శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి
సప్తతితమ జన్మదినోత్సవ పరిచారణములు

3

# బాలకవిశరణ్యము

# బాలకవి శరణ్యము

రావుసాహెబు, మహోపాధ్యాయ

గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు, బి. ఏ.

తెలికిచెర్ల వెంకటరత్నం

ప్రకాశకుడు : గుంటూరు

# సంపాదకీయ భూమిక

శ్రీ రామమూర్తిపంతులుగారు వ్యావహారిక భాషను పునఃప్రతిష్ఠితము చేయడానికి సుమారు పాతిక సంవత్సరములనుంచి చేస్తూఉన్న వాదములో ప్రధానముగా నాలుగు మార్గములు గోచరిస్తున్నవి.

భాషాతత్త్వ పరిదర్శనపూర్వకముగా ప్రపంచములోని ఇతరభాషా వాఙ్మయముల చరిత్రములున్ను వాటితో పోల్చి ఆంధ్రభాషావాఙ్మయముల చరిత్రములున్ను బోధించి తక్కిన భాషలవలెనే తెలుగుకూడా నానాటికి మారుతూ వచ్చినదనీ, ఆయా కాలముల కవులు తమనాడు శిష్టవ్యవహార సిద్ధమయిన భాషను కావ్యాలలో ప్రయోగిస్తూవచ్చినారనీ, నేటి రచయితలు కూడా ఈ శిష్టాచారమే పాటించి వ్యావహారిక భాషలో గ్రంథములు వ్రాస్తే భాషాప్రయోజనము చక్కగా నెరవేరుతుందనీ, నోటిమాటకూ చేతివ్రాతకూ సామరస్యము కుదిరి ఒకదాని కొకటి పోషకముగా ఉన్నప్పుడే వాఙ్మయములోని భాష సహజముగానూ, సరళముగానూ, సుబోధకముగానూ, పరమ ప్రయోజనకారిగాను ఉంటుందనీ నిరూపించడము ఒక మార్గము.

వ్యావహారిక భాషను బహిష్కరించి గ్రాంథికాంధ్రమును దాని స్థానములో నెలకొల్పడానికి ప్రయత్నిస్తూ ఉన్నవారు ప్రాచీన తాళపత్రగ్రంథములలో ఉన్న లౌకిక భాషను ఎట్లు గ్రాంథికీకరణము చేసి కూటకరణ దోషమునకు పాల్పడి భాషకు అపారమయిన అనర్థము కలుగజేసినారో ఋజువు చేసి, పూర్వులు వ్రాసిన పురాణ (వచన) ములూ, లక్షణగ్రంథములూ, వ్యాఖ్యానములూ, టీకలూ, వివిధశాస్త్ర గ్రంథములూ, దేశచరిత్రములూ, జానపదవృత్తాంతములూ, వార్తాపత్రికలూ, శాసనములూ, కథలూ, బడిపుస్తకములూ మొదలయిన అన్నివిధముల రచనలలోను వచనము వ్యావహారిక భాషలోనే ఉన్నదని నిదర్శనపూర్వకముగా సిద్ధాంతీకరించి, ఏ భాషలోనయినా ఇదే నిజమయిన వచనరచనా సంప్రదాయమని నిరూపించడము రెండోది.

'గ్రాంథిక భాష' అని మన పండితులు వ్యవహరించేదాని స్వరూపము ఇదమిత్థమని నిర్ణయించడానికి వల్లపడదనీ, మన వ్యాకరణములు పరస్పర విరుద్ధములుగానూ, అసమగ్రములుగానూ ఉండడమువల్ల ఏది తప్పో ఏది ఒప్పో నిర్ధారణ చేయడము దుష్కరమనీ, ఒక పండితుడికి గ్రామ్యమయిన

ప్రయోగము ఇంకొకరి మతములో అగ్రాహ్యమనీ, ఒక మహామహోపాధ్యాయుల గ్రంథాలలో ఇంకో మహామహోపాధ్యాయులవారికి వేనవేలు తప్పులు కానవస్తూ ఉన్నవనీ, గ్రాంథిక భాషలో నిర్దుష్టముగా వ్రాసిన గ్రంథము మచ్చుకి ఒక్కటిఅయినా లేదనీ, గ్రాంథికభాష పండిత ప్రకాండులకయినా సాధ్యపడక ఇంత అవ్యవస్థముగా ఉన్నదనీ ప్రాచీనభాషలో శబ్దస్వరూపమూ శబ్దార్థమూ నిర్ణయించడమే బహు కష్టముగా ఉన్నందువల్ల ఆ భాషలో స్వతంత్రరచన సాగించడము అసంభవమనీ నిరూపించడము మూడో మార్గము.

ప్రాచీనకవుల కావ్యములన్నీ సమగ్రముగా పరిశీలించకపోవడమువల్ల వ్యాకరణకర్తలూ, కోశకారులూ, పండితులూ తప్పులుగా భావించి లక్షణ విరుద్ధములనీ గ్రామ్యములనీ నిందించిన రూపములు వందలకొలదిగా కవుల కావ్యములలో ప్రయుక్తములై ఉన్నవనీ, వ్యాకరణము ప్రయోగమూలము కావడమువల్ల కవిప్రయోగము లక్షణముకంటె బలవత్తరమైనదనీ, కవులు ప్రయోగించిన రూపములు లక్షణములో చెప్పకపోతే లక్షణమే అసమగ్రమూ దుష్టమూ అవుతుంది కాని ప్రయోగములు నింద్యములు కావనీ నిరూపించి, అట్టి రూపములకు—ప్రతిపక్షులు ఎదురాడుటకు వీలులేనట్టుగా—కవుల కావ్యములనుంచి వందలకొద్దీ ప్రయోగములు చూపి నిర్దుష్టత్వ మాపాదించడము నాల్గో మార్గము.

ఈ నాలుగు మార్గములూ వ్యక్తపరిచే గ్రంథములు వరుసగా శ్రీ పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణములలోని వ్యాసావళి, గద్యచింతామణి, ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజము, బాలకవి శరణ్యమున్ను.

ప్రకృతగ్రంథము ఒక కొత్తవ్యాకరణము. ప్రాచీన వైయాకరణులూ ఇప్పటి పండితులూకూడా లక్షణవిరుద్ధములనీ గ్రామ్యములనీ నిందించినవీ, వాఙ్మయము ఆమూలాగ్రముగా పరిశీలించకపోవుటచేత వ్యాకరణములలో గతి కల్పించనవీ, వందలకొలది రూపములు ఈ నూతన వ్యాకరణములో సాధింపబడినవి. ఆయా రూపములు ఎట్లుమార్పుచెందినవో భాషాస్వర ధర్మ (Phonetic laws) ప్రదర్శనపూర్వకముగా నిరూపించి, తోడి సోదరభాషలగు అరవము, కన్నడము మొదలయినవాటిలో కూడా అట్టి మార్పులే కలిగినట్టు నిదర్శనము చూపి, కవుల ప్రయోగములు లెక్కలేనన్ని ఉదాహరించి శ్రీ పంతులుగారు వాటిని సాధించినారు. వ్యాకరణము

ప్రయోగమూలము గనుక కవిప్రయుక్తములయిన ఈ రూపములు శిరసావహింపదగినవికాని నిరసింపదగినవి కావు. వ్యాకరణములలో ఈ రూపములు చేర్చకపోవడమువల్ల వ్యాకరణములు అసమగ్రములూ దుష్టలక్షణలక్షితములూ అయినవి.

ఉత్తరాంధ్రకవులు తమ కాలములో శిష్టవ్యవహారములో ఉన్న రూపములు—ప్రాచీనకవులు ప్రయోగింపనివీ, ప్రాచీన లాక్షణికులు అనుశాసింపనివీ మాత్రమే కాక దుష్టలక్షణములలో నింద్యములని పేర్కొన్నవి కూడా—ఎట్లు స్వతంత్రించి స్వేచ్ఛగా ప్రయోగించినారో రుజువుచేయడమువల్ల ఇప్పటి కవులు తమకు సుపరిచితమయిన భాష యథేష్టముగా వాడుకొని సరసకావ్యములు రచించుటకు ఉత్సాహము కలుగుతుంది. కవులు ప్రయోగించే భాష ఎంత సుపరిచితమై ఎంత సులభసాధ్యమై ఉంటే కావ్యము అంత సుబోధమై, సహజమై, సరసమై ఉంటుంది.

శ్రీ పంతులుగారు 25 సంవత్సరముల క్రిందట ఈ గ్రంథము రచించుటకు ప్రయోగములు సేకరించినారు. వారు ప్రకటించిన తెలుగుపత్రికలో ఇందులోని మొదటి రెండు ప్రసంగములున్నూ—కూతురిని కూతురికి మొదలయినవీ, చేతురు, కోతురు మొదలయినవీ—ముద్రితములయినవి. మిగిలిన ప్రసంగములు పంతులుగారు వ్రాసిఉంచిన ప్రయోగములు, నోట్సు ఆధారము చేసుకొని వారి పెద్ద కుమారులు శ్రీ సీతాపతి పంతులుగారు రచించినవి. ఈ గ్రంథము పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవమునాటికి అచ్చుపడవలెనని సంకల్పించుకొని నేను తొందరచేయడమువల్లనూ, వారు అస్వస్థతగా ఉండడమువల్లనూ, మొదట అనుకొన్నంత సమగ్రముగా, మొదటి రెండు ప్రసంగములను వ్రాసినంత విపులముగా, అవతారికలు రచించుటకు వీలయినది కాదు. అయినా ముఖ్యములయిన విషయములు విడిచిపెట్టకుండా సంగ్రహముగానైనా వ్రాసి ఈ గ్రంథము ప్రకాశన దశకు తెచ్చినందుకు శ్రీపంతులుగారూ, వారి కుమారులూ అభివంద్యులు.

జన్మదినోత్సవ నిర్వాహక సంఘమువారికి శ్రీపంతులుగారు తమ రచనలు ప్రకటనార్థము ఇచ్చినందుకు వారికి ఈ సంఘము తరఫున కృతజ్ఞతాపూర్వక వందనములు సమర్పిస్తున్నాను.

గుంటూరు,
నవంబరు, ౧౯33.

తెలికిచెర్ల వెంకటరత్నం,
సంపాదకుడు.

---

## విషయానుక్రమణిక

# బాలకవిశరణ్యము.

## ఉపోద్ఘాతము

ఇది ఒక చిన్న గ్రంథము; దీనిలో మేము చెప్పే విషయము కొన్ని కొత్త తెలుగు మాటల సాధుత్వము: కొత్త తెలుగు అనగా ఉత్తరాంధ్ర కవులు వాడినది. అవి అసాధువులని కొందరు నిషేధించినందున వాటి సాధుత్వము నిరూపించవలసి వచ్చినది. ఇది ఎవరికోసము వ్రాసినది అంటే తెలుగు పిల్లల కోసము. తెలుగు పుస్తకాలు బాగా చదువుకొన్న పండితులకు ఒకరు చెప్ప నక్కర లేకుండానే కవుల వాడుక తెలుస్తుంది. తెలిసీ తెలియని పండితమ్మన్యులు తాము పుస్తకాలు చూడకుండానే పుస్తకాలలో తప్పు లున్నవనిన్ని, తమ రెరుగని ప్రయోగాలన్నీ గ్రామ్యాలనిన్ని వాదిస్తారు. ఆంధ్రభాషా లక్షణమును బట్టి తెలుగు మాటల సాధుత్వము తెలుసుకో రాదా అంటే, అది పండితులకే అగమ్యము గదా, పిల్లల మాట చెప్పేదేమి? చూ. ఆం. సా. పత్రిక 5వ వ్యాసము.

కీర్తిశేషులయిన పూండ్ల రామకృష్ణయ్యగారు చెప్పినట్లు 'మన తెలుగు పండితులలో నొకర యభిప్రాయముతో నొక రేకీభవింపక పోవుట సైజమైనది'. ఎంతటి పండితుడు వ్రాసిన గ్రంథ మయినా ఎవరో ఒకరు అందులో తప్పులు చూపించక పోరు.

ఆదిమ కవి నన్నయ భట్టుకే తప్పినది కాదు గ్రామ్యాలు వ్రాసిన వాడను నింద. శ్రీకృష్ణ భారతమని కొత్త తెలుగు భారత మొకటి రచిస్తూ ఉన్న బ్ర॥ శ్రీ॥ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు పాత తెలుగు భారతము రచించిన నన్నయ 'వేన వేలు' అపశబ్దములు, 'సంకర సమాసములు', 'గ్రామ్యములు' తెలుగులో చేర్చి నాడని వ్రాసినారు. 'ఇవి యన్నియు నర

యం॑గా దప్పులనియే నా యభిప్రాయము' అని మొగమాటము లేకుండా దృఢముగా తమకు యథార్థమని తోచినది చెప్పినారు. సరే; ఈ విమర్శకుల భాషా శౌచమెట్టిదో మేము విమర్శించి మాకు యథార్థమని తోచినది మొగమాటము లేకుండానే వేరే ఒక వ్యాసములో విశదపర్చగలము. ఇప్పుడు అనవసరము.

ఈ లాగుననే ఆంధ్ర వాల్మీకులని పేరు పొందిన బ్రి|| శ్రీ|| వావిలకొలను సుబ్బారావు పంతులుగారు తమ సులభ వ్యాకరణములో తప్పులని చెప్పినవి, కొన్ని, పండితులు వ్రాసినవే కాక, తాము వ్రాసినవికూడాను. వీరి భాషానుశాసనక్రమము అపూర్వమైనది. భాష్యకారులు పతంజలి మహర్షి ఉత్సర్గములు అపవాదములు రెండున్ను చెప్పినాడు; అంతకంటె లాఘవమని కాబోలు ఆంధ్ర వాల్మీకుల శబ్దానుశాసనమందు సంధిపరిచ్ఛేదము కడపటిది, ౮, ౯ వ సూత్రములలో 'అపవాదములు విధులుగావు' అని తోసివేసినారు. వహ్వా! శాస్త్రము! వీరి లక్షణము ఈ చొప్పున ఉన్నది. చిన్నయసూరిగారి బాల వ్యాకరణములలోని తప్పులు గుప్తార్థప్రకాశికా కారుల భాష్యములలో చూపిస్తే, దానిలో తప్పులు మరి ఒకరు చూపిస్తున్నారు. లక్షణము కొంచెమయినా దానిలో తప్పులే అనంతముగా ఉన్నవి. ఆంధ్ర లక్షణము అంధకార బంధురము; అగమ్యము.

పోనీ, కీర్తిశేషులైన రావుబహద్దూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తెలుగు రచనకు మార్గదర్శులు; వారు రచించిన గ్రంథములోని భాషను సాధువుగా భావించవచ్చునేమో అనుకొంటే, వారి గ్రంథములు (పేరు పెట్టి అనలేదుసుండీ, పేర్కొన్న వాక్యములను బట్టి స్పష్టమైనది.) దుష్టప్రబంధములనిన్నీ, వారున్ను వారిని అనుకరించిన వారున్ను చేసిన విష ప్రయోగముల వల్ల ఆంధ్ర భాషాదేవికి నంజుచేసి ఒళ్ళంతా వాచి, పాపము! ఆయమ్మ ప్రాణ సంశయ దశలో నున్నదనిన్నీ మూడు నెలల క్రిందట

నెల్లూరిలో జరిగిన ఒక గొప్ప సభలో పిడుగులాటి మాట చెప్పినారు—ఎవ రను కొన్నారు ? వారూ వీరూ కాదు ! బ్ర॥ శ్రీ॥ వేదము వేంకటరాయ శాస్త్రులవారే, పండితభిషజ్ఞ్మణులే-వీరి భాషా భైషజ్యము సవిస్తరముగా వచ్చే సంచికలో వర్ణిస్తాము. అది అతి విస్తారము; ఇక్కడ సూచనగానైనా చెప్ప జాలము.

అందరి కన్నను ఎక్కువ భాషాభిమానము గలవాని వానికన్నవారు బ్ర॥ శ్రీ॥ జయంతి రామయ్య పంతులవారు గదా! వారు వ్రాసినవి నిర్దుష్ట ముగా ఎంచుకో వచ్చు నంటామంటే, గడియ కొక వేషము వేస్తారు వారు భాషకు. ఏది సాధువేషమో తెలియదు. ఇట్లే అగ్రామ్య భాషాపోషకు లందరూ ఒక్క పుటలోనే ఒక మాటే, ఇక్కడొక లాగున, అక్కడొక లాగున వ్రాసి సాధు కేదయితే అది తాము వ్రాసినదనిన్ని, తక్కినది అచ్చు వేసిన వారిదనిన్ని, చెప్పడాస్తారు. ఏలాగు వారి భాషాలక్షణము చెప్పడము ?

ఇట్టి అవస్థలో గ్రాంథిక భాష ఉన్నప్పుడు, పండితులేలాగున నైనా ఈదు లాడ గలరు, గాని, చిన్న పిల్లలకు ఉక్కిరి బిక్కిరిగా ఉండి ఊపిరి తిరగదు. భాషాశౌచము పండితులు నోటను పలికే మాటలను బట్టి నిశ్చయించు కొమ్మంటే, కష్టము లేకపోవును గాని అందుకు ఎవరూ ఒప్పు కోరు. నోటికి అడ్డులేదట! పండితుల ధర్మాన వ్రాతలోనే ఉండవలెనట నియమాలన్నీ. కలము చేత పట్టుకోగానే చెయ్యి వణుకు తుందే; ఏమి వ్రాస్తే తప్పు పట్టుతారో! వ్రాయకపోతే వ్యవహారము నడవదే! గనుకనే వాస్తవమైన లోకవ్యవహారములో (అనగా ఉత్తర ప్రత్యుత్త రాలలోను, దస్తావేజులలోను) నియమము లక్కర లేదట!—కొందరి మతమందునుండి!

ఇక భాషాశౌచము ముఖ్యముగా పాటించవలసిన విధికి వినియోగము పద్య కావ్యములందు; గద్య కావ్యములందున్ను. అట్లయితే, వీటిని రచిం చడమునకు ప్రాచీనుల గ్రంథములే ఆదర్శములు కావలెను. గద్యమును

గురించి ప్రాచీనుల మర్యాద ఎట్లున్నదో మరి ఒక వ్యాసములో చూపిస్తాము. ఈ వ్యాసమందు పూర్వుల పద్యకావ్యములలోని ప్రయోగములు చూపించి వాటినిబట్టి కొన్ని శబ్దముల సాధుత్వము నిశ్చయిస్తాము. లక్షమంది పండితమ్మన్యులు తప్పన్నా ఆశబ్దములు తప్పు కావు. ముమ్మాటికీ అవి సాధువులే. జీవలోకమందు శిష్టజనుల వ్యవహారమందుండడమే సాధుత్వమునకు కారణము కాగా, అవి కావ్యమందు కూడా కనబడితే, మరి మాటాడకూడదు——నోరు మూసుకోవలసినదే గదా! ఇదే మేము పిల్లలకు బోధిస్తున్నాము. అప్పకవి కూడా అట్లె చెప్పినాడు 'ప్రయోగమూలం వ్యాకరణమ్' పుట 27. 'గ్రామ్యమైన నాంధ్ర కవులు సంకేతిత సుప్రసిద్ధ మనుచు సూత్రమునను గలిమిఁ బూర్వసుకవి కావ్యోక్తములు ప్రసిద్ధంబులైనఁ గూర్పఁ దలఁతు నెపుడు. ( 1. 230)

కవి ప్రయోగము తప్పు అని మరి వాదించకూడదు; అది దుష్టవాదము. అది వ్యాకరణమునకు విరుద్ధముగా ఉన్నా, ఆక్షేపించరాదు. కవి వాడిన శబ్దములు చూచి అవి లక్ష్యములుగా చేసుకొని లక్షణము చెప్పవలసినవాడు లక్ష్యము తప్పనడమునకు అధికారము గలవాడు కాడు. లక్షణములో అనేక దోషము లుండవచ్చును. చెప్పవలసిన దంతా చెప్పక పోవడము ఒకదోషము; చెప్పకూడనిది చెప్పడము ఒకటి; చెప్పినది తిన్నగా చెప్పకపోవడము, అవ్యాప్తి, అతివ్యాప్తి ఇటువంటివి ఉంటవి. గనుకనే ఆదోషములు పరిహరించడమునకు, "ఈ శాస్త్రము దిఙ్మాత్ర ప్రదర్శకముగా చెప్పినాము. శేషము శిష్ట ప్రయోగములనుండి తెలుసుకోవలెను. శబ్దసిద్ధి లోకంబువలనఁ దెలియును. లక్షణవిరుద్ధమైనది గ్రామ్యమనీ అపభ్రంశమనీ చెప్పినా, సుకవిప్రయుక్తమైనయెడల గ్రాహ్యము," ఈ లాటివాక్యములు అభిసంధిగా లాక్షణికులు శాస్త్రమందే చేర్చినారు. ఇవి ప్రమాణము కాకపోతే శాస్త్రమే అప్ర

మాణ మవుతుంది; వ్యాకరణమునకు మూలమయిన ప్రయోగము ఒప్పకపోతే, శాస్త్రమునకు మూలవిచ్ఛేదనము చేసినట్టే అవుతుంది.

వర్ణోత్పత్తి శాస్త్రమునుండి గ్రహించకుండానే జనులందరూ అచ్చులూ హల్లులూ పలకడము నేర్చుకొన్నారు. వర్ణోత్పత్తి వివరణము తెలిసినవాడు లక్షమందిలో ఒకడైనా ఉండడు. అట్లే భాషాశాస్త్రము చదువకుండానే భాష అందరికీ వస్తున్నది. కవులన్నవారు సరసముగా మాట్లాడుతారు; ఇంపుగా పాడుతారు, సరస్వతి అనుగ్రహము చేత. ఇదివరకు కవులు ఏలాగు మాట్లాడినారో తెలుసుకోవడమువల్ల ఇప్పటివారికి కష్టముతగ్గి పని సులభముగా కావలెను; గాని నిరోధము కలుగకూడదు. శాస్త్రము పూర్వుల వాడుకను జ్ఞాపకమాత్రముగా నుండి కొంతమట్టుకు తోవచూపిస్తుంది; అంతే, తన భావము, తననేర్పు, తనయిష్టము, తనభాష, (తన) స్వత్వము-ఇవే కవికి ఆధారము. ఇవే కవికీ కవికీగల తారతమ్యమును చూపగలిగినవి. ఇవి విడిచితే కవులందరూ ఒక్క మచ్చులోని అచ్చుబొమ్మలే. స్వాభిమానముగలవాడు స్వత్వమునకు హాని కలుగనివ్వడు; కలుగనియ్యకూడదు. కవి స్వత్వము కాపాడకపోతే, ఒక్కకవికే కాదు నష్టము, లోకమునకున్ను—ఇవిఅన్నీ ఆలోచించితే కవికి భాషావిషయమున లోకమే ప్రమాణమని ఒప్పుకోక తప్పదు. ఉత్తరాంధ్రభాష కవులు స్వేచ్ఛగా వాడేవారని చూపిస్తే, ఇప్పటి బాలకవులకు ఉత్సాహము పుట్టి నిస్సంశయముగా తమకు సుపరిచితమైన భాష యథేష్టముగా వాడుకొని సరసకావ్యములు రచిస్తారని ఈ గ్రంథమునకు 'బాలకవిశరణ్య' మనే పేరుకూడా పెట్టినాము. తత్వము తెలుసుకొనిఅందరమూ శాంత చిత్తులము అగుదుముగాక! శాంతి శ్శాంతి శ్శాంతిః

* * *

ఈ గ్రంథమందుదాహరించిన ప్రయోగములుగల కావ్యములు వాటికి పెట్టిన సంకేతాక్షరములు మొదలయినవాటి వివరణము.

| గ్రంథ సంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|
| అచ్చ. రా | అచ్చతెలుగు రామాయణము. | కూచిమంచి తిమ్మకవి |
| అని. | అనిరుద్ధ చరిత్ర | కనుపర్తి అబ్బయ్య |
| అప్ప. | అప్పకవీయము | కాకునూరి అప్పకవి |
| అలం. | అలంకార చంద్రిక | నేలనూతుల శివరామయ్య |
| అహ. | అహల్యా సంక్రందనము | సముఖము వెంకటకృష్ణప్ప |
| అహో. | అహోబల పండితీయము | గాలి నరసయ్య |
| ఆంధ్రం. | ఆంధ్రనామ సంగ్రహము | పైడిపాటి లక్ష్మణకవి |
| ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము, నిఘంటువు | కోటి వెంకనార్యుడు |
| అము. | అముక్తమాల్యద | కృష్ణరాయలు |
| ఇందు. | ఇందుమతీ పరిణయము | కుమార ధూర్జటి |
| ఉ. నై. | ఉత్తర నైషధము | సిరిపెగ్గడ ధర్మయకవి |
| ఉ. రా. | ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజు |
| ఉ. హరి. | ఉత్తర హరివంశము | నాచన సోమనాథుడు |
| ఉషాక. | ఉషాకల్యాణము | కైప మాయన |
| కకు. | కకుత్స్థ విజయము | మట్ల అనంత భూపాలుడు |
| కవిక. | కవికర్ణ రసాయనము | సంకుసాల నృసింహకవి |
| కవిజ. | కవిజనరంజనము | అడిదము సూరన |
| కవిజన చ. చ. | కవిజనచకోరచంద్రోదయము | నారపరాజు కాంతకవి |
| కవిరా. | కవిరాజ మనోరంజనము | కనుపర్తి అబ్బయ్య |
| కవిసం. | కవిసంశయ విచ్ఛేదము | అడిదము సూరన |

| గ్రంథ సంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|
| కళా. | కళాపూర్ణోదయము | పింగళి సూరన |
| కాశీ. | కాశీఖండము | శ్రీనాథుడు |
| కాళ. | కాళహస్తిమాహాత్మ్యము | ధూర్జటి |
| కుచే. | కుచేలోపాఖ్యానము | గట్టు ప్రభువు |
| కువ. | కువలయాశ్వ చరిత్రము | సవరయ చిన్ననారాయణ |
| కృష్ణ. | కృష్ణరాయ విజయము | కుమార ధూర్జటి |
| కృష్ణ. వి. | కృష్ణలీలా విలాసము | * * * * * * |
| కృష్ణా. | కృష్ణార్జున సంవాదము | పోచిరాజు వీరన |
| కేయూ. | కేయూరబాహుచరిత్రము | మంచన |
| క్రీడా. | క్రీడాభిరామము | వల్లభరాయుడు |
| గంధ. | గంధవహము | * * * * * * |
| గోవ్యా. | గోవ్యాఘ్ర చరిత్ర | వేల్పూరు వేంకటేశ్వరులు |
| గౌరీ. | గౌరీసంవాదము | * * * * * * |
| చం. వి. | చంద్రరేఖావిలాపము | కూచిమంచి జగ్గకవి |
| చంద్ర. | చంద్రభానుచరిత్ర | * * * * * * |
| చంద్రా. | చంద్రాంగద చరిత్రము | పైడిమర్రి వేంకటపతి |
| చంద్రి. | చంద్రికా పరిణయము | సురభి మాధవరాయలు |
| చమ. | చమత్కార మంజరి | వేంకటకవి |
| చంపూ. రా. | చంపూ రామాయణము | ఋగ్వేది వేంకటాచలపతి |
| చిత్రభా. | చిత్రభారతము | చరిగొండ ధర్మన్న |
| చెన్నపు. | చెన్నపురీ విలాసము | మతుకుమల్లి నృసింహకవి |

| గ్రంథ సంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|
| చెన్న బ. | చెన్నబసవ పురాణము | అత్తులూరు పాపయ |
| జైమి. | జైమినీ భారతము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు |
| తార. | తారక బ్రహ్మము | కొ॥ కోదండరామయ్య |
| తొండ. | తొండమాన్ వంశావళి | * * * * * * |
| తోభ్య. | తోభ్యచరిత్ర | పింగళి ఎల్లనార్యుడు |
| దశ. | దశరథరాజనందన చరిత్ర | మరింగంటి సింగనాచార్యులు |
| దశా. | దశావతార చరిత్ర | ధరణిదేవుల రామనమంత్రి |
| ద్రౌ. ప | ద్రౌపదీ పరిణయము | అల్లమరాజు రామకృష్ణకవి |
| ధను. | ధనుశ్శాస్త్రము | రాజగోపాలరాజు |
| నరస. | నరసభూపాలీయము | రామరాజభూషణుడు |
| నాగ్న. | నాగ్నచిత్రీ పరిణయము | వల్లూరి నరసింహకవి |
| నిరం. | నిరంకుశోపాఖ్యానము | కంసాలి రుద్రయ్య |
| ని. రా. | నిర్వచనోత్తరరామాయణము | తిక్కన |
| నీలా. | నీలాసుందరీ పరిణయము | * * * * * * |
| నిర్వ. వి. రా. | నిర్వచన విచిత్రరామాయణము | వేల్పూరు వేంకటకవి |
| పంచ. | పంచతంత్రము | దూబగుంట నారాయణ |
| పట్టా. | పట్టాభిరామాయణము | పట్టాభిరామశాస్త్రి |
| పట్టాభి. | పట్టాభిరామాయణము | వేంకటరామకృష్ణకవి |
| పద్మ. | పద్మపురాణము | మడికి సింగన |
| పండి. | పండితారాధ్య చరిత్ర | పాలకురికి సోమన |
| పల్నా. | పల్నాటివీర చరిత్ర | శ్రీనాథుడు |

| గ్రంథ సంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|
| పరమ. | పరమయోగివిలాసము | తిమ్మరాజు |
| పాంచా. | పాంచాలీ పరిణయము | కాకమాని మూర్తి |
| పాండు. | పాండురంగ మాహాత్మ్యము | తెనాలి రామకృష్ణుడు |
| పార్వ. | పార్వతీ పరిణయము | రఘునాథ మహీపాలుడు |
| ప్రబో. | ప్రబోధచంద్రోదయము | నందిమల్లయ, ఘంట సింగయ |
| ప్రబం. | ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము | గణపవరపు వేంకటకవి |
| ప్రభా. | ప్రభావతీ ప్రద్యుమ్నము | పింగళి సూరన |
| ప్ర. ద్వి. | ప్రభు లింగలీల ద్విపద | పిడుపర్తి బసవడు |
| ప్రభు . | ప్రభులింగలీల | నడకుదుటిరామన, పా\|\|సోమన |
| ప్రౌఢ. | ప్రౌఢవ్యాకరణము | బ. సీతారామాచార్యులు |
| బస. | బసవ పురాణము | పిడుపర్తి సోమనార్యుడు |
| బస. | బసవ పురాణము | పాల్కురికి సోమన |
| బహు. | బహులాశ్వ చరిత్రము | దామెర వెంకటపతి |
| బి. | బిల్హణీయము | * * * * * * |
| బ్ర. | బ్రహ్మోత్తరఖండము | శ్రీధరమలి వేంకటస్వామి |
| బృం. | బృందావన విహారము | దామరాజు లక్ష్మీనారాయణ |
| భాగ. | భాగవతము | బమ్మెర పోతరాజు |
| భాను. | భానుమతీ పరిణయము | రెంటూరి రంగరాజు |
| భార. | భారతము | నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగ్గడ |
| భీమ. | భీమఖండము | శ్రీనాథుడు |

| గ్రంథ సంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|
| భోజ. | భోజరాజీయము | అనంతామాత్యుడు |
| మత్స్య. | మత్స్యపురాణము | హరిభట్టారక |
| మ. వి. | మధురవాణీ విలాసము | చింతలపల్లి వీరరాఘవుడు |
| మను. | మనుచరిత్ర | అలసాని పెద్దన |
| మార్క. | మార్కండేయ పురాణము | మారన |
| మార్క. | మార్కండేయపురాణము | మండ చిట్టికామశాస్త్రి |
| మిత్ర. | మిత్రవిందాపరిణయము | కుందుర్తి వెంకటాచలపతి |
| మృ. వి. | మృత్యుంజయ విలాసము | కుర్మ్మనాథకవి |
| మొ. రా. | మొల్లరామాయణము | కుమ్మరి మొల్ల |
| య. | యయాతి చరిత్రము | పొన్నగంటి తెలగన |
| రంగా. | రంగారాయచరిత్రము | దిట్టకవి నారాయణ |
| రఘు. | రఘువంశము | అవుదూరి కిచ్చయ్య |
| రాఘ. | రాఘవ పాండవీయము | పింగళిసూరన |
| రాజరా. | రాజరాజాభిషేకము | అంగర నృసింహకవి |
| రా. వి. | రాజవాహన విజయము | కాకమానిమూర్తి |
| రాజశే. | రాజశేఖరవిలాసము | కూచిమంచి తిమ్మకవి |
| రాధా. | రాధామాధవ సంవాదము | వెలిదండ్ల వేంకటపతి |
| రాధి. | రాధికా సాంత్వనము | ముద్దు పళని |
| రామ. వి. | రామరాజ విజయము | అందుగుల వెంకయ్య |
| రామస్త. | రామస్తవరాజము | మల్లయామాత్యుడు |

| గ్రంథ సంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|
| రామా. | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుడు |
| రా. | రామాయణము | భాస్కరుడు |
| రుక్మాం. | రుక్మాంగద చరిత్ర | పోషకవి మల్లన |
| రుక్మి. | రుక్మిణీ పరిణయము | కూచిమంచి తిమ్మకవి |
| లం. | లంకావిజయము | పిండిప్రోలు లక్ష్మణకవి |
| వరా. | వరాహపురాణము | నందిమల్లయ, ఘంటసింగయ్య |
| వసు. | వసుచరిత్ర | రామరాజభూషణుడు |
| వాయు. | వాయుపురాణము | ఒడ్డెపూడి పెద్దయ్య |
| వా. రా. | వాశిష్ఠ రామాయణము | మడికి సింగన |
| విక్ర. | విక్రమార్కచరిత్రము | జక్కయ |
| విజ. | విజయ విలాసము | చేమకూరి వేంకటకవి |
| వి. పు. | విష్ణు పురాణము | వెన్నెలకంటి సూరన |
| వీధి. | వీధినాటకము | శ్రీనాథుడు |
| వీర. | వీరభద్రవిజయము | బమ్మెర పోతరాజు |
| వీరభూ. | వీరభూపాలీయము | * * * * * * |
| వేం. చ. | వేంకటాచల మహాత్మ్యము | తరిగొండ వెంకమ్మ |
| వేం. చ. మా. | డిటో | శిష్టు కృష్ణమూర్తి |
| వేం. శ్వ. | వేంకటేశ్వర మాహాత్మ్యము | ములపాక బుచ్చనశాస్త్రి |
| వేం. ఆం. | వేంకటేశాంధ్రము | గణపవరపు వేంకటకవి |
| వై. వి. | వైజయంతీ విలాసము | సారంగు తమ్మయ్య |
| శంక. | శంకర విజయము | * * * * * * |

| గ్రంథ సంకేతములు | గ్రంథముల నామములు | గ్రంథకర్తల నామములు |
|---|---|---|
| శ. | శశాంకవిజయము | శేషము వేంకటపతి |
| శశి. | శశిలేఖాపరిణయము | వేంకట రంగకవి |
| శివ. | శివరహస్యము | గోడూరి వేంకటాచలపతి |
| శివ. సా. | శివయోగ సారము | అనియాది గణపతిదేవుడు |
| శు. | శుకసప్తతి | పాలవేకరి కదరీపతి |
| శేష. | శేషధర్మములు | తామరపల్లి తిమ్మయ |
| శేష (వి). | శేషధర్మములు | వెలుతురుపల్లి విశ్వనాథం |
| శృం. శా. | శృంగార శాకుంతలము | పిల్లలమర్రి పినవీరభద్రుడు |
| ష. | షట్చక్రవర్తి చరిత్ర | మల్లారెడ్డి |
| స. కృ. | సత్యభామా కృష్ణసంవాదము | * * * * * * |
| సత్యా. | సత్యభామా సాంత్వనము | కామేశ్వరకవి |
| సమీ. | సమీర కుమారవిజయము | పుష్పగిరి తిమ్మన |
| సాంబ. | సాంబ నిఘంటువు | * * * * * * |
| సా. | సానంద గణేశ్వరము | కొండమడుగు పురుషోత్తమకవి |
| సానం. | సానందోపాఖ్యానము | కోట శివరామయ్య |
| సారం. | సారంగధర చరిత్ర | చేమకూరి వేంకటకవి |
| సారం. ద్వి. | సారంగధర చరిత్ర-ద్విపద | * * * * * * |
| సీతా. | సీతా విజయము | మద్దనకవి |
| సుద. | సుదక్షిణా పరిణయము | తెనాలి అన్నయ |
| సునం. | సునందా పరిణయము | చింతకుంట కోదండరామకవి |
| సుబ్ర. | సుబ్రహ్మణ్య విజయము | * * * * * * |

| గ్రంథ సంకేతములు | గ్రంథముల నామములు | గ్రంథకర్తల నామములు |
|---|---|---|
| సుభ. | సుభద్రాపరిణయము | కూచిమంచి జగ్గకవి |
| సురా. | సురాభాండేశ్వరము | ఘట్టు ప్రభువు |
| సుల. | సులక్షణసారము | లింగమగుంట తిమ్మకవి |
| హంస. | హంసవింశతి | అయ్యలరాజు నారాయణకవి |
| హర. | హరవిలాసము | శ్రీనాథుడు |
| హరి (ద్వి). | హరిశ్చంద్ర ద్విపద | గౌరన |
| హ. న. | హరిశ్చంద్ర నలోపాఖ్యానము | రామరాజభూషణుడు |
| హరి. | హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి |

# బాలకవి శరణ్యము

## ము ఖ బం ధ న ము

**యస్తే స్తనః శశయో యో మయోభూః యేన విశ్వా పుష్యసి వార్యాణి**

**యో రత్నధా వసువిద్యః సుదత్రః సరస్వతి తమిహ ధాతవే కః ॥ ఋక్** ౧

శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి చరాచరోపజీవ్యమ్
కరుణామసృణైః కటాక్షపాతైః కురుమామంబ కృతార్థసార్థవాహమ్. ౨

భద్దం భోదు సరస్సఈఅ కఇణో ణందంతు వాసాఇణో
అణ్ణాణం పి పరం పఅట్టదు వరా వాణీ ఛఇల్లప్పిఆ
బచ్ఛోమీ తహ మాఅహీ ఫురదు ణో సా కించ పంచాలిఆ
రీదీఓ విలిహంతు కవ్వకుసలా జోణ్హం చఓరా విఅ ॥ 3

అమ్మలఁ గన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలఁ బె
ద్దమ్మ సురారులమ్మ కడుపాఱడి పుచ్చిన యమ్మ నిన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యీవుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్ ॥ ౪

*　　*　　*

౧ ఈ ఋక్కు తాత్పర్యం:— ఓ సరస్వతీ! నీ స్తనము శబ్ద స్వరూపము; అది అందరకు సుఖము కలుగజేసే టటువంటిది; ధనముగానీ, రత్నములుగానీ, ఏది కోరితే అది ఇస్తుంది. నా కోర్కెలు తీరే టట్టుగా నా కది ఇమ్మని వేడుకొంటున్నాను.

౩ సరస్వతికి జయమగునుగాక! వ్యాసాది కవులు ఆనందము పొందుదురుగాక! ఇంకా తక్కిన వారికికూడా విద్వజ్జన మనోహారిణియు ఉత్కృష్టయూ అయినటువంటి భారతి విశేషంగా ఆనందము కలుగ జేయునుగాక! వైదర్భీ మాగధీ పాంచాలికా రీతులు మా కావ్యమున స్ఫురించునుగాక! వెన్నెలను చకోర పక్షులు ఆస్వాదించేటట్లు రసజ్ఞులైన కావ్యరచనా నిపుణులు మా కావ్యమును ఆస్వాదింతురుగాక—అని తాత్పర్యము.

ఏయమ్మ చన్ను గుడువన్
వాయర్చుచు నేర్తురెల్ల బాసలు భువిలో
నాయమ్మ భక్తి వేఁడుదు
మాయ దొలగించి భాష మర్మము దెల్పన్

లోక యాత్రకొఱకు లౌకిక భాషలు
పుట్టి ప్రజల నోటఁ బొందియుండు
జీవలోక మంద జీవించు భాషలు,
జనుల తలఁపు దెల్పు సాధనములు. ౨
కాలుఁ జేయు ముక్కుఁ గన్నులు వీనులు
మనసు వలెనె వాక్కుఁదన ప్రవృత్తిఁ
బొందియుచుండు; నిత్యము చ్ఛ్వాసనిశ్వాస
గతుల యట్లు నాల్క కదలుచుంట. 3
శబ్దసిద్ధి దెల్పియ శాస్త్రాలు లేకగావు
దానియు లోక సంద మెఱుఁగి యాయ;
కాని శాస్త్రకర్త కనవలె నన్నాఁడు
సాజమైన సిద్ధ శబ్దములను. ౪
లోకమందుల భాషలందున్న సిద్ధ
శబ్దముల పరామర్శించి తగించి
మేలు వ్యాకరణ ప్రక్రియ లేరుపరచి
వ్యాకృతిగ్రంథ మూసిన వాఁడగునుఁడు 5
ముందు మనతెలుగు బాసలో నందు గొందు
లెవరు వెదకిరి? మర్మఁబు లెవరు గనిరి?
వాఙ్మయం బెల్లఁ జూచిన వారెవరు?
బాస చుల్లను బండితుల్ బావు కొనిరె? ౬
సాహసము గాదె పెద్దల సభ్యభాష
తప్పు తప్పని దూఱుట? తగదె కవుల
పలుకులును దప్పు లంటయు వ్రాసి గనక?
ఆత్మ గౌరవమే తమ యాడు మాట? ౭

గ్రామ్యమని పండితులె తాము గ్రామ్యమాట?
తమకె సాధ్యము కానట్టి ధర్మనియతి
యజ్ఞదీక్షయు నెల్లర కగతికముగఁ
గలిపి తాము నిత్యవిధులు మఱచుటలు గానె? ౮

గ్రామ్య భాషయనఁగఁ గాదు ప్రాజ్ఞుల భాష,
పామర జన వాక్కె పగిదిఁ గాని;
మాట యర్థము చెడ మాన్యుల భాష కే
గ్రామ్య నామ మిడుట క్రమముగాదు ౯
కాని పేరు పెట్టి, కానిది యని యెన్ని
కాని దాని కీడు గానఁ జెప్పి,
గ్రామ్య మాడు వారిఁ గాలుఁడు నగ కానఁ
ద్రోయు నంచు నడల గోఁత గాదె? ౧౦
వినుఁడు తెలుఁగువాణి విలపించుచున్నది
'మ్లేచ్ఛ నెట్టులయితి తుచ్ఛులార!
పెద్దలింటఁ బుట్టి ముద్దుగాఁ బెరిగితి;
వారి నోట మాట మీర నెపుడు; ౧౧
మనసు దెలిసి కాని మాటాడ నోడుదు
నెట్లు వారు దిద్ది రట్ల నడతు
నో గిరెట్లువచ్చు నోరార ననుదిట్టఁ
దండ్రి మ్లేచ్ఛుఁడేనిఁ దనయ మ్లేచ్ఛ. ౧౨
తప్పులేనట్టి దానిపైఁ దప్పువెట్టు
వారు దండ్యులు సభ్యులేఁ బండితులును;
అట్లుగావున ధర్మంబు పట్టఁజాల
మెలకువ గలిగి వర్తింపవలయు నందుఱు. ౧౩

'గ్రామ్య' మన్న నేల కటకటం బడుదురు?
పాం భాషికంపుఁ బదమ వందుఁ;
తెలుఁగు శాస్త్రమందుఁ దెలుఁగు 'వికారి'మం
చనుటఁ జేసి విడుతురయ్య తెలుఁగు. ౧౪
'మన్యము' పురుషమున 'మీరు' మధ్యమమటె?
వ్యయము గనని వెల్లను 'నవ్యయము'లె?
'సంకరము' నలంకారమే సంస్కృతిని!
దాల్లుఁ గల్లెఁ 'బుల్లింగ' మారయంగ. ౧౫
'గ్రామ్య' కర్త్రమెట్లు కానట్టి పనియగు?
భోజ్యమకద మ్లేచ్ఛ భోజనంబు'
అడుగు కోసికొండెరి 'యథమాంగ' మనిచెప్ప?
'గ్రాంగ' యన గంగ నీ సయకెట?' ౧౬
శాస్త్రమందుండు లక్షణ జాలమెల్ల,
నియపదేశించుఁ దాల నెన్నినట్లు,
కోటి యిట్లుంట రెంటిఁగి వ్యాకరణమంద
శాస్త్రకారులే చేసిన సమయ మొకటి. ౧౭
లక్షణ నిరూపణములందు లోకములు
సర్వమును జేర్చి చెప్పంగఁ జాలకునిక
దానఁ జేసి దైనను దానిమాటి
యున్నదైనను గాహ్యసం దుండెనేని, ౧౮
సెల్లుఁ బెట్టుక కన్నుల నొత్తి కొంచు
నెల్లరును దాని సాధుగా నన్నపలయు;
గ్రామ్యమేని లౌకికమయేనిఁ గవుల పలుకు
వేదవాక్యము వలెను బవిత్రమంచు. ౧౯

2

ఇట్టి సమయంబు లేకుండేనేని శాస్త్ర
మెంత గొప్పదియయ్యుఁ గొఱంతపడదె?
శాస్త్రకర్తలు మనుజులు; శాస్త్రమునకుఁ
బారమేర్పర్చు మనుజు లేపాటివారు? ౨౦
కనరొకో శాస్త్రనియమంబు గాచుకొఱకు
శాస్త్రదోషంబు పరిహరించంగ నెంచి
శాస్త్రకారులె చేసిన శాసనంబు
గ్రాహ్యమే లోకరూఢమౌఁ గవులమాట. ౨౧
మూలవిచ్ఛేదనము శాస్త్రమున కొనర్చి
శాస్త్రమూలంబు కవిమాట సగకుగనక?
శాస్త్ర మెల్ల నప్రామాణ్యసరణిఁ బడదె
శాస్త్రకారుల యభిసంధి సడలెనేని? ౨౨
వ్యాకరణమందుఁ గవియందు లోకమందు
వాసిగాఁగ నెల్లర వశమటయ్య
ఇల మహాజను లేత్రోవ మెలఁగుదు రది
రాజమార్గంబు సాధ్యంబు నైజపథము. ౨౩
పెద్దలెవరొ వారి సుద్దులె సుద్దియౌఁ
జిన్నవారి నుడులు చిన్ననుడులె;
పెద్దచిన్నతనము సుద్దుల కీటులబ్బె
సుద్దులాడువారి యుద్ది వలన. ౨౪
పెద్దతనముగోరి పెద్దల నుడివడ
చిన్నవారు నేర్చి చెలఁగుచుండ్రు
పెద్దలన్నవారు 'ప్రేతలే' కారు సూ
నేఁటి వారిలోన మేటివారు. ౨౫

కృతియుగము వారితోఁ బోల్చి కీడువచ్చు
గూడదే నేఁటి బాఁపల; గురు లటండ్రి;
యోగముఁబట్టియె రూపంబు నుండునంచు
నేఁటి బాఁపలుఁ బూజ్యుల నేఁడటనిరి. ౨౬
"పదుగు రాడు మాట పాడియై ధరఁజెల్లు
నొక్కఁడాడు మాట యొక్కదండు,"
తత్త్వమందు పాడి తరము దప్పిన యేని
మాటపాడి యిల్లె తేఁటపడును. ౨౭
ఏఱుపాఱునట్లు పాఱుచునుండును;
దేశ భాష తెలుఁగు దెలియు టరిది
మాఱు చుండుఁగాని మాఱుపు గనరాదు
లోఁతు చూచి కనుఁడు లోని గుట్టు. ౨౮
మనమె కానలేము మనము మాఱెడుచొప్పు;
మారుచుండు రూపు మనసు గుణము
మాఱుచున్న నేమి? మాఱుపు మఱచిరె
వ్యవహరింతు మెల్ల యందు నెపుడు. ౨౯
బాస యొకటె కాదు బ్రహ్మయు బ్రహ్మండ
మెల్ల మారుచుండు మెఱుఁగ రొక్కొ?
ఎప్పు డెద్ది కలదొ యప్పటి కది నిత్య
మదియ మనకు సేవ్యమగుట యొప్పు. ౩౦
దండి చెప్పెగాదె తగినట్టి కారణా
ల్మాటలోను గల్గు మార్పులకును
ఎట్లు గల్గెఁ గల్గె నిక గలుగని దాని
గాఁగఁ జేయ నెపుడు గాదు విధికి. ౩౧

మాల మాటగాని మాదిగ మాటని
నాఁటి దేనిఁ గాక నేఁటి దేని
ఈడదైన నేమి యాడదైనను నేమి
ఏడదైనఁ జెల్లు వాడికయిన. ౩౨

వాడికగద మాట ప్రాణంబు మానంబు
వాడనట్టి మాట పాడు వడును
చెల్లుబడిని బట్టి చేకొంద్రు లోకులు
మాడలైనఁ గవుల మాటలైన. ౩౩

రాము మాడయేని ఱాతిపై రాసియుఁ
గాల్చికొట్టి చూచి కాక కొనరు;
చెల్లు నట్టిదైనఁ జేకొందురు తడయక
కాగితంపు ముక్క కానుగాను. ౩౪

తద్భవాలు చూడఁ దప్పైన సంస్కృతాల్
పామర జన వాక్కు వలనఁ బుట్టె
గాక, పండితు లవి గానక మార్తురే
వ్యావహారికముగ వాడనయ్యె. ౩౫

ప్రాఁత మాటలెల్ల పరమ పవిత్రమా?
క్రొత్త మాటలెల్ల కుత్సితముల?
చన్న వారి మాట శాస్త్ర ప్రసిద్ధమా?
బ్రతుకు వారిమాట ప్రల్లదనమ? ౩౬

ప్రాఁతయుఁగొలి క్రొత్తె; బ్రతికిన కవినోట
వెడలెఁ గాక శవము నుడివెనయ్య?
నేఁటి క్రొత్త నుడులు నెరసి కొన్నాళ్ళకుఁ
బ్రాఁతలౌను నవియు బ్రదుక వలదె? ౩౭

లోక సిద్ధమైన లౌకిక పదములు
సార్థకంబు లెల్ల జనుల కగును
మాసి నట్టి మాట మఱి మఱి పరికింప
కోశమంద తెలియుఁ గోవిదులకె. ౩౮

పుస్తకాలలోన ప్రిచ్చిన మాటలు
ప్రాఁతలైనవానిఁ ద్రవ్వి యెత్తి
నేఁడు నెల్లవారు వాడఁగావలెనన్న
గొంతుకడ్డపడదె క్రొత్తమాట? ౩౯

వాడికఁగనరాని పదముల పాపతెల్ల
నిశ్చయింప నెట్లు నేసగునా ?
తప్పలెన్న వ్రాసి గ్రాంథిక పండితు
లొప్పులంచుఁ జెప్ప నొప్పులగునె ? ౪౦

సంశయము పేర్చు కోశమేన్ శాస్త్రమేని
లేదు లేదయ్య తెలుఁగునకే వాడుకైన
కావ్యముల పాఠమేనియుఁ గాదు నమ్రఁ
బండిత పరిష్కారమున బన్న వడియె. ౪౧

శబ్దశంకలఁ జేసి సుశబ్దములను
వాడుకొన మానుచున్నారు బాలకవులు
భ్రాంతి నెవ్వఁడుతప్పన్న భయము పడుట
సాజమేకద పుడమి నజ్ఞానులకును. ౪౨

తాము తప్పన్నమాటల తాను వాడు
చొప్పుతప్పులు తెలియక తప్పువట్టు
పండితమ్మన్యులకు నొక్క దండమిడుదు;
కలదు లోకంబు; సత్కవుల్ గలరు భువిని. ౪౩

కాన యల్పజ్ఞ నిందుల గణన సేయ
కవ్వి పెద్దలు వాడిరో యవ్వి మనము
జంకు లేకుండ కావ్యరచనల యందు
వాచితినిఁబట్టి వాడుట యసదు కాద. ౪౪

అప్పకవి చెప్పినట్టుల "గొప్పకాదు
మంచివని యెల్లరును సమ్మతించినట్టి
వానిఁ జెప్పంగ;" తప్పు తప్పనిన వాని
వెదకి సాధించి యొప్పు లే విశదపఱతు. ౪౫

అఖిల లోకుల కానంద మైన చొప్పు
సరసముగఁ గైత గూర్చిన సరస కవుల
సరసభావల నెత్తి నిస్సంశయముగ
బాలకవులకు నర్పింతు వాణిఁ గొలిచి. ౪౬

అప్పకవి తిమ్మకవి మూరనాది పూర్వ
లాక్షణికు లొక్క పద్యంబె లక్ష్యముగను
జెప్ప నొప్పక తప్పదా శిష్ట వాక్కు
నేనుఁ జూపెదు లక్ష్యమ్ము లెన్ననల్లె. ౪౭

ఒండు రెండును గావవి, యొండు నుండి;
అప్రసిద్ధుల వాక్యంబు లనఁగఁ జనదు;
లక్షణంబున కవియు నాలంబనములు;
కావ్య లోక నిరూఢమే భవ్యపదము. ౪౮

* * *

## కూతురిని, కూతురికి, (కూతుండ్రు) కూతుళ్లు.

—:O:—

"కూఁతు శబ్దము ప్రథమైక వచనంబునకు రువర్ణం బగు కూఁతురు-కూఁతులు. కూఁతురులు కూఁతుళ్ళు కూఁతురినీ త్యాదిరూపంబులు గ్రామ్యంబు లని యెఱుంగునది."

అని తన బాల్యవ్యాకరణమునందు, ఆచ్ఛిక పరిచ్ఛేదము 8వ సూత్రము లో చిన్నయసూరి అరవై యేండ్ల క్రిందట 'శబ్దానుశాసనము' చేసినాడు. ఆ వ్యాకరణము బడులలో విద్యార్థులకు తెలుగు పండితులు బోధించడము నకు మొదలు పెట్టిన తర్వాత, లోకమం దంతటా శిష్టజన వ్యవహారములో ఉన్న 'కూతురిని' 'కూతురికి' 'కూతుళ్ళు' మొదలయిన రూపములన్నీ గ్రామ్య ము లయిపోయినవి. 'గ్రంథములలో వ్రాయుటకు తగినవి కావని వాటిని పండితులు బహిష్కరించినారు. అంత కంతకు గ్రంథములలో అది కనబడ నే కూడదని, చిన్నయసూరిగారి లక్షణము పుట్టకమునుపే అచ్చుపడ్డ గ్రంథము లలో కనబడిన ఈ మాటలు సాధ్యమయినంత మట్టుకు తొలగించి తర్వాత అవి అచ్చు పడ్డప్పుడు గ్రంథ పరిష్కరణము చేసినారు. కొత్తగా అచ్చు పడ్డ పూర్వ గ్రంథములు అన్నిన్ని ఇట్టే పండిత పరిష్కృతములై నందువ వాటిలో అవి మనకు కనబడవు. కవులు వాడిన ఉత్తరాంధ్ర శబ్దములు తాటాకుల పుస్తకాలుగాని, 1860 వ సంవత్సరమునకు పూర్వము అచ్చుపడ్డ పుస్తకాలుగాని శ్రద్ధతో చూస్తే తప్పక కనబడుతవి కొన్నైనాను, పండి తులు తర్వాత తీసివేసినవి.

చిన్నయసూరిగారిమాట వేదమువలె ఎట్టి ప్రమాణమైనదో చూడండి మనపండితులకు. పాణిని చెప్పిన లక్షణములో పదివేల తప్పులు చూపించి దిద్దినాడుకాని వేదవాక్యమూ వంటిదని అంగీకరించలేదు కాత్యాయనుడు.

ప్రౌఢవ్యాకరణము చేసిన సీతారామాచార్యుల వారేమి, గుప్తార్థ ప్రకాశికాకారులేమి తక్కిన పండితులేమి, గ్రుక్కుమిక్కనకుండా చిన్నయసూరి చెప్పిన ఈ సూత్రమును అంగీకరించినారు. పరిశీలన లేకపోయినది గదా!

1856వ సంవత్సరములో చేమకూర వేంకటకవి విజయ విలాసము ఆ కాలమందు ప్రసిద్ధ పండితులయిన మాడభూషి వేంకట కృష్ణమాచార్యుల వారు పరిష్కరించి అచ్చు వేయించినప్పుడు కూతురిని మొదలయిన ప్రయోగములు దిద్దక విడచిపెట్టినారు. ఆతర్వాత అచ్చుపడ్డ పుస్తకాలలో ఇవి కనబడవు. వసుచరిత్రలో రెండు పద్యములందు కూఁతూరఁ అని (1851) సం|| జూలూరు అప్పయ్యపండితులుగారు టీకతో కూడ అచ్చువేయించిన పుస్తకములోనున్ను, 1868 వ సంవత్సరమున అచ్చుపడ్డ పుస్తకములోనున్ను—తాటాకు పుస్తములోనున్నూ శిష్టుకృష్ణమూర్తి శాస్త్రులుగారు స్వహస్తముతో వ్రాసిన ప్రతిలోనున్నూ కనబడుతున్నది. వ్యాఖ్యానము వ్రాసినవారు టీకలో 'కూఁతురఁ కూఁతురిని' అని అర్థము వ్రాసి యున్నారు. ఈ రూపములు ఇప్పటి అచ్చు పుస్తకములలో కానరావు. చిన్నయ్యగారి శాసనము ప్రకారము ఇవి గ్రామ్యాలని మొదట తాము భ్రమపడి, పూర్వకవులు తప్పు వ్రాసినారని కూడా భ్రమపడి, ఆ తప్పు దిద్దితేగాని ఆకవులకు అపఖ్యాతి కలుగుతుందనో, లేక గొప్ప వన్న ప్రబంధములందు ఆశబ్దములుంటే చిన్నయగారి లక్షణమునకు దోషము కలుగుతుందనో, ఏకారణము చేతనైతే నేమి, ఈ కావ్యములలోని పాఠము దిద్దివేసినారు.

అయితే జీవలోకమందు ఈ శబ్దములు సదా అందరినోటను ఆడుతూ ఉన్నందున పండితులూ కవులూ తమగ్రంధములందు నేడు కూడా అవివాడుతున్నారు—పొరబాటున అంటే అనండి, చిన్నయసూరిగారే తాము వ్రాసిన హిందూ ధర్మశాస్త్రసంగ్రహములో 'కూతుండ్రు' అనేశబ్దము వాడి ఉన్నారు. అది తప్పనిగాని ఒప్పనిగాని తమ లక్షణములో చెప్పలేదు. తాము ప్రయో

గించిన శబ్దమే తాము శాస్త్రమందు సంగ్రహించడము మరిచి పోయినారు గదా! ఆయన వ్యాకరణము వ్రాసినప్పటికి భారతమైనా అంతా అచ్చు పడలేదు. ఆయన చూచిన గ్రంథములు కొంచెము. తెలుగులో ఉన్న గ్రంథములు అన్నీ చూచిగాని ఏదయినా ఒక శబ్దము అప్రయుక్తమని చెప్పుటకు ఏవరయినా సాహసించ కూడదుగదా! చిన్నయసూరిగారిని మనము నిందించ కూడదు. తన లక్షణము సంపూర్ణ మయినది కాదని చెప్పి, శిష్ట ప్రయోగములనుండి శేషము తెలుసుకో వలసినదని చెప్పినాడు. ఇంతేకాక తనలక్షణమునకు విరుద్ధముగానున్న శబ్దమయినా ఆర్యులు వాడినట్లైతే గ్రాహ్యమన్నాడు. ఆ ప్రకారము ఆయన చెప్పినప్పటికీ, అతని లక్షణము వేదవాక్యముగాను, అనతిక్రమణీయముగాను, వివేకములేనివారు గ్రహించి, అతని మీద భారము మోపితే వారిది తప్పు; అతనిది కాదు.

నేటి గ్రంథములలో కొన్నింటినుండి ఈ లక్షణ విరుద్ధమైన శబ్దములు ఎత్తి చూపిస్తున్నాము.

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి కర్పూర మంజరి-మూడవ ముద్రణము.

'తనయునంగుంగూతురును గాళ్ళు కడిగి కన్యాదాన మిచ్చి' 6వ పుట, 9వ పంక్తి. 'వానికూతురును తనకూతురట్లు పెంచుచు' 21వ పుట. 13వ పంక్తి 'అనుంగుంగూతురు నెందు దాచువాడ' 25వ పుట, 5వ పంక్తి 'సుధాశరశ్చంద్రము. కూతురిని' 129వ పుట '—కూతురుకు' 240వ పుట

శ్రీ మద్రాజా వెంకట లక్ష్మణరావుగారి మహమ్మదీయ మహాయుగములో—
రాయల కూతురును' పు 385.

చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్రము పూర్వయుగములో అయిదుమార్లు—కూతురిని అని ప్రయోగించినారు. చూ. పుటలు 76, 98, 148, 156, 314

రాణీసంయుక్త—కూతురిని-పుట 95.

లక్ష్మీ కాంతరావు గారి అశోక చరిత్రము—'కూతురును పుత్రెంచి' పుట 51
పీకులచరిత్రము—కూతురును. పుట 59. కూతురునకు పుట 20.
కూతుళ్ళు పుట 111.

సూర్యనారాయణరావుగారి మృణాలిని-కూతును కూఁతురునకు పుట 188.
,, చంద్రశేఖరము.—కూఁతురిని పుట 60.
కొత్తపల్లి సూర్యారావుగారి ఫసానే యాజబ్-కూతురు పెండ్లిచేసెను పు 83
మసర్ల అనంతరావుగారి బేకనుపన్యాసములు—కూఁతుళ్ళు పుట 56.
మల్లాది సూర్యనారాయణ శాస్త్రులుగారి భవభూతి నాటకములు.
'కూఁతురికి' పు 73—'కూతురి కష్టము' పు 78—'కూఁతురికి' పు 111
పానుగంటి లక్ష్మీనరసింహారాయకవి సారంగధర—'పెళ్ళి కూతుళ్ళు' పుట 21
తిరుపతి వేంకటేశ్వరుల విక్రమాంక 'పెండ్లి కూఁతురు మీఁదికి' పుట 57.
శ్రీ రామమూర్తిగారి కవిజీవితములు—'కూఁతురు పేరు' పుట 263
రాయసము వేంకట శివుడుగారి ఇంగ్లీషువారి సంసార పద్ధతులు—
'పెండ్లి కూఁతురు తల్లి' పుట 15.
అముద్రితగ్రంథచింతామణి 1897 జనవరి పు2. కూఁతురి పెండ్లికై-పత్రికాధిపతి.

కాంచీపురము పచయప్ప మొదలిగారి విద్యాశాల యందు ఆంధ్ర గీర్వాణ ప్రధానోపాధ్యాయులైన వైయాకరణ రామానుజాచార్యులవారు 1847 సం|| రచించి అచ్చువేయించిన భారతవచనం బను గ్రంథమునందు —తరుచుగా కూఁతురిని కూఁతురికి కూఁతుండ్రు వాడినారు.

(చూ, కూఁతురునిన్ని-పుటలు 73, 85, 87, 95, 115, 137, 147, 217.)

కూఁతురికి పుట 137, కూఁతురితో పు. 115, కూఁతురికొడుకు పుట103, కూఁతుండ్రు పుటలు 77, 81, 133, 135, 139.

వాగపూడి కుప్పు సామయ్యగారి భారతములో కూఁతుండ్రిన్ పుట 23.

ఇట్టివి ఇంకా అనేకము చూపించవచ్చును. అయితే వచనములలో ఏమరిపాటున వాడుకలోని శబ్దము ప్రయోగించినా పద్యకావ్యములలో గ్రామ్యమన్న వివాదము లేదందురేమో; నేటి పద్యకావ్యములలోని ప్రయోగములున్ను కలవు.

కొప్పు కామరాజాగారి జాంబవతీ పరిణయములో, ఆ 2. పద్యము 10. ఉ. అల్లుని వెంటఁ గూఁతురిని నంపు తలంపునఁ గంనుఁ గాంచి నీ...; లక్షణ విరుద్ధమైన శబ్దము గ్రామ్యపిశాచిగా భావించి గ్రంథము మీదవాలకుండా తమనోటనే బంధించిన కూచి నరసింహముగారుకూడా గౌరాంగ చరిత్రము, భా 1. I V. 211 వ పద్యములో ఉ. 3వ చరణము—వారుప్రవ్వక యట్లు వారు తమకూఁతురు వాంఛకు వేటొనర్తురే, అని వ్రాయడము అని వ్రాయవలసినదిగదా! వాడిక తప్పించు కోవలెనంటే ప్రాణాలు బిగబెట్టుకొని వ్రాయవలెను.

ప్రాచీనాంధ్ర భాషాభిమానులయిన కవిరాజులు పండితులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు తమ భారతమునందే ఆది 4. 13 పద్యములో తే.గీ. కవికిఁ గూఁతురిపైఁగడు కరుణగలదు' అని వ్రాసి వాడికలోనున్న శబ్దము ఎంత అపరిహార్యమో ప్రకటించినవారయినారు.

కొందరు పండితుల వ్రాతలలో వైచిత్ర్యమున్నది. తాము సంపాదించిన వ్యాకరణ జ్ఞానము వల్ల వాడుకలోని శబ్దము గ్రామ్యమని మాత్రము తెలుసుకొని దానికి అగ్రామ్య రూపమెట్లుండునో తెలియకను, స్ఫురించకను గ్రామ్యమనుకొన్న శబ్దములోని అచ్చుగాని హల్లుగాని మార్చి, వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములచేత, గ్రాంథికీకరణ విధానము ఏర్పరుచుకొన్నారు. అచొప్పున 'కూఁతురికి' శబ్దములోని గ్రామ్యదోషము పోగొట్టడమునకు 'కూఁతురు' ఉకారాంతముగనుక, 'కు' ప్రత్యయము చేర్చవలెను. దానికి పూర్వమందు నుఁకో, అనేసూత్రము చేత నకారమురావలెను

గనుక 'కూతురునకు' అని దిద్దుతున్నారు. ఈరూపము లోకములో ఎక్కడా లేదుగనుక గ్రామ్యము కాదు. గ్రామ్యవిరుద్ధమైతే తప్పకుండా అగ్రామ్యమే, అగ్రామ్యము సాధువేకదా అని సమాధానము చేసుకొని నిస్సంశయముగా ప్రయోగిస్తున్నారు. ఒక్కటైనా సాధు శబ్దము చక్కగా ప్రయోగిస్తే కామధేనువులాగు అన్నికోరికలూ తీర్చి స్వర్గానికి తీసుకొని వెళ్ళుతుందటగదా పోనీ అంతలాభము లేకపోయినా గ్రామ్యము ప్రయోగించడము చేత కలిగే నరక బాధయినా తప్పినది గదా! చూడండి వారిప్రయోగములు:—

మృణాలిని—పుట 183 కూతురునకు వివాహము గావించెను.

ప్రభావతి—పుట 115 పెండ్లి కూతురున...

సీతల చరిత్ర. పుట 20 కూతురునకు

అల్పదోషమైనా కావ్యమందు సహించక విమర్శచేసేటప్పుడు యముని కన్న ఎక్కువ నిర్ఘృణుడని పేరుపొందిన పండితులు బ్ర॥ శ్రీ॥ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రులవారు కం. వీరేశలింగం పంతులుగారి వివేకచంద్రిక విమర్శించి వ్రాసిన విమర్శన గ్రంథములోనే—'...రఘురామ్ గారు రుక్మిణి వలన యీ వద్వృత్తాంతమును వినిన వారేయయినను దమకూతురునకేమి కీడు గలుగునో...' అనే వాక్యమందు 'కూతురునకు' అని ప్రయోగించినారే! మరి యితరులను నేను వేరొక్కటనవలె మెందుకు?

'కూతురునకు' వంటిదే 'కూతుని' అనిమరి ఒక విచిత్ర రూపము కలదు. 'కూతురిని' అనేగ్రామ్యసేద తప్పించుకొనుటకు ఏ ఉపాయమూ తోచనప్పుడు ఇది తరుణోపాయముగా కల్పించుకొన్నది. ఇదే విద్వాన్ పరీక్షకు పఠనీయగ్రంథమయిన రాజస్థాన కథావళిలో ఉన్నది. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు వ్రాసినది. విద్వాన్ పరీక్షలో దీనివిషయమై ఇచ్చిన ప్రశ్నలలో ఒకటి 'కూతుని' ఈ శబ్దముయొక్క సాధుత్వమును విచారించవలెను. అది బుద్ధిమంతులు నిదానించి చూస్తేబోధపడుతుంది. ఏలాగునగింజాకొంటు

వైయాకరణులు ఎతటము (అనగా ప్రత్యయము చేర్చుటకు ముందుండు రూపము; సంస్కృతములో అంగమనిన్ని ఇంగ్లీషులో బేస్ అనిన్ని అంటారు.) 'కూఁతు' 'కూఁతురి' అనిచెప్పినారు. కూతుకుట్టి, కూఁతుఁగుట్టి, అల్లుఁగుట్టి అన్న ప్రయోగములు కావ్యమందున్నవి; గాని, 'కూఁతు' అనివిడిగా ప్రథమైక వచన రూపము కర్తగా ఎక్కడా కనబడలేదు నాకంటికి. చూచినారా దుర్భ్రమవల్ల ఎంతకీడు కలుగుచున్నదో? లోకవిరుద్ధమైన శబ్దముసాధువు అని ధూర్తపండితుడంటే వేయిమందిగల సభలో ఎవ్వరూ తప్పుపట్ట లేరు గదా! 'కూఁతురునకు,' 'కూఁతువు' 'నాకొక కూఁతున్నది' 'నాకూఁతుని వాని కిత్తు' అనిపద్యములలో ప్రయోగించి రాగముతో పాడితే సభలోఅందరూ సంతోషిస్తారు; గాని, అపశబ్దములు వాడినాడని తోఁచదుగదా! లోకములో పెద్దలువాడే మాటలకన్న ఈఅపశబ్దములు ఎక్కువ సాధువులేమి? ఛీ ఛీ!!

చిన్నయసూరి బాలవ్యాకరణములో చెప్పిన 'కూఁతుఁరు,' 'కూఁతుఁఱు' అసాధువులు కావుగాని, అతడు గ్రామ్యములని చెప్పిన 'కూఁతురులు'- 'కూఁతుళ్ళు', 'కూఁతురిని' సాధువులే. ప్రాచీనాంధ్రభాషలో కూఁతురు- కూఁతుఱు, కూఁతులు మొదలయినవేగాని కూఁతురిని, కూఁతురికి, కూఁతురును, 'కూఁతురులు', కూఁతుళ్ళు'-ఇట్టివి కనబడవు. ఆంధ్రభాషా భూషణములో కేతన-క. 'కూఁతురు పదము రుకారము ప్రాంతిగఁ దాఁ జెడువిభక్తిపైఁ బెట్టి నచోఁ గూఁతురు కూఁతుంగనియెను గూఁతులచేఁ గూఁతువలనఁ గూఁతుల ధనముల్' అని తనకాలమందున్న లౌకికశబ్దరూపముల లక్షణము చెప్పినాడు. అతనికాలమందు శిష్టజన వ్యవహారములో కూఁతురిని, కూఁతురికి మొదలయిన రూపములు లేవని ఆకాలపు గ్రంథములనుబట్టి తెలుస్తున్నది.

అయితే, విన్నకోట పెద్దిరాజునాటికి శబ్దరూపములలో మార్పుకలిగినది. అప్పటి కావ్యములలోకూడా ఉత్తరాంధ్రశబ్దములు కనబడుతున్నవి. గనుక పెద్దిరాజు తనలక్షణములో:—

గీ. పరగ కూఁతురు శబ్దంబుపై రుకార మొక్కపలుకునకైనను నుండుఁబాయుఁ
బెక్కుపలుకులకైననుదక్కిపోవుఁ గూఁతుఁబడసెను గూఁతుగాఁగోరెననఁగ.

క. కూఁతులచేఁ గూఁతురిచేఁ। గూఁతురకై కూఁతుకొఱకుఁ గూఁతులవలనన్
గూఁతులకుఁదగవు లొసఁగెన్। గూఁతుల యందుండు ప్రీతిగుణవంతులకున్.

వీటినిచెప్పినాడు. ఈ గ్రంథము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో నేడు అచ్చుపడ్డది; గాని మేము ఎనిమిది సంవత్సరముల క్రిందట వ్రాతప్రతి చూచి, అనేక పట్టణములలో మా ఉపన్యాసములందు ఈ లక్షణము ఉదాహరించిఉన్నాము.

అహోబలపండితుడు కూడా కవిశిరోభూషణములో (పుట 308) 'కూఁతు', 'కూఁతురు', 'కూఁతురులు', 'కూఁతులు' ఇత్యాది, అనిచెప్పి ఉన్నాడు. అతఁడే తన వ్యాఖ్యానాంతమందు తెలుగున మంగళము చెప్పుతూ:—

'సీ. పా. పంటతామరకంటిదంట కూఁతురి మోనిపంటి తీయని తేనె జుంటి తేటి'
అని 'కూఁతురి' శబ్దము ప్రయోగించినాడు.

చిన్నయసూరిగారు పుట్టకముందే తెలుగుబడులు, తెలుగు వ్యాకరణాలు పుట్టినవి. ఆబడులలో తెలుగుచెప్పినవారున్ను అప్పటి వ్యాకరణాలు వ్రాసినవారున్ను అయనవంటి పండితులు కాకపోలేదు. చన్నపట్నమందున్న గవర్నమెంటు పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులు గానున్న రావిపాటి గురుమూర్తి శాస్త్రులుగారు వ్యావహారిక భాషలో 1819 సం॥ న విక్రమార్క చరిత్రమున్ను, 1834 వ సం॥న పంచతంత్రమున్ను, 1836 వ

సం॥న వ్యాకరణమున్ను వ్రాసినారు. ఆవ్యాకరణమున్ను ఆపంచతంత్రి మున్ను చాలాకాలము బడులలో వాడుకగా చదువుకొనేవారు. ఉదయగిరి శేషయ్యగారి వ్యాకరణము 1857 వ సం॥న వ్యావహారికభాషలోనే వ్రాసి ఉన్నది. 1875-వ సం॥న దానినిమార్చి 'గ్రాంథికభాష'లో అచ్చు వేసినారు. అప్పటి వ్యాకరణాలలో ఉత్తరాంధ్రశబ్దములు అనేకములకు లక్షణము కనబడుతున్నది. కాంబిల్, బ్రౌన్, మొదలయిన ఇంగ్లీషువారు తెలుగు పండితులదగ్గ నేర్చుకొని ఇంగ్లీషుభాషలో తెలుగు లక్షణము వ్రాసినారు. అట్టి వ్యాకరణములలో కూతురు శబ్దమును గురించి చెప్పిన లక్షణము ఉదాహరిస్తాను.

కాంబిల్‌గారి వ్యాకరణము (1820 సం. పుట 57) ప్ర. ఏ. కూతురు-ఏతటము-కూతు, కూతురి-బ. వ. కూతుకులు, కూతుండ్లు.

గావిపాటిగురుమూర్తిశాస్త్రిగారి వ్యాకరణము (1836 సూత్రము147) కూతురు శబ్దమునకు ఏతటము కూతు, కూతురి. ప్రథమాబహువచనము కూతురులు, కూతుండ్లు, కూతుళ్ళు, కూతులు.

బ్రౌన్‌గారి వ్యాకరణము (మొదటి ముద్రణము 1840, రెండవది 1857) ఏ. వ. కూతురు-ఏతటము కూతురి-బ. వ. కూతురులు, కూతుండ్లు.

అబ్బాయినాయుడుగారి వ్యాకరణము (1869) చిన్నయసూరి వ్యాకరణముచూచే వ్రాసినామని చెప్పినారు. ప్ర. ఏ. వ. కూతురు-ఏతటము-కూతు, కూతురి-బ. వ. కూతుండ్లు, కూతుళ్ళు, కూతురులు, కూతులు.

చిన్నయసూరి తెలిసియో తెలియకనో, తానువాడిన శబ్దములే తన వ్యాకరణములో సంగ్రహించ మరచినాడు. అతడు వ్రాసిన హిందూధర్మశాస్త్ర సంగ్రహమునుండి కొన్ని ఎత్తి వ్రాస్తున్నాను. (రెండవముద్రణము 1867) ఇరువురి (పుట 1) ఇద్దఱి (పేరా 34), అందఱి, (పేరాలు 170, 185, 205, 313, 319, 383, 387) ఎందఱి (పేరా 383) కొందఱి (పు 8)

—సూత్రుండ్రు (పేరా 194)—వల్ల (పుట 4)—చేసికోవచ్చును (పుట4)—విభాగించుకొని (పేరా 149)—కాక నే (పుట 7)—పరిశీలింపకనో, తెలియకనో (పేరా 176)—ప్రతి మనుష్యునికి (పుట 5)—మదార్సు నందంతటా యుయుళ్ళు వ్రాయు వాచారము (పేరా 176).

ఆయన వ్రాసిన నీతి చంద్రికలోనివి—అందఱికి (పుట 18), అందతి (పు 102), లోభమువల్ల (పుట 8), మాటలవల్ల (పుట 9) మొదలయిన వెన్నో ఉన్నవి వ్యాకరణములో చెప్ప మఱచినవి.

'భారతాది ప్రాచీన గ్రంథములలోని భాషకే ఆయన లక్షణము చెప్పినాడు; అందు చేత 'కూంతురిని' గ్రామ్య మన్నా'డని సమాధానము చెప్పడమునకు వల్లకాదు. ప్రాచీనులు వాడని 'ఉండును, ఉందువు, ఉందుము, ఉన్నాను, ఉన్నావు, ఉన్నాము, నొకు, పదునొకరు' మొదలయినవి ఎన్నో చెప్పినాడు. ప్రాచీనులు వాడినవెన్నో మఱచిపోయి నాడు.

ఇన్ని లోపములున్న ఇతని లక్షణమును ప్రమాణముగా చేసుకొని ఇతడు పుట్టకమునుపు వ్రాసిన గ్రంథములలోని భాషలో తప్పులు పట్టి దిద్దడము అవివేకము కాదా? 'అందఱి' వంటి రూపాలు ఇతరుల గ్రంథాలలోనే కాక అతని గ్రంథాలలోనూ కనబడుతూ ఉన్నా, ఆ రూపము తప్పని అతడెక్కడా చెప్పకపోయినా, అతనికి ఆరూప మిష్టము కాదు, అని పండితులు కొందరు వాదిస్తారే. ఎట్లా తెలిసినదో వారికి? దివ్యదృష్టిని చూచినారా?

చిన్నయసూరిగారి తాతముత్తాతలు పుట్టక మునుపు వ్రాసిన కావ్యములలో నాకు దొరికిన ప్రయోగములు చూపుస్తాను. అచ్చుపడ్డప్పుడు, చిన్నయగారి శిష్యులు పరిష్కరించి దిద్దినప్పుడు ఎన్నిపోయినవో మేము చెప్పలేము. కొందకు యతిప్రాసములందున్న గణబద్ధమయినప్పుడున్న శబ్దములు మార్చక

విడిచి పెట్టుతారు. కొందరు అట్టి చోట్ల ఉన్నవాటిని కూడా 'దిద్ది' పాడుచేస్తారు. అడిగే దిక్కులేక ఎవరియిష్టము వచ్చినట్లు వారు కావ్యభాష తారుమారుచేస్తే అదే సాధుభాష అని భ్రమపడుతున్నారు. పండితులు పుస్తకాలు ఏ భాషలో వ్రాసినా శాస్త్రాలు ఏలాగు కల్పించుకొన్నా లౌకిక భాషను నిర్మూలము చేయలేరు. అదివారి నోట్లోనే కాపుర ముంటుంది; నాలుక మీద నెక్కి నాట్యమాడుతూ ఉంటుంది, సలక్షణముగా వృద్ధిపొం దుతుంది. బ్ర॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులవారు తమ ముక్తేశ్వర శతకములో —'పంచాంగము దిద్దిన గ్రహసంచారము మానునె?' అని మాత్రము చెప్పినారు; 'పంచాంగము లేకున్నను బంచాంగము చెప్పకున్న ఒరియునె గ్రహముల్?' అని కూడా చెప్పవచ్చును. గ్రహసంచార విధానము లెస్సగా తెలిసికొని భాషాశాస్త్రము వ్రాస్తే శాస్త్రము ఒప్పుగా ఉంటుంది; లేకుంటే తప్పు; అట్లే లౌకిక భాష లెస్సగా తెలిసికొని భాషాశాస్త్రము వ్రాస్తే ఆశాస్త్రము తప్పుకాదు; లేకుంటేతప్పే. గ్రహసంచారమునకు పంచాంగానికి విరోధము కలిగినప్పుడు గ్రహసంచారము తప్పనడము ఎటు వంటిదో, అటువంటిదే శిష్టవ్యవహారమందు సిద్ధమయిన శబ్దము శాస్త్ర విరుద్ధ ముగా ఉన్నది గనుక తప్పనడము.

ఇకను ప్రయోగములు చూడండి—వాడుకలో లేనిమాటలలో అ చ్చులు హల్లులు నిర్ణయించడమునకు యతిస్థానమందు ప్రాసస్థానమందు వాటిని చూడవలెను కాని వాడుకలోనున్న శబ్దములు పదములు ఎక్కడ కనబడినా ఒప్పుకోవచ్చును. అయినా శంకించే వారుకూడా సంతోషించ వలెనని వారికి కావలసినట్టి ప్రయోగములున్ను సమర్పిస్తున్నాను.

## కూఁతురికి, కూఁతురిని

సీ॥ పా 1. పంట తామరకంటి దంట కూఁతురిమోవి
పంటితీయని తేనె జాంటి తేటి — అహో: పు 518.

ఆ॥ తాటి సిడమువాని తల్లి కూఁతురిబిడ్డ
వెన్ను నడుగుపాప మిన్ను వాఁక. — ఆంధ్ర: దేవ 33.

గీ॥ అనిన కూఁతురు నూరార్చి జనని పల్కె
నింత మాయయ్యగలంగ వెయ్యేళ్లకైన
జాలి వగనింత మాటాడనేల నిపుడు
విన్నపము చేసి పనుపు నీవిభుని వరయ. ఉ. సై. 6 ఆ. 129, వ్రాత 643.

చ॥ కమలదళాక్షి కూఁతురిని గాంచుట మేలగునైన నొక్క ప
క్షమున విచారహేతువని కాంచెద నెట్లగునన్నఁ దల్లివం
శముగురునన్వయంబు పతిసంతతి కన్యదురాత్మురాలైన నొ
ప్పమి యపకీర్తియుఁ సకలబాంధవ నిందయు నొందు గావునన్.
ఉ. రా. పు. 53.

క॥ ఏనీనఁటె నాకూఁతురు (పాఠాంతరము:— ఏనఁటె నాకూఁతుపవటె).
మానవుఁడటె నగరుచొచ్చి మాకులమునకున్
హాని యొనరించెఁ గన్నులఁ
గానఁడు దలయెత్తరొఁత గాదే నాకున్. — ఉ. హరి. ఆ. 5-217.

సీ॥ తొలకరం తరియాట పులుఁగుఁ దేజీరౌతు, నడుగుదోడుమిపక్కి పడగవాని
నలువవాగా బాట యలవరించిన మేటి, రాకావిముక్కాక డాకవాని
తెలిగంటిరాచకూఁతుఁరికైకొనినజాణఁ, గొమరుమన్నెతికంపుగొమరువాని
జాళువా నెత్తమ్మి పరిదాల్చు నీటరి మలచెంచు రామాలి వలపువాని.
(ప్రాసస్థానము) — చంపూ: రా: 111: 8.

క॥ నను సిగ్గునఁ దలవంచిన తనయకు వస్తువ లొసంగి తపనీయ గృహం
బున నొక్క రత్నపీఠిని సొనరుఁగఁ గూర్చుండి యిట్లనియెఁ గూతురికిన్.

దశా: పుట 177 ఆ. 6.

ఉ॥ మామ యిదేటిమాట వినుమా మనమాఁడి జెందెనింక నా
సామి పదంబులాన కొనసాగదు తొల్లిటిభంగి దానవ
గ్రామణి యింటనున్న జనకప్రభు కూఁతుగ నేలుకొంట కా
రామునకొప్పె నొప్పదనరాదు ప్రభుత్వము గల్గువారలన్.

నిర్వ: పి: రా: 23.

క॥ మనమున వెఱఁగంగఁచు నెసఁ జని కూఁతురు కొప్పునందు సవరించినపు
ష్పనికాయముఁ గాంచుచునుదద్వనజాక్షిందోఁడుకొంచువచ్చివినతుఁడై.

పరమ: 4 ఆ: 64.

సీ॥ పా॥1. తన కన్నకూఁతురు దాన పెండ్లాడఁడే వారిజగర్భుండు వావిదప్పి

ప్రబో: వ్రాత పు: 5B: పద్యం 50.

ఉ॥ ఏతలఁ జూచివత్తునని యేగిన నల్వకడాన దోవలో
యాతనగాక యాపయి మహత్తరశాపముఁ జెంద నల్లదే
ద్యోతటినీ శిరస్కుని యథోచిత రీతిని బూజచేసి నీ
కూఁతురి నీయఁజూడఁ గలుగుంగద యాబిడ పాపిలునెట్టగన్.

పాంచ్వ: పంచమా: పుట 84.

సీ॥ పరదేశులము మేము దొరలు మీరున్నపాలు
ముద్దుగూఁతురిసఖుల్ మున్న మేము
విట వేషధరులము వెలయంగ మీయిండ్ల
వరుసతో నుండగ వచ్చు నెట్ల

ప్రభు: ఆ1: పుట 15.

చ॥ తిరముగ మింట వేవెలుఁగు దేవుని గన్గొనినట్టి యాస ని
బ్బరముగ నేగి చేఁగడిమిఁబట్టిన యావరి నేల చెల్వ కూఁ
తురి చెలువంపు కౌని యెద తుందుడు కెల్లను దీర్చినట్టి యా
కరువలి పట్టి నాదు మదిఁగల్గిన కోరిక లెల్ల నీవుతన్.

(ప్రాసస్థానము.) బహు: ఆ 1. పద్యం 8.

ద్విపద॥ అప్పుడు విడిదికి నరిగి పార్వతిని
నప్పగించుటకు భిన్నాత్ముఁడై వరుని
చేతిలోఁ గూఁతురి చేయివేసి పలికె. మృత్యు: ద్వి: 41.

చ॥ క్రొందవళ్ వ్రేలినట్టి దొర కూఁతురికిన్ నసనిడ్డ నాభి చం
దడఁగఁ గాంచి పంచవిశిఖాఖ్య తురుష్క బలంబు వాఁడి క
క్కుఁడు సమయంబటం చదరుగ్రోవుఁ గాల్పఁగ బిట్టునుందు చిం
దడి పొగ నాసజాండమున నిండె నఖండతమఃప్రకాండముల్ ॥

రా. వి: 4 ఆ; ప: 41.

ఉ॥ తెల్లని పాము పాన్పు గడు దెల్లని వార్ధము నెక్కు బిడ్డడున్
తెల్లని చివిపై విడిది తెల్లని తమ్ముల మీరు కన్నులున్
తెల్లని మోము గుజ్జమును తెల్లని మామయుఁ దెల్లకైదువున్
తెల్లని కోడలుం గలుగు తెల్లని కూఁతురి తండ్రి గొల్చెదన్ ॥

రుక్మా: ఆ 1-60, పు 6.

చ॥ జలకములార్చి పాండు జలదచ్ఛదపాళిక గప్పి తమ్మి సం
కులఁ దెలిదేసి లుగ్గులిడి క్రొందరగల్ గదలించుఁ గల్వతో
టైలలఁ గుమారు గూఁతురు ఘటించి భజించు నదీలలామ కో
మలకుముదాగ తాళికుల మంజురవంబున జోలపాడుచున్ ॥

వసు: III ఆ, 432.

ఉ॥ చక్కదనంబు రూపును బొసంగుటె కాదు గుణంబు లందు లం
జక్కదనంబు గల్గెనెరజాణ జగంబుల నీడులేని నా
చక్కని గూఁతురుం దొరయ జాలిన వాఁ డితఁ డల్లుఁడౌ గదా
మిక్కిలి కీర్తిగల్గునని మెచ్చు మనంబున రాజు సారెకున్ ॥

విజయ: I ఆ; ప: 223.

ఉ॥ ఆ నలినాక్షు పెద్దకొడుకు కంచితరూప విలాస చారు తే
జోనిధిఁ బెండ్లియాడె నతి శోభన మూర్తిని రుక్మి కూఁతురిన్
మేనటికంబుగా నఖిల మేదిని నాథులు చూచుచుండఁగా
నా నలినాయతాక్షిని స్వయంవర మైన వివాహ సంపదన్ ॥

విష్ణు. పురా. VIII ఆ: 76.

ఆ॥ తనదు దాన మవని తన గూఁతురి సమంబు
తండ్రి దానమెల్ల తనకు తోడు
అన్యులిచ్చు దాన మది తనవంటిది
విశ్వదాభిరామ వినుర వేమ ॥ వేమన: ద్వి. భా. 126.

క॥ అలగట్టు రాచ గూఁతురు । చెలువెంతయుఁ గపట విప్రశేఖరుతోడన్
బలికిరి వినయంబొప్పగ । సలలిత మకరంద మధుర రసవత్ఫణితిన్ ॥

శివ: 50.

సీ॥ పా: 1. వానిఁదప్పించితి వనజాసనుని యంత
వానికిఁ గూఁతురు వలపుఁ గలపి ॥ శృం. శా. III ప. 189.

మ॥ అకలంకేందునిభాస్య గౌతమ తపస్యా శాలి చంద్రావతిం
సకు సంగంబున నంత గర్భ మొదవన్ సంపూర్ణరాకాశశాం
క కళాగర్భితపూర్వ దిక్ప్రమద రేఖం బాండుగ స్త్రీ విశా
లకపోలద్యుతి మించి యొక్క శుభవేళన్ గూఁతురింగాంచినన్ ॥

సమీ: I ఆ: 186.

సీ॥ దారువనస్త్రీలఁ దగిలెగాని యదేమొ? నీ వలె ముక్కంటి నేరదయ్యొ
గారాబుగూతురిఁగదిసెగాని యదేమొ? నీవలెఁ బరమేష్ఠి నేరదయ్యొ
సారంగ: ద్వితీయా: 118.

సీ॥ పెండ్లి కొమారుకుఁ బెండ్లి గూఁతురికిఁ గై
సేసిరి ముత్యాల బాసికంబు ॥ సుభ: VI. అ: 35.

ద్విపద॥ చెవిడాని గూఁతురుచే వ్రాఁత ఫలము
వివరించి చూఁపితి వినుమీ కుమారి ॥
గౌరన: నవనాథ చరిత్రము: ఆం. కవులం: పుట. 604.

## కూఁతుండ్రు; కూఁతుళ్లు

సీ॥ పెళ పెళమని మ్రోగు పిడుగుల మొత్తము
పెట్లక్రోవుల వాగు వితముగాఁగ
దల తల యంచని వెలుఁగు మెఱుంగులు
దీపికా స్తోమంబు కైపుఁ జెంద
జల జల యంచను సలిల ధారావళి
పన్నీటి చినుకుల పగిదిగాఁగఁ
బట పటయని మైనిఁ బడుచుండు వడగండ్లు
వికసిత మల్లికా వృష్టిగాఁగ
నిబిడతమము వితానము నీడగాఁగ
బెండ్లి కూఁతుండ్రి చందాన వెడలివచ్చు
జారిణుల వానకాలాన జారతతిని
నొక్కటిగఁ గూర్చు నెవడింక యోర్చుపాంక ॥
పార్వ: తృతీయా, పు. 46.

సీ॥ వినుము గాంధారి నీ తనయుండు చేయు దు
ర్న్యయము లెఱుంగవె నాకు నీకు
శాంతనవునకు నాచార్యునకును బాహ్లి
కునకుఁ దండ్రికి మాన్పఁ గొలఁదిగాని
దుర్మానమున నట్లు దొడరి యిట్లయ్యె మీ
యపరాధమున వచ్చినట్టి కీడు
నకు నింత నొవ్వంగననుఁ బల్కఁ దగునె యు
మ్మలికంబు ధృతిఁబట్టి మాన్పు మింక
చేటునకుఁ జావునకు వగఁ జెందు జనుల
కినుమడింపదె మానసమున నలంత
రాచకూఁతుండ్రు సుతుల సంగ్రామ నిరత
హృదయులగు వారిఁ గాంచఁ గోరుదురె కాదె॥ భార. స్త్రీ, 2 ఆ: 166.

సీ॥ ఇరుగింట దయ్యంబు పొరుగింటికిని గూబ
యెదురింటివారల కెదురుచుక్క
వాడకుఁ బగయూరివారల తల నొప్పి
పెంపుడుకూఁతుండ్రు పెద్దపిడుగు ॥ శుక: పు. 114.

వ॥ అస్తి ప్రాప్తి నామధేయ లయిన కంసభార్య లిద్దఱు తన కూతుండ్రు గావున వారికైన వైధవ్య దైన్యంబు తనకు నత్యంత దుస్సహంబగుటయు
* * * * హరి: ఉ: I పద్య 4: 1870 Ed.

వ॥ పెండ్లి కాని కూఁతుండ్రున్న పక్షమందుఁ బ్రతి వివాహమునకుఁ గొడుకుల భాగములలో నాలవ పాలువంతున నెత్తి తండ్రిచేతి కిప్పింప వలసినది.—— హిందూధర్మ శాస్త్రసంగ్రహము—— పరవస్తు చిన్నయసూరిచేతఁ దెనుఁగింపబడినది. రెండవకూర్పు- పేరా 194, పుట 47.

గీ॥ ఘన విలాసవతులు కౌసల్య కైక సుమిత్ర యనెడు పేళ్ళ పేర్మిమీరి
మీరి శనునకుముప్వురనుఁగు కూఁతుళ్ళు వారలవరించునంచు దెలిసె నధిప॥
నిర్వ: వి. రా: పుట 58.

*   *   *

చదువరులారా! చూచినారుగదా ఎందరు కవులు వాడిఉన్నారో చిన్నయసూరిగారు గ్రామ్యములన్న శబ్దములు—అతని పూర్వులే కాక అతని తర్వాతివారున్ను! అతడు అసాధువులన్నవి అతడు పుట్టక మునుపు పుట్టిన వ్యాకరణాలలో సాధువులుగా ఉన్నవిగదా! ఏమయినట్టు అతని అనుశాసనము? గొంకయినదా, కాలేదా? ఈ మాటలకు అతడు వేసిన వెలి ఇకనయినా తీసివేస్తారా పండితులు' లేక, ఇంకా సిగసావహిస్తారా అతని శ్రీముఖము? చిన్నయసూరిగారి శిష్యులు అతని శాసనము వేదవాక్యముగా నెత్తిమీద పెట్టుకొని మనతో కలియకపోతే పోనీండి; మనము లోకములోనివారము; వారు లోకాతీతులు; వారితో మనకేమి పని? వారు మన జోలికి రాకుంటే చాలును.

కూఁతురు శబ్దము ద్రావిడ భాషలోనిదిగాని ఆర్య భాషలోనిది కాదు. శిలా శాసనములో "కూఁతురు", 'కూంతుఱు' అనే రూపములున్నవి. గ్రంథములలో 'అల్లు (=అరులు)ఁ గుఱ్ఱ' 'తమ్ముఁగుఱ్ఱ' వలెనే, సమాసములో 'కూతుఁగుఱ్ఱ' అని ఉండే అక్షరములు గలిగ 'కూఁతు' శబ్దము కనబడుతున్నది. పదమధ్యమందున్న బిందువు నకారము నిర్దేశిస్తున్నది. 'కూన' 'కున్న', 'గున్న', 'కూను', 'కుత్తు'; 'కుర్దు' 'కుందు' మొదలయిన వాటివలెనే 'కూంతు', అల్పార్థముగల 'కుఱ' వంటి ధాతువు నుండి వచ్చినది కాబోలు. దీనివ్యుత్పత్తి ఇంకా విచారించవలసి ఉన్నది.

ప్రాచీనాంధ్రభాష ఎంతగా మారినదో ఈ 'కూఁతు' శబ్దము యొక్క మార్పును బట్టి వివేకము గలవారు తెలుసుకో గలరు. ప్రాచీన

దశలో 'కూఁతు' అనాప విభక్తికము, గనక 'కూఁతును', 'కూఁతునకు' 'కూఁతులు' అనే రూపములున్నవి. ఉత్తరాంధ్రములో 'కూఁతురు' ప్రాతిపదికము; 'ఊరు' 'నగరు' వలెనే ఔపవిభక్తికము; కూతురిని, కూతురికి, కూతుళ్ళు (=ర్లు) అనే రూపములు దానినుండి వచ్చినవి. ఆంధ్ర భాషలోని విశేష్య ములు వర్గీకరణము చేస్తే, ఔపవిభక్తికములనిన్ని అనాపవిభక్తికములనిన్ని రెండు గొప్ప వర్గములు ఏర్పడుతవి. ఒక కాలములో ఒక వర్గములో చేరిన శబ్దము మరిఒక కాలమందు మరిఒక వర్గములోచేరితే, ఆ శబ్దము ఎంతమట్టుకు మారినట్లో గ్రహించుకోండి. ఒకప్పుడు ఒక జాతిలో ఉన్నవాడు మరి ఒక ప్పుడు మరి ఒక జాతివాడయినట్టేగదా! సాధారణమైన మార్పా ఇది? 'కూఁ తురు' వలెనే, 'సేఁపు', 'ప్రొద్దు' 'మన్ను' ప్రాచీనాంధ్రములో అనాప విభక్తికములుగా ఉండినందున 'సేపునకు', 'ప్రొద్దునకు', 'మన్నునకు' అనే రూపములు కనబడుతున్నవి; ఇవి ఉత్తరాంధ్రములో ఔపవిభక్తికములు గనుక 'సేపటికి' 'ప్రొద్దుటికి' 'మంటికి' అనే రూపములు వాడుకలోఉన్నవి. గ్రాంథిక భాషమారలేదని వాదించే మూఢులకు భాషంటే ఏమిటో, మా ర్పంటే ఏమిటో తెలియదు. మేము భాషమార్చి పాడుచేస్తున్నామని గట్టిగా మొర్రపెట్టి వట్టికేకలు పెట్టితే కొంపకూలినట్టు పామరులు భయపడ్డారు— అంతే. బుద్ధిపూర్వకముగా ఎవరైనా భాషమార్చగలరా? వట్టి తెలివి తక్కువ మాటగాని! 'కూఁతురిని' మొదలయిన రూపములను గురించిచేసిన చర్చవల్ల ఏర్పడ్డ సిద్ధాంతములోని సారాంశములు చదువరులు జ్ఞప్తియం దుంచుకొని, ఇంకా మరికొన్ని మాటలనుగురించి ఇటుపైని మేము చేయ బోయే చర్చలో అనుసంధానము చేసుకోవలెనని మాకోరిక. అందుచేత మా ఊహాపోహములు స్పష్టముగా చెప్పుతున్నాము. చదువరులు విసుక్కో కూడదు; పాడిన పాటే పాడుతున్నామని ఆక్షేపించ కూడదు. నిజమైన హరిభక్తి బోధించే హరిదాసులు పాడినట్టు నిజమయిన భాషాభిమానము

బోధించుటకు భారతీదాసులు పాడినపాటే పరిపరివిధముల పాడకతప్పదు. లౌకికభాష గ్రామ్యభాష అని భ్రమ పుట్టించిన మాయ పోగొట్టడము సామాన్యమైన పనికాదు. దేశమంతా ఆవరించిన ఆమాయనుండి తప్పించుకోవడము బహు కష్టము. చదువరుల మనస్సుకు తెల్లగా బోధపడవలెనన్న అభిలాష చేత వివరముగా విషయము విశదపరచడము, చాదస్తములాగున కనపడ్డా, తప్పుకాదు. మరి చిత్తగించండి.

'కూతురిని' మొ॥ రూపములు నన్నయ తిక్కన మొ॥ ప్రాచీనులు తమ గ్రంథములలో వాడనివి అయినా అర్వాచీనులు అనేకులు తమ గ్రంథములలో వాడిఉన్నారు; నేడు అవి లోకములో ఉన్నవి; శిష్టులు కొందరు గ్రంథములలో వ్రాస్తున్నారు. నన్నయ తిక్కనల కాలములో ఉన్నట్టే, తర్వాతికవుల కాలములోకూడా భాష ఏకరూపమున ఉన్నదని చెప్పలేము; పూర్వము 'కూఁతును' 'కూఁతులు' తర్వాత 'కూఁతురిని' 'కూతుళ్ళు'గా మారినవని ఒప్పుకోక తప్పదు. కూతురిని మొ॥ ఉత్తరాంధ్ర రూపములు ప్రయోగించిన ఉత్తరాంధ్రకవులు, నన్నయ తిక్కనలు వ్రాసిన గ్రంథములు చదివే ఉంటారు గనక, తెలిసే అట్లు వ్రాసిఉంటారనుకో వచ్చును; ఒకవేళ తెలియకనే వ్రాసినారన్నా, ప్రాచీనభాషకు భిన్నముగా ఉన్న ఉత్తరాంధ్రభాష వాడకూడదన్న నియమము ఉత్తరాంధ్ర కవులకు లేదని ఊహించవచ్చును.

ఉ॥ ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగాఁ బడియె నెంతును దానినె కాని నూత్న సం
పాదన లేమిచేఁ దెనుఁగు పల్కు మరొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రాదని ద్రాక్షవాటి కవిరాక్షసుఁడీ నియమంబుఁ జేసినన్.

క॥ ఆమూఁడుపర్వములలో, సామాన్యుఁడునుడువు తెనుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కనసుధీమణి మొదలైన తొంటి తెనుఁగు కవీంద్రుల్॥

అని అప్పకవి చెప్పినట్లు, కవిరాక్షసుడు కానీ మరి ఎవడట కానీ, నన్నయకవి యుగాదిని, (అనగా అయిదు వేల సంవత్సరముల క్రిందట!) ఏ శబ్దములు తన భారతములో వాడినాడో, ఆ శబ్దములే కాని వాటికి భిన్నమైనవి వాడకూడదని నియమము చేసిఉంటే, ఆనియమము ఎవరూ పాటించ లేదని మేము రుజువు పర్చగలము. తిక్కన మొదలయిన వారయినా నన్నయ గ్రంథములోని 'తెలుంగు లరసికొని కృతులు రచించి' రన్నమాట వాస్తవము కాదు. పై పద్యములో 'సూత్రి సంపాదన లేమిచే' అని ఈ నియమమునకు కారణముగా చెప్పినట్టున్నది; సూత్రసంపాదన లేకపోవడమేమి? మనకాలములో కందుకూరి వీరేశలింగంపంతులు గారు చెప్పినారు:— భారతము వ్రాసిన నన్నయభట్టు రచించినది కాదు ఆంధ్ర శబ్ద చింతామణి అని-గాని అంతకు పూర్వము పండితులందరూ:

క॥ అవధారు శబ్ద శాసనుఁ డవనిఁ గళింగుఁ గమున కారి రాజమహేం

దవరంబునఁ జెప్పిన యాంధ్ర వచో వ్యాకరణ సూత్రతతిఁ దెనుగింతున్॥

అని అప్పకవి చెప్పినట్టే నమ్మేవారు. తిక్కనకు నన్నయ శబ్దానుశాసనము తెలిసి ఉంటే అతడు తెలిసి తెలిసి మరీ ఉల్లంఘించినాడని ఊహించ వలెను.

కాబట్టి అన్ని దేశములలో ఉన్నట్టే మన తెలుగు దేశములో కూడా ఏ కాలములో ఏ శబ్దములు ఏ రూపమున శిష్ట వ్యవహారములో ఉన్నవో ఆ కాలములో ఆశబ్దములు ఆ రూపమున కవులు తమ గ్రంథములలో వాడడము ఆచారము—అని ఊహ్యము.

ఇకను, భాషా లక్షణము కూడా భాషతో మారుతుందని ఊహించవచ్చును. ఆంధ్రశబ్దచింతామణి ఏ కాలములో పుట్టినదో నిజము తెలియదు. అందులో కూడుకురు శబ్దమును గురించి ఏమీ చెప్పి ఉండలేదు. అట్టి అసంపూర్ణ వ్యాకరణముచేత భాషకు అంతటికీ అను శాస

నము ఏర్పడదు గదా. ఏర్పడినంతమట్టు కయినా, భాషానుశాసనము, (=భాషాసంస్కారము) లోకములో సిద్ధమయిన శబ్దములను సాధించేదే కాని, సిద్ధమయిన దానిని అసాధువు చేయలేదు; సిద్ధము కాని దానిని సాధువు చేయలేదు. కేతన వ్రాసిన వ్యాకరణములో 'కూఁతున్', 'కూఁతులు' మొదలయిన రూపములు మాత్రమే చెప్పి ఉన్నవి. రేఫపోతుందని కూడా స్పష్టము. కేతన తన కాలములోని సిద్ధ శబ్దములను అనుసరించి ఈ వ్యాకరణము వ్రాసి భాషాలక్షణము కొంచెము చెప్పినాడు. పిమ్మట విన్నకోట పెద్దిరాజు చెప్పిన లక్షణములో 'కూఁతురిని' ఉన్నదిగాని 'కూఁతురులు' లేదు. తర్వాత అహోబలుడు 'కూఁతురులు' అనే రూపము చేర్చుకొన్నాడు. రావిపాటి గురుమూర్తిశాస్త్రిలుగారు కూతుళ్ళు* అనే రూపము అంగీకరించినారు. ఈ శబ్దములోని మార్పులు లోకములో ప్రజలనోటను పుట్టి గ్రంథాలలో చేరినవే గాని లాక్షణికులు పుట్టించినవి కావు; తాటాకులమీద వ్రాసిన శబ్దములు ఎప్పుడూ మారవు. 'గ్రాంథికభాష మారదు' అంటే అర్థమేమిటి? తాటాకుమీద ఏలాగున వ్రాస్తే ఆలాగే ఉంటుంది అంటే సరే, ప్రజల నోటనుకూడా నిత్యంగా ఆలాగున ఉంటుంది, అంటే ఒప్పుకోలేము; మారితే మారవచ్చునంటాము. 'వ్యాకరణములో నియమము ఏర్పరచి కట్టు కట్టి ఉంచితే శబ్దము మారదు' అని ఊహించడము అవివేకము. కేతన చేసిన అనుశాసనమూ సంస్కారమూ కేతన కాలమువరకూ చెల్లవచ్చును; గాని అటుపైని చెల్లకపోవచ్చును. అట్లే పెద్దిరాజాది; అట్లే ఎవరిదైనాను. దేశభాషాలక్షణము సనాతన ధర్మశాసనము కాదు.

అయితే చిన్నయసూరి వ్యాకరణము మనకాలములోనే పుట్టినా అది మనకాలములోని వ్యవహారమును అనుసరించి చేసిన అనుశాసనము కాదు. కూతురిని, కూతుళ్ళు మొదలయిన రూపములు అతని కాలములో లోకవ్యవ

* కొమారులు = కొమాళ్లు; గోరులు = గోళ్లు; సీరులు = సీళ్లు; ఊరులు = ఊళ్లు; నగరులు = నగళ్ళు మొ॥

హారమందున్న వే; అతని మిత్రుడే 'ఆంధ్రభారత వచనము'లో వాటిని తరుచుగా వాడిఉన్నాడు* అవి వ్యావహారిక భాషలోనివే అని తెలిసినవాడైనా, ఆ రూపములు తాను చూచిన ప్రాచీన కావ్యములలో లేకపోవడముచేతనూ, బహుశా ఉత్తరాంధ్రకావ్యములు అతడు బాగా చదువకపోవడముచేతనూ, కేవలము వ్యవహారములో మాత్రమే జనులు వాడుకొంటూ ఉన్న రూపములు గ్రామ్యములని ఒక పరిభాష యేర్పర్చుకొని, కూతురిని, కూతుళ్ళు మొదలయినవి గ్రామ్యములని చెప్పిఉండును. ఆ ప్రకారము చెప్పినా, అతడు పెద్దల వ్యవహారంబు గ్రామ్యంబైనను గ్రాహ్యంబన్నాడు కాడా? కాబట్టి తెలుగుమాటల సాధుత్వా సాధుత్వములు నిరూపించడములో కవుల ప్రయోగమే ప్రమాణము; దానికి విరుద్ధమైన లక్షణము దుష్టముగాక మానదు.

ఇప్పటి తెలుగుపండితులుకూడా, తమకిష్టమైన రూపమును చిన్నయసూరి నిషేధించి ఉంటే, తమ కిష్టమైన ప్రయోగము ఒకటి చూపించి, చిన్నయసూరి అనుశాసనము దిగద్రొక్కివేస్తున్నారే. ఉదా. పూను శబ్దములోని మొదటి హల్లు వికల్పముగా లోపిస్తుంది అని అప్పకవి చేసిన అనుశాసనమును తృణీకరించి, 'పూను పాదవుల కాదిలోపం బొకండు వచియించెనది యవిచారమూలకంబు' అని చిన్నయసూరి సగర్వముగా తాను వేరే అనుశాసనము చేసినాడు. అయితే సీతారామాచార్యులవారు తమ శబ్దరత్నాకరములో చిన్నయసూరి వాక్యము నిరాకరించినారు. వేదము వేంకటరాయశాస్త్రిగారుకూడా నైషధటీకలో చిన్నయసూరిమాట తప్పన్నారు. గుప్తార్థ ప్రకాశికలో కల్లూరి వెంకటరామశాస్త్రిగారు చిన్నయసూత్రమునకు వ్యాఖ్యానము వ్రాస్తూ ఏమీ మొగమాటములేకుండా, 'ఇట్టు

* 1847 వ సంవత్సరములో కాంచీపురములో పచ్చయప్పమొదలిగారి విద్యాశాలయందు ఆంధ్రగీర్వాణ ప్రధానోపాధ్యాయులయిన వైయాకరణము రావూనుజాచార్యులవారున్ను చిన్నయసూరిగారున్ను కలసి పరిష్కరించిన ఆదిపర్వమునకు అర్థముగా ఈ భారతవచన మున్నది.

లసామాన్య కవిప్రయోగంబులుండఁగా, బరిశీలింపక కవిబ్రహ్మ వాక్యాన నెదురాడిన చిన్నయసూరి వచనంబు చిన్న యసూరి వచనంబుగాఁ జెల్లంవగు' నని అధిక్షేపించినారు*.

వ్యాకరణములోని దోషమును చూపించి, శిష్టవ్యవహారసిద్ధమైన కవిప్రయోగమును సాధువుగా సిద్ధాంతము చేయడము అన్ని దేశములలోను పండితులకు విహితమయిన పని. చిన్నయసూరికి పూర్వము చేసిన శబ్దాను శాసనము ప్రకారము తప్పు లనవలసినవి అనేకములు చిన్నయసూరి సాధువులుగా అనుశాసించినాడు. అయినా అతడు చేసిన బాలవ్యాకరణము నందున్న 462 సూత్రములలో అనేక లోపములు కనబడినందున సీతారామాచార్యులవారు 314 సూత్రములు చేసి త్రిలింగ లక్షణశేషము అనే పేరుగల ప్రౌఢ వ్యాకరణములో తిరిగీ తెలుగుభాష అనుశాసించినారు. ఈ సీతారామాచార్యులవారి అనుశాసనములో తమ కనిష్టమైన భాగము వేదము వెంకటరాయశాస్త్రులవారు తమ వ్యాఖ్యానాలలో ప్రత్యాఖ్యానము చేస్తూఉన్నారు.

పండితుల శబ్దానుశాసనము రాజు చేసే ధర్మశాసనమువంటిది కాదు. శబ్దానుశాసనమునకు ఆధారము లోకమందున్న సిద్ధశబ్దములు; ధర్మశాసనమునకు ఆధారము శాసనాధికారి చిత్తవృత్తి, మంచిది కానీ, చెడ్డది కానీ; దానిని మీరితే దండన. వాస్తవముగా లోకమందున్న భాషను అనుసరించేదే భాషానుశాసనము, గనుక అది (సరిఅయినదయితే, సరిఅయినది, కాకుంటే అనుశాసనమే కాదు.) పిచ్చివాళ్ళు తప్ప దానిని ఉల్లంఘించేవారు ఆ భాషనువాడి సంఘములో ఉండనే ఉండరు. గ్రంథములలో ఉండే శబ్దములు మాత్రమే ఆధారముగా అనుశాసనము చేసేవారు గ్రంథములన్నీ ఒకటైనా విడవకుండా ప్రతిగ్రంథమూ ఆమూలాగ్రముగా పరిశీలించ

* ఊను వేరేక్రియా రూపము కావచ్చును 'పూను' నుండి 'పూనికి' అయినట్లు 'ఊను' నుండి 'ఊనికి' కాదు. ఇది 'ఊఁదు' యొక్క రూపాంతరము. కృద. ఊత.

వలెను. కోశము చేసేవారున్నూ అట్లే వారి పరిశీలనలో లోపముచేతగాని ప్రమాదము చేతగాని ఏశబ్దమైనా వ్యాకరణములో గాని కోశములోగాని చేరకపోయినా, మార్పుచెందినా, గ్రంథమందున్న శబ్దము ఎప్పుడూ తప్పు కాదు; 'వ్యాకరణమున్నూ కోశమున్నూ ఆ విషయమునందు తప్పు' అనక తప్పదు.

ఇందుకు దృష్టాంతముగా అథర్వణాచార్యుల శబ్దానుశాసనము లోని ఒక సూత్రము ఉదాహరించి దానిలోని దోషములు చూపిస్తాము.

టవర్ణః క్రియాంతేస్యాద్భావార్థే సాసమాసయోః పూర్వస్య సవికారోనో స్తస్మిన్ లోపశ్చకస్యచిత్, అనగా భావార్థమందు క్రియాపద మునకు అంతమున 'ట' వర్ణకము వచ్చును, సమాసమందుగానీ, అసమాస మందుగానీ. (ఉదా:— సాటివచ్చుట, వచ్చుట). ఆటవర్ణమునకు పూర్వ మందు 'ను' ఉంటే, దానికి వికారము రాదు. ఒకానొకదానికి లోపమున్నూ కలుగును. ఈ అథర్వణశాసనము ప్రమాణముగా అంగీకరించి, అహోబలుడు తన భాష్యములో, పూర్వస్యన వికారోనో రిత్యనేన-అంటవింట కొంట ఇత్యాది ప్రయోగస్య భావార్థేన సాధుత్వం కింతు అనుట ఇత్యాది రేవ। ఏతేన "మధుకైటభారాతి మఱఁది రమ్మని పిలిచి పనిగొంట నీకుఁ బ్రాభవము గాదె" ఇత్యాది వచనస్య ప్రామాదికత్వమే వేత్యవధేయం" అని ఉద్ఘో షించినాడు. అనగా టవర్ణమునకు పూర్వమందున్న ను వర్ణమునకు వికారము లేదని (అథర్వణాచార్యుల శాసనములో) ఉన్నదిగనక అంట, వింట, కొంట, మొదలయిన ప్రయోగములు సాధువులుకావు; అనుట, వినుట, కొనుట అనే ఉండవలెను. అందుచేత 'మధుకైటభారాతి మఱఁది రమ్మని పిలిచి పనిగొంట" అనే వచనము ప్రామాదికమని తెలుసుకోవలసినది.

ఈ 'మధుకైటభారాతి...పనిగొంట' అనే వాక్యము వ్రాసిన కవి సామాన్యుడు కాడు, శ్రీనాథుడు. నైషధము, 3వ ఆశ్వాసము, 126వ పద్యములోనిదిది. నైషధములోనే III, 159 లో 'పగగొంట' అనిన్నీ IV, 54 లో 'కాదంట అనిన్నీ ఉన్నది. ఆకవి వ్రాసిన తక్కిన గ్రంథ

మాలలో కూడా ఇట్టి రూపములు కనబడుతున్నవి. హరవిలాసము II, 80 లో 'క్రొంట', కాశీఖండము I, 50 లో అంట, ఈ శబ్దములు శ్రీనాథుడు బుద్ధిపూర్వకముగా వాడినవిగాని, తప్పి దారిపడ్డవికావు. ఈ రూపము ప్రామాదిక మని అహోబల పండితుడంటే శ్రీనాథుడు వ్రాసినది తప్పు అని భావము. దేనినిబట్టి అహోబలుడు ఈరూపము తప్పన్నాడు? అథర్వణాచార్యుల అనుశాసనమునుబట్టి. ఆ అనుశాసనమునకు ఏమి ఆధారమో అతడు చెప్పలేదు; చెప్పక పోయినా, అతని అనుశాసనము అహోబలునికి వేదవాక్యమువలె ప్రమాణమయినది. ఈ లాక్షణికుల మాట మనము శిరసావహించి,అంట, క్రొంట అనే రూపములు అసాధువని ఒప్పుకొని, శ్రీనాథునికి నిర్దుష్టమైన తెలుగుభాష రాదనవలెనా? అథర్వణుడున్ను, అహోబలుడున్ను సామాన్యులు కారు. తెలుగుమునిత్రయములోనివారట! సంస్కృతములో అపశబ్దమును ఉచ్చరించినా, విన్నా, పాణిని తలచుకొంటె పాపము పోతుందన్నట్టే, ప్రాకృతములో అపశబ్దోచ్చారణదోషము వాల్మీకిని తలచుకొంటే పోతుందన్నట్టే, తెలుగు విషయములో తన్ను స్మరిస్తే అపశబ్దమచ్చరించిన పాపముగాని విన్నపాపముగాని ఉండదని "అత్రతుమామేవ స్మరే" త్తని చెప్పుకోదగినంత ప్రఖ్యాతపండితుడు అథర్వణుడు.

ఇక అహోబలుడు తన్నుగురించి తానే ఇట్లు చెప్పుకొన్నాడు.

ఉ॥ వేరనలేఁడు ధారుణి నవీనతరాంధ్రకవిత్వ సంపదా
ధార రసజ్ఞులైనఁ గవితల్లజులైన వినుండు పాండితీ
పారగులార, యోపరమబంధువులార, తదీయ శబ్దసం
భారము పారముం దెలియఁ బాల్పడ నేన సుఁడీ జగంబునన్ ॥

కం॥ గట్టిగ నభినవ నన్నయ భట్టాచార్యాభిధాన పటు బిరుదాంకం
బట్టిట్టనక వహించినదిట్టను ననుబోలఁగల సుధీమణు లేరీ?

పండితులు తమ్ముగురించి తాము వ్రాసుకున్న ప్రశస్తినిబట్టిగదా వారి పాండి

త్యము లోకములో ప్రకటితమవుతున్నది ! ఇప్పుడు మన కాలములో కూడా గ్రంథాలు వ్రాసేవారు చాలామంది తమ్ము గురించి తామే సంకీర్తనలు పాడుకొంటున్నారుగదా ! ఇప్పటి పండితుల సిద్ధాంతములందు ఇప్పటి సామాన్య జనులకు ఎంతగౌరవము గలదో, అహోబలుని కాలములో అతనియందు అప్పటి జనులకు అంత గౌరవముండేది అని మనము ఊహించుకో వచ్చును. వివేకము గలవారు మాత్రము ఎవరిమాటైనా విమర్శ చేసి మరీ గ్రహిస్తారు గాని, ధూర్తులు చెప్పిన మాటని భయపడి ఒప్పుకోరు.

అంట కొంట మొదలయిన రూపములు తప్పని అథర్వణుడు, అహోబలుడు చెప్పినారని వారిమాట శిరసావహించి తర్వాతి కవులు ఆరూపములు ప్రయోగించడము మానివేసినారా ? పరిశీలించి చూతాము.

ఎంత వెదకినా నన్నయ భారతములో ఈ రూపములు మాకు కన బడలేదు. తిక్కన ఎఱ్ఱనలు వ్రాసిన భారతములో ఉన్నవి. వీరేకాక, కేతన, మారన, భాస్కరుడు, పాల్కురికి సోమన, నాచనసోమన, మంచన, శ్రీనాథుడు, పోతరాజు, పినవీరన, పోతకవి మల్లన, నందిమల్లయ, నందితిమ్మన, కృష్ణదేవరాయలు, మాదయ్యగారి మల్లయ, రామభద్రుడు మొదలయిన గొప్పకవులందరూ ఈ రూపములు వాడిఉన్నారు. వీరి తర్వాతివారు నేటివరకూ అవి వాడుతూ ఉన్నారు; గాని గ్రామ్యము లనిన్నీ లక్షణ విరుద్ధములనిన్నీ విసర్జించలేదు. చూడండి ప్రయోగములు క్రిందను ఉదాహరిస్తున్నాము. కావ్యములను అకారాదిగా వరుస ఏర్పర్చుకొని వాటిలోని ప్రయోగములు ఎత్తి వ్రాసినాము.

సీ॥ స్వప్న భాషణముగా జరుగుచుండును మేలు
కొంట యనఁగ మేలుకంటయనఁగ॥ అం. భా. I, 142.

సీ॥ గీ॥ తొంట చెక్కుతడప యంట త్యాగాఖ్యయో
త్యాగవయవమూ దనరు బరడు నాఁగ అం. భా. II, 87.

సీ॥ ఆఁకలియన గొదయనఁగ నాకొంట నాఁ
గను క్షుత్తు పేరుగాఁ దనరుచుండు ఆం. భా. II, 260.
తే॥ నిపుణుఁడయ్యె నటంటను ద్రిపురివైరి ॥
ఆంధ్రనామ శేషము, పుట 98, పద్య. 32.

కం॥ కనియెను, జూచెను, గాంచెను, గనుఁగొనె, గన్గొనె, ననంగ గలయవి పేళ్లై
నను వీక్షించె పటంటను ఘనతరగోరాజ గమన కాయజదమనా.
ఆంధ్ర. నా. సం॥ II, 40.

తే॥ నాల్మి, యోరిమి, సైఁణ, తాలు కొంట,
సైఁచు టోర్చుట, యనఁగను క్షాంతిపేళ్ళు ॥
ఆంధ్రనా. శే. 54, 104.

ఉ॥ అంటలుఁగట్టి చేలకును నాండ్రను బిడ్డలుఁగూడ గాయఁ బో
గంటకముల్పదాగ్రముల గాడగ దూసిననొప్పి గూయిడక్
గంటికి నిద్రగాన కొదుసంబడి వేగద మిందు నొక్క మా
కంటయ కాక నీవు పడునట్టి యవస్థ వచింప శక్యమే ॥
ఆముక్త మాల్యద II, ఆ. 33.

సీ॥ గీ॥ యిచ్చటనె కాదె పచ్చరాగచ్చు దిన్నె
ముచ్చటలు మీఱ మెచ్చుచు రచ్చయుంట
మఱియు నిచటనె కాదె పేరిమ మెయిమనము
గచ్చులనుకొంట యోమత్స్య కంతులార ॥
ఇందుమతీ పరి. 33.

ఉ॥ ఆ దురితంబుచే నృపతి యాననసీమ వికార భావము
త్పాదకమైన నాప్తులగు బ్రాహ్మణ ముఖ్యుల తోడ దెల్పినన్
ద్వాదశిపుణ్య కాలమునఁ దైలమునన్ దలయంటి కొంటదో ॥
కవిరాజమనో. పుట 80.

చ॥ నెలపది ప్రొద్దునే మిచట నిల్చినమాత్రన మాకు మీర లెం
గిలి సతతంబు బెట్టితిరి; కిల్బిషవర్తనులార, యక్కటల్
కలుగవె గొట్టివారికి జగంబున? నోడలబండ్లు బండ్ల నోడలుం
జనుదెంచునంట యకటా! వినరే యిటు జేయఁ గూడునే॥

కేయూర. బా. III, పుట 103.

మ॥ విపులంబైతగు కోట లోపల శిలావేదిన్ జతుస్తంభ మం
టపమందాసులు తానుతోడి తన బిడ్డన్ దెచ్చి యొప్పించుట
ల్లపుఁ జేకొంటయు గన్పడన్నిలుపుమే రీసున్ గనన్ దోఁచు తీం
ద్ర పురీశ్రీరంగ సమాఖ్య పట్టణ రణారంభంబు లీనాటికిన్॥

చెన్న పు.

ఉ॥ మామ, యిదేటి మాట! వినుమా, మన మారడి జెందె నింకనా
సామి పదంబులాన కొనసాగదు తొల్లిటి భంగి దానవ
గ్రామణి యింట నున్న జనకప్రభు కూతుర నేలుకొంట కా
రాముని కొప్పె నొప్పదనరాదు ప్రభుత్వము గల్గు వారలన్॥

నిర్వ ఉ. రా. పుట. 23.

కం॥ చెలువు గలవాడ వంటను, జెలువలనలయింప నీకు జెల్లదయో నీ
చెలువెల్ల జెట్టపాలుఁగ, నలరు జిరాజోదుజోడ, యామని చేడా॥

నీలాసుం. ఆ. 3, పద్యము 23.

సీ॥ మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి
పని గొంట నీకుఁ బ్రాభవము గాదె    నైషధం III, ఆ. 126.

ఉ॥ అక్కట యిట్టి వల్లభునియందును గోపము పుట్ట నాకుఁ ద
ప్పొక్కటి యేలతోఁచె నదియున్ మఱిమదిఁ గూర్చి యంటఁగా
దక్కఁగ దెల్పె వల్లభుడు దానికి నగ్గము నప్పుడేను నే
లొక్కటిగాఁ దలంచి విడనొల్లన కోపము దైవవంచనన్॥

పరిభా. V, 145.

ఉ॥ ఒంటిగ నుండి యా వెనుక నొక్కతెఁ గైకొని యిర్వురౌటచే
వంటక మబ్బమిన్ గడుపు పాటుకు నుర్వ్యగఁ దాను నల్ల వా
ల్గంటియు నొక్క దేహముగఁ గన్పడు చుండిన యట్టి మంట నే
మంట వచింతు స్త్రీల కళ డాఁకలిఁ దీర్చెనె పోయి గూర్చునే ॥

పార్వ. పుట 6, ఆ. 4.

శా॥ ఆఁడుంగాన్పును గంటకన్నసతి గొడ్రాలౌటయే మేలు నూ
ఱేఁడు ల్పెంచినఁ గూఁతురేమి సతమా యీవియ్యముల్ కోడలిన్
గాఁడంబల్కినఁ దాళఁగావలెసెఁగా కాఁగాని తిట్లాడికల్
నేఁడీ తండ్రియుఁ దల్లివంగడముగానీ పంచుకోనాయెఁగా ॥ పాంచా.

చ॥ మునిపతి రాకయుం గుసుమమూం దన కిచ్చినలాగు రుక్మిణీ
వనితకుఁ దానొసంగుటయు వంచనఁ బొందిన బోటి సత్యకు
న్మన మెరియంగఁ జెప్పుటయు మానిని కోపము వేఁడుకొంట యుం
దనదు ప్రతిజ్ఞయుం దెలిపెఁ దార్క్ష్యన కాంతయు నాదరంబునన్ ॥

పారి II, ఆ. 74 పద్య.

చ॥ అలయక మంత్ర తంత్ర వివిధౌషధ భంగులఁ జేసి యెంతయుం
వలగురు నాథులంట; మగువా, కడు బేలతనంబు దాన మున్
గలిగిన ప్రేమయుం బోలియుగాని యొకండును సిద్ధిఁ బొందఁ ద
ప్పాలఁతులతోడి మన్కి యహిపాత్తుగఁ జూచు విధుం డెఱింగినన్ ॥

భార. ఆ. V, 296.

క॥ వింటే మృత్యువుమాటలు, గంటే నామీఁద దప్పు గలిగించెద వి
ట్లంటం గట్టందగునే, యంటను నగి బోయ యిట్టులనియె నరేంద్రా॥
అనుశా 1. 28.

ఉ॥ బంటుతనంబుమాటలకుఁ బాలకు పాండునృపాలు పాలు గై
కొంటయచాలునన్న నృపకుంజరు పల్కుల కడ్డమాడరా
కుంటరయేలుంగ వేమును సుయోధను చందముఁ జూపి యప్పుడే
మంటి యుపేంద్రనిన్నని రణాగ్రమునన్ నిను మూదలించెదరా ॥

భార. ఉద్యో. III, 59.

క. ఇఁటం దెవులునఁ జచ్చుట, కంటెను పాపంబు లొండుగలవె నృపులకున్
బంటకలను పొలిగలనిది, గంట నిధానంబు గంట గాదే మనకున్ ॥

భార. భీష్మ I, 99.

చ. సమరము పెంపు సెప్పెదవు, సంజయ! చెప్పను నీవు నీమహీ
రమణునిభంగి, ధర్మజా శరంబులచే విరథత్వమొంది మా
నముఁ, జలముం దెగం దొలఁగె నామగుడం బురికొంట లేదె ని
క్కము సెపుమా తనూజా భుజగర్వ విహీనత నొంచెఁ జిత్తమున్ ॥

భా. కర్ణ I, 137.

చ. సమరము పాడి నీవెఱిఁగి శత్రుల గెల్వఁగ నుత్సహించు టొ
ప్పు మనుజనాథ యొక్కఁడునుబూని మహాద్భుత బాహు సంపదన్
మమువడిఁ దాఁకెదం బిలుకుమార్చెదనంట యుదాత్తమైన ధై
ర్యమహిమగాదె యిట్లనిన యంతనయే నటులేల చేసెదరా ॥

భార శల్య. II, 39.

సీ॥ ఒకయింట నుండి వేఱొక యింటికరగి నవిధమున వస్త్రంబు విడిచియొండు
వస్త్రంబు గట్టిన వడువున నైయుండు నొడలు దొఱంగి యొండొక్కయొడలు
గైకొంట నృపవినుకడవకుసారెపై నమరమృత్తిక యిడునపుడు వీఱయు

భార, స్త్రీ I, 34.

ఉ॥ మిత్రుల చెయ్దులన్ సుఖము మీఁకొను నంటయుఁ జెందు దుఃఖముల్
శత్రుల చెయ్ది నంటయును సన్మతి దా ధన మూల మంటయున్
గోత్రవరేణ్య భోగములకున్ ధనముల్ గరణంబు లంటయుం
జిత్ర చరిత్రుఁ డైన విధి చేష్టదొఱంగిన నీటివ్రాలగున్ ॥

భార. శాంతి I, 207.

చ॥ చనదిటు లంట గం పెఱుఁగ జాలదు నాసిక జిహ్వయుం జవుల్
గొనవెఱవేదు రూపు గనుఁ గొంటకుఁ గన్ను వలంతి గాదు సోఁ
కు నెఱుఁగు శక్తి చర్మమున కుంబ్రభ వింపదు శబ్ద జాతము
న్వినఁ జెవి కల్ప మేనియును నేర్పడఁగూడదు నేఁదొఱంగినన్॥

భార. అశ్వ. II, 31.

తరల॥ కులగురుండు వసిష్ఠుఁడంత వికుక్షి కుందెలు దింట లో
పల నెఱింగి యనర్హ మెంగిలి పైతృకంబొనరింపఁగా
వలదు వీఁడు దురాత్మకుండన వాని తండ్రియు వానిఁ జెం
తలను జేరఁగనీక దేశముదాటి పోనడిచెన్ వడిన్॥ భాగ. IX, 158.

శా॥ వింటే లక్ష్మణ రామునార్తరవమై వీతెంచె నే నొంటిఁబో
ష్మ్రంటిం దమ్ముఁడ యేమి పుట్టెనొ కదే హా లక్ష్మణా యంటగా
వింటిం దాలిమిఁ బట్టజాల నటవీ వీథిం గురంగంబు వె
న్వెంటం బోక దలంపఁ గీడు సన వేళగ న్నిను న్వేఁడెదన్॥

రా. అరణ్య. II, 65

మ॥ అకటా భాగ్యము లేమిఁజేసి పటుమాయా సంప్రయోగంబు నం
బ్రికటంబైన బలంబు బాహుయుగళ ప్రవ్యక్త సారంబు పై
నిక సన్నాహము నస్త్ర శస్త్ర విభవో న్మేషంబు నీ భంగి నూ
రకపోయె న్విధిచేఁత దప్పఁదిరుగ న్రాదంట దామిథ్యరో॥

భాస్కర రా. యుద్ధ. 1890.

కం॥ తొలినోముల ఫలమిప్పుడీ చెలువునిఁ గనుగొంట యిందుచే భాగ్యంబో
చెలులార కల్గె నిట్టులు దలపఁగ నద్భుతము గాదె ధారుణి యందున్॥
రాజశే. II.

ఉ॥ కంటివె మత్ప్రతాపము జగంబులు మువ్వురుసం గలంతు నేఁ
గంటొనరించినం దృణముగాదె మనుష్యుఁడు రాముఁడింక లే
దంట యెఱుంగు కొంటె యిక నైనను వేఱొక చింతమాని చే
కొంట తగున్ మదిందలఁచుకొమ్మని పంక్తిముఖుండు వల్కినన్॥
రామా. అ. VII, 215.

కం॥ అక్కరగలదని పతి ప్రజ నెక్కుడుగా ధనముగొంట యిలపై జెరువుల్
ద్రక్కలుగ ద్రవ్వి మీలను గ్రక్కునబట్టుకొని తింట గణుతింపంగన్॥
రుక్మాం. III, 27.

ఉ॥ ఆలలనావతంసముల నమ్మునులంగని జార రానల
త్స్వేళ భరంబు నేత్రములఁ జీఁకటి గొల్పఁగ నాట లేల యీ
యాలతు లేటికిం జెవుల నంతకు బల్కులు పోవ నన్నియుం
జాలును దుఃఖితే మనసి సర్వ మసహ్యమటం చెఱుంగరే॥
వరాహ. XII, 65.

మ॥ ఒక భూమీదివిజుండు చోరహృతధేనూత్తంసుఁడై వేఁడికొం
టకు రా ధర్మజు కేళిమందిరము దండంబోయి కోదండసా
యకముల్ దెచ్చుటఁ బూర్వక్లుప్త సమయ న్యాయానుకూలంబుగా
నొక యేఁడుర్వి ప్రదక్షిణంబరుగ నుద్యోగంబు వాటిల్లినన్॥
విజయ. I, 198.

సీ॥ వా॥ ఇచ్చి క్రమ్మఱఁ గొంటయిలఁ గూలిపనిచేత
తివిరి యొడంబాటు తిరుగఁబడుట

విజ్ఞా. వ్యా. 17.

ఆ॥ తెఱవ నేను నోరు దెరవకుండఁగ గాక చొరవగొనుచు నిల్లు చొరవశంబె
పఱవఁ బొమ్మటంట బరువటే నాకు నీ యఱవఁ దోకగోని యఱవఁజేతు ॥

వైజ. III, 97.

చ॥ మిగుల దృఢంబుచేసి కద మీరదు గందగ; వేడఁ జెల్లు ని
మ్మగువనె యందు నిక్కమగు మాటకు నిందడిగింపు దూరకే
బెగడు కుమారు నాఱడిని బెట్టఁగ జెల్లునె వింటలేద, యిం
టగలిచి రచ్చగెల్వుమను నానుడి నానుడి నానుఁడీ చెవిన్ ॥

సారం. II, 258.

తే॥గీ॥ అధ్రువం బైన మలభాండ మైన దేహ
మనఘ, యన్యోపకారార్థ మై వ్యయించి
ప్రవిమలంబుఁ గల్పాంతస్థిరము నైన
కీర్తికాయంబుఁ గైకొంట కార్తియేల॥ హర. వి. II, 80.

తే॥ నాఁడు గోమంత నగమున నన్ను నాజిఁ
గదిసి చూచినవాఁడవు గావె నీవు
నాఁటి వాఁడన యేనును నవ్వుఁబాటు
గాదె యిట్లంట యీ వితర్కంబు వలదు॥ హరివ ఉ. భా. II, 31.

శా॥ ఘంటా టంకృతితోఁ గృతాంతలగుడాకారంబుతో దిక్కులన్
మింటన్మంటలు గ్రమ్మ గ్రొమ్మెఱుంగుతో నెక్కొన్న యాశక్తిపై
గొంటన్మేను మలంచి పట్టుకొని కో కొమ్మంచు వ్రేసెన్ వెసన్
వెంటన్ గిటి ధరిత్రి దూఱ నతఁ డవ్వీరుండు మూర్ఛిల్లగన్॥

ఉ. హరి V, 257.

ఏమయినట్టు అధర్వణాచార్యులంతవారు చెప్పిన కారిక? అహోబల పండితులంతవారు చేసిన వ్యవస్థ? ఈవై యాకరణులశాసనము ఈ కవులకు

తెలియదా? తెలిసిన్ని దానిని మీరినారా? వ్యాకరణశాస్త్రమునకు విరుద్ధముగా వ్రాసిన ఆ కవుల కావ్యములు దుష్టములయి నిందలపాలు కాలేదేమి? అచ్చుయంత్రము లేని కాలములో తెలుగువ్యాకరణాలప్రతులు వ్రాసుకొని తెలుగువారందరూ పఠించి వ్యవహరించేవారా? లేక కవులుమాత్రమే వ్యాకరణాలు చదువుకొనేవారా? కలియుగాదిని నన్నయ రచించిన వ్యాకరణము బాలసరస్వతికాలమువరకూ ఎవరూ ఎరుగరటగదా! అంతవరకూ కవులు ఏ లక్షణముచొప్పున భాష వాడేవారు? సామాన్యజనులందరూ లోకవ్యవహారమున కుపయోగించే వ్రాతలు ఏ వ్యాకరణముచొప్పున వ్రాసేవారు? అథర్వణాచార్యుల లక్షణగ్రంథాలు ఎన్నో ఉండేవట! మొన్నమొన్న వీరేశలింగంపంతులువారు అచ్చువేసినతర్వాత అథర్వణకారికలు మాత్రము బయటికివచ్చినవి. అహోబలపండితీయము మొన్న మొన్న ఏలూరిలో అచ్చుపడ్డది. ఇవిఅన్నీ సంస్కృతభాషలో వ్రాసినవిగదా. వారి కాలములో తెలుగువారందరికీ సంస్కృతభాష బాగా వచ్చేదని ఊహించడమునకు హేతువులున్నవా? అవి సంస్కృత భాషా పాండిత్యముగల తెలుగు కవులకోసము వ్రాసినవే కాని ఇతరులకోసము కాదని ఊహించవచ్చునా?

'అంట', 'కొంట' మొదలయిన మాటలలో నిజముగా దోషమేమున్నది? 'అనుట,—కొనుట' లలోని నడిమివర్ణమందున్న ఉకారము పోవడమేనా దోషము? ఇట్టివేకదా కినుక-కిన్క; వినుము-విన్ము; పూనుచు-పూంచు; వినుదు-విందు; కొనుచు-కొన్చు-కొంచు. ఇట్టివి ఇంకా అనేకములున్నవే. పదమధ్యమందున్న నకారముపై ఉకారము లోపించడమునకు శాస్త్రమందు ఉత్సర్గమున్నది; అయితే అథర్వణుడు అపవాదము విధించినాడు. ఉత్సర్గముకన్న అపవాదము ఎక్కువ బలవంతమైనది; గనుక 'అనుట', 'కొనుట'లలో మధ్య ఉకారము లోపించకూడదు, అని ఈ యిద్దరు మునుల మతము నిలబెట్టదలచేవారు సమాధానము చెప్పవచ్చును. అయితే తిక్కనాదుల

ప్రయోగములు ఇట్టి సమాధికి ప్రతికూలముగా ఉన్నవే, అంట, కొంట మొ॥ రూపములు నన్నయగ్రంథమందు లేవుగాని తిక్కనకాలమున వ్రాసిన గ్రంథములలో ఉన్నవి; గనక కేతన వీటిని తన లక్షణములో చేర్చినాడు.

"తినుటకు తింటయగు మఱి కొనుటకుఁ గొంటయగుఁ గనుటకు గంటయగుఁన్
వినుటకు వింటయగు దా ననుటకు నంటయగు వలసినప్పు డాకృతులన్"

తిక్కనమొదలుకొని నేటివరకూ మహాకవుల గ్రంథములలో ఈరూపములు తరుచుగా కనబడుతున్నవిగదా! అధర్వణుడు కేతనలక్షణము తప్పని ఎందుకు చెప్పినాడు? అంటే, అతడు తిక్కనకు పూర్వుడు అని కొందరు చెప్ప వచ్చినారు. అధర్వణలక్షణములో చేరిన "ఎల్లిగా" "పుల్లిగా", నా తల్లికాన, గంగనుకాసె, కాదటవే మొ॥ రూపములు అనేకములు ఆధునికములు. (చూ. విజ్ఞానసర్వస్వము). పోనీ, తిక్కనకు పూర్వుడే అయినా అధర్వణుని అనుశాసనము తిక్కన తృణీకరించినాడని ఒప్పక తప్పదు. తిక్కన ఒక్కడేకాదు, తిక్కనతరువాత ఏ కవిఅయినా అధర్వణశాసనము మన్నించలేదు. కుట్టిగుదకు చిన్నయసూరి అధర్వణశాసనము రద్దుచేసి అతను తప్పన్నది ఒప్పన్నాడు గదా! అధర్వణకారిక ప్రమాణముచేసి తిక్కనాది కవిపుంగవుల ప్రయోగములు తప్పనేవా రెవరైనా ఉన్నారా? చిన్నయసూరి లక్షణములో అంట మొ॥ రూపములు సాధువులని చెప్పక, కూతురిని మొ॥ వాటిని నిషేధించినట్లే, వీటిని గ్రామ్యములని నిషేధించి ఉంటే, మన కాలములోని పండితులు భారతము మొదలయిన గ్రంథములలో ఈ రూపములు కనబడకుండా దిద్ది పరిష్కరించి ఉందురుగాబోలును! పండితుల భ్రమవల్ల ఆంధ్రవాఙ్మయమునకు ఎంత చేటుకలుగుతున్నదో లోకానికి తెలియదు. అధర్వణుడు ఎప్పటివాడో తెలియకపోయినా అహోబలుడు అప్పకవికి పిమ్మటివాడని ఎరుగుదుముగదా. అహోబలుడు కేతనవ్యాకరణము చూచినవాడేకాని దానిని మన్నించలేదు. ఈ అహో

బిలుని ఆంధ్రసారస్వత జ్ఞానము సర్వమంగళము. శ్రీనాథుడు భీమఖండ ములో ఇట్టి పండితమ్మన్యుల నుద్దేశించే కాబోలును:—

గీ|| "బోధమల్పంబు గర్వమభ్యున్నతంబు;
శాంతి, నిష్పచ్ఛరంబు, మచ్ఛరము ఘనము,
కూపమండూకములఁబోలె గొంచె మెఱిఁగి
పండితమ్మన్యులైనవై తుండికులకు."||

అని చెప్పిఉండును. అంట మొ|| రూపములు తిక్కనభారతమందు ఏడెనిమిది పర్వములలో అనేక ప్రయోగము లున్నవే. తిక్కన కవిబ్రహ్మ అని ప్రఖ్యాతి పొందినవాడు. ఈ లోపములు ప్రయోగించిన యితరకవులు దిగ్గజాలవంటివారు. కేతనలక్షణము తిరస్కరించినా అహోబలుడు ఈ కవుల ప్రయోగములు మన్నించవలసి ఉండెను. వీరందరూ అహోబలునికి పూర్వులు. వీరి గ్రంథములుగాని, తిక్కన భారతము ఒక్క పర్వమైనా గాని తిన్నగా చదువకుండా లక్షణము చెప్పడానకు పూనుకొన్న ఈ పండి తమ్మన్యుని సాహస మెట్టిదో చూడండి!

ఇప్పుడు మేము విమర్శించిన అహోబలపతి వాక్యమందే మరియొక అంశము చిత్రమైనది ఉన్నది. కొంట అసాధువైతే 'ఉంట' కూడా అసాధువంటారేమో అని 'మింటఁగడుఁదెల్లనై పొరుచుంటజూచి ఇత్యా దౌ డవర్ణక లోపః' అన్నాడు. అనగా ఉండుట అనే శబ్దమందు డు వర్ణకము లోపించడముచేత 'ఉంట' అయినదట. 'డు' వర్ణక మెందుకు లోపించి నదో? సిద్ధశబ్దము తప్పనకుండా వైయాకరణులు తమ యిష్టమువచ్చినట్టు ప్రక్రియ చెప్పుకోవచ్చును. భాషాతత్త్వము ఒకలాగున, ప్రకిృయ మరిఒక లాగున ఉంటే ఉంటుంది. సంస్కృత లక్షణములో 'పరేద్యుః' అనేది పర + ఏద్యుస్ అని 'ఏద్యుస్' ప్రత్యయము వంటిది. 'పరే + ద్యుస్' అని చెప్పితే కుదురదు. వాస్తవముగా ఉండు, మండు, వండు, పండు, ఆడు, పాడు వీటికి కృదంతములు ఉంట, మంట, వంట, పంట, ఆట, పాట; ఇట్లే

కాఁగు, మూఁగు, అఁగు, కలఁగు, వంగు వీటికి కాఁక, మూఁక, అఁక, కలఁక వంక కృదంతములు; ఈఁదు, వందు, చెందు, ఈఁదు వీటికి ఈఁత, వంత, చెంత, ఈఁత; తేలు ఊలు-వీటికి తేట ఊట కృదంతములు. ధాతువు కొనను్న పరళవర్ణము కృదంతరూపమునందు పరుషముగా ఉంటున్నది. సరిగా ప్రక్రియ చెప్పడముకు సజాతీయభాషలలో శబ్దము లెట్లున్నవో తెలియవలెను.

విస్తరించి ఈ విషయ మింత నొక్కి ఎందుకు వ్రాస్తున్నామంటే, మేము పండితులయెడలను కవులయెడలనుకూడా భక్తిగలవారమే; కాని కవులను పండితులు నిందించినప్పుడు పండితులమాట ఖండించి, కవులమాట నిలబెట్టవలెనని మా మతము. "ప్రమాదో ధీమతామపి", "నిశ్శృంఖలాః కవయః" అని కవులు పొరపాటుపడ్డారనిన్ని నోటికివచ్చినట్లెల్లా కవులు పేల్తా రనిన్ని కవులను లాక్షణికులు చేసుతారుగదా! లాక్షణికులకు మాత్రము ప్రమాదము ఉండదు గాబోలు. వారు సర్వజ్ఞులో! ఎన్నడూ భ్రమాధీనులు కారో! అధర్వణుని అప్రమాదిత్వము ఎట్టిదో తెలిసినదిగదా! అహోబలుని సర్వజ్ఞత్వమూ వెల్లడి అయినదిగదా! వీరిలాటివారే కవులను ప్రమత్తులను చేసి తమ పాండిత్యము విజృంభింపజేసే లాక్షణికులు కొందరున్నారు.

క. విరచించెను శ్రీనాథుఁడు, ధరణిని శృంగారనైషధంబుఁ గూర్పుం
డికి యొండొరునని కానక; వరపురుషక్రియలఁ బ్రకృతిభావముగలదే.

అని అప్పకవి శ్రీనాథుని ఆక్షేపించి చెప్పినమాట ఎవరూ ఒప్పుకో లేదు. కవులను ఆక్షేపించే శుష్కలాక్షణికుల గతి తెలిసి తెలిసి బ్ర॥ వేదము వేంకటరాయశాస్త్రిలవారే శ్రీనాథుని నైషధములోని 'బచ్చుకసన్' పసపుకు, పిచ్చుకుఁటుకు' అనే రూపము తప్పనిన్నీ, 'జఘన్య'మనిన్ని నిందించినారు; కాని బ్ర॥ సీతారామాచార్యులవారు త్రిలింగలక్షణ శేషములో

మన్ను బ్ర॥ కల్లూరి వేంకట్రామ శాస్త్రులవారు గుప్తార్థప్రకాశికలో నున్న ఇట్టి ప్రయోగములు సాధువులని ఆమోదించినారు. మత్తమాంగములవలె కవులు యథేష్టముగా వ్యవహరిస్తూఉంటే, లాక్షణికులు ఎవరిష్టమువచ్చినట్టు వారు వ్యాహరిస్తారు, తమతమ స్వభావముచొప్పున, గనక లాక్షణికుల మాటలు అమోఘములు అని భ్రమపడకూడదు. కారణముంటే ఒక లాక్షణికుని మరిఒక లాక్షణికుడు నిరాటంకముగా ఆక్షేపించవచ్చును; లక్షణములో చేరకపోయినా, లక్షణమునకు విరుద్ధముగా ఉన్నా, కవిమాట లౌకికమయితే సాధువే. కవులు యథేష్టముగా తెమతెమ కాలమందున్న భాష కావ్యములలో వాడిఉన్నారు. భాష మారుతున్నదని తెలియకను, ఏ కవి ఏ రూపము ప్రయోగించి ఉన్నాడో చదివి తెలుసుకోకను, కొందరు పండితులు ఉత్త తరకటాలు పన్ని, లేనిపోని ఆక్షేపణలు చేస్తున్నారు; మహామహోపాధ్యాయుడైనా, ఏ శ్వగోపాధ్యాయుడైనా బ్రహ్మదేవుడే అయినా లౌకిక భాష మారకుండా ఆపలేడు అని చదువరులు బోధపర్చుకుందురుగాక !

"కేవలం శాస్త్రమాశ్రిత్య నకర్తవ్యోవినిర్ణయః। యుక్తిహీనవిచారేతు ధర్మహానిః ప్రజాయతే॥ కేవలం వేదమాశ్రిత్య కః కర్తోతివినిర్ణయం బలవాన్ లౌకికో వేదాల్లోకాచారంచ కస్త్యజేత్ ॥" అని ధర్మశాస్త్రమందున్న పురాణములందున్ను ఉన్నది. చిన్నయసూరి వ్యాకరణము, నీతిచంద్రిక యాభై యేండ్లయి బడులలో చదువుతూ ఉండడంచేత, అతనిలాగున పుస్తకాలలోను పత్రికలలోను కొందరు వ్రాతగాండ్లు 'గ్రాంథిక భాష' అంటూ కృత్రిమభాష ఒకటి వ్రాస్తున్నారు, గాని అది యెందునూ పొందిన భాషగాదు. ఆ వ్రాతగాండ్లు తాము మోసపోయి యితరులను మోసపుస్తున్నారు; సదుద్దేశముతోనే కావచ్చును. కాగితముమీద పడే శబ్దము సాజమైతే నోటినుండి రావలెనుగాని కోశమునుండిన్ని వ్యాకరణమునుండిన్ని కాదు. శిష్టులనోట సారముగావచ్చేదే వాస్తవమైన దేశభాష. పూర్వులు వ్రాసిన భాష

కృత్రిమమైనది కాదు. ప్రాచీన భాషాస్వరూపము స్పష్టముగా తెలుసుకోక లోకమందున్నది గ్రామ్యమని భ్రమపడి, లౌకిక భాషలోని వర్ణములు ఇష్టము వచ్చినట్టు మార్చి 'గ్రాంథికీకరణము' చేసుకొని గ్రామ్యతను తొలగించి, అశ్రుతపూర్వము, అదృష్టపూర్వము అయిన తెలుగు పుట్టిస్తున్నారు గాని అది దేశభాష కానేరదు; అది తెలుగు కానేరదు. అది యేభాషా కానేరదు. కేవల సాంకేతికము; అంకగణితములోని అంకెలవంటిది; బీజగణితము లోని అక్షరములవంటిది; శాస్త్రములలోని సంజ్ఞలవంటిది; జీవద్భాష కాదు; దాని కుపలక్షణముగనక ఇప్పటి గ్రంథములుగానీ, పత్రికలుగానీ నిర్దుష్టమైన దేశభాషకు ఆదర్శములు కావు దాని కుపలక్షణము నాటిలో పండితుల దృష్టికే ఆక్షేపణ కెడమియ్యని వ్రాత ఒకటయినా మాకు కనబడలేదు.

ఈ కాలములో పుట్టిన వ్యాకరణములుగానీ కోశములుగానీ అన్ని విషయములందున్న ప్రమాణములు కావు. "లక్షణవిరుద్ధంబు గ్రామ్యము" అనే సూత్రము చూచి అవివేకులు భయపడతారు గాని, తత్వము తెలిసిన వారు లక్ష్యవిరుద్ధంబగు లక్షణంబు గ్రామ్యంబనిన్ని, అట్టి లక్షణమునకు విరుద్ధంబయినను శిష్టవ్యవహారంబు గ్రామ్యంబనిన్ని నొక్కి చెప్పుతారు. కాలముతో కూడా భాషాలక్షణము మారినది గనుకనే కేతన చెప్పిన లక్షణము నకు విరుద్ధముగా పెద్దిరాజు లక్షణమున్నది; దీనికి విరుద్ధముగా నున్నది రావి పాటి గురుమూర్తిశాస్త్రి లక్షణము. 'లక్షణవిరుద్ధము' అంటె, 'ఏలక్షణ మునకు?' అని అడిగేవారికి సమాధానమేమి? ఈ కాలములో వాడుతూ ఉన్న మాటల సాధుత్వము త్రికవుల ప్రయోగములనుబట్టి సాధించవలెనన డము తప్పు. ఉత్తరాంధ్రభాష సుతరాం విడిచిపెట్టి కేవలము భారత భాష వ్రానేవారు ఇప్పుడు ఒక్కరైనా లేరని మేము నిశ్చయముగా చెప్ప గలము. 'అభారతప్రయోగము'లని శ్రీనాథుని నైషధములోని తెలుగు శబ్దములను నిరాకరించే వేదము వెంకటరాయ శాస్త్రులవారి మతము ఎన

టికీ చెల్లదు. ఈ శాస్త్రిలుగారు "జంకు కళంకుతే కవిచంద్రుఁడు తోషిత కోవిదేంద్రుఁడా వేంకటరాయశాస్త్రి కృతి వెంగలి మూఁక కెఱుంగ శక్యమే" అని తమ్మగురించి తాము చెప్పుకొన్న వాక్యములోని 'కళంకు' అనే శబ్దము అపశబ్దమనిన్ని శబ్దరత్నాకరములో లేదనిన్ని శాస్త్రిలవారు కల్పించినదనిన్ని కీ॥ శే॥ కొక్కొండ వెంకటరత్నము పంతులు మహామహోపాధ్యాయుల వారు ఆక్షేపిస్తే, పూండ్ల రామకృష్ణయ్యగారు కవిసంశయవిచ్ఛేదములో "కళంకము"నకు "కళంకు" వైకృతముగా అడిదము సూరకవి చెప్పినాడని సమాధానము చేసుకోమన్నారు గాని భారతములోని ప్రయోగము ప్రమాణముగా ఇవ్వలేదు.* ఈ రామకృష్ణయ్యగారు విచ్చలవిడిగా తాము "గ్రామ్య భాష" వ్రాస్తూ ఇతరుల వ్రాత గ్రామ్యమని తాము ఆక్షేపించినప్పుడు, వారు ఉత్తరాంధ్రగ్రంథములలోని ప్రయోగము చూపిస్తే, భారతప్రయోగముంటేనే గాని అంగీకరించమని వాదించేవారు. ఏమిచెప్పను భాషావిమర్శకుల మొండివాదము! బాలకవులను బెదరగొట్టే పండితులు ఎటువంటివారో తెలియుటకోసము ఇంతగా వ్రాయవలసి వచ్చినది. చదువరులు మన్నింతురు గాక. ప్రవాదమోహితః ప్రాయో నవిచారక్షమో జనః.

---

* ద్రోణ II 300 (ఆనందాశ్రమ) 'కలంకుదేఱి' అని ఉన్నది. గాని తాటాకు పుస్తకాలలో 'కలంకదేఱి' అనే పాఠమేకద్దు

## చేతురు, కోతురు మొదలయినవి

బాలవ్యాకరణము క్రియాపరిచ్ఛేదము, 108-వ సూత్రమందు:—

"చువర్ణంబుతోడ దుద్గకారంబు తకారంబగు: నిలుతురు, పిలుతురు, అడఁతురు, కడతురు, చింతురు, పెంతురు, పచింతురు, వచింతురు; చేతురు, కోతురిత్యాదు లసాధువులని యెఱుఁగునది"

అని చిన్నయసూరిగారు అనుశాసనము చేసినారు. దీనినిబట్టి రెండు తెగల శబ్దములకు బహిష్కారణమయినది. (1) నిలుచుదురు, చించుదురు, వచించుదురు మొదలయినవి చుదురు రూపములు—దేశ్యక్రియలలో స్వార్థమందున్న చువర్ణముగానీ, ప్రేరణార్థకముగా ఉన్న చువర్ణముగానీ, తత్సమ క్రియలకు చేర్చిన 'ఇంచు' లోని చువర్ణముగానీ, ఏ 'చు'వర్ణమయినా, 'దురు'కు పూర్వమందు గలవి. ఇవి ఒక తెగ.

చేయు, కోయు మొదలయిన యుకారాంతక్రియల తదర్థార్థక రూపములందు చేయుదురు, మొదలయిన 'యుదు' రూపములకు బదులుగా 'తు' వర్ణముగల చేతును, చేతువు, చేతుము, చేతురు వంటి రూపములు. ఇవి మరిఒక తెగ.

అయితే మొదటి తెగలోని రూపములు సాధువులే అని చిన్నయసూరిగారికంటె నాలాకాలము క్రిందట గొప్ప లాక్షణికుడని ప్రఖ్యాతిపొందిన విన్నకోట పెద్దిరాజు కావ్యాలంకారచూడామణిలో నవమోల్లాసము, క్రియాప్రకరణములో అనుశాసించి ఉన్నాడు.

క॥ తుద బహువచనమునకు నిం
పుదురును, నింతురును నర్యోఁబుడమియెడలనిం
చుదురునుఁ గలుగుఁ బ్రయోగా
స్పదములు దేశీయసరణిఁ జనుఁ దెలియంగన్॥

అని దేశీయ సరణినిబట్టి 'నించుదురు' వంటి చుదురు రూపములు కూడా జనపద వ్యవహారములో ఉన్నవి గనుక ఈ లాక్షణికుడు సంస్కార నియమము చేసినాడు.

క|| తెలుంగుక్రియాపదములకును
దలకొను ధాతువులు జనపదవ్యవహారో
క్తులు కాన వానిఁ బేర్కొన
వలదు ప్రయోగములఁ దెలియవలయుఁ దెలుపుడున్||

క|| ఇది తెనుఁగున కెల్లను జనపదవిదితంబైన తెలుఁగువర్తించుకరయు
ల్లిదముగఁ జెప్పితినంతయు, మది నెఱుఁగుండగని బుద్ధిమంతులితరముల్||

అని పెద్దిరాజు 'జనపద వ్యవహారోక్తులు' అనగా లోకమందున సిద్ధ శబ్దములు, సాధువులుగానే 'సంస్కార నియమము' ఏర్పర్చినాడు.

'సంస్కార నియమ'మనగా మా అభిప్రాయము ఇక్కడ విశదపరుస్తున్నాము. శుక్ల యజుః ప్రాతిశాఖ్యములో కాత్యాయనుడు మొట్టమొదట ప్రతిజ్ఞాసూత్రమున ఏమని చెప్పినాడంటే:—

'స్వరసంస్కారయోశ్ఛంధసినియమః' అని; దీనికి ఉబ్బటుడు, 'స్వరఉదాత్తానుదాత్త స్వరిత ప్రచిత లక్షణః; సంస్కారోలోపాగమ వర్ణ వికారప్రకృతి భావలక్షణః-తయోః స్వరసంస్కారయోః ఛందసి విషయే నియమోధికృతో వేదితవ్యః' అని భాష్యము వ్రాసినాడు. స్వరమనగా ఉదాత్త-అనుదాత్త-స్వరిత-ప్రచిత లక్షణమని, సంస్కారమనగా లోప-ఆగమ-వర్ణవికార-ప్రకృతిభావ లక్షణమని, వీటి రెంటికీ ఈ వేదములో నియమము తెలియనివారు తెలుసుకోవలసినది; అని దీనికి అర్థము. కాత్యాయనుడు పెద్దలవల్ల నేర్చుకొన్న ప్రకారము వేదములో ఎక్కడెక్కడ ఉదాత్త-అనుదాత్త-స్వరితములలో ఏదయితే పాఠములో ఉన్నదో ఆ విషయము పరిశీలించి వర్గీకరణము చేసి ఉత్సర్గాపవాదములు నిరూపించి, స్వర

లక్షణమున్ను; శబ్దములలో ఎక్కడ లోపము-ఆగమము-వర్ణవికారము-ప్రకృతిభావము కనబడుతున్నవో అక్కడ అవి కలుగునట్లుగా వర్గీకరణము చేసి, ఉత్సర్గములున్ను అపవాదములున్ను సూత్రించి శబ్దలక్షణమున్ను, ప్రాతిశాఖ్యముగా రచించి శిష్యులకు నేర్పినాడు; గాని లోకములో ఆ వేదమును పఠించే పెద్దలపాఠములో ఇదితప్పు, అదిఒప్పు అని నిర్ణయించలేదు. పాఠ భేదములున్నప్పుడు శాకల్యుడీలాగన్నాడు (సూ. III. 2), శాకటాయనుడు ఈలాగన్నాడు (సూ. III.12) అని చెప్పినాడు. మాధ్యందినులు, ఔజ్జహాయనుకులు వేరుగా ఉచ్చరించినప్పుడు భేదము తెలియజేసినాడు. (సూ. I. 120). నారదీయశిక్ష, యాజ్ఞవల్క్యశిక్ష మొదలయినవాటిలో చెప్పిన విషయములు ఉదాహరించినాడు. భాష్యకారుడు ఉబ్బటుడు కూడా కాత్యాయనుడు స్పష్టముగా చెప్పనప్పుడు అన్యశాఖీయపాఠములు ఏర్పాటుచేసినాడు. ఉ. షట్ + దశ = షోడశ అయినట్లె, 'షట్ దంతా అస్య = షోడంతః' అని కాత్యాయనుడు చెప్పి ఊరుకుంటే, ఉబ్బటుడు ఇది "అన్యశాఖీయానాంపాఠః" అని విశేషించి చెప్పినాడు. సంస్కార నియమమంటే ఇట్టిది; 'శబ్దానుశాసనము' అనేదికూడా ఇట్టిదే. పతంజలే చెప్పినాడుగదా—ఏ శబ్దములకు అనుశాసనమంటే, వైదిక శబ్దములకున్ను లౌకిక శబ్దములకున్ను అని; వేదములలోనివి వైదికములు; 'లోకేవిదితాః లౌకికాః' లోకమందు అందరూ ఎరిగిఉన్నవి లౌకికములు. వీటినే మీద నుదాహరించిన పద్యములలో "జనపదవిదితంబులు" అని చెప్పినాడు విన్నకోట పెద్దిరాజు.

కవిశిరోభూషణము, ఆంధ్రకౌముది, వైకృతచంద్రిక—సంస్కృత భాషలో రచించిన తెలుగు లక్షణగ్రంథములు—వీటిలో 'చుదు'లకు బదులుగా 'తు'వర్ణము తప్పకుండా రావలెననే చెప్పినారు. అహోబలుడు చుదురు రూపములే కాక పుదురు రూపములుకూడా తప్పన్నాడు. అతని

మాట పట్టుకొని-పుదురు ప్రయోగించిన ప్రాచీనకవులను దూషింతురా? తెలుగుభాషలో రచించిన వ్యాకరణాలలో చిన్నయసూరిగారికి పూర్వము చెన్నపట్నములో తెలుగుపండితులని పేరుపొందినవారు - చుదురు-పుదురు రూపములు సాధువులనే చెప్పినారు చూడండి:—

1836 సం॥మున అచ్చుపడ్డ గురుమూర్తిశాస్త్రి వ్యాకరణము చిన్నయసూరి బాలవ్యాకరణము వ్రాయకమునుపు బడులలో విద్యార్థులు చదువుకొనేవారు. ఈ వ్యాకరణమునందు 292-వ సూత్రము ప్రకారము చువర్ణాంతధాతువులకు దువర్ణము పరమైనప్పుడు చువర్ణము వికల్పముగా పువర్ణమగును. కాగా 'సేవించుదును' 'సేవింపుదును' అనే రెండు రూపము లున్ను సాధువులు.

1857 సం॥మున అచ్చుపడ్డ శేషయ్య వ్యాకరణము ఆ కాలమందు చిన్న బడులలో చిన్నపిల్లలు చదువుకొనేవారు. ఇదికూడా చిన్నయసూరి బాలవ్యాకరణముకంటె ముందుదే. దీనిలోకూడా "చువర్ణాంత ధాతువులకున్ను యువర్ణాంతములైన ధాతువులవలెనే తద్ధర్మకాలమునందు రూపాంతరము గలదు. ఉ. సేవించుదును-సేవింతును, పాలించుదువు-పాలింతువు ఇత్యాదులు" అని ఉన్నది. (చూ.పు.31.) అయితే ఈ శేషయ్యవ్యాకరణము 1875-వ సం॥మున మళ్ళా అచ్చుపడ్డప్పుడు, ఎవరో పండితులు (చిన్నయసూరి శిష్యులుగాబోలు) శేషయ్యగారి భాష, శేషయ్యగారి మతము రూపుమాపి శేషయ్యగారి పేరేఉంచి, పరిష్కరించి పాడుచేసినారు—ఏమి అని అడిగే దిక్కులేక. అయ్యో ఆంధ్రమా! నీ గతి ఈలాగున్నది! నన్నయాదుల గ్రంథాలు పండితమ్మన్యులు తారుమారు చేస్తూఉంటే అడ్డేదిక్కులేదు! ఈ పరిష్కృత శేషయ్య వ్యాకరణములో ఈ సూత్రమే ఎట్లు మారినదంటే:— "చువర్ణాంతములైన ధాతువులకు తద్ధర్మమునందు రూపాంతరముగలదు. ఉ॥ దీవింపుదును-సేవింతును, పాలింపుదువు-పాలింతువు, "ఇత్యాదులు"

(చూ. 34). ప్రీవించుదును, దీవించుదువు గ్రామ్యములని గుర్తులు పెట్టి పుట అడుగున వ్రాసిఉన్నవి (చూ. 37). చూడండీ, ఎంత మోసమో! ఎంత సాహసమో! ఈ పరిష్కర్తకు శేషయ్యమతము అనిష్టమైతే, వేరే మరిఒక గ్రంథము వ్రాసి ఖండించవలెనుగాని, శేషయ్య వేరే ఉంచి, శేషయ్య సాధువన్న రూపమే శేషయ్య అసాధువన్నట్టు అందరికి తోచేవిధముగా శేషయ్య గ్రంథము దిద్దివేసినాడు! శేషయ్య చెప్పని 'ప్రీవింపుదును, పాలింపు దువు' అనేవి శేషయ్య చెప్పినట్లుగా గ్రంథములో దూర్చినాడు! ఎంత పాడుపని! ఛీఛీ!! శేషయ్యకన్న ఈ పరిష్కర్త గొప్ప పండితుడైతే తన గ్రంథమందు వెలార్చించవలెను.

చదురు రూపముల సాధుత్వాసాధుత్వములు విమర్శించేవారు మరిచి పోక జ్ఞప్తియందు ఉంచుకోవలసిన భాషాతత్త్వము ఏమంటే, భాషాపరివర్తనము. నన్నయ తిక్కనాది ప్రాచీనకవులు ఈ చదురు రూపములు వాడ లేదు, నిజమే; అయితే చిన్నయసూరి ప్రాచీనాంధ్రభాషకు మాత్రమేనా చెప్పినాడు లక్షణము? ఎన్ని చేర్చినాడుకాదు వర్తమానాంధ్రములోని శబ్దములు! ఎన్ని దిగవిడిచినాడుకాదు నన్నయ భాషావిశేషములు! వాస్తవ మయిన తెలుగుపాండిత్యము దేశమందెక్కడనయినా ఉంటే, తెలుగు భాషాపరివర్తనపరిపాటి ఏర్పడవలెను. భట్టోజీదీక్షితులువారు సిద్ధాంత కౌముదిలో వైదికప్రక్రియ విడదీసి, ప్రాచీన భాషాలక్షణము అర్వాచీన భాషాలక్షణము వేరువేరుగా చెప్పినట్టు; ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను భాషల లక్షణములు ఏ దేశములో ఎట్లున్నవో పాశ్చాత్య పండితులు నిరూపించి నట్లు, కన్నడ భాషాలక్షణము హళగన్నడవు (=పాత కన్నడము), హొస గన్నడవు (=క్రొత్త కన్నడము) అని ద్వివిధముగా కన్నడ పండితులు విభజించినట్లు, పూర్వాంధ్రము ఉత్తరాంధ్రము సవిశేషముగా లక్షణపరి చ్ఛేదము చేసి, వ్యక్తపర్చవలసి ఉన్నది—తెలుగు పాండిత్యముగలవారు

ఎవరైనా ఉంటే. పంచాంగము వ్రాయకపోయినా నక్షత్రాలూ గ్రహాలూ తమతమ గతులు తప్పనట్లు భాషసాజముగా మారుతూనే ఉంటుంది. జనుల వ్రాతలలో ఆయా కాలమందుండే శబ్దరూపములు పడుతూనే ఉంటవి; గనుక-చుదురు రూపములు ప్రాచీనుల గ్రంథములలో లేకపోయినా ఉత్తరాంధ్రగ్రంథములలో కనబడితే, ఉత్తరాంధ్రములో సాధువులే అని చెప్పక తప్పదు. పట్టాభిరామాయణము, రెండవ ఆశ్వాసములో (చూ. పుట 51) చ|| మూడవ చరణము ఇట్లున్నది: 'శరణనువారిఁ గాచుదువు సంగరమందు విరోధిరాజులన్.' తంజావూరి మహారాజు చేత ఆంధ్ర కాళిదాసు అనే బిరుదుపొందిన కుప్పనకవి తన శంకరవిజయములో 'తలంచుదును' అని ప్రయోగించినాడు (చూ. పుట 108). ఇంకా ఉన్నవి ఇట్టివి ఉత్తరాంధ్ర గ్రంథములలో-గాని విరళము. వీరు బాలవ్యాకరణ మెరుగనివారు. వీరి కాలములో అది పుట్టలేదు. చిన్నయసూరి మతము ప్రకారము చుదురు రూపములు తప్పని తెలిసినవారే ఇప్పటి పెద్దలు అవి వ్రాస్తున్నారు. మ|| వావిలికొలను సుబ్బారావు పండితులవారు ఒంటిమిట్ట వాదానువాదములో "భక్తులు తమ మతానుసారముగఁ జిహ్నము లుంచుదురు. ఒకమూర్తికే కొందరు వడగల నామములుంచిన గొందఱు తెంగల నామములుంచుదురు; మఱికొందఱు గోపిచందనముంచుదురు..." అని తరుచుగా-'చుదురు' రూపములు వాడిఉన్నారు. (చూ. ఆం. సా. పత్రిక VII, పుట 183).

మ|| కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు శివాజీ చరిత్రములో 'కాన్పించుదురు' (చూ. పుట 237).

బ్ర|| కా|| బ్రహ్మయ్య శాస్త్రులవారు భాస్కరోదంతములో 'ఎంచుదుము', 'వైచుదుము' (పుట 18).

మ|| నండూరి మూర్తిరాజుగారు శుక్తిమతిలో 'మోసపుచ్చుదురు' (పుట 42).

కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగముపంతులుగారు ఇట్టి రూపములు తమ గ్రంథములలో వాడి భాషాదేవికి విప్రప్రయోగము చేసి ఆమెను ప్రాణసంశయ దశకు తెచ్చినారని బ్ర॥ వేదము వెంకటరాయశాస్త్రులవారు ఆంధ్ర సాహిత్య పరిషత్తుమ వార్షిక సమావేశ సమయమందు అధ్యక్షులుగానుండిన్ని జంకులేనివారు గనక పడదిట్టినారు. ఆనాటికి పంతులుగారు కాలంచేసి పదిరోజులయినా కాలేదు.

మ॥ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు శ్రీ మహాభారతాంధ్రీకరణ విమర్శనములో 'మనవారు సుకవీశ్వరుని జిత్రకారుసతుం బోల్చుదురు' (ఆం.సా. పత్రిక II, పుట 38).

ఇంకా చాలామంది వ్రాసిన గ్రంథములలో ఇట్టి రూపములు చూచి ఉన్నాము. స్కూల్ ఫైనలు పరీక్షకు రెండుసంవత్సరముల క్రిందట పఠనీయ గ్రంథముగా ఉండిన మహాపురుషుల జీవితములలో 'ఉంచుదురు' (చూ. పుట 128) 'నెరవేర్చుదురు' (చూ. పు.132) కలవు. పద్యకావ్యాలలో కూడా ఇవి ఉన్నవి గాని లేకపోలేదు. పట్టాభిరామాయణములో (ఆ. II, పుట 51) చ॥ శరణమువారిగాచుదువు సంగరమందు అని ఉన్నదని వెనక చెప్పినాము. ఆ కావ్యము జఘన్యమంటె భాగవతము దశమస్కంధము ఉత్తరభాగములో 123-వ పద్యము చూడండి.

సీ॥ పుత్రులఁగోల్పోయి భూరిశోకంబున వనటబొందుచు విప్రవరులుచాల
వేరాజు రాజ్యమందేని వసించుదు, రారాజు దలపోయ నవనిమీఁద॥

అని "శాలివాహనశకగత సంవత్సరంబులు 1765" అనగా క్రీ॥శ॥ 1843-వ సంవత్సరమునందు పురాణము హాయగ్రీవశాస్త్రులవారున్ను వేదము వేంకటాచల శాస్త్రులవారున్ను పరిష్కరించి ప్రకటించిన దశమైకాదశ ద్వాదశంబులను "స్కంధత్రయంబు"ను పుస్తకములో ఉన్నది. నేటి

ఆనందముద్రణమందు రెండవపాదము దిద్ది, "వసించుదురు + ఆరాజు" అనుటకు మారుగా "వసింతురును + ఆరాజు" అని చిన్నయసూరి సూత్రము ప్రకారము—'చుదు' తీసివేసి 'తు' పెట్టి అందువల్ల పద్యానికి ఒక లఘువు చాలకపోతే, నిరర్థకముగా ఒక 'ను' చేర్చినారు, ఎవరో క్రొత్త పరిష్కర్తలు. ఎక్కడా లేకుంటే విన్నకోట పెద్దిరాజు తన లక్షణములోనికి ఎక్కడనుండి తెచ్చినాడు ఇవి? ఇప్పటి లాక్షణికులలాగున లేని శబ్దాలు సృష్టిచేయలేదు. అయితే—'చుదురు' రూపములు నేటి లౌకిక భాషలో లేవు. వాటిని సాధువుగా సాధించవలసిన పని మాదికాదు. వాడుకలో లేని శబ్దములు వాడవద్దనే మేము చేసే హితోపదేశము. అవి సాధువులో అసాధువులో వాస్తవముగా ఎవరు ఎరుగుదురు? ఎప్పుడయినా భాషలో నిజముగా అవి ఉండెనో లేదో ఎవరు చెప్పగలరు? ప్రాచీన గ్రంథాలలో భాష లేఖకులున్ను, పరిష్కర్తలున్ను తెలిసి కొంతమట్టుకూ, తెలియకకొంతమట్టుకూ మార్చివేసినారు. ప్రాచీనభాషలోని శబ్దములన్నీ కోశాలలో చేరలేదు; చేరినవాటిలో కొన్ని తప్పులు. వ్యాకరణాలు అసంపూర్ణములు, పరస్పర విరుద్ధములు—ఇట్టి స్థితిలో ప్రాచీనాంధ్ర భాషా లక్షణమున్నప్పుడు, జంకుకళంకులేని 'కవిచంద్రు'లెవరో సాహసించి వాడుకలో లేని శబ్దములు ప్రయోగించి, విమర్శకులు చేసే ఆక్షేపములకు యథాశక్తి సమాధానము చెప్పుకోగలరు గాని సామాన్యులకు అట్టి పని చేయ శక్యమా? ప్రాచీనాంధ్రము గుత్తగొని పండితులను ఏలుకోనియ్యండి; అందుల లాభనష్టాలు వారివే. నేటి లోకానికి నేటి లౌకిక భాష రహదారి—అగ్రహారములో లాగున అగ్రవర్ణాలవారికేకాదు; ఆబాలగోపాలము అందరికిన్నీ, పట్నాలలో ఉన్నట్టే.

వర్తమానాంధ్రములో 'జయిస్తావు' అనే రూపముకన్న, 'జయించుతావు' అనే రూపము మంచిదని కొందరు అనుకొన్నట్టే, మునుపు 'జయిం

తురు' అనేదానికన్న 'జయించుదురు' గాని 'జయింపుదురు' గాని ఎక్కువ బాబుగా ఉంటుందనుకొన్నారు కాఁబోలు. అయితే నన్నయగారికాలములో చుదురురూపములూ లేవు, పుదురు రూపములూ లేవు. సాధ్యమయినంతశ్రద్ధతో మేము వెదకగా వెదకగా అరణ్యపర్వము రెండవ ఆశ్వాసములో 255 పద్యమందు, 'ఏమేమమున్న పూజింపుదుము రుద్రనిందని వేడ్క' అని మధ్యాక్కర ప్రథమ చరణములో 'పూజింపుదుము' అన్న పుదురురూపము ఒక్కటి మాత్రమే మాకంటబడ్డది. మధ్యాక్కర నన్నయ ఏ లక్షణముచొప్పున వ్రాసినాడో ఇదివరకు ఎవరికీ లెస్సగా తెలియదు. కొన్నిమధ్యాక్కరలు లేఖకులు, కొన్ని పరిష్కర్తలు తారుమారు చేసినారని మేము నిశ్చయముగా చెప్పగలము. మావద్దనున్న ఒక వ్రాతపుస్తకములో (50b) ఈ పద్యము ప్రథమ చరణము 'ఏమేమమున్న పూజింతుము రుద్రునిందనుచు వేడ్క' అనిన్ని మరిఒక దానిలో (73b) 'ఏ మేముమున్న పూజింతుము రుద్రుని నిందును వేడ్క' అనిన్ని ఉన్నది. మరికొన్నిటిలోకూడా 'పూజింతుము' అనే పాఠమే ఉన్నది.

తక్కిన కాలములోనైనా-పుదురు రూపములు కావ్యభాషలోనికి వచ్చినవో లేదో ఇంకా మేము సిద్ధాంతము చేయలేము; బహుళా రాలేదు; మల్లయమనీషి వరాహపురాణము వ్రాసిననాటికి మాత్రము గ్రాంథిక భాషలో ఉన్నవి; అవి ఈ గ్రంథమందు అనేక పద్యములలో కనబడ్డవి; గాని యతిస్థానమందు దువర్ణముగలవి మూడు మాత్రము ఇక్కడ ఉదాహరిస్తున్నాము:

సీ॥గీ॥ రూపమునునైన తనువులార్యులు వచింపు
దురు వరుస మూఁడటంచు నందులన ధర్మ
ధర్మభోగాను భూతికిఁదగిన మేను
పారలౌకిక మనియొందు పేరుదాల్చు॥ (VII, 110).

గీ॥ వేదమార్గ రహస్యైక వేత్తలైన
భూనిలింపోత్తములు యజింపుదురు బ్రహ్మ (X, 76).

సీ॥ అచట జాంబూనదంబను పైఁడిఁ జేసిన
తొడవులు ధరియింపుదురు దివిజులు (X, 119).

తెనాలి రామలింగకవికూడా వీటిని వాడినాడు. (చూ. పాండురంగ మాహాత్మ్యము—సుఖింపుదురు II. 146; వసియింపుదును II. 224; నుతియింపుదుము V. 279; ఒనర్పుదురు V. 292. (ఇంకా మరికొందరు ఈ రూపములు ప్రయోగించినారు.)

నన్నయకాలములో లేని-పుదురు రూపములు తర్వాత వచ్చినట్టే నన్నయకాలములో లేని-చుదురు రూపములు మరికొంతకాలమునకు పుట్టినవి. లాక్షణికులు కొందరు ఇవి సాధువులన్నారు. కొందఱు అసాధువులన్నారు. అయితే లాక్షణికులు సర్వజ్ఞులు కారు; మహాసముద్రము వంటిది వాఙ్మయము; ఒకలాగున ఉండదు; మెల్లమెల్లగా మారుతూ ఉంటుంది. ఏ కాలములో ఏ రూపములు వ్యవహారములోనికి వచ్చినవో ఎవరు చెప్పగలరు? గ్రంథాలలో కొన్ని చేరినవి; కొన్ని చేరలేదు. కొన్నికొన్ని నన్నయనాటినుంచి నేటిదాకా మార్పులేకుండా ఉన్నవి. కొన్ని చాలా మారినవి. ఆ మార్పులు అన్నీ గ్రంథాలలో కానరాకపోవచ్చును. నన్నయకు పూర్వమందున్న ఇట్లే భాష మారుతూ ఉండేదని ఊహించుకోవలెను. ఉండు ధాతువు యొక్క రూపములలో మార్పులు చూడండి.

నన్నయ తిక్కనలు అక్కడక్కడ 'ఉన్నే' అనే రూపము వాడినారు. ఏమి రూపము ఇది? ప్రశ్నార్థకమయిన ఏ కారము తీసివేస్తే 'ఉన్న, నిలుచును; ఇది 'ఉనును' యొక్క వికారము. తద్ధర్మార్థకప్రథమపురుషైక వచనము. ధాతువు 'ఉను' కావలెను. విను, తిను వంటిది. ఉనుదును-ఉనుదుము; ఉనుదువు-ఉనుదురు; ఉనును, ఉనుదురు—తద్ధర్మ; ఉనితిని-ఉని

తిమి; ఉనితివి-ఉనితిరి; ఉనెను (?)-ఉనిరి(?)భూత; ఉనుచు-ప్రేరణ; ఉనికి-కృద. ఇట్లు మాండలీయక రూపములుండేవిగాబోలు; ఇవిగాక, ఉండు ధాతువుగా-(నేను) ఉండును, ఉండుము ఉండువు;ఉండురు, ఉండుదు, ఉన్రడు, తద్ధర్మ; ఉంటిని-ఉంటిమి; ఉంటివి, ఉంటిరి; ఉండెను, ఉండిరి-భూత అనేవిన్ని, 'ఉండు' ధాతువుగానె-నేను ఉండుదును; ఉండుదుము; ఉండుదువు, ఉండుదురు; ఉండును, ఉండుదురు; ఉండితిని, ఉండితిమి, ఉండితివి, ఉండితిరి; ఉండెను, ఉండిరి- అనేవిన్నికూడా, ఎక్కడనో ఎప్పుడో చెప్పలేము గాని వాడుకయందు ఉండేవి. ఇప్పటికిన్నీ కవులు ఉన్రడు, అన్రడు, కన్రడు మొ॥ వాడుతున్నారు. వీటిలో విశేష మేమిటంటే—నన్నయకాలము మొదలుకొని మూడు నాలుగువందల సంవత్సరములవరకు ఉందును, ఉందుము, ఉందువు, ఉందురు-అనే రూపములు కవులెవరూవాడలేదు. ఉన్నాను, ఉన్నాము, ఉన్నావు, ఉన్నారు మరి ఇన్నూరు సంవత్సరములకు గాని వాడుకలోనికి రాలేదు; ఉన్నవాఁడను, ఉన్నవారము, ఉన్నవాడవు ఉన్నవారరు. అని నన్నయకాలములోను, ఉన్నాఁడను, ఉన్నారము, ఉన్నాఁడవు; ఉన్నారరు (ఉన్నారు?) తిక్కన మొదలుకొని అప్పకవివరకున్ను-వాడుకలో ఉఁడేవి. అచ్చు పుస్తకములలో తప్పిదారి ఎక్కడనయినా కొత్తరూపము కనబడితే తాటాకు పుస్తకాలలో ఆ పాఠము అట్లా ఉండదనే మాకు నమ్మకము. మేము లెస్సగా పరిశీలించి మరీ చెప్పుతున్నాము*

'చుదు' రూపములందున్నట్లే స్వార్థమందు మరికొన్నింట్లో చువర్ణము మారినది. 'ఎదురు' అనేది నన్నయకాలమందు క్రియ. ఎదిరితిని, ఎదిరితివి అనే రూపములు అప్పుడు వాడుకలో ఉండేవి. ఎప్పుడు మారినదో తెలి

* అచ్చుభారతము భీష్మ III. 310లో 'వయుచుందు'-వ్రాతప్రతిలో 'వయుచుందు' శాంతి V, 181 లో 'ఉందు'-వ్రాతప్రతిలో 'ఉండు' ఇట్లే తక్కినచోట్ల.

యదుగాని 'ఎదుర్చు'న్ను దానినుండి వచ్చిన ఎదిర్చితిని, ఎదిర్చితివి, ఎదుర్చుచు మొదలయిన రూపములున్ను కొన్ని గ్రంథములందున్నవి. శబ్దరత్నాకరమందు 'ఎదురు స.క్రి. ఎదిరించు' అనిన్ని 'ఎదిరించు క్రి= ఎదురు-ఎదుర్చు ఎదురుచు-ఎద్రుచు అ. క్రి. ప్రతికూలమగు' అనిన్ని ఉన్నది; అంతే. ఒక్క ప్రయోగమైనా లేదు. తెలుగుభాష సవిమర్శముగా అభ్యసింపగోరేవారికి ఈ కోశమువల్ల ఈ విషయములో ఏమీ లాభము లేదు. నేడు 'ఎదురు' క్రియగా లోకమందు వాడుకలో లేదు. 'ఎదిరించు' మాత్రమే ఉన్నది. 'వాడు నాకు ఎదిరెను' అంటే నేడు తప్పుగా తోస్తుంది కాని ఒప్పుగా తోచనే తోచదు. 'ఎదిర్చెను' ఎదిరిచెను, ఎద్రిచెను—ఇవి నేడుకూడా గ్రంథాలలో కొందరు పండితులు వ్రాస్తూఉన్నారు; గాని సకర్మకముగా వాడుతున్నారు. నన్నయ 'ఎదురు' ఏలాగున వాడినాడో చూడండి:—

క. జాంబవతేయు బృహద్వీశిఖంబులకున్ బెదరకెదిరిఘనుడేసె రణా
గ్రంబున నాతనిపై నవిలంబితుఁడై క్షేమవృద్ధి లక్షశరంబుల్
(అర. 1. 156)

దీనిలో 'ఎదిరి' ఏమి రూపమో కారకమేమో స్పష్టముగా తెలియకపోతే,

క. ఎఱుకని యెఱుఁగక నిన్నున్ మఱకువ నెదిరితివి దీని మఱవుము నన్నుం
గఱకంఠా క్షమియింపుము నెఱి నెవ్వరికెఱుఁగ నగునె నీ చరితంబుల్
(అర. 1. 326)

అనే పద్యములోని ప్రయోగము చూస్తే 'ఎదురు' క్రియాపదమనిన్నీ సకర్మకమనిన్నీ తోచవచ్చును. అయితే ఇది ఆనందముద్రణములోని పాఠము. వావిళ్ళవారు ముద్రించిన పుస్తకములో 'నీకున్' అనే పాఠము పద్యమందున్నది. పుట అడుగున 'నిన్నున్' అనేది పాఠాంతరముగానున్ను కనబడుతున్నది. మావద్దనున్న తాటాకు పుస్తకములలో ఒకదానియందు

(A 31) 'నిన్నుఁ మరుపాటెదిరితిని' అనిన్ని మరిఒకదానియందు (B 29) 'నీకుఁ మరుకువ నెదుర్గైతి' అనిన్ని ఉన్నది. ఇప్పుడు ఇది జిజ్ఞాస: 'ఎదురు' క్రియాపదమవును గాని కారక మేమిటి? ద్వితీయావిభక్తితో ఒక పాఠమం దున్ను షష్ఠీవిభక్తితో మరిఒక పాఠమందున్ను కనబడుతున్నదే. ఏది సాధువు? రెండున్ను సాధువులేనా? తిక్కన్నగారి కాలములో వాడుకను బట్టి నన్నయగారి కాలములోని వాడుక నిర్ణయించలేము; దేశ కాలభేద ములచేత భిన్నము కావచ్చును; కొన్నిటిలో వాస్తవముగా భిన్నమే. అయినా తిక్కనగారి ప్రయోగములు గాంతాము. 'శిఖండికెదుగంబోపుడుఁ' (భీష్మ. 1. 81) ఒకటికొకటి కెదుగఁ, భీష్మ (1. 50); దేవవ్రతునకెదిర్చిన (భీష్మ. III, 55); అతనికప్పుడెదుగఁ జాలగ్గైరి: (III, 411) ఇరువుర యుద్ధతి కెదుగవశమె (ద్రో. 1, 183). అయితే అక్కడక్కడ సకర్మకముగా అశ్వత్థామ నెదిరిన (భీష్మ. 1, 259) అని ప్రయోగములు కలవుగాని చాలా అరుదు. చంద్రభాను చరిత్రములో 'అరికెదురుగుదురే' అని ఉన్నది (మా. అదురు శ. ర.) ఎట్లు సిద్ధాంతము చేయడము? 'ఇది సాధువు, ఇది అసా ధువు' అని సాహసించి చెప్పలేముగదా. ఈ జిజ్ఞాస అలాగున ఉండ నీయండి. ఎదురుదును, ఎదిరితిని, ఎదిరిరి, ఎదిరి(క్త్వా), ఎదురన్ (తుమున్) మొ|| ఈ రూపములుండగా ఎదుర్తును, ఎదిర్చితిని, ఎదిర్చి, ఎదురపఁ అనే విన్ని ఎదిరింతును, ఎదిరించితిని, ఎదిరించిరి, ఎదిరించి, ఎదిరింపఁ అనేవిన్ని క్రమముగా భాషలోనికి వచ్చినవిగదా. తనరు, ఎలరు అనే క్రియలు తనర్చు ఎలర్చు అని స్వార్థమందే చువర్ణముకలవై తనరుదును, ఎలరుదును, తనర్తును, ఎలర్తును, తనరారుదును, ఎలరారుదును అనిన్ని వాడుకలోనికి వచ్చినవిగదా. నన్నయకాలమందు సంతోసిల్లు, వర్తిల్లు, దొంగిలు, ప్రముచ్చిలు అని లువర్ణాంతములుగా మాత్రమే ఉండేక్రియలు కొంతకాలము నకు సంతోసి (షి?)ంచు, వర్తించు, దొంగిలించు, ప్రముచ్చిలించు అని చువ

ర్థాంతములుకూడా, అయినవికావా? పూర్వాంధ్రములో లేని రూపములు ఉత్తరాంధ్రములో ఉన్నప్పుడు, కవులు యథేష్టముగా యతులకోసము, ప్రాసములకోసము, గణాలకోసము, అలంకారములకోసము పాతవిన్ని కొత్తవిన్ని వాడుకొన్నారుకారా? తెలిసినంతవరకు లక్షణమందు లాక్షణికులు చేర్చుకొన్నారుకారా? లక్షణమందు చేరకపోయినా, గ్రంథాలందు కనబడే పాతమాటలు ఏ ప్రమాణముచొప్పున అంగీకరిస్తున్నారో, గ్రంథాలందు కనబడే కొత్తమాటలుకూడా అంగీకరించడానికి ఆ ప్రమాణము పనికిరాదా?

భాషలో పూర్వముండి, గ్రంథాలలో ఇంతవరకు కనపడకుండాను, లక్షణమందు చేరకుండాను శబ్దముల ప్రకృతులు కొన్ని నష్టమైనవన్నందుకు బ్ర॥ వేదము వెంకటరాయశాస్త్రిలవారు శృంగారనైషధముటీకలో (చూ. VIII, 31) 'ఎలరు' ధాతువు పేర్కొన్నారు. ఎదిరించు, చిగిరించు, తరిలించు, చెమరించు, ఇగిరించు ఇత్యాదులయందు నామధాతువుల యించుక్కగా సెంచవలయునన్నారు. కన్నడములో ఎలర్, చిగుర్, ఎదిర్ ఇత్యాదులు క్రియాపదములే. ఇట్టి తెలుగుశబ్దముల సంస్కార నియమము శాస్త్రమందు కానరాదు. ఆంధ్రశబ్దానుశాసనము చేసినవారు, మున్పటివారుగానీ, ఇప్పటివారుగానీ ఎవరూ ఈ శబ్దములజోలికి పోలేదు. 'చుగాగములంబు అప్రేరణంబున కంఠోక్తముగా విహితముగాదు; ఇందువలన (ఎదురు) ఎదురుచు, (చిగురు) చిగురుచు, (చెమరు) చెమరుచు, (ఇగురు) ఇగురుచు-ఇత్యాదులందు పత్వము అగతికము కావలయును. సీతారామాచార్య ధృతములందు పత్వమే కానిపించుచున్నది' అని వెంకటరాయశాస్త్రిలవారే వ్రాసినారు. ఈ చువర్ణమునుగురించి మాకు తెలిసిన విశేషములు వేరే మరియొక ప్రసంగమునందు (చూ. రక్షించు, రక్షించక మొదలయినవి) వివరిస్తున్నాము. ఒక్క వైచిత్ర్యముమాత్రము చెప్పి ఈ విషయ మిప్పుడు చాలించి ప్రస్తుత మనుసరిస్తాము. ధాతువు కొననున్న చువర్ణము పోవడము

నకు అదుఱు, అదుర్చు సమానార్థకములయిన అకర్మకక్రియలు (ఎదుఱు) ఎదుర్చులోని చువర్ణమువలెనే అదుర్చునందు చువర్ణము తిక్కనకాలములో స్వార్థమందున్నది.

మ. ధరణీచక్రము దిర్దిరందిరిగె మార్తాండుండు గుంభీభవ
త్కిరణుండయ్యె దిశావితానము వడంకెన్ మిన్నదిర్చెన్
(ద్రోణ. V, 377)

వ్రాతపుస్తకములోకూడా పాఠమిట్లే ఉన్నది. నన్నయకాలములో నున్ను అదుఱుచు, అ్రదుచు అనేరూపము లున్నట్లే ఊహించవలెను.

క. అనలాస్త్ర మట్లువక్షము గొనిన విచింత్యుండు గూలెఁ గుతలంబ్రదువన్*
(అర. I, 162)

'అదుర్చు-అద్రుచు-అ్రదువన్' అన్నట్లె 'ఎదుర్చు-ఎ్రదుఱు-ఎ్రదువన్' అనవచ్చునో అనరాదో ఎవరు సాహసించి చెప్పగలరు? సందేహమున కెడమేమీలేని పాఠములందు ఏ రూపము కనబడితే అదే సాధువు, ఆ గ్రంథము వ్రాసినకాలములందు.

చిన్నయసూరి శాసనము చొప్పున గ్రామ్యము లనుకొన్న-చుదురు రూపములున్న, అహోబలుని శాసనము చొప్పున గ్రామ్యము లనవలసిన-పుదురు రూపములున్న ప్రాచీన కావ్య భాషలోనివి కాకపోయినను కొన్ని ఉత్తరాంధ్ర కావ్యములందు ఉన్నవిగనక అసాధువులన కూడదని సిద్ధాంతము చేసుకొన్నాము. అయితే ఇవి నేడు వాడుకయందు లేవు; వాడుకయందు లేనివాటిని గురించి వాస్తవమైన జ్ఞానము కలిగేదాకా తటస్థులముగానే ఉంటాము.

* 'అ్రదువన్' అన్నప్పుడు రేఫము తేల్చి పలకవలెను. అర II. 255 వ పద్యములోని వ్రాతపుస్తకముల పాఠము 'పూజింతును రు్రదునినిందును' అనే వాక్యమందు 'రు్రదుని' అనే మాటలోని రువర్ణము గురువుకాదు; 'ఎడ్డ' అనేమాటలోని డవర్ణము తేల్చి ఎకారము లఘువుగా పలుకవలసినట్లు ప్రాచీనపాఠములు కనబడుతున్నవి

'చెప్పెదను', 'చెప్పుదును' వంటి-ఎదరూపములున్ను, ఉదురూపములున్ను సమానార్థకములుగా నేటికవులు వాడుతున్నారు. అయితే కేతన తన వ్యాకరణమందు-ఎదరూపములు వర్తమానార్థకములు అనిన్ని-ఉదురూపములు భవిష్యదర్థకములనిన్ని చెప్పినాడు. చిన్నయసూరి వ్యాకరణమందు ఈ రెండు విధములయిన రూపములున్ను తద్ధర్మాద్యర్థకములని చెప్పిఉన్నది. నేటి వ్యవహారమందు చెప్పెదనువంటి రూపములు లేనేలేవుగాని, 'చెప్పుదును' వంటివి ఉన్నవి: ఉదా|| ఏమి చెప్పుదును! నేను ఎరుగుదును, నీవు ఎరుగుదువా? నేను చదువుదునా? మేము ఇక్కడ ఉందుమా? మొ||. భారతాది గ్రంథములందు ఈ రెండు విధముల రూపములందున్ను అర్థమందు కొంత భేదము కనబడుతున్నది. "నీకంటె నెఱుంగుదునే సదసత్ప్రకారము?" 'ఏమి సెప్పుదుఁ గురునాథా!' ఇట్టిచోట్ల 'ఎఱింగెదను' 'చెప్పెదను' అనేరూపములు పూర్వులు వాడినట్టు మాకు ఎక్కడా కనబడలేదు. అయితే నేడు ఇట్టి చోట్లకూడా-ఎద రూపములు కొందరు ప్రయోగిస్తున్నారు. బ్ర|| శ్రీ|| శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలవారు తమ కొత్త భారతములో భీముడు అరణ్యమందు నిద్రితులయిన జననీసోదరులంగని చింతిల్లినట్లు వర్ణించి చెప్పిన పద్యమందు మొదటి చరణము చూడండి 'చ. కటకట యేమి చెప్పెదను గాలవిపర్యయ మెట్టివారికిఁ (ఆది VIII, 48)' అనే వాక్యమందు 'చెప్పెదను' అనేరూపము పొసగదని మాకు తోస్తున్నది. ప్రాచీన గ్రంథములందు ఈ వాడుకకు అనుకూలమైన ప్రయోగము కనబడే వరకూ ఇప్పటికి మాకు తెలిసిన ప్రాచీనాంధ్ర లక్షణమునుబట్టి ఈ వాడుక ఒప్పుగా గ్రహించలేమని మాత్రము చెప్పుతున్నాము. ఇట్లే ఈ కృష్ణమూర్తి కవిగారు చువర్ణాంతమైన చొచ్చు ధాతువునుండి ఆ చువర్ణము తీసివేసి, చొరి, చొరినన్, చొరిన, 'చొఱితిని' (బండిఱానుండీ!) మొదలయిన విచిత్ర రూపములు కల్పించి తమ భారతములో వాడినారు; చూడండి:—

క॥ మృగములఁ బక్షులఁదక్కఁగ, జగతీశ్వరుఁ డొరుని నొక్కఁడును నేనరయం
దగ కెవ్వరిందుఁ గలరించుఁ గమున్వాడిఁ బిలిచె వనము చొరి మార్గోన్మయఁగ
(ఆది V, 41.)

ఉ॥ మాటలఁ జూపుదే తగవుమాలి పరాక్రమమున్నయేని నీ
వేటులఁ జూపగా వలవదే యిసిసీ వెడగా యొఱుంగవో
పోటరు లెల్లరుం జొరఁగఁ బోలిన చోటిదిగాని పిల్వగా
నేటికిఁ బోటరింజొతితి నేనిది ధర్మువుకాదె చూడఁగన్ (అ VII, 72)

సీ॥ హరుఁడనునోరియా గిరిగహ్వరము తెర్చి
చొరిగమ్మ నాహరిచొచ్చియందు (అ IX, 272).

ఉ॥ ప్రమాదావ్రతచిహ్నుఁ డైచొనయట్టిఁడు ద్వాదశవర్ష తీర్థచార్యా (X, 105)

క. అనిసురలు భయతిరస్తులు, తన మఱువుఁగ జొరిన వజ్రి (X, 244)

క. మరుఁడు శరణంశరధనం, జయుమఱువుం జొరిన నతఁడుజడియమనుచుఁగ
(X, 251.)

శబ్దరత్నాకరమందు, వ్యాకరణములందు చొచ్చు, చొచ్చి, చొచ్చితిని, చొచ్చిన, చొచ్చినన్ మొదలయిన రూపములు మాత్రమే ఉన్నవి. ఈ కవి రాజుగారి అపురూపపు ప్రయోగములు లోకమందు లేనే లేవు; గ్రంథములందు మాకంటికి కనబడలేదు* వీటికి ఆకరమేమో తెలియగోరి, రాజమహేంద్రవరములో సభ చేయించి, 1918-వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో కవిగారినే అడిగినాము; ఏదో కవిప్రయోగము ఇందుకు ప్రమాణమున్నదనిన్ని వెతికి చూపిస్తామనిన్నీ సెలవిచ్చినారు. తగిన ప్రమాణము, ఎవ

* బ్రి. వేదము వెంకటరాయశాస్త్రులవారి అలంకార సారసంగ్రహమందు మాత్రము "అరయనద్భుత మిథ్యాశూరత్వౌదార్యరచన చొఱు నత్యుక్తిన్" అని గురురేఖముతో చొఱుగా అనే శబ్దము చూచినాము.

గైనా చూపించేవరకూ ఈ వింత రూపములు సాధువులని ఒప్పుకోలేము గదా. తిక్కనవాడిన అదుర్చు, అనేరూపము మనము వాడము. మన కాలమందు అదురు అనేరూపము మాత్రమే ఉన్నది. చోరు, అట్టిదికాదు; తిన్నగా చదివేవారులేరుగాని గ్రాంథికాంధ్రము వ్రాస్తున్నా మనుకొనేవారు చాలామంది ఆక్షేపమునకు అవకాశమిచ్చే ఇట్టి శబ్దములు ప్రయోగిస్తూనే ఉన్నారు. పుస్తకములందును, పత్రికలందును—అవి వాడుకలోనివి కాక పోవడముచేతనున్న తప్పో ఒప్పో ఎవరూ కనుక్కోలేరు. పండితులూ పరికించరు. వాడుకలో లేని శబ్దములు వాడడము దోషముకాక, సుగుణముగా పెద్దలు ఎన్నుటవల్లను, ప్రాచీనాంధ్రభాషాలక్షణము స్పష్టముగా ఏర్పడకపోవుటవల్లను, ఇట్టి శబ్దములు ప్రయోగించేవారు నిందపాలుకాక నెగ్గిపోతున్నారు. ఇంగ్లండులోగాని, ఫ్రాన్సులోగాని ఇట్టి శబ్దములు వాడినవారికి తగిన పరాభవము కాకమానదు. గొప్ప కవులలో దొడ్డవాడు అని పేరుపొందిన స్పెన్సరువంటివాడు తనకు పూర్వుడయిన ఛాసరు వాడిన శబ్దములు ప్రయోగింప యత్నించి, ప్రాచీనభాషాలక్షణము తెలియక, తప్పులు వ్రాసినాడనిన్ని, ప్రాచీనభాషా పండితుడనిపించుకొనుటకు ఇట్టి వేషాలు వేసినాడనిన్ని మొగమాటములేకుండా డ్రైడెను అనేకవిన్ని, నేటి విమర్శకులున్ను నిందించినారు. మన దేశములోని తెలుగు పండితుల వలెనే ప్రాచీన భాషాశబ్దములు ప్రయోగించి పాండిత్యము విజృంభింప జేతామని పూర్వము ఇంగ్లండులో కొందరు పండితమ్మన్యులు తలంచేవారుగాని ఇప్పుడు అట్టి అవివేకులు లేరు. ప్రాచీనాంధ్రభాషాలక్షణము చక్కగా ఏర్పడ్డ తర్వాత పండితమ్మన్యుల భేషజము బయలుపడక మానదని నొక్కి చెప్పుతున్నాము. మాటాడ నేర్చిన బిడ్డ, రెండేళ్లదయినా, వాడుకభాషలో 'నీవు అన్నాడు' అనికర్త మధ్యమ పురుషముగాను క్రియ ప్రథమ పురుషముగాను, ప్రయోగించదుగదా. చూడండి కొత్తభారతములో పాత తెలుగు

ఎంతవ్యత్యస్తముగా వాడినారో కవిరాజు లంతటివారే:— జరాసంధుడు శ్రీకృష్ణభీమార్జునుల నుద్దేశించి,

"...మీ రెవరయ్య చెప్పుఁడీ;

మ. విని యంటిన్ మఱి చైత్యశృంగతటముం ఛేదించి నిస్సాణముల్
గునియల్ సేసి పథంబు గాని పథమందున్వచ్చి విప్రాకృతిన్
ననునర్థించియు నర్చనంగొనక మానంబంచు భాషింతు రే
పనికర్మం బను దెంచిరో యిటకు మీపారంభముం డెల్పుఁడీ."

(సభా. II, 21)

'మీరు చనుదెంచిరి' అనే వాక్యములో కర్త మధ్యమ పురుషబహు వచనమును దానిక్రియ ప్రథమపురుష బహువచనమున్ను గనుక ఈవాక్యము తప్పు కాక తప్పదుగదా. గ్రంథము అచ్చుపడ్డతర్వాత గాని కవిగారికి తప్పు కన బడలేదు. అయితే నిజమయిన మాతృభాషలో వ్రాసేవారు ఏమరిపాటున అయినా ఇట్టితప్పు చేయరు- పండితులు కానీ, పామరులు కానీ. అచ్చుపడ్డ తర్వాత నయినా గ్రంథకర్తగారు కనుక్కొని వైచిత్ర్యము ఒకటి చూడండి.

ఉ. ఓర జయద్రథా తెలియవుల్లమునందిది రాజధర్మమే
కూర్మిత నిట్లు సేయుటలు గూడునె పాండవులుగ్రమూర్తులీ
తీరున నున్న నిన్నుఁగని తెంపునఁ గనేయక మానరింతలోఁ
జేరఁగవత్తురిల్లుటయ సిద్ధము నీకెటుచూచె నేనియున్.

(అర IVII, 379)

నేటి వాడుకలో "ఎటు చూచినా నీకుచావుసిద్ధము" అనేవాక్యము "ఈల్లుటయసిద్ధము నీకెటుచూచె నేనియున్" అనిపాతతెలుగులోనికిమార్చి నారు. అయితే, చూచెన్ అనే సమాపక క్రియకు కర్త కానరాదే, ఈలాగే ఉంటుంది అనేకపండితుల గ్రాంథిక తెలుగు. ఏమిచెప్పను ఆ తెలుగు తీరు!

వాడుకలో లేనివి తప్పులో ఒప్పులో సిద్ధాంతము చేయడము దుష్కరమే గాని, వాడుకలో ఉన్నవి పండితులు తప్పులనుటకు సాహసిస్తారే. అది మేము సహించలేము.

చేతురు, కోతురు వాడుకలో లేనివి కావు. జీవలోకములో నేడు కులుకుతూ ఉన్నవి. ఆంధ్రభాషా ప్రపంచములో వాటికి విహితవ్యాపారమున్నది. ఇవి అసాధువులంటే, మేము సహించలేము. భాషాభిమానులు సహించరు. కూంతురని, కూంతురిక యొ|| నిషేధించినట్లే చిన్నయసూరిగారు వీటిని అసాధువులు, గ్రామ్యములు, అని నిషేధించి దూషించినారు. ఆయనమతమును అవలంబించిన పండితులు వాటిని వాడడముమాని ఊరకుంటె లోకానికి ఏమీనష్టము లేకపోవును గాని, ఇతరులు వాటినివాడితే తిట్టుతున్నారు; పూర్వుల గ్రంథములలో ఈ రూపములు కనబడకుండా దిద్ది గ్రంథాలు పాడుచేస్తున్నారు. ఇవి బడిపిల్లలువ్రాస్తే ఉపాధ్యాయులు తప్పెట్టుతున్నారు. పరీక్షకులు మార్కులు తగ్గిస్తున్నారు. ఇది మిక్కిలి నింద్యమయినపని; ఈ దురాచారము పండితులున్ను పరిష్కర్తలున్ను విడిచిపెట్టేటట్లు చేయడము భాషాభిమానులకు విహితకృత్యము. పండితులు వెలివేసినా పెద్దల నోటనే ఆ శబ్దములు నెలకొని ఉన్నవి; వారి గ్రంథములలో కూడా చొరబడుతున్నవి. ఎంతఅణగద్రొక్కినా చావవు. మాటలనున్నూ, మనలాగే వాటిప్రాణాలు వాటికీతీపి.

నేటి కవిపుంగవులు శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు బహిరంగముగా ఢంకామీద దెబ్బకొట్టి మల్లచఱచి మరీవాడుతున్నారు 'చేతురు' అని; తప్పన్నవాళ్ళకే వారుతప్పు పెట్టుతున్నారు, (చూ. పాండ. అశ్వ. పుట 31).

తమకు ఉచితమని తోచినప్పుడు, చిన్నయసూరి మాటేకాదు బ్రహ్మదేవుని మాటయినా సరే, తోసివేసి, జంకు లేకుండా వ్రాసే వారిలో అగ్రగణ్యులే చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు; ఉత్తవాదములో ఆయన ఏమం

లేనేమి? వ్రాతలలో స్పష్టముగా తెలియజేస్తున్నారు తమమతము. ఆయన గ్రంథములలో లేనిశబ్దము నేటి తెలుగులో లేనేలేదేమో అనిపిస్తుంది. ఆయన రచించిన రామచంద్ర విజయములో 'తెలియఁజేతును' (చూ. పుట 121) 'వివాహము చేతును' (చూ. పుట 127) అనేరూపము లున్నవి.

మ॥ రామలింగ రెడ్డిగారు తమఅర్థశాస్త్రములో తరుచుగా చేతురు, చేతుము వాడియున్నారు (చూ. పుటలు 139, 146, 174, 183, 216, 248, 249, 314).

కీర్తి శే. గురజాడ శ్రీరామమూర్తిగారి కవి జీవితములలో చేతును (చూ. పు 390) వ్రాతుము (చూ. పు 384) ఉన్నవి.

మ॥ హరిసర్వోత్తమరావుగారి అబ్రహాము లింకను చరిత్రలో ఉన్నవి (పు111.)

బ్ర. శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులంతటి వారువ్రాసిన వివేక చంద్రికా విమర్శనములో కూడా ఉన్నవి; వ్రాతము (చూ. పుట 22), పోతురు (చూ. పు 29) అని. ఇవి చేతురు కోతురు వంటివే కదా.

కూతురిని మొదలగు శబ్దములవలెనే, చేతురు మొదలగు శబ్దములు ప్రత్యేకించి పేర్కొని చిన్నయసూరి సూత్రములతో కట్టుకట్టి, నిషేధించినందున, చాలామట్టుకు నేడు గ్రంథకర్తలు వాడుక చేయడము మానుకొన్నా, పద్యాలలోకూడా, తెలిసిగాని, తెలియకగాని, అనేకకవులు చేతును మొ॥ ప్రయోగిస్తునే ఉన్నారు, చూడండి:— శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు తమ్ము ఆక్షేపించే వారిని శపించి మరీవాడుతున్నారుగదా వీటిని 'దేశభాషాలలితాంగి మారుటది సత్కవిసమ్మతి'మ నివాదించిన వీరిని గ్రామ్యాభిమాను లని నిరాకరించేవారు ఎవరైనా ఉంటే, వారి తృప్తికోసము మ॥ జయంతి రామయ్యపంతులువారున్ను మ॥ వావిలికొలను సుబ్బారావు పం(డి)తులవారున్ను రాజదర్బారులోని కవులున్ను రచించిన కృతులే ఉదాహరిస్తాము. మనలౌకికభాష గ్రామ్యమని నిందించి, దానిని కాగితముమీద ఎక్కడా

కనబడకుండా చేయడమునకు బ్రహ్మాండము బ్రద్దలకొట్టుతూ ప్రయత్నప్రయాసల కోర్చి గ్రాంథికాంధ్రభాషా రక్షణపరాయణులయి వ్యవసాయము చేస్తూ ఉన్న మహానుభావులుగదా ఈ పంతులుంగార్లు. వీరిప్రయోగములు నెత్తిని బెట్టుకొని గ్రామ్యద్వేషులు సమాధినొందుదురుగాక.

మ|| రామయ్యపంతులవారి ముక్తీశ్వర శతకములోనివి రెండు పద్యాలు:—

క. గండములొందియు సుజనుల్ మెండుగఁ జేతు రితరులకు మేలుస్సుజనుల్
మెండుగ వాడియునీడఁగ దండనుగల వారికివె ధరముక్తీశా ||

క. కూళలు కీడొనరించిన మేలునె సేతురు మహితులు మేదినియందున్
గాలస్సన్నినవీదే పూల నశోకంబపహృతపుర ముక్తీశా ||

1893 సం|| నవంబరు తే 12 దిని నెల్లూరిలో వావిలికొలను సుబ్బారావు పం(డి)తులవారికి చాలాగౌరవముచేసి వారి మిత్రులు 'గజమాల' బహుమతిగా ఇచ్చినప్పుడు దానికి మారుగావీరు 'పంచరత్న సీసములు' కట్నం చదివించినారు. వాటిలో కడపటిది ఉదాహరిస్తున్నాము చిత్తగించండి:—

నిమ్మళంబుగఁ దన్ను నెమ్మది నమ్మిన నిమ్మహిని శుభమ్ము గ్రమ్మనెడి
నుడి నడుపంగ నానుడి నిచ్చి పలికించెనే నేరకున్నను నేర్పు లెచ్చ
నిచ్చలు బెచ్చుగఁ గ్రచ్చర మీయిచ్చవచ్చి అచ్చలఁగృతి మెచ్చ జేసె
గాఢకాంతరమును గల్పించి యీయూరికిని దెచ్చిమిముఁ జూపి యనఘుఁ జేసె
నవనిజాభర్త తాద్రూప్యమగుట శుభ యశస్కరంబును గరము శ్రేయస్కరమున
మస్కరణమని జేతు మనస్కరించి విబుధ అంగీకరింపుఁడీ ప్రేమ జెలఁగ

(అముద్రిత గ్రంథ చింతామణి 1894 జనవరి)

ఇందులోని కవితారసము విబుధులే జుఱ్ఱుకొందురుగాక! ఇట్టిరచనలో ఇమిడ్చిన 'జేతు' ప్రమత్తుని మాటన దగునా? ఏమో? ప్రమాదమని ఒప్పుకొంటారు గాబోలు కవులు నేటికి పాండిత్యము పండి పక్వమైనది గనుక.

శ్రీ వేంకటగిరి సంస్థానమందుండే శ్రీ గోపినాథ వేంకట కవి రచించిన కృష్ణజన్మఖండమనే మహాకావ్యము బ్ర॥ శ్రీ॥ చెదులవాడ సుందరరామశాస్త్రిలవారు పరిష్కరించి మరీ అచ్చువేయించినారు. అందులో చేతురు మొ॥ తరుచుగా కనబడుతున్నవి; మచ్చుకు ఒకటి ఇస్తున్నాము.

క॥ సర్వేశ్వర సర్వరూప, సర్వోత్తమ సర్వబీజ సర్వాధారా
సర్వజ్ఞ సర్వవందిత సర్వాతీత నినుభక్తి సన్నుతి <u>సేతున్</u> (IV)

శ్రీ బొబ్బిలి సంస్థానములోని కవులు బ్రి॥ సుసర్ల చినసుబ్రహ్మణ్యశాస్త్రిలవారు సంస్థానాధిపతుల ఆజ్ఞచొప్పున, వర్షాభావముచే లోకము బాధపడుచుండఁగా, వర్షము కురిపించుమని దేవుని ప్రార్థిస్తూ చెప్పిన పద్యము.

క॥ శ్రీ మించు మించుమైవగ, హేమాంబర మనఁగఁ దగిన హీనవిరాజ
చ్ఛామాంగుఁడవై విష్ణువ, వామెఱసిన నీకు వందనము <u>జేతు</u> ఘనా
(చూ. అముద్రిత 1893)

శ్రీవిజయనగర సంస్థాన కవులు బ్రి॥ మండచిట్టి కామశాస్త్రిలవారి మార్కండేయ పురాణములో ఈ శబ్దములుగల పద్యములు వందలు వందలున్నవి.

క॥ జీవించిన భద్రములగు, జీవించిన బుణ్యములను <u>జేతురు</u> తనువుం
బో విడిచి ధర్మహానిం గావింతురె గాన తనువు గడు రక్ష్యమగున్ ॥
(పు 50)

సీ॥ విప్రగురునింద గావించిరట్టివారి జిహ్వ <u>గోతురు</u> మొలువంగ మరల (104)

గ్రామ్య భాష గ్రాంథిక భాషగా చేసి, తమ నాటకములలో నెక్కించి, నెలకొల్పినవారైనను గ్రామ్యమును సర్వతోముఖముగా నిందించి ప్రసిద్ధిగాంచిన పిఠాపుర కవులు మ॥ పానుగంటి లక్ష్మీనృసింహారాయలవారి నర్మదాపురుకుత్సీయము (రెండవ కూర్పులో-ఉత్తమ పాత్రి వాక్యము-'ఏమి చేతురు' పుట. 108.)

ఇకను ఈ రూపము క్రొత్తగా భాషలో దూరిన గ్రామ్యము కాదనిన్ని ప్రాచీనులు తరుచుగా వాడి ఉండకపోయినా అయిదువందల సంవత్సరములయి నిస్సందేహముగా కవులు వాడుతున్నారనిన్ని రుజూవు చేయగలము. నన్నయ భారతము వ్రాతపుస్తకములు తంజావూరి సరస్వతీనిలయమందు కొన్ని ఉన్నవి. వాటిలో 27వ రెజిస్టర్ నెంబరుగల తాటాకుపుస్తకమునందు 28వ ఆకుమీద ఆదిపర్వము II, 56వ పద్యము ఇట్లున్నది.

క|| విషనిధికుక్షి నసంఖ్యము విషాదగణముండి ధారుణీప్రజకుఁ గడున్
విషమము సేతురు వారినిమిషమునభక్షించిచను మమిత్రవినాశీ||

వావిళ్ళవారి అచ్చుభారతము సభాపర్వము II, 168 సీసపాదములో పాఠాంతరము 'కుడిచినచోటికిఁ గొరఁతసేతు' అని ఉన్నది. ఇవి నన్నయనాటివి.

గుప్తార్థప్రకాశికలో ఉదాహృతము. తిక్కన విరాట. II, 281 వ పద్యము మూడో పాదము. మ|| 'నా। కులతంబొందెదునప్డు మంటపము సంక్షోభింపగాఁ జేతు' అని ఉన్నదని శ్రీ తిరుపతి వేంకటేశ్వరులుకూడా తిక్కన దీప్రయోగమున్నదన్నారు. కర్ణపర్వము I, 296 లో 'దయసేతువుగాక' అని ఆనందముద్రణములో ఉన్నదిగాని పుట అడుగున 'దయసేసెదవు' అని పాఠాంతరమున్నది. సౌప్తికప. ఆ. I, ప. 33 'ఉ|| నీతిదొరంగి కార్యములనెట్టన యాగ్రహ వృత్తిఁజేసినం। బీతిగ సిద్ధిఁబొందినను భీతి జుగుప్సయుఁబుట్టి భూజనుల్ । సేతురె చేటు సేఁతలు ఫలింపక...' అని తాటాకు పుస్తకములో ఉన్నది. అచ్చులో చేతురుకు బదులుగా వేతురు అని ఉన్నది అర్థమేమో?

I, 16. క...తిక్కన నిర్వచనోత్తరరామాయణము 'అలతి యలతి తునియెల గాహళగూర్చి నట్టులమరంజేతున్||' అని ఒక తాటాకులపుస్తక

ములో ఉన్నది. మరిఒక తాటాకు పుస్తకములో 'అలతి తునియల గాహాల సంధించిన విధంబు నమరఁగవలయుఁ॥ అని ఉన్నది.

మారన మార్కండేయ పురాణము వ్యాసమూర్తి శాస్త్రిలవారు పాఠాలు మార్చి పరిష్కరించి అచ్చువేయించినారు. వారికి పని యిచ్చిన పోలవరం జమీందారుగారు స్వయంగా వ్రాసియిచ్చిన సాక్ష్యపత్రములో స్పష్టముగా పరిష్కరణ దోషాలు పేర్కొన్నారు. పిఠాపురమందున్న ఆంధ్ర పరిశోధక మండలివారు స్థాపించిన పుస్తకభాండాగారమందు మారన మార్కండేయ పురాణము తాటాకుపుస్తకము ఒకటున్నది., అందులో I, 227 వ పద్యము ఇట్లున్నదని బ్ర॥ మండపాక పార్వతీశ్వరశాస్త్రిలవారు మాకు పుస్తకము చూపించినారు.

ఆ॥ మార్గజనిత రేణు మలినమై నీ ముఖాంభోజమింక డఱిఁగి జాలఁ బొలుపు
వాడి తొంటి యంత చూడఁగా నొప్పకయుండు నేమిసేతు మండలేశ॥

అచ్చుపడ్డ మార్కండేయ పురాణమంతా దిద్దిపాడుచేసినారు పరిష్కర్తలు. దిక్కుమాలినది అయినది ఆంధ్ర సారస్వతము.

శ్రీనాథుని నైషధమునందు II, 88 వ పద్యములో పూర్వముద్రణమున సేతురు అనే పాఠముండగా బ్ర॥ వేదము వేంకటరాయ శాస్త్రిలవారు తాము పరిష్కరించి అచ్చువేయించిన పుస్తకములో పాఠము సవరించి వ్యాఖ్యానములో "పూర్వముద్రణపాఠమున 'చేతురు'-అపశబ్దము; 'చేయుదురు' సాధువు" అని వ్రాసినారు. మేము చూచిన తాటాకు పుస్తకములలో 'చేతురు' అని ఉన్నది. ఎన్నో పద్యాలు వీరి పరిష్కరణము వలన మారిపోయినవి. ఏమిచెప్పను!

ఈలాగుననే భోజరాజీయము VII, 63 వ పద్యములో 'పదంపడి యేమిసేతుగో' యని వ్రాతపుస్తకములో కనబడుతున్న పాఠము అచ్చు పుస్తకములో 'పదంపడి యేమొనర్తుగో' అని పరిష్కృతమైనది. భోజ

రాజీయములో చేతురు మొ|| ప్రయోగములు కావలసినన్ని ఉన్నవి. పరిష్కర్తలు కడుపుబ్బు తీర్చుకోడానికి ఒక్కచోట దిద్దివేసి ఏమిమాటకట్టుకొన్నారు? తక్కినచోట్లనున్న ఈ ప్రయోగము నిల్చిఉన్నప్పుడు అది వాడనివా డని ఆ కవి అనిపించుకోడుగదా! బ్ర|| పండిత గోపాలాచార్యుల వారు పరిష్కరించి టీకవ్రాసి అచ్చువేయించిన భేషజకల్పమందు చేతును అని మూడు పద్యములలో (I. 4, 5, II. 2) పూర్వుల గ్రంథములలో ఉంచినారుగాని దిద్దలేదు. సెబాష్!

బుద్ధిపూర్వకముగా దిద్ది కూటకరణదోషము చేయడమేకాక తాము తప్పులనుకొన్న ఈ శబ్దములు ఎవరైనా గ్రంథములలో వాడితే పత్రికలలో విమర్శనముచేసి పండితులు పడతిట్టుతున్నారు. బ్ర|| బాలకవి కాశీభట్ల కృష్ణరాయశాస్త్రీగారు రచించిన శమంతకోపాఖ్యానము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (V, పుట 295) లో విమర్శించిన మహానుభావు లెవరోగాని 'చేతురు' అన్నందుకున్ను ఇంకా మరికొన్నిటికిన్ని పాపము బాలకవిగారిని బేమర్యాదగా నిందించి, గ్రంథాలు పండితులచేత దిద్దించుకొని మరీ అచ్చు వేయించుకొమ్మని గట్టిగా బుద్ధిచెప్పినారు. మ|| చెలికాని లచ్చారావు వారు పండితులచేత దిద్దించుకొని గ్రంథము అచ్చువేస్తే దిద్దిన పండితులకే బుద్ధిచెప్పినారు. ఏమిదారి? పరిషత్తువారే ఆంధ్రగ్రంథ పరిష్కర్తలను నియమించి వారు సరిచేస్తేనేగాని ఏ గ్రంథములయినా ఆంధ్రులు చదవ కూడదని శాసనము చేయిస్తే బాగుండును.

కీ|| శే|| శిష్టు కృష్ణమూర్తి కవి ప్రసిద్ధుడేగద! ఆయన రచించిన ఒక ఉత్పలమాలికలో 'రేబగళ్లులం బాయని సాధకంబు పరిపాటిగ జేతురో వారివిద్య', అనేచరణమందు 'చేతురు' ప్రయోగించినారు. (కవిజీ. పు. 448)

ఆయన కాలములోనివాడే సంస్కృతమందున్ను తెలుగునందున్ను కూడా గొప్ప పండితుడనిన్ని గొప్పకవి అనిన్ని ప్రసిద్ధిగలవాడు పిండిప్రోలి లక్ష్మణకవి తాను రచించిన ద్వ్యర్థికావ్యము లంకావిజయములో:

గీ॥ ఒనరు మద్యావన్కాలం దెలుంగునకు బద్ధుడగును వాగను శాశనుండైననమ్మ్ర
మలఘుమద్ద్వయ గోచయంబులకుబద్ధుడగును శ్రీమనోవనుచోరుడైననిజము (II, 48).

అని తన తెలుగులో ఏమీ దోషముండదంటూ సావజ్ఞముగా చెప్పి,

క. చేతోవీధిన్ సన్నుతిం జేతుణ్ విక్రమసమేతు శ్రీకరగుణసం
ఘాతున్ భవ్యామేయనికేతున్ రిపువిపిన ధూమకేతున్ గేతున్॥ (I,16)

అని ప్రాసస్థానమందు 'తు'వర్ణముంచి శబ్దాలంకారముగా చేసి మరీ ప్రయోగించినాడు. ఈ శబ్దముగల పద్యములు ఇంకా ఉన్నవి ఆయన గ్రంథములో. లక్ష్మణకవివంటివాడు ఇట్టి రచనలో 'చేతును' ప్రయోగించడము ప్రమాదమవుతుందా? బుద్ధిపూర్వకముగా సావధానముగా కామతః కవివాడిన శబ్దము ఏదో దుష్టలక్షణమునకు విరుద్ధముగా ఉంటే 'ప్రమాదోధీమతామపి' అని కవిని దూషించడము అవివేకముకాదూ? కీ॥ శే॥ దాను శ్రీరాములు పంతులుగారి 'కృతులు' చాలా రసవంతమయినవని తెలుగుదేశమందంతటా ప్రఖ్యాతిపొందినవి. వాటిలో 'చేతును' ప్రయోగించినారు చూడండి:—

'వారిజాక్షులోలి కాకెలగసామి' వద్దువద్దుచాలురా నోరుమూసికొని
యూరకున్నగాని తీరదాయె దానిపోరు నేనేమి సేతురా (116)

'భానురాంగి నిన్నుమాయజేసె నేనేమి సేతు దానురామకవి మనో
నివాసుడాయె మోసమాయె' (III, 12)

కృతులలోనూ, పాటలలోనూ వాడినశబ్దములు ప్రమాణమా? అంటారు కొందరు బాగా ఆలోచించక; కృతులలోను పాటలలోను గ్రామ్యాలు వాడవచ్చునని ఏశాస్త్రమందు ఉన్నదో! ఎవరు సెలవిచ్చినారో! అవి గ్రంథములుకావా? అవి రచించినవారు శిష్టులుకారా? త్యాగరాయల పాటలున్నవి చూడండి! వడ్డాది సుబ్బారాయల పాటలున్నవి; అవీ చూడండి.

త్యాగరాయలవారు భక్తిరసము ఉప్పొంగేటట్లు తమ తెలుగున రామకీర్తనలు రచించి పాడినారు. సుబ్బారాయలవారో? మేము చెప్పడమెందుకు? తెలుగుదేశములోనే కాదు అరవదేశములోను, కన్నడదేశములోను తెనుగు తేనెవంటిదన్న ప్రఖ్యాతి త్యాగరాయల తెనుగు పాటలవల్లనే వచ్చినది. అట్టి త్యాగరాయల తెలుగు, శిష్టజన వ్యవహారమందున్నప్పుడు, గ్రామ్యమన డము ఎంత సాహసమో ఆలోచించండి; త్యాగరాయలకు గ్రామ్యభాష వాడుమని ఇచ్చిన అనుజ్ఞ సుబ్బారాయుల కాలమందు రద్దయినదా? వాస్తవ మయిన సంగతి యేమిటంటే, సుబ్బారాయులవారు అనర్థకమయిన నియ మాలు పెట్టుకొని, తమ స్వంతభాష గ్రామ్యము చేసుకొని, ఏదో కృత్రిమ భాషలో సంకీర్తన చేసినారు; త్యాగరాయలవారు స్వేచ్ఛగా లోకములోని సత్సంప్రదాయము ననుసరించి, తమ స్వంతభాషయెడల గౌరవము అభి మానము గలిగి రామకీర్తన చేసినారు. దేవుడు త్యాగరాయల కీర్తనకు మెచ్చక, 'గ్రామ్యభాష' వాడినందుకు ఆయనను నరకమందు పడవేసినాడం టారా? 'స్వభాష' విడిచినందుకు సుబ్బారాయలవారికి పుణ్యము లభించిన దంటారా? తెలివితక్కువవాళ్ళు అనే మాటలు పండితులనోట రాకూడదు. విన్నకోట పెద్దిరాజు చెప్పినాడు గ్రామ్యలక్షణము చూడండి:

క॥ ఈసడములు గోరడములు గాసిలి బీసాలునైన కట్టిడి పలుకుల్
భాసిల్లు గ్రామ్యములు నా, హాస్యోక్తులఁ దెగడుచోట నవియున్ వలయున్॥

సరిగా ఉన్నది! చంద్రశేఖర శతకము మొదలయినవి నవ్వించడము కోసము వ్రాసినవే, గనుక వాస్తవమయిన గ్రామ్యభాష అట్టివాటిలో ప్రయుక్తమైనదే. ఉదాహరణముగా ఒకటి చూడండి:

ఉ॥ పెద్దలు శెప్పగింటి బవు పెద్దట యొగ్గ సామాదులంటబల్
గద్దిరి తోడయాటలును కంబము కాడ మరుండ మెట్టియా
డిద్దరులోన ఓమమట యేకముకా రొాదపెట్టి బాపనాం
డ్లెద్దుల మోలెతిందురని యెన్నును మూఢుఁడు చంద్రశేఖరా (24)

ఇట్లే సారంగపాణిపదములు మూడవభాగమునందు గ్రామ్యభాషను అని రచించిన హాస్యగీతములున్నవి. 'ఇగ నేను పైనెక్కి యీ బీసనూరొచ్చి' త్యాగరాయల కీర్తనలు ఇటువంటి హాస్యోక్తులా? రాములవారిని 'పొగడుట' కోసము రచించినవా? దేవుని స్తోత్రము చేస్తూ గొప్పవారు రచించిన పాటలు హాస్యాలా? హాస్యానికి కల్పించినవికూడా ఉన్నవి కొన్ని; వాటికీ వీటికీ భాషలో వ్యత్యాసము స్పష్టముగా కనిపిస్తూనే ఉంటుంది కండ్లుంటే. గనుక దాసు శ్రీరాములుపంతులవారి కృతులలోని చేతును అనే రూపములను గ్రాంథికములని ఉదాహరించడము తప్పుకాదు. మా వాదము సమర్థించడమునకు ముఖ్యాధారముగా పాటలలోని ప్రయోగములు మేము ఉదాహరించడములేదు; ఆమాట మరిచిపోవద్దు. ఒక శబ్దము సర్వజనసమ్మతమైనదనిన్నీ, సర్వజనవిదితమైనదనిన్నీ, సర్వప్రియమయినదనిన్నీ రుజువుచేయుటకు సార్వజనీనమయిన పాటలలోనూ శతకములలోనూ చూపించకతప్పదు. లోకులకందరికీ తెలిసేటట్టు వ్రాయవలెనని కోరేవారు ఇట్టి శబ్దములే వాడుతారు. ఒక్క ప్రబంధములో ఒక్క పద్యములో యతిస్థానములో, ప్రాసస్థానములో శబ్దరూపము స్పష్టపడేటట్టు ఒక్క ప్రయోగముచాలు పండితులకు; అది సాధువు అని నిరాక్షేపముగా ఒప్పుకొంటారు; లోకములో ఉండనీ, ఉండకపోనీ. పదేపదే చెప్పుతున్నాము మా మతము; లోకములో ప్రచారముగా ఉండి గ్రంథము అనేదానిలో ఎక్కడైనా ఆ మాట కనబడితే పండితులున్నూ కవులున్నూ సంతోషించవలెను. గాని దుఃఖించకూడదు, ఎందుకు కనబడ్డది ఇందులోనని; దుఃఖిస్తే దుఃఖించనీండిగాని, అది దిద్ది కనబడకుండా చేయకూడదు. దాసు శ్రీరాములుపంతులువారు 'చేతును' అనే రూపము ప్రౌఢకావ్యములలో కూడా ప్రయోగించే ఉన్నారు. ఆయన తెనిఁగించిన మాలతీ మాధవములో (దశమాంకములో రెండో పద్యము చూడండి):

గీ॥ వచ్చిరానట్టి యేడుపు వచ్చిరాని నవ్వుగల పాలపళ్ళతో నన్నుఁజూచి
వచ్చిరాని పలుకు పల్కు పాపమోముదమ్మి నాడెందమున స్మరణసేతు॥

వీరివలెనే త్యాగరాయలవారు పద్యముగల ప్రబంధము వ్రాసిఉంటే వారు కృతులలో వాడిన శబ్దములే పద్యములలో కూడా వాడేఉందురు.

'అట్లా పలుకుదు విట్లాపలుకుదు-వందుకేమి సేతు' (101 వది) అని పాటలో వాడినట్టే.

సీ॥ ఎవ్వరి భాగ్యమో ఎందడగుంటివో యందు గాగిలిజేర్తు నేమి సేతు (మూ. 213)

అని పద్యములోకూడా ప్రయోగించినారు-చూచినారా?

రామదాసు చరిత్రమందు పాటలలోనూ పద్యాలలోనూ కూడా 'చేతును' మొ॥ రూపములున్నవి.

1 "ఇటులఁజేతువటరా యిది తగునటర ఓ రామరామ!" (పుట 63)

2 "ఏలాగుతాలుదు నేమి సేతురరామ" (పుట 68)

3 "ఎంతవేఁడుకున్నఁ బలుకఁడేమి సేతునమ్మా
యింతటాతిమనను వానినెందుఁగాననమ్మ" (పుట 101)

ద్విపద. ఆవాహనము సేతు వతిశీఘ్రముగను
రావయ్యనీలనీరదగాత్రరామ (పుట 116)

4 "స్నేహముఁజేసినవానికి ద్రోహముఁజేసినవాని కూహకమున యముని దూతలు కులిశముననను మెండుకష్టుల గోసురు కొఱంత వేతురు (పుట 124)

5 సర్కారు పనులను సగునఁజేతురు సాయంకాలమువఱకు (పుట 46)

6 నాపైప్రీతిని చేరఁదీతువను నాకలఫలమేమో (పుట 36)

క్షేత్రయపదములలో ఈరూపము తరుచుగా ప్రయుక్తమయినది.
ఇందుకు నేనేమి సేతు—యేమందునే (35 వ పదము)
ఇందుకేమి సేతునమ్మా—యెవరితోడి తెచ్చెదరమ్మా (36 వ పదము)

ఈయన పద్యాలు వ్రాసిఉంటే వాటిలోనుకూడా ఈ శబ్దము వాడి ఉండును. క్షేత్రయపదములలో వాడినపదములు ప్రమాణమా? అని ఆక్షేపించేవారికి తగిన సమాధానము చెప్పగలము. సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరములో ఈ పదములలోని కొన్నిపదములు ఉదాహరించినారు గదా; వారికి అవి ప్రమాణమైనప్పుడు మాకు మరికొన్ని ప్రమాణ మేల కాకూడదు? "ప్రమాణమంటే" పెద్దలువ్రాసిన గ్రంథములోని ప్రయోగము; అంతేకదా! చూ. శ. ర. "ఊరు=పుట్టు:అసలూరు:గా: క్షేత్రయ" "మా మాబాగాయె: క్షేత్రయ" ఈ రెండవపదము 'మా' 'మహా' అనేశబ్దము యొక్క వికారము. శ్రీనాథుడు నైషధములో వాడినాడు (చూ. vi. 95); అక్కడ అవ్యయము. విశేషణమయినందుకు క్షేత్రయప్రయోగమే ప్రమాణము కోరికినది. శతకములు ప్రబంధములకన్న ఎక్కువగా దేశములో వ్యాపించి ఉన్నవి. నరసింహశతకమువంటివి సర్వజన ప్రియమైనవి. సుమతీ శతకము, వేమనశతకము, కృష్ణశతకము చిన్నపిల్లలుకూడా చదువుతారు. అందుచేత శతకములలోనుంచి ప్రయోగములు ఉదాహరించినాము. శతకములు ప్రమాణములా అంటే, ఔను ప్రమాణములే అని నిశ్చయముగా చెప్పుతున్నాము; కాకేమి? అప్పకవికి అయినవి కావా? చూడండి:—

దేవకీనందనశతకము (చూ. అప్పకవీ. III, 209. మ. చతురంబోధి.......)

మకున్నందనశతకము (చూ. అప్పకవీ. III, 119. శా. కోపాటోపము...)

భాస్కరశతకము (చూ. అప్పకవీ. III, 149. ఉ. దక్షతలేనియింటికి...)

మనకు ఇవిన్ని ఇటువంటివి తక్కినవిన్ని ప్రమాణమేలకాకూడదు? అప్పకవీయముతోకూడా తెలుగుభాష, తెలుగుకవిత్వము, తెలుగులక్షణము మరిమారకుండా గడ్డకట్టుకొని పోయినవా? అప్పకవికి తన కాలమందున్న కవులయెడల గౌరవమున్నందున వారి గ్రంథములు ప్రమాణముగా గ్రహించినాడు. చూచినారా? మననాటి కవులయెడల మనకెందు కుండకూడదు

ఆగౌరవము, ఆభక్తిన్ని? శబ్దరత్నాకరములో దాశరథీశతకములోని ప్రయోగములు ప్రమాణమయినవి (చూ. కొప్పరము, . జొబ్బిలు). గనక ప్రసిద్ధమైన శతకములలోని ప్రయోగములు ప్రమాణముగా అంగీకరింపక తప్పదు. అయినా, వాటినే మేము ఆధారముగా చేసుకోలేదునుండీ. వేదములోనిది పురాణాలలోకూడా ఉన్నదన్నట్టు శతకాలు ఉదాహరించినాము. అప్పకవి ప్రమాణముగా ఎత్తుకొన్న భాస్కరశతకములోనిది:

ఉ. “లోకములోన దుర్గుణుల లోఁతు తెలుంగక చేరరాదు సు
శ్లోకుఁడు చేరినంగవయఁ జూతురు జేసురు చెడ్డహాస్యముల్ (82)

ఈపాఠము తాటాకు పుస్తకములలోనున్న, మొన్న మొన్నటివరకూ అచ్చుపడుతూ వచ్చిన కూర్పులన్నింటనున్ను కనబడుతున్నది. 1911-వ సంవత్సరమున టీకతోకూడా బడిపిల్లలకోసము ముద్రించిన పుస్తకములో “చేయుదురెక్కసక్కెముల్” అని దిద్దినారు పరిష్కర్తలు; చిన్నయసూరిగారు చేసిన నియమము చొప్పునగాబోలును.

అప్పకవికి ప్రమాణమయినదే దేవకీనందన శతకములోనిది:—

శా. అక్రూరాత్మకులైన పాండవుల బాహాశక్తియున్ ధాత్రి ని
ర్వక్రంబయ్యెడునట్లు చేసి ననుచున్ వాత్సల్య మింపొంద (52)

ఈ పాఠము రెండుకూర్పులలో ఉన్నది, పండిత పరిష్కరణములో మాయమయినదేమో మేమెరుగము.

కలువాయిశతకములో చాలామాట్లు ఈశబ్దము ప్రయుక్తము: ఇది సర్వజన ప్రియమైనది.

సీ. వలపెందు దాతునే వరు నెటుమాతునే నేనేమి నేతునే నెలతలార. (24)

కాంతాలలామ శతకములో ఇట్టివి ఉన్నవి. ఇదిన్నీ సర్వజనప్రియమైన పుస్తకము.

సీ. అలుక చేసురు గాని యతివరో నీవలె పలుమారు నలిగెడి పణతిగలదె (44)

జానకీపతిశతకము ఆబాలగోపాలము అందరూ చదువుతారు. అందు లోనిది:—

ఉ. "ఎన్నిక నెన్ని విన్నపము లెంతయు జేతును నీదుచిత్తమున్."

తాడిమళ్ల రాజగోపాల శతకములోనిది:—

సీ. సకియరో నాపతి సంశయంబులుమాని రాడేమి సేతునే రాజవదన.

వ్యాకరణములోగాని ఎవరయినా ఒక శబ్దమును చేర్చితే, ఆశబ్దము సాధువు అవుతుందని అనేకమంది భ్రమపడతారు. వ్యాకరణముగాని కోశము గాని చేసినవాడు సర్వజ్ఞుడయి, వానిమాట అమోఘమయినా, వాడు చెప్పిన లక్షణము వాని తదనంతరము భాషమారినయెడల దానికి పట్టదుగదా. అల్పజ్ఞులయినవారు చెప్పేలక్షణము ఆక్షేపణకు ఎడమివ్వక తప్పదు. విమర్శ పయినిగాని అందులోని తప్పులు, లోపాలు సవరణకావు. తెలుగుభాషను అనేకమంది కవులు పండితులు నిఘంటువులున్ను వ్యాకరణాలున్ను వ్రాసినారుగాని, అవి అన్నీ లోకములో వెల్లడి కాలేదు. వాటిలో ఏదిన్నీ సంపూర్ణముగాను నిర్దుష్టముగాను లేదు. ఇప్పటికిన్నీ కొన్నింటిపేర్లే పండితులు ఎరుగరు. లౌకిక వ్యవహారములో వాడేభాష ఏదేశమందయినా వ్యాకరణాలను కోశాలనుబట్టి నేర్చుకొంటూరా? గనుక లక్షణము ప్రయోజనము లేదు. కేతన వ్యాకరణములో 'అంట' అనేరూపము సాధువుగా చెప్పినా అధర్వణుడున్ను అహోబలుడున్ను అది అసాధువుఅన్నారు. పెద్దిరాజు కూతురికి, కూతురిని సాధువులంటే చిన్నయసూరి అసాధువులన్నాడు. చుదురు రూపములు తన పూర్వులు సాధువులన్నా, చిన్నయసూరి ఒప్పుకో లేదు. ఇట్లే చేతురు, కోతురు సాధువులని పూర్వులు కొందరు లక్షణముచెప్పి ఉండగా, చిన్నయసూరి తప్పుఅనగానే తప్పులయిపోవునా? గణపవరపు వేంకటకవి అని గొప్ప పండితుడు ఒకడు సర్వలక్షణ శిరోమణి అనేపేరుగల

గొప్ప గ్రంథము ఒకటి రచించినాడు. దానిలోని దశమోల్లాసము ద్విరూపకోశము. అందులో తన యోగ్యతను ఇట్లు వర్ణించుకొన్నాడు.

క. సమకాలము వారలు తమతమ మదులకు మిగుల సమ్మతంబని మత్కా-
వ్యములందలి నుడులు ప్రయోగములకునిడుకొనుచుబాగడఁగాఁదగునుకవిన్.

క. ఇది గలదో లేదో యను మదిలోపలి సంశయంబు మాత్సర్యంబున్
వదలిచి కవులిందునుగలవిధమున రచియింప దారి వేంకటశౌరి.

ఈ గ్రంథము ఇంకా అచ్చుపడలేదు. తంజావూరి గ్రంథాలయములోను, చెన్నపట్నములోని గవర్నమెంటువారి గ్రంథాలయములోను దీని ప్రతులు మేము చూచి అందులోనివి కొన్నివిషయములు వ్రాసుకొన్నాము. 'చేతును' సాధువుగా ఈలాక్షణికుడు ఒకపద్యములో చెప్పినాడు:

క. చూతము చూతమ్మనఁగా
వ్రోతును వ్రోయుదును నాఁగ (దొరువుదొరియనన్)
నేతురు నేరుతు ననఁగ
జేతుఁ జేయుదును నాఁగఁ జెలువొప్పు హరీ.

అనేకముగా చేరియున్నవి ఈ లక్షణములో చిన్నయసూరివంటి పండితులు తప్పులని నిషేధించిన శబ్దములు. మా ఉపన్యాసములలో కావలసినచోట్ల వాటిని ఉదాహరిస్తాము. ఈ లాక్షణికుడు ప్రాచీనకాలమువాడు కాకపోయినా ఇంచుమించుగా ఇన్నూరు సంవత్సరములక్రిందటివాడయి ఉండును. చిన్నయసూరికి పూర్వము చెన్నపట్నములోని పండితులే వ్రాసిన వ్యాకరణాలున్నవి. వాటిలోని సూత్రాలు ఉదాహరిస్తాము. 1836 సం॥ములో అచ్చుపడి చాలాకాలము బడులలో విద్యార్థులు చదువుచుండిన రావిపాటి గురుమూర్తి శాస్త్రులవారి వ్యాకరణము, 230 వ సూత్రము:—

"యువర్ణాంతములైన సమస్తధాతువులకును భావక్రియయందలి తద్ధర్మమునందును ప్రార్థనార్థమునందును 250 సూత్రములోని పటములో

తెలియఁజేసినప్రకారముగానైనా, లేక, యుదు-యుద-యుదా అనువాటికి క్రమముగా-తు-త-తా అనునవిగా మార్చడముచేతనైనా, రూపములు నిష్పన్నములవుచున్నవి. ఈ ప్రకారముగా మార్చునప్పుడు యువర్ణమునకు పూర్వమునందు ఇకారముంటే, అది ఈకారమగును. ఉ. చేయు అను ధాతువునకు చేయుదును, చేతును; చేయుదము, చేతము; చేయుదాము, చేతాము; తడియు అను ధాతువునకు తడియుదును, తడుతును; తడియుదుము, తడుతము; తడియుదాము, తడుతాము అని రూపములు వచ్చును.

1857 సం॥ములో అచ్చుపడి బడులలో క్రిందితరగతుల పిల్లలు చాలాకాలము చదువుచుండిన శేషయ్యవ్యాకరణము, 83, 84 సూత్రములు:— యువర్ణముకొనయందుగల ధాతువులకు ఇ, ఏ అనే యచ్చులు ఆదియందుగల ప్రత్యయములను చేర్చునప్పుడు ఆధాతువుమీది యకారము సకారమవుచున్నది. ఉ. చేయు + ఇ=చేసి; చేయు + ఎదను=చేసెదను. ఇత్యాదులు.

దు అనే అక్షరము వచ్చేటప్పుడు ధాతువుమీది యువర్ణమున్ను, ఈ దు అనే అక్షరమున్ను తువర్ణముగా వికల్పముగా మార్చబడుచున్నవి. ఉ. చేయుదును= చేతును.

ఈ శేషయ్యవ్యాకరణము 1875-వ సంవత్సరమునందు మరల అచ్చుపడ్డప్పుడు కడపటిసూత్రము ఎవరో పండితులు అవకతవకగా మార్చినారు; ఏలాగునంటే—"గ్రామ్యభాషయందు దు అనెడి అక్షరము వచ్చునప్పుడు ధాతువుమీది యువర్ణమును, ఈ దు అనెడి అక్షరమును, తువర్ణముగా మారును. ఉ. చేయు + దును= చేయుదును." పుట అడుగున చుక్క గురుతుపెట్టి, "గ్రామ్య-చేతును" అని చేర్చినారు. చూచినారా పునర్ముద్రణములో వ్యాకరణాలుకూడా ఏలాగు 'పరిష్కృతము' లయి పోడయినవో! శేషయ్యగారి వ్యాకరణము ఆయనవ్రాసినట్టు ఉంచక, దిద్దమని ఈ

పెద్దయ్యలకు ఎవరు అధికారమిచ్చినారో! శేషయ్యగారి మతమందు "చేతును" గ్రామ్య మెంతమాత్రమూ కాదు. చిన్నయసూరిగారి శిష్యులు ఎవరో 'చేతురు' గ్రామ్యమని గురూపదేశముపొంది ఇతరుల కావ్యములే కాక ఇతరుల వ్యాకరణములుకూడా దిద్దిడమునకు సాహసించినారు. పర మత ద్వేషము మూర్ఖులచేత ఎట్టిదుష్కృతములనైనా చేయించగలదని దేశ చరిత్ర చెప్పుతున్నది. ఎంతమందిమహాకవులు "చేతును" మొ|| రూపములు వాడి ఉన్నారో చూడండి; వీరిభాష గ్రామ్యభాష అనడానకు ఎవరికైనా నోరువస్తుందా? అకారాదిగా గ్రంథనామముల వరస ఏర్పర్చి, వాటిలోని పద్యములు ఉదాహరిస్తున్నాము. "చేతును" గ్రామ్యమని భయపడేవారు ఇకను సమాధి పొందవచ్చును. చిన్నయ్యసూరి శాసనము యూనివర్సిటీ వారి తెలుగుపండితులున్ను, యూనివర్సిటీ పరీక్షలకు కావలసినపుస్తకములు వ్రాసేవారున్ను, ఆపుస్తకములు చదివేవారున్ను, పరీక్షకులున్ను, మాత్రమే మన్నిస్తున్నారేమోకాని, దేశములో ఇతరు లెవరూ పాటిస్తున్నట్లు కన బడదు. బడులలో అది తప్పనిసరిగాచదువవలసి వచ్చినది గనుక దాని పేరునిల్చినదిగాని లేకుంటే బాలసరస్వతివ్యాకరణమునకున్ను తక్కిన లక్షణ గ్రంథాలకున్ను ఏగతి పట్టినదో ఆగతే దీనికీ పట్టును. కవిత్వము నేర్చుకో నేవారే కొంచెముభాషాలక్షణము తెలుసుకొంటూరు. వారికిప్రయోగమే శరణము. తిరుపతి వెంకటేశ్వరులు ఒకచోట "మాకు చిన్నయ మాటకన్న పెద్దయమాటే ప్రమాణ మన్నారు. గుప్తార్థప్రకాశికాకారులు ఒకచోట "చిన్నయసూరి వాక్యము చిన్న యసూరి వాక్య" మన్నారు. కీ|| శే|| మండ పాక పార్వతీశ్వర శాస్త్రులవారు "సాతాని పండితోత్తముం"డని ఒక చోట అతనిని చెనకినారు. చిన్నయసూరిగారియెడల మాకు గౌరవములేక ఇట్లు వ్రాస్తున్నా మనుకోకూడదు. ఆయన భాషాశుద్ధి మేము ఎరుగక పోలేదు. ఆయన అనుశాసనము మాకు వేదవాక్యము వంటిది కాదన్నమాట

నిజమేకాని, తక్కిన లాక్షణికులయెడల మాకెంతగౌరవముగలదో ఆయన యెడలను కూడా మాకు అంతగౌరవము లేకపోలేదు. తత్త్వవిచారమందు, స్తుతిగానీ, నిందగానీ వాదమునకుచెందుతవిగాని వాదిప్రతివాదులకు చెందవు. మాఉద్దేశము బోధపడనివారికి కొందరికి మామీదకోపంగా ఉంటే, మే మేమిచేయగలము? మా అభిప్రాయము లెస్సగా అందరికీ బోధపడక పోయెనుగదా అని నొచ్చుకొంటాము. సద్భావముతో లౌకిక భాషాభిమానముచేత, దానిని నిందించేవారి మతము మొగమాటము లేకుండా ఖండిస్తున్నాము. మాకున్నప్రమాణములు చూపిస్తున్నాము. మా వాదము తప్పయితే, వదలుకొంటాము. మాకు దురాగ్రహము లేదు.

## చే తు ను

ఉ॥ కొండలు పిండి సేతుమొ పెంగు లెౘరు వోక్కుటఁ ద్రింగి వైతుమో
గండలరాగ జిల్వగమి కానిగలంతుమొ యెల్ల వేలుపుం
బండులఁ బట్టి కాటియల బెట్టుదుమో వెసమిత్తి గుండియల్
సెండుదుమో జగంబునకు జేటొదవింతుమొ చీవిరాయఁడా ॥

అచ్చ. రా. 72 పుట

మ॥ అగువ్యాజస్తుతిని నిందచేస్తుతియు స్తోత్రావాప్తిచే నిందయుం
దగగా బల్కుట నీకు దెల్విగలదే ద్వ్యాహినీ నీవు, స్వ
ర్గగులం జేసువు పాపుల న్మతియునాకై లెస్సయా దూతికా
యొగినేమున్నది యింతకంటె నఖదంతోరుక్షతుల్వొందితో ॥

సటీకాలంకారచంద్రిక. నేలనూతుల శివరామయ్యకృతం, పు 56.

మ॥ పరకాంతారతి దోషమంచు మది సంభావింపఁడో; యన్యులె
వ్వరు గన్నందను నిందసేతు గను భావం బెంతయుం బూనఁడో;
నరుఁ డొక్కింత యొటింగనేని నిలుగు ల్వాటిల్లు నం చెన్నఁడో
పగమా మోదమె కాని యింద్రునకుఁ భావభ్రాంతి లేదేమియుఁ ॥

అహల్యాసంక్రందనవిలాసము. వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యుడు
పు. 529.

గీ॥ అప్పురారాజ శేఖరుఁడక్కుమారు
నధిక శక్తియుతులఁ బహుళాను మోద
మలరఁ గతి సర్వమంగళోజ్జ్వలత దనరఁ
జెలఁగి బుధులెంచ సేనానిఁ జేసె నపుడు॥ ఇందు. పరి. II. 28.

శా॥ ఈరీతిన్ జగముల్ దలంకగను వే యేండ్లార్తుఁడై కూయఁగా
నారక్షోవిభు దైన్యపాటుఁ గని దైత్యశ్రేణి కన్నీరు ము
న్నీరై పాఱఁగ నేమిసేతు మనుచున్ నిర్విణ్ణతం జెంద న
మ్మారీచాదికు లాతనిం గని యసామాన్య ప్రబోధంబునన్॥

ఉ.రా.పుట.85.

చ॥ అతఁడును మారుదారుణశరావళిహావళి కోర్వలేమి నో
నుతనుని మనీష నిటుసోలుచు వ్రాలుచుఁ దూలసేల; నీ
వితరపు జింతఁ దక్కి నుతి కెక్కిన హేలల నోలనాడు మా
నృతముగఁ జేయఁ గామితముఁ దెల్పుము సల్పుము బుల్పు ముచ్చటల్॥

ఉసా. పుట. 481.

చ॥ స్థిరమతి నీకు మేము మును చెక్కుల వ్రాసిన పత్రభాగము
ల్వరుస యురంబున న్గలిగి వచ్చెఁ గదే విపరీత వృత్తి మీ
సరస సప్రసక్తి నని చాయలఁ దాఁగ నాగు నెచ్చెలి
కరకమలా హతి న్నిలుపఁ గన్నియ నెన్నదు ప్రోదఁ జేతునో॥

కవికర్ణ. III, 55.

సగర్భ కంద గీత చంపకము.

నరహరిపాదజానుకగుణాభర జాహ్నవి సుందరాంగి బం
ధురతటీనీలసత్ చరణతోయజ శంకర జాయ గంగ భా
గ్గురు దురితచ్ఛిదాయమల గోపుర సంచర దాపగాఖ్య ము
మ్మఱ హరణీ సమాజనని సన్నుతి జేతుము జక్కజూడుమా॥

కవిజనచ. చం. II, 115.

మ॥ పారుగైనం బగవారితోఁ గెలిమి సంపూర్ణంబుగాఁ జేతురే
నరు లాప్తుల్ గడు దూరదేశమున నున్నన్ గూర్మి వాటింపరే
ధరణిన్ జాతి ఖగంబులుండగ మహాదానాంబుద శ్రేణికిన్
గురు లల్లార్చి నటింపవే శిఖిచయంబు ల్భూధరాగ్రంబులన్॥

కుచేలో. అ. II, 80.

సీ॥ ధరణి వ్యాసు కాళిదాసు మయూరుని మాఘు బిల్హణుల సమంచిత గతి
నుతులు సేతు నెపుడు నతులిత సంస్కృత పటుకవిత్వ గరిమ పట్టుపడగ॥

కృష్ణరాయవిజయము I, 10.

చ॥ వరుఁడిఁక నేమి సౌమ్యుఁడుగ వచ్చె నటంచును నల్గుదాననా
సరస కటాక్ష బాణములఁ జల్లగ నుల్లము విచ్చఁబోద నా
చరణ సమీపభూములకుఁ జయ్యనఁ జేరఁడె యేమి సేసు నుం
దరులకు నాగడింక దయ దప్పిన నేమగు వామలోచనా॥ గంధ.పుట. 11

గీ॥ అనఘ నీపాద మంటిన యట్టిపుణ్యవశముమై నాకు సురలోకవాసమహిమ
దివ్యదేహంబు శాపంబుదీరఁగడయుఁగలిగెఁ బ్రత్యుపకృతి నీకు నెలమిఁ జేతు.

చిత్రభార. V, 40.

ఉ॥ శిష్యుని మేలి బుద్ధి ననుఁ జెందక పోయె స్మృతీతి హాస స
ద్భాష్యము లెన్నియేని సతతంబు గ్రహించియు భక్తిమార్గనై
దుష్యము గానసైతి మదిదొట్టిన మందత లోకు లెల్ల నన్
దూష్యము సేతురన్ భయముతోఁ జరియించితి మీ డెఱుంగమిన్॥

చెన్నబసవ II, 181.

క॥ ధరలో వినర యహింసా పరమోధర్మ యని యంచు ప్రాణి వధను సే
తురె యకట యజ్ఞవిధి యని యరయగ నది యజ్ఞవిధియెయగు చింతింపన్॥

దశా. 345.

ఉ॥ ఎవ్వని వేఁడువాఁడ బరమేశ్వర దుష్టపరిగ్రహంబు నే
నెవ్విధిఁజేతు నెచ్చటికి నేఁగుదు నేపని యాచరింతునే॥

ప్రౌ. పరి III, 35 పుట వ్రాత.

ఉ॥ అంజలి చేతుఁ బద్మజ నిశాంత కరాంత నిరంతర గోల్లుణ
న్మంజుల వల్లకీ మధుర మందిర నినాదసముల్లసద్ధ్వని
వ్యంజక వాణి గుంభన సమంచిత నూతన సృష్టి చాతురీ
రంజిత సత్కవీంద్ర బుధరాజికిఁ దిక్కన సోమయాజికిన్॥

రాజరాజాభి. కవుల 499.

ఉ॥ అంత నరుంధతీరమణు డాదిగ భూసుర కోటి పద్మినీ
కాంతుని వంశ భర్తను జగజ్జన కర్తకు సాధుమార్గ ను
స్వాంతునకున్ రయంబున వివాహము జేతుమటంచు నొక్క సి
ద్ధాంతము జేసి రాజుకు హితంబున దెల్పగ సమ్మతించినన్॥

నిర్వ. విచి. రామా: పుట 146.

క॥ అనరాదు గాక నీవొక మనుజుఁడవా దుర్విదగ్ధ మార్గమె మార్గం
బని విప్రమార్గ ముద్యాపన సేతురె నిన్నువంటి బ్రాహ్మణ కులజుల్॥

నిగం: II, 130.

తే॥ హంసతూలికాతల్పంబునందు మేను సేర్చినప్పుడు నేత్ర రాజీవయుగముఁ
జేరి చుంబించి మోహింపఁ జేతు రనిన నతివ నిద్రయునీవు నేమాదు రొక్కొ॥

నైష: II, 88.

చ॥ పరసతు లెల్ల దల్లులని భావన సేతువు బుద్ధిమంతుడై
గురుజన బాంధవాది ముని గోటుల బ్రోతువు సత్యవృత్తితో
శర ణను వారిగాచుదువు సంగరమందు విరోధిరాజు లం
బొరిగొని వచ్చుచుందుదువు పుట్టిన హేతువు లేమి లక్ష్మణా॥

పట్టాభి రా. పుట. 51, ఆ. 2

సీ॥ పూబోణులారా యీ పాదరిండ్ల చెంతను వసియింతమా దేవ పారిజాత
కుసుమములం గ్రోతమా మా సరుతేంట్లను దోలిమధుపానములం జేయగదలుదామ
పులిన దేశములందు పిలిచిబంతులుం జేరి యానందమయులమై యాడుదామ
కదళికా స్తంభ సంకాశ దేశములందు బుష్పశయ్యలమీఁదఁ బొందుదామ
పరిజనములంది కోత్తామ చలువచప్పరములవిహరించివత్తమా రాజ్యమింత
హంసలనుబట్టుకొందమా యగరుగంధఁపూతలలర విరతి దృప్తిఁబొందుదామ॥
పట్టాభి రా. పుట. 78, అ 3

ఉ॥ నివ్వటిలంగ వాగలం బునీశులఁ జేతురు సర్వలోకులన్.* పద్మపు.

గీ॥ అనుచు నీరీతి గీరాల నాడి మఱచి తరల జేతు గిరికుల శైగ్య మనిన
గర్త్మ సంబంధషష్ఠి కేగతిని వచ్చు, బహువచనమందు నింద్రుండుపలకరింప॥
పా. పుట 29.

ఉ॥ హా యిక నేమి చేతు వెతలన్నియు నా తల వ్రాసె ధాత యా
న్యాయముగా మహేశ్వరుఁడు నగ్నని యైనను దోసమంచు నా
నాయకుపై దయారసమునన్ గనిపింపక పోయె. నయ్యయో,
యీ రొద సమ్మఖుం డరిగి యొంబ్రతుకన్ గని నవ్వరేజనుల్! పా. 48.

సీ॥గీ॥ యెవ్వ రేనేమి నావార కెగ్గుదలచినట్టి మనుజాధములనెల్ల నసురయోని
సంభవుల జేతు నని చక్రధరుడు........ ప్రబోధ V, 53.

క॥ నీవేమి సేతు చెలులే గావింపగ బోలువట్టి కరకగయన్నః
దేవికిని పకల యిట్లనె మా వంకను రాదు మాయమన జేయెరుగన్
ప్రభు పుట 15.

* బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారీప్రయోగము జూపించినారు

ఉ॥ కానుక గట్నమందు నొక కాసును జిక్కదు సుంకసూత్రముల్
మానక కొన్ని బెట్టితిని మాపయి నిల్వయు లేదు వెట్టి యొం
తైనను జేతు నిట్టినను నాఁడి నూరక బెట్ట వేటి క
య్యో! నవసాధ నాదుమొర యుల్లమునం బరికింపు నావుకున్ ॥

బసవ. పుట 190.

క॥ ఓరోరి వంకముక్కున । నూరుపు వెళ్ళదిక నేల యొాడితి నన్నున్
వాగకీవెడెముఁ జేతుర । వీఁగ భవాభక్తి జూడు విన నా వశమే ॥

బసవ. పుట 227.

ఉ॥ అంగడి యంగడిం దిరుగులాడుటకుం బలువిత్తు లిష్టితిం
బొంగుచుఁ గాసు గప్పరకుఁ బోవుచుఁ బెక్కు పదార్థముల్గ్రహిం
పం గొలగాక గోఁతలనుఁ బాల్పడి బిట్టుడుకింప మోఁత లె
ల్లం గను కూఁగాయకవులన్సరకించుచుక సేతురే కవుల్ ॥

బహు. ఆ. I, 11.

క॥ దేవర లేమి వచించిన నా విధమునఁ జేతు నేను నది యొట్లిదొ మీ
భావము యోగ్యాయోగ్య విభావముగా గానవలయు బరహితబుద్ధిన్ ॥

బిల్హా. 3, అ 38.

ఉ॥ మానిని విస్ఫురత్కమల మంజుల పత్రవిశాలలోచ నం
బీన కఠోర తుంగ కుచ భృంగ గరుద్రుచి నీలచక్రస
న్మానిత కోమలాలక సమాన వరాకృతి కామదేవతన్
దాని గురూపదేశము విధంబున ధ్యానము సేతు నాత్మలోన్ ॥

బిల్హా. 3, ఆ 194.

మ॥ కులగోత్రంబులు లేక నిర్మలముగా గూఢీకృతాధిక్య ని
స్తుల మాధుర్య నిరూపదీపకలిత స్థూలైకతా నిర్గుణో
జ్జ్వలులై జన్మములందుఁ బూనుకొని కృష్ణస్వామిరాముండు గొ
ల్లలకుం జేతురు చేయరాని పనులన్ లజ్జించెదం జెప్పఁగన్ ॥

బృందావన విహారము కవుల. 598.

మ|| అరుదై పొల్చు రవిద్యకుం దుహితయై యశ్రద్ధయు న్మందతా
కరదుర్మేధయు వీరలిర్వురు దగఁ క్ష్మాలోకముంజేరి యా
నర సంఘంబుల చిత్తము ల్బలన మందంజేతు రట్లైన య
స్నరక స్థానము పూర్ణమై వెలయు సంతాపంబు నీ కేటికిన్ ||

బ్రహ్మో 179.

గీ|| అకట నాకిట్టి కష్ట దుష్టాన్నభుక్తి
యొసఁగ నేనేమి చేసితినో క్కొ దివిజు
లింతయవినీతి చేసుగ రయుటెఁగి యొటెఁగి
యతిథి యగు నన్నుఁ దగదె పూజితునిఁజేయ || భోజ III, 51.

మ|| తనరారున్నతి సేతు సేతుహిమవద్గంగా ద్రిశైలాంతరా
వనిభాగావిత ప్రసిద్ధ కవివిద్వన్మాగధేంద్రాది యా
చనకానీక నిరంతర ప్రశంసా భాస్వద్దానవిద్యా పరా
యణా భూభృజ్జన పూజ్య మజ్జన గంగామాత్య చూడామణిన్ ||

గనిక I, పుట 3.

కం|| అడిగిన వస్తువు లొరులకుఁ గడువేడుక నొసఁగి యుజ్జగంబులసుం దా
నొందయఁ దగునట్టి శంభునిఁ దనయక హర్షింపఁ సేతుఁ దధ్యము మిాఱన్ ||

గాజ శే. 90.

మ|| ఎవఁడో రక్షకుఁడంచు కుయ్యిడఁగ వచ్చేవంచు నాకాశవా
ణివలె న్నెక్కడనుండి వస్తి మిదిగో నీ నోరు నీవేమి సే
తువు నాకర్మము నాటికూడక నె యుండున్ చేతగాదేని పు
నవలెన్ తప్పునె యింక నే దహహా ! కృష్ణా యాపదోద్ధారకా ||

రామస్త 10.

చ|| చెలువుగ బూర్వసత్కవులు చేసిన కబ్బము లెన్నియుండగా
జెలిమిని నీకృతిన్ గణన సేతుఁ గ సత్కవులందు రేమొకో;
భళి కయికొందు రెట్లనిన బద్మపు దేనియ నాను తుమ్మెదల్
పులిసి హసించకే యితర పుష్ప మరందము గ్రోలవే ||

రాధికా. 2, పుట 7వ పద్యము.

తే॥ రతుల నే నేల దా సమరతుల నేలి
సారసాక్షిరో యిది మారుబేరమనుచు
చిన్ని చిన్నారి వెన్నుడు సేయు చిన్నె
లెన్ని యెన్నని తలపోతు నేమి సేతు ॥

రాధికా. పు 36.

సీ॥ గీ॥ భూమియభివృద్ధి బొందదా పుణ్యమెట్లు
గుంతతము సేతుఁ జేసినగోత్రధరుడు
గినియకూరక యెట్లుండు గినిసె నేని
వలవదని యడ్డుపెట్టనెవ్వారితరము॥ రుక్మాం. II, 48.

గీ॥ ఒక యుపాయంబు గల్పించి యుచితభంగి
నవనినాథుడు గావించు నావృతంబు
మఱచియుండెడు నట్లుగా నెరయఁ జేతు
శమన సంతసమందు విచార ముడిగి॥ రుక్మాం. II, 49.

మ॥ అరయ స్వర్గన సేతు తారకపదవ్యాఖ్యాంతవర్తిం గురున్
స్ఫురదుత్తుంగ బలాతిరేకకలుషీ భూతారి జీవున్ ఘనాం
గిరసాఖ్యాతు బుధౌఘ పూజితపదున్ క్షేమంకరాంచత్తపో
భర సంతోషిత సర్వసూనిధిమణుం వాచస్పతిన్ ఆర్యునిన్ ॥

లంకా. అ. I, 7.

క॥ సరసిజ భవుడన సృష్టియు హరియన దత్పాలనంబు హరుడన తత్సం
హరణముఁ జేతువుశక్తిన్ స్ఫురణమ్ముల బొందునట్టి పురుషత్రయమున్ ॥

వరా 124 (VIa)

ఉ॥ జిహ్వాగ సార్వభౌముఁడు శరీరమరాండుడును బంకజాసన
బ్రహ్మతనూజులం గమల బాంధవులున్ హరి నాద్యు నీశ్వరున్
బ్రహ్మకు జన్మ హేతువుగ బ్రస్తుతిఁ జేతురు గాని కేవల
బ్రహ్మము విశ్వకర్త యని భావమునం దల పోయ కజ్ఞతన్ ॥

వాత్రపతి. వరా.156 (a)

సీ|| గీ|| వనిత మీతండ్రి తమ్ములిచ్చిన ధనంబు
చే ఋణము దీరకే నేమి సేతు ననుచు
జింత పుట్టిన దిపుడు నా చిత్తమందు
దీని కాలోచనం జేమి మీననయన || వేంక. పు 11, ప 175.

ఆ|| తెలవ నేను నోరు దెఱచి కుండఁగాక చొరవ గొనుచు నిల్లుచొరవశంబె
పరవఁ బొమ్మటంట బరువచే నాకు నీయఱవఁగోఁకఁగోనీయఱవఁ జేతు*||
వైజ III, 98.

ఉ|| ఎక్కువ మాటలేల విను మేబహుభాషల దానఁ గాను
నా యక్కఱ చిన్న బుచ్చక ప్రియంబున చేలిన మేలుగానిచో
మక్కువలేని వారిఁ బ్రతి మాలిన నేమి ఫలంబు చూడరా,
గ్రక్కున నింద నీకునయి ప్రాణము లర్పణ సేతు గట్టిగన్ ||
తారాశశాంక. ఆ III, 84.

ఉత్సాహము|| కోమలాంగి నిన్ను నేను కోరినందు కేమి నా
కామితంబు వ్యర్థమాయె కాము బాధ కోర్వ నిం
కేమి సేతు మామకూఁతురిట్టి మాటలాడ నీ
కేమి బోధ గల్గె జెప్పు మింతి దీని దాఁచకన్ || శశా 19.

ఉ|| ఏపు దలిర్ప దైత్యభటు లెల్లరకుం గడు క్రూర బుద్ధులై
యాపద జేయ ధర్మపద మంత యణంగగ జేసి దుష్టశి
క్షాపటిమం జెలంగుచును సజ్జనపాలక మొప్ప ధర్మసం
స్థాపనఁ జేతు కారుణను సారె జనించి ధరాతలంబునన్ || శప 26

ఉ|| ఓవర వైశ్య వంశకలశోదధికల్పలతా లతాంగి నీ
వోవని వారి ముందఱనయో మగనింగడ కాళ్ళఁ ద్రోచి నేఁ
డీ వసు ధేశునింగలయ నెంచితి విట్లు పతివ్రతామణీ
ల్యావులు ప్రత్తురమ్మ తలవంపులు సేతురటమ్మ జాతికిన్ || కుశ 9.

* చింతామణి ముద్రణములో, "జేతు" అని దిద్దినారు.

చ|| పలువుర గొట్టి యొక్కరుని బాలన సేతురు మూర్ఖులొక్కనిన్,

శేష. ఆ 2, పు 27.

గీ|| అస్పృతవాదుల గొండీల యన్యమందిరాన్నభోక్తల మర్యాద నడచువారి
విశ్వసించినవారి ద్రుంచివేయునట్టి ఖలుల జిహ్వాలు గోతురు కాలభటులు.

శేష. ఆ 3, 42,

మ|| వారినుతించి మంచిమతి వాయుజు పుణ్యచరిత్రలన్నియున్
గూరిచి తత్ప్రబంధమునకున్ బతినెవ్వరిఁ జేతునంచు లో
గూరినజాలి నొండొకరిఁ గూడ వచింపక యొక్కనాడు గౌ
రీగమణాలయంబుకడ రేపటివేళ వసించి నిష్ఠతోన్. సమీ ఆ 1, 70.

క|| ఏణాంకధరుని గుధర । ద్రోణు జగన్నాథు గర్మదూరుని నుతగీ
ర్వాణుని హిమాద్రితనయా । ప్రాణేశు మహేశు నేను ప్రస్తుతి సేతున్.

సురా. పు 2.

గీ|| ఏమిసేతు నాథు డింటిలోపల లేఁడు । అతనియాజ్ఞలేక యన్యమైన
పనులకొడబడంగ బాపంబు; పొమ్మన్నఁ । బోఁడు కాముకుండు భూసురుండు.

సురా. పు 19.

క|| ఛీ లెండని పెనుగుదియల । పాలుం గావింతు రొకని బరిఘంబులచే
దో లూడజేతు రొక్కని । కోలల విసరుదురు పాడుగోడని యొకనిన్.

సానం. పు 26, ఆ 2.

సీ|| బటువైన పటుకాల్ల బట్టుదురొక్కని వేమరు చట్రాత వేతురొకని
ఖండివాలంబుల జెండుదురొక్కని కొసరి యందంబుల గోతురొకని

సానం. 26.

సీ|| నామారుగా మీరు వేమారుఁ బ్రోవుఁడీ సఖులార! యీకీరశాబకముల,
నేఁ బెంచినట్లుగా నిచ్చలుఁ బెంచుఁడీ చెలులార! యీలతావళుల నెల్ల,
నే దిద్దుకైవడి నేర్పున దిద్దుఁడీ యనుఁగులార! నెమిళ్లకాట లెపుడు,
నే జేయులాగున నెమ్మదిఁ జేయుఁడీ చెలికత్తెలార! బొమ్మలకుఁ బెండ్లి,

గీ॥ యాత్మ నిఁక మీరు నామీఁద యాసవదలి। సంతసంబున నే నాఁడు సౌధవీథి
నేళి గావింపుచుండుఁడీ లీలమీఱ। బలిమి నిటు సేతు నని వేఱ తెలుప నేల?

సుభ. ఆ 5. 102.

క॥ ఈపురవరమణి చెంగట। నీ పరమేశ్వరునిఁ బ్రతిష్ఠ నెంతయుఁ జేసున్
దాపురము మోక్షలక్ష్మికిఁ। గాఁపుర మభివృద్ధిఁ బొందఁగద మన కనియెన్.

హంస అ1. పు 178

శతముఖంబుల రేఁగి సన్నుతి సేఁతు!　　హరి ద్వి. పు 19, పంక్తి 66.

---

[కూతురిని, కూతురికి; చేసురు, కోసురు అను మొదటి రెండు ప్రసంగములు శ్రీ. రామమూర్తిపంతులుంగారు స్వయంగా రచించి తమ "తెలుగు" పత్రికలో ప్రకటించినవి. తక్కిన ప్రసంగములు కూడా వాటివలెనే సవిస్తరముగా రచించవలెనని వారు ఉద్దేశించినారు గాని ఆ పత్రిక ఆగిపోయినందున వారి ఉద్దేశము నెరవేరినది కాదు. ఇప్పుడు అస్వస్థతచేత వారు స్వయంగా మిగిలిన ప్రసంగములు రచించలేమునను వల్లపడనందున, వారి పెద్దకుమారుడు వెంకట సీతాపతి పంతులుంగారు ఆ పనికి పూనుకొని, ఇరవైయేండ్లక్రిందట తండ్రిగారు సంపాదించి ఉంచిన ప్రయోగములున్ను, జ్ఞాపకములుగా వ్రాసిఉంచిన లఘువ్యాఖ్యలున్ను ఆధారముగా ప్రస్తుతార్థము వ్యక్తపర్చుటకు కావలసిన అవతారికలు రచించి, ప్రయోగములతో కూడా ప్రకటించుటకు పంపినారు.]

తె. వెం. గ. సంపాదకుడు.

## రాజుకు, అందుకు

“నఃకౌ” అని ఆన్ధ్రశబ్ద చింతామణిలో షష్ఠ్యేక వచన ప్రత్యయ ‘కు’ వర్ణమునకు పూర్వము నకారాగమము విధించినారు గనుక, నకారాగమము లేని రాజుకు మొదలయిన రూపములు గ్రామ్యములని కొందరి అభిప్రాయము. కాని, ఇటువంటి రూపములు నన్నయకాలమునుండి నేటివరకున్ను కవులు యథేష్టముగా ప్రయోగించి ఉన్నారు. కూచిమంచి తిమ్మకవిగారు తమ సర్వలక్షణ సారసంగ్రహములో భారతము సభాపర్వము నుండిన్ని, భాస్కర రామాయణము, నైషధము, పారిజాతాపహరణము, కవికర్ణరసాయనమునుండిన్ని ప్రయోగాలు చూపించి, “సప్తమికి నమునందని కద్దు. షష్ఠికిఁ గొందఱు నకార లోపము లేదందురు. అనినను, ‘టాదివిభక్తౌ నిర్ణేత్యేకే’ అన్న శబ్దానుశాసన సూత్రమునకు రాముచేత, రాముకొఱకు, రామువలన, రాముకు, రామునందు అని కలదని వ్యాఖ్యానము వ్రాసిన బాలసరస్వతి వ్రాఁతకును భంగము వచ్చును గనుక, రాముకు అని చెప్పవచ్చును” అని వ్రాసినారు.

సభాపర్వములో తిమ్మకవికి కనబడిన “కౌరవేంద్రుకు” అనే ప్రయోగము ఇప్పుడు అచ్చుప్రతులలో కనబడదు. ఇట్లే భాస్కర రామాయణములో తిమ్మకవికి కనబడిన “ప్రాచేతసుకున్” అనే ప్రయోగము ఇప్పుడు అచ్చుప్రతులలో కనబడదు; గాని అహోబలుడు చూచిన ప్రతిలోను మేము చూచిన ప్రతిలోను ఉన్నది. సీతారామాచార్యులవారు, “కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబు వారి ప్రయోగంబులందక్కఁ దక్కిన మహాకవి ప్రయోగములందుఁ గొన్నిచోట్ల నగాగమంబు చూపట్టదు” అని రాజుకు మొదలయిన రూపములకు సాధుత్వము సాధించినారు. అయితే, వారనుకొన్నట్లు కవిత్రయమువారి గ్రంథాలలో ఇటువంటి ప్రయోగాలు లేక పోలేదు. ‘కౌరవేంద్రుకు’ అనే పాఠము లేదని చెప్పినా ఎఱ్ఱాప్రగడ

ప్రయోగము లున్నవనక తప్పదు. హరివంశం (ఉ. VIII.)లో 'అఖిలము కుణ' (పు. 199) అనిన్ని, వసుదేవుకుణ (పు. 226) అనిన్ని ప్రయోగాలు కలవు. తిక్కన సైతము ఇటువంటి రూపాలు ప్రయోగించినాడు. "పరుస దనంబు గోర్చి" అని కర్ణ. III, 298 లో మూడు వ్రాత ప్రతులందున్నది. అచ్చులో ఈ రూపము కనబడకుండా పాఠము సవరించినారు.

[ఈ పట్టున బ్రా॥ శ్రీ॥ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారి అథర్వణకారికావళీ విమర్శనము, షష్ఠప్రకరణము చదువదగినది.]

సీతారామాచార్యులవారు తమ శబ్దరత్నాకరమందు నగాగమములేని రూపములు తరుచుగా ప్రయోగించినారు. మా. "ఏల. ఉభ. దే. అవ్య. ఎందుకు". అందుకు, ఇందుకు, ఎందుకు రూపములు ఉత్తరాంధ్రకవులు అనేకులు తమ గ్రంథాలలో తరుచుగా ప్రయోగించినారు. ఇవి శంకర విజయములో ముప్పదిసార్లు, వైశ్యపురాణములో వందసార్లు ప్రయుక్తములై ఉన్నవి. ఎందుకు అనే శబ్దమునకు ఏల అనే అర్థము ఉత్తరాంధ్ర కవుల నాటి వాడుకనుబట్టి వచ్చినది. ప్రాచీనాంధ్రములో ఎందుకు, ఎందునకు మొదలయిన రూపాలు లేనేలేవు. ఎందుకు శబ్దార్థము తెలియచేయుటకు ప్రాచీనాంధ్రములో ఏల, దేనికి, దేనికై, ఏమిటికి, దేని నుద్దేశించి–గోరి–వేడి, ఏమి ప్రయోజనంబునకు అనే శబ్దములు ప్రయుక్తములై ఉండేవి. కవిత్రయము ప్రయోగించిన ఎందులకు అనే శబ్దమునకు ఎచ్చోటికి అనేకాని దేనికి అనే అర్థములేదు. శబ్దరత్నాకరములో ఎచ్చోటికి అనే అర్థము నిరూపించుటకు శాంతిపర్వము 3. ఆ. నుండి "ఎందుండి యేమి పనికై యెందుల కేగెదవు" అనే ప్రయోగము చూపించినారు. ఎందులకు అనే శబ్దమునకు దేనికి అనే అర్థముకూడా కలదని చెప్పినారుగాని దానికి సరియైన ప్రయోగము కనబడదు. "వ. ఇదియేమి యెందులకుంబోయెదవు" భార. అర. ౧౫.

అని ప్రయోగము చూపించినారు గాని దీనినిబట్టి వారు చెప్పిన అర్థము సమర్థించుటకు వీలులేదు.

ఎందునకు అనే రూపము ప్రాచీనాంధ్ర గ్రంథాలలో కనబడదు. ఈ రూపము "నఃకా" అనే సూత్రము ననుసరించి, ఇప్పటి గ్రాంథికవాదులు చేసిన కృతకాంధ్రరూపము. ఇటువంటి కృతక రూపములే మీఁదునకు, క్రిందునకు, నెల్లూరునకు, గుంటూరునకు, గుంతకల్లునకు, అయ్యంగారునకు, కృష్ణరాయలునకు మొదలయినవి. ముందుకు అనే శబ్దము ఇప్పుడు లోకములో సుప్రసిద్ధమైనది. ప్రాచీన రూపము ముందటికి. ముందునకు అనే రూపము నేటి వ్యవహారములో లేదు; ఈనాటిపఁకు గల కావ్యాలలోనూ లేదు. ఇప్పుడు వాడుకలో నున్న ముందుకు శబ్దమునకు 'నఃకా' సూత్రము పట్టించి కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రులవంటి మహాపండితులు సంస్కరించి చేసిన కృతకాంధ్ర రూపమిది. చూ. ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము (I.i, 118–121).

నగాగమము లేని రూపములు 'నఃకా" సూత్రమునకు తప్పిఉన్నా మహాకవిప్రయోగాలు ఉన్నవి గనుక, అగ్రాహ్యము లనలేక "ఆగమశాస్త్ర మనిత్యం" అనే పరిభాష సంస్కృత వ్యాకరణములో ప్రసిద్ధమై ఉన్నది గనుక, అదే తెలుగు వ్యాకరణాలలో సైతము శరణమని ప్రౌఢవ్యాకరణములోను బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికలోను సమాధానము చెప్పుకొన్నారు.

అయితే, నగాగమరహిత రూపములకు సాధుత్వము కల్పించిన గుప్తార్థప్రకాశికాకారులు సైతము "నగాగమంబులేనిచోఁ బువర్ణాంత నామ వాచకములమీఁద షష్ఠీవిభక్తి సంబంధం బన్నిల దోషభ్రాంతి కరంబయి శ్రుతి కటువగుఁ గాన నట్టి స్థలంబులందు నగాగమ ప్రయోగము తప్పకయుండుట మేలు. 'సీ. సీతాపుణోర్వ్యక నిటలాక్షుఁడును దనూఫలకంబు చాటునఁ

బాయఁ డెపుడు' కవికర్ణరసాయనము; 'దనుజరిపుకు' ఇట్టిచోట్ల నగాగమ ముండినచో మేలుగా నుండును" అని వ్రాసినారు. సీతారామాచార్యుల వారును తమ ప్రౌఢవ్యాకరణమున ఈ అభిప్రాయమునే తెలియజేసినారు. అయితే, అశ్లీలముగా తోచినప్పుడు ఈ రూపములే కాదు తక్కినవి మరి కొన్ని రూపములు సైతము విడిచిపెట్టవచ్చును. "జంజపూకః, నీమూపు కువలయాక్షి, నక్షింపు కుమారా, అధిపు సమారుఁ జూచి, పందెమొడ్డఁ జూచి పడఁతి నగియె, సంప్రసమొద్ధాణంబు, ఎంపనాకె నానవాక, పాలీక పోసచ్చునే" మొదలయిన శబ్దములుకూడా అశ్లీలములుగానే భావించ వచ్చును. అయితే, ఆడవాళ్లే పసుపూ కుంకం, ఉప్పుకుండ, పప్పుకుండ మొదలయినవి వాడుక చేస్తున్నారు. 'నిప్పులు చెరుగుంటుదా' అనే లోకోక్తి స్త్రీలనోటను పురుషుల [illegible] సూచనగా వినబడుతూ ఉంటుంది. అశ్లీల స్ఫురణ వ్యక్తుల మనోభావములబట్టి ఉంటుంది. పైపుకు శ్రీరంగమాహా త్మ్యమునందు 'సొంపుకు' అని 'పు' పదాదిని యతిస్థానమందున్ను, 'కు' ద్వితీ యాక్షరముగా ప్రాసస్థానమందున్ను ఉంచి ప్రయోగించినాడు.

రాజుకు

సీ॥ అరుదుగా నాభిముఖ్యము నొందు మోముకు

వాలుఁ గన్గవలుదర్కోలు పడఁగ — అని I, 81.

సీ॥ లగ్నవేళకు మంగళస్నానయుతులైన

పెండ్లికుమార్తెకుఁ బెండ్లికొడుకు

కెలమితో — అని I, 98.

బంధురవృత్తము

నీరజకల నడుమ నిలిచిన తెలుపుం

దూకొను వాఁగుకుఁ దండ్రియనన్ — అప్ప.

క॥ కప్పునఁగా నింటిమీఁది కసవునుఁ జేరా   ఆంధ్ర. నానా.

ఉ॥ పేరునుఁ దగ్గ కార్యములు పెక్కువిధంబులు దెల్ప శక్యమే ?
ఆం. భా. I, 19.

గీ॥ పైరునను ముందు పైరుఁగాఁ బార్వతీశ !   ఆం. భా. III, 32.

చ॥ ... ... ... ... జానుద
ఘ్నువుజలమందు నిల్చి యతి గ్రక్కున లోకువు డిగ్గి
ఇందు ప. III, 60.

గీ॥ తెరువు విడుము నాసుత్తర దిక్కుకనియె   ఉ. హ. II, 40.

సీ॥ సంగరంబనిన నుత్సవము కేఁగిన క్రియ
సొలవక చనియెడి సూరులార !   ,, VI, 140.

సీ॥ నీ తలాపుకోర్వక నిటలాక్షుఁ డుమతనూ
ఫలకంబు చాటునఁ బాయఁ డెపుడు   కవి. కర్ణ III, 119.

గీ॥ మూఁకలడుగుచుఁ దుదిఁ బన్ను నాసకైన   కవి. కర్ణ. IV, 95.

చ॥ గురువును బొమ్మ వెట్టితిరి క్రూరవిచారము కీరవారమా   కవిరాజ III.

క॥ కఱవునుఁ దోడావ పంట కలిగిన కాణిక్   నవ I, 101.

ఉ॥ మందును నెక్కినట్టు ఘన మంత్రముఁబోలెఁ బ్రచండమూర్తియై
కిరాతా I, 210.

మ॥ మరువెల్ల స్వైరజాడి మందుకయినన్ మత్స్యంబు లేకుండ
కేయూర III, 161.

చ॥ నడుమనుదింతి చన్నుల తనర్చున ముందఱు కానరాదు మా
కడుగిడుచోటఁ గా ల్దెమలి నంతన కానుకు బందమయ్యెడున్
కుమారసం. నన్నచో VIII, 16.

క॥ కరములను రాహువు దివా
కరుఁ బట్టఁగ నభముకెగయు గతిఁ బోలు పెనఁగెన్
,, XI, 734.

ఉ॥ పాలుపడంగ భర్త పని పాటునకుఁ ద్రిమ్మరువాఁడు బిడ్డకున్ గంధ.

ఉ॥ భైరవుఁ డిచ్చుగాత నశుభంబులు నీల నృపాలు కిప్పుడున్ చం.వి.

సీ॥ కమలాకరములు పాళెము పట్టుకొసఁగెద

నెంచుఁడీ నాదెస యంచలార చంద్రభా.

రగడ॥ వనరి పెక్కడని వాదుకుఁ జేరకు చమ. I, 109.

ఉ॥ ... ... ... పత్రికచూపి రాజునం

గొంచక దీని కేడుమణుఁగుల్ గొనివచ్చితి మంచు నిచ్చినన్

జైమి VIII, 57.

క॥ మేలని మీరందరు రా

చూలిని వారించిరేని చూలుకు మోసం నిర్వ. వి. రా.

ఉ॥ గోలయు సాదువైన యొక కోమటికిన్ నిషధేంద్రు బచ్చునన్

నైష. VI, 115.

సీ॥ నిండిన చెఱువును నెరయవాటము గాఁగ

నలువులు దీర్చిన యట్లు కాన పంచత I, 70.

క॥ భవుకైనం దరమె పోర బలిమిని నాతోన్ పట్టాభిరా. III, 98.

క॥ ప్ర। తాపంబునఁ బురముకరుగఁ దలఁపఁగ నంతన్

పద్మ. ఉ. ఖ I, 116.

ఉ॥ రా। మూళివయాళివాపుగము నూడుకుఁబట్టు మహోగ్రసింహముల్

పాండు. II, 175.

సీ॥ వాజులఁ గొనివచ్చి వరరథంబునఁ బూన్పఁ జిచ్చుకు నాఁకలి చిచ్చుల్పైటై

పాలపర్తి సోమేశ్వరుఁడు నన్నె. కుమా. టీక I, 160.

ఉ॥ వంతుకు వచ్చు సత్యగరువంబికఁ జెల్లదటంచు మానినీ పారి I, 82.

చ॥ రా। చిలుకను వాదుకుం గవితఁ జెప్పఁగఁ దా నియమించి

ప్రభా. II, 92.

సీ|| అతులిత దాన ధారాంభోధి రాజుకుఁ
జంద్రికావళి ఫేన సమితిగాఁగ ప్రభా. I, 104.

చ|| ... ... ... ... వృత్రుఁకోడిపో
యినసురరాజు చందమున నెక్కడనో యణఁగుండె నంతటన్
ప్రబో.

క|| ఒడలెల్లను భక్తిమహిమ దోఁగి బసవునన్ బసవ.

క|| తనయొడలాఁకలిఁగొన్న యెలుకకు కోగిరముగ ,,

గీ|| ఎదుర కాదు రేల కోపించె నిందుధరుఁడు భీమే. IV, 12.

చ|| పొరిం బొరినల కామధేనువునకుఁ బుట్టిన క్రేపులతోయ మోయనన్
భోజ. II, 48.

ఉ|| తోయధిరాజునుం బొడమి తోయజవాసినితోడఁ బుట్టి రాధికా.

క|| వాగీంద్రునికైన నల్ల వాసవుకైనన్ రామ స్త.

క|| మిట్టకు చెట్టునకుఁ గాదను
నట్టి విధము సేయవలవ దవనీనాథా! రుక్మా.

గీ|| కొంత తడవుకు బ్రహ్మ పీ డొ్కలుప వరాహ.

మంజుభాషిణి|| దినరాజవంశమునకుఁ దెల్పి క్రమ్మరన్ వాసి. రా.

చ|| వనరుహనాభునకుద్భవుఁడు వజ్రికి జీవుఁడు విప్ర. I, 36.

ఉ|| సిగ్గునకు సిగ్గులేదిటులు చేసిన పిమ్మట నుండవచ్చునే?
విజయవి II, 30.

గీ|| తోటపని పాటుకోదిగి నాతోఁ బ్రయాసపడుచు నున్నది
వైజ. II, 126.

సీ|| తన యుక్తివైఖరి తన యుక్తివైఖరి
మహి నహీనప్రౌఢి మంతుకెక్క శశాంక I. 54.

క॥ పెద్దలు బలకృష్ణులు మన
కిద్దరికిని బెండ్లిసేతు రింతకులోఁగా
నిద్దరు గలిసియు ధరలో
బద్దుకు రానేల వినుము పార్థతనూజా   శశి.

క॥ లోక హితంబుకుఁ దెలిపిన
నీకేల హితంబుకాదు నిర్మల హృదయుల్
లోకోపకార హితవుకు
చేకొందురు కీర్తి జగతి చెన్నలరారన్   శివ.

సీ॥ రాగిమీసంబు లభ్రభకిరాతు మొగముకుఁ
బగడంపులతలుడుపధపయోధి   శైవశ్రు.

చ॥ మెకముల క్రొత్తనెత్తురుల మించునునుం బులిగోరుతాగు సొం
పుకుఁ బసఁజాపువాఁడికొన ముక్కున   శ్రీగంగ. (భైరవునిది) I, 252.

క॥ పలుదెసలఁ బాఱుమనసుకు
గలుగునె వైరాగ్యమెంత కాలముకైనన్?   V, 1207.

క॥ ఈలీలనతఁడు ధరణీ
పాలన మొనరించి రాజ్యపదముకుఁదనయుం
జాలించి యితర సుఖములఁ
దేలియుఁ దపమాచరించి త్రిదివముకేఁగెన్॥   V, 1276.

క॥ పోలుపగు నేనుఁగుకు నూలుత్రోగులయట్లు   శృం. శా. II, 196.

క॥ ఖేచరులను మిగుల పాడవుకే చనవలసెన్   సమీ .V, 17.

సీ॥ నలువంక నీళ్ళవానకు నిల్వగాలేక
భూతాళి మరువుకుఁ బోవువారు   సానం.

గీ॥ సందియము లేదొకింతయు నిందుకిపుడు
వచ్చు సారంగధరుఁడు   సారం.

ఉ|| తమ్ములమీఁదఁ బెట్టుకొని నెదన్ ద్విజరాజునుఁ జేయిసాఁచెదన్

సుదానందపరిణయము.

గీ|| అశ్వినేయులతో సైన నతఁడువాడు

కదిరి హంస. I, 233.

క|| స్వజనుఁడవు జనార్దనుఁడవు జనివఖిలమునకున్ హరి. ఉ. VIII, 199.

ఉ|| కానుకరాని కమ్మలు వీధినా.

ఉ|| ... ... ... నాత్మసం

వేదముకై మునులుం(కు)ల పవిత్రుని గౌతముబోల నేర్తురే||

ప్రభా. I, 123.

## అందుకు, ఇందుకు

గీ|| అందుకేమాయెఁగాని లేవమ్మయనుచు కువ. III, 132.

ఆ|| అందు కేమి సేయువార మిచట చెపుమ కృష్ణ. III, 99.

క|| పోనిమ్మని రోనిందుకుఁ

బూనిన ఫలమబ్బెఁజాలం బోపొమ్మనినన్ చంద్రభా. I, 144.

గీ|| ప్రాచి తెలిచాయయనుమంచు ప్రబలభాస్వ

దంశుక విహీనఁగానఁదా నందుకోర్వఁ

జాలకూన్చిన నవకేలి చక్రమనఁగ

నపుడు తొలికెంపుతో సారసారివోలిచె|| చంద్రికా. IV, 102.

క|| హరిమీకుఁ బ్రాణబంధువు

గురువున్ సచివుండు రక్షకుఁడునై మిమ్మె

వ్వరుఁ గూర్మి నెల్లవేళల

నరయుచు రక్షించినందుకా యిది తలఁపన్? చిత్రభా. VI, 78.

క|| మగువా నీకిఁక వగవఁ
దగవా? వినుమిందుకుఁ విధానము మున్నే — చంపూరా. IV, 79.

చ|| గొనబుటొయారి వెన్నెలులు కొప్పున కందుటచూచి వానికిఁ
ననలకుఁ దామురాఁగలుగు నంటుగణించి నిజోపమాన రో
జన మొనఁగూర్ప వేఁడుటయుఁ జంపక మిందుకు సమ్మతింపమిఁ
కనకలతాంతవాటిపయిఁ గంటువహింపఁగఁబోలుఁ దుమ్మెదల్||
,, III, 73.

ఉ|| ఎందుకుఁబల్కవే తరుణి యేమిటి కల్గితివే మిటారి దశా. VIII, 235.

సీ|| ఈ రెండు నెటేఁగి యెయ్యది యెందుక్వాంబు
నరసింహ (హరిభట్టు) I, 124.

క|| గురుఁడందుకు మోదింపుచు
మురువగు నొక శుభముహూర్తమున నుత్సవమున్ — నిర్వ. వి. రా.

చ|| మనసిటులైన వెన్క నభిమానము లెందుకు — పట్టాభి.

గీ|| ఎందుకటుల సత్కీర్తి నిలిపెద నవనియందు — రాజశే. I, 114.

ఉ|| మంచిది; అందుకేమియని మంత్రుల మోములుచూచి నవ్వి — II, 55.

ఉ|| నిందలుసేయ నెందుకు తృణీకరమెందుకు మించవాడగా
నెందుకు కాదుకూడదన నెందుకు మోడివహించియుండగా
నెందుకు మందు మంత్రమన నెందుకు దైన్యముతోడ వేడుకో
వెందుకు సేవచింతునొక యిక్కువ యించుక వింటిరేనియున్||
రాధా. III, 62.

గీ|| ప్రాజ్ఞుఁడభిమాని యిందుకు ద్రవ్యశక్తి — రామస్త.

క|| కోరిక యిది నమ్మినందుకున్ ఫలమధిపా — రామా. V, 288.

ఉ|| చెచ్చెర నేఁగుదెంచి మరి చింతనజేసెద విందుకాత్మలో — రుక్మాం.

మ॥ అశుభధ్వంసక మీదుకుఁ దగునుపాఖ్యానంబు నేఁ జెప్పెదన్

వరాహ. IX, 8.

మ॥ గురువిద్వేషికి విప్రయోగిహరణ క్రూరుండు మారుండు దాఁ
బరమాప్తుండు దదీయ భృత్యులు దలంపంగాంచన స్తేయత
త్పరగంధానిలముల్ మహామధుప ముల్లన్నెమ్ముత్రిఁగాంచెంబిక
స్వరముం బంచమశబ్దమిందుకు సుదృగ్జాలంబు రాఁ జెల్లునే?

వసు. III, 124.

క॥ కావున నిందుప పశుపతిపూజనమని

విజయ. III, 66.

గీ॥ చామ ! నీవంటి సుందరి బ్రహ్మదేవుఁ
డంత్యజాతిని బుట్టించి యడవియందుఁ
గాచినటువంటి వెన్నెలశరణిఁ జేసె
నిందుకా విధి కేమందు నిందువదన.

వేం. శ్వ. మా.

మ॥ పరపాకంబులఁ గోరి యెందుకయినన్ బ్రాహ్మలి కృత్యార్థమై

శశాంక. I, 20.

క॥ కోవిదులెందుకు? మీరే
భావజు మోహాబ్ధిఁ బడని పంకజనేత్రుల్

శశి.

చ॥ తెలియఁగఁ జూచినాఁడ నిది దేవర ! సందియమిందు కేమియున్

సారం. III, 63.

ఉ॥ చక్కనివారిలో మిగులఁ జక్కనిదానవటంచు వేడ్కతోఁ
జొక్కుచుఁ జెప్పినందులకుఁ జూచినయందును నా మనోరథం
బక్కట సిద్ధమయ్యె ఫలమబ్బెను హా ! యిటులుండవద్దె? ఓ
చక్కరబొమ్మ యంచు సరసప్రతిభాషల నిచ్చగింపుచున్॥

హంస. I, 84.

## అందఱికి

చిన్నయసూరిగారు తమ బాలవ్యాకరణములో సంజ్ఞా పరిచ్ఛేద ద్వితీయ సూత్రము క్రింద వ్రాసిన వాక్యములో "కొందఱమతంబున" అని అకారాంత శకటరేఫ సహితముగా 'కొందఱు' శబ్దము ప్రయోగించినారు గాని, ఇకారాంత శకటరేఫసహితముగా 'కొందఱి' శబ్దము ప్రయోగించ లేదు; గనుక, అందఱి, ఎందఱి, కొందఱి రూపములు అసాధువులు అని కొందరి అభిప్రాయము. అందఱు శబ్ద నిష్పత్తి విచిత్రముగా నిరూపించి "అందఱి మతము, కొందఱి మతము' ఇత్యాది ఇకారాంత శకటరేఫ సహిత రూపంబులు గ్రామ్యంబులు. 'అందఱమతము, కొందఱమతము' అనవలయును" అని సుప్రార్థ ప్రకాశికాకారులు అను శాసనము చేసినారు. అందుకు వారికిగల ప్రమాణము పైని చెప్పిన చిన్నయసూరిగారి వాక్యము లోని ప్రయోగమే కాని ఏదైనా ఒక వ్యాకరణసూత్రముగాని యతిస్థాన మునుబట్టి అకారాంత శకటరేఫ సహితరూపమే అని చెప్పదగిన కవి ప్రయోగము కాదు.

కొందఱు మతంబున అని చెప్పిన చిన్నయసూరిగారే తమ నీతిచంద్రిక లోను హిందూధర్మశాస్త్రము లోను అందఱి, 'అందఱికి మొదలయిన రూపములు వాడినారు. గనుక చిన్నయ సూరిగారికి రెండు రూపములున్ను ఇష్టములే అని చెప్పవలెను.

చిన్నయసూరిగారి బాలవ్యాకరణములోని లోపములను పూర్తిచేయుటకు ఉద్దేశించి రచించిన ప్రౌఢవ్యాకరణములో ఆచార్యులవారయినా అందఱకు అనే ఉండవలెను అందఱికి అని ఉండకూడదు అని అను శాసించి ఉండలేదు. శబ్దపరిచ్ఛేదము ౬౦ వ సూత్రములో "ద్వితీయాదులందసంయుక్త రవర్ణకంబునత్వంబున కిత్వంబు తలచుగనగు: ఉ. వారికి, వీరికి, వేరికి, ఒకరికి, వాండ్రకు, వీండ్రకు, వేండ్రకు, ఒకండ్రకు

ము. తలచుగ ననుటచే ఇరువుర నిత్యాదులయం దిత్వంబు కలుగదు." అని ఉన్నది. ఇక్కడ 'ఇత్యాదు' లనుటచే అందఱి, కొందఱి మొదలయిన రూపములు అనిష్టములని ఊహించుటకు అవకాశము కలుగుతున్నది.

వైకృత చంద్రికలో "శసాదావిద్వా. అందఱచేత, అందఱిచేత" అని ఉన్నది.

అందఱు, ఇందఱు, ఎందఱు వంటివే ఇద్దఱు, ఇరువురు, నల్వురు, ఏవురు మొదలయిన శబ్దములు. ఈ శబ్దములలోని రేఫ ఇకార సహితము గాను అకార సహితముగాను ఉన్నట్లు ప్రయోగాలవల్ల స్పష్టము. భారతము-ఆదిపర్వములో 'అందఱిని' (V.152), 'ఇద్దఱిలో' (VIII. 110) అని అచ్చుప్రతిలో కనబడుతున్నది.

ఇంకా అనేక స్థలములందు కొన్ని సంవత్సరముల క్రిందటివరకు అచ్చు పడుతూ ఉండిన గ్రంథాలలో అందఱికి కొందఱికి, మొదలయిన రూపములు కనబడుతూ ఉండేవి. భాగవతములోని "కొందఱికి తెలుఁగు... నే నందఱి మెప్పింతు" అనే పద్యములో ఇకార సహిత శకటరేఫమే కనబడుతూ ఉండేది.

'అందఱికి' సాధువో 'అందఱకు' సాధువో నిశ్చయించుటకు దకార అకార కకారములు యతిస్థానమందున్న పద్యములు కనబడినదాకా తగవు తప్పదు. అట్టి ప్రయోగములు రెండుకనబడినవి.

క. అనుటయు నాతం డందఱ
కును మెలపునఁ జెప్పవగలఁ గుందుచు

భార. శల్య 1,12.

క. దనుజుఁ బరిమార్చి యందఱి
కిని దానవ బాధ దీర్చి కృతకృత్యుండై

పినవీరభద్రుని శకుంతలాపరిణయము.

ఈ ప్రయోగములనుబట్టి ఇందఱు, అందఱు, కొందఱు మొదలయిన శబ్దములకు ద్వితీయాది విభక్తులందు రెండు రూపములున్ను వచ్చును; రెండు రూపములున్ను సాధువులే అని స్పష్టమైనది.

అరవములో ఎనక్కు, ఉనక్కు, నమక్కు, ఉమక్కు, అవర్లుక్కు, మనిదనుక్కు, రామనుక్కు, అనిన్ని కన్నడములో నెనగె, నినగె, నమగె, నిమగె, రామనిగె, అనిన్ని తెలుగులో నాకు, నీకు, మాకు, మీకు, రామునికి రామునకు అనిన్ని రూపము లేర్పడినవి. రామునకు రామునికి అని మాండలిక భేదములచే రెండు రూపము లేర్పడినవి. అలాగుననే మాండలిక భేదములచే అందఱకు, అందఱికి అని రెండేసి రూపములు సిద్ధించును. ఇప్పుడు ఆంధ్రలోకములో అందఱికీ ఇందఱికి, కొందఱికి మొదలయిన రూపములే సర్వసామాన్యముగా వాడుకలో ఉన్నవి. ఇవి వైకృత చంద్రికలోని అనుశాసనముబట్టి చూచినా, పినవీరభద్రుని ప్రయోగమునుబట్టి చూచినా శబ్దముల సాదృశ్యమునుబట్టి చూచినా లోకవ్యవహారమునుబట్టి చూచినా సాధువు లనక తప్పదు.

సీ॥ ప్రాసముల్ ముమ్మాఱు వాసవులాఱ్గురిపైను గాకీకతి

అప్పక. IV, 293.

క॥ సురపతులాఱ్గురిపై భాస్కరు లిరువురుగూడ IV, 339.

శా॥ అయ్యా! ఎక్కడినుండి యొక్కడికి లీలాగ్రంబు విచ్చేసినా
రియ్యజ్ఞాననమీఁద నింత దయ మీ కెట్లయ్యె? నేఁ డెద్దినేఁ
జెయఁ గాఁగల యూడిగంబని ప్రశంసింపన్ ఫణిగ్రామణీ
శయ్యాస్థుండు ప్రసన్నమూర్తియయి రాజన్యున్ విలోకింపుచున్॥

కా శ. 1,58.

క॥ కొడుకుల నందఱి నిల్లడ యిడి పరలోకమున కరిగె—భార. ఆది. V,152.

క॥ సుందరి! మా యిద్దఱిలో నం దెవ్వరి వలఁతుఁ? ఆది. VII,110.

చ॥ ... ... ... ఇందఱి కి వ్విధంబునఁ
బరఁగ నవజ్ఞ సేయుటిది పాడియె? ధర్మువె? ధర్మనందనా! సభా. II,12.

శా॥ కల్పింతుఁ భోజనమిష్ట మందఱికిఁ దృప్తంబొందఁగాఁ బెట్టెదన్॥
భీమ. II, 123.

క॥ దనుజుఁ బరిమార్చి యందఱికని మానవబాధ మాన్చి కృతకృత్యుండై
మునిజనములు హర్షింపఁగ జననాయకసూనుఁ డపుడు శంఖంబొత్తెన్॥
శకుంత.

## చాలా, కూడా

చాలా, కూడా, అయినా మొదలయినవి "గ్రామ్యదీర్ఘాలు"-ఒక మాటలో ఒకవర్ణము లోపించినప్పుడు ఆ లోపమునకు ప్రతివిధానముగా దానికి పూర్వమందున్న అచ్చు దీర్ఘమవుతుంది. దీనిలో వైపరీత్యమేమీ లేదు. అన్ని భాషలలోనూ ఈ విధానమున్నది. వేదములలో దుర్-డభ= దూడభ; దుర్-ధి=దూఢి. సంస్కృతమందు రాజన్-ప్ర. వి. రాజా; శర్మన్-శర్మా; గుణిన్-గుణీ; పితృ-పితర్-పితా. ప్రాకృతాది భాషలలో తరుచుగా ఈ మార్పు కనబడుతుంది. సం. వింశతిః— వీసతి-వీస్-బీస్; సం-కర్తుమ్, పాలీ-కాతుం; సం. సర్షప-పాలీ సాసప; సం. కర్కటిక. హిం. కాకరీ; సం. ముద్గర-మోగర; సం. సింహ. ప్రా. సీహ; హింది ఆగే, ఆగ్, పీఛే, కామ్, హాత్, ఆర్ మొదలయిన మాటలలోని దీర్ఘాలు ఇట్టివే. మన ఉచ్చారణలో జాగా, బారా, తేరా, పంజా, తనిక్, డేరా, హర్కారా మొదలయిన మాటల అంత్యదీర్ఘాలు హకారము లోపించడమువల్ల దానికి ప్రతివిధానముగా వచ్చినవే. తెలుగులోని కున్న - కూన, గిచ్చు-గీచు, చివుకు-చీకు, చెయ్యి-చేయి, నుయ్యి-నూయి, నెయ్యి-నేయి, తిన్నె-తీనె; తెమ్మ-తేమ నివులు-నీలు, తనుకు-తాఁకు, బొడ్డసరము-బోడసరము, మువ్వురు-మూవురు,

మొగము-మోము, ముహూర్తము-మూర్తము, సహాయము-సాయము, మహా-మా, సగము-సాము, ఒకర్తు-ఓర్తు, ఒకటి-ఓటి, తలయంపి-తలాపి, లొంగు-లోఁగు, తలగడ-తలాడ మొదలయినవి ఇట్టివే.

'అవ' అనే వర్ణములు తెలుగు భాషలో 'ఆ' గా మారుతవి. ఉన్నవాడు=ఉన్నాఁడు; మయలవాడు=మాయలాడు; వలవదు=వలాదు. మఱవకు=మఱాకు; పదవాలు=పదాలు; కడవసము=కడాసము; అమావాస్య=అమవస, ఆమాస. (ఇది స్త్రీలభాషలో 'ఉఆఁస' గామారి, కావ్యములందు ప్రయుక్తమయినది)

[ఇంగ్లీషు, ఫ్రెంచి మొదలయిన భాషలలో కూడా ఇట్లు వర్ణలోపములు, వర్ణాగమములు, వర్ణవ్యత్యయములు కలుగుచున్నవి. సం. 'యజ్ఞోపవీతము' మారి నేటివాడుకలో 'జందెము' అయినట్లు లాటిను భాషలోని Consuetudinem, buticularius అనేమాటలు మారి, custom, butler అయి నేడు వాడుకలో నున్నవి.]

ఇట్లు, వకారమునకు పూర్వమందున్న ఇకారము దీర్ఘమవుచుంది. తివియు-తీయు, ఉక్కివుఁడు-ఉక్కీఁడు. సంస్కృతశబ్దములు 'అవ' వర్ణములు ప్రాకృతమందు 'ఓ' వర్ణముగా మారుతవి. అవసర-ఓసర-తెలుగు ఓసరిల్లు; భాగవతులు - భాగోతులు. ప్రాచీనాంధ్రమందు పూరణార్థకముగా సంఖ్యావాచకములకు 'అగు' చేర్చేవారు. ఇది అగు ధాతువుయొక్క తద్ధర్మార్థక విశేషణరూపము - ఉ - రెండగు నింద్రుఁడు. ఈరూపము ఆదిపర్వమందు మేము చూపించినప్పుడు అసాధువని వాదించిన మ.రా.శ్రీ జయంతి రామయ్యపంతులుగారు శాసనములందు అది కనబడినప్పుడు అది ప్రాచీనాంధ్రభాషలోనిదనిన్ని అర్వాచీనాంధ్రభాషలో 'అగు,' = 'అవు' మారి 'అవ' అయినదనిన్ని అంగీకరించి తమ సత్యప్రియత్వము ప్రకటించినారు. రానురాను ఈ 'అవ' కూడా మారి 'ఓ' అయినది. రెండగు=రెండవు=

రెండవ=రెండో—ఈశబ్దములు శిష్టవ్యవహారమందుండుటవల్ల ఆయాకాలము లందు కవులు వాడినారు. నిరంకుశోపాఖ్యానములో (చూ. ఆ 2-ప. 102)

క. 'వాఁడా నాలుగుగడియలు, నేఁడాదిగఁగడపిసూర్యుఁడేఁగఁ దూర్పునకుఁ
రాఁడోయని తలపోయఁగ మూఁడో జాముయ్యె నంతమోద మెలర్పన్॥'

అని రుద్రకవి నాలుగోపాదములో 'మూఁడో' అని ప్రయోగించినాడు. ఈ పాఠము చెన్నపట్టణము ఓరియంటల్ లైబ్రరీలో నున్న తాటాకుల పుస్తకమందున్నది. ఆ పుస్తకమే ఆధారముగా ప్రతి వ్రాయించి, కీర్తిశేషులయిన పోలవరం జమీందారు కృష్ణారావుగారు తమ ఆస్థానకవులు శతావధానులు బ్ర. శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచేత పరిష్కరింపించి అచ్చు వేయించినారు. అచ్చుపుస్తకములో 'మూఁడవ' అని ఉన్నది. ఇట్టి మార్పు జరిగినదని చెన్నపట్నమందే బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నాతో చెప్పి, తాటాకుల పుస్తకములోని పాఠము చూపించినారు. మేము కాకినాడ వెళ్ళినప్పుడు జమీందారుగారియెదుటనే బ్ర. శ్రీ. దివాకర్ల తిరుపతిశాస్త్రిగారితో ఈ పాఠమును గురించి మాట్లాడగా, తాము బుద్ధిపూర్వకముగానే ఆపాఠము మార్చినట్లు ఒప్పుకొన్నారు, మార్చినందుకు నొచ్చుకొన్నారు కూడాను. అట్లు గ్రంథము మార్చడము అయుక్తమని జమీందారుగారు వారిని మందలించి, మార్కండేయ పురాణము పరిష్కరించిన బ్ర. శ్రీ. ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు ఇట్టి మార్పులు అనేకము చేసినారని దూషించి, ఆవిషయము ప్రమాణపత్రములో నిరూపించి సంతకము చేసి మాకిచ్చినారు. పూర్వకవుల కావ్యాలు పండితుల పరిష్కరణము వల్ల ఏలాగున పాడయినవో లోకమునకు తెలియజేయుటకోసము ఈవిషయము ఇక్కడ చెప్పవలసివచ్చినది.

'అవు' 'అవ' మారి 'ఓ' అయినట్లే, 'ఇయ' మారి 'ఏ' అయినది.

ఉ. కన్నియ-కన్నె, లంజియ-లంజె, ఆటకత్తియ-ఆటకత్తె మొ॥ 'దీర్ఘాలు', కొన్ని వర్గములుగా విభజించవచ్చును.

(a) చాలా=చాలన్ (చాలు ధాతువు + అన్ తుమున్నాద్యర్థకము), కూడా=కూడన్ (కూడు ధాతువు + అన్ తుమున్నాద్యర్థకము), ఇట్లే మళ్ళా, తనుకా (=దనుకా), తాఁకా (=దాఁకా), ఆరా మొదలయినవి మొట్ట మొదట తుమున్నాద్యర్థకములయినా, రానురాను నిపాతసంజ్ఞల వంటివి అయినందున ధాతువుల అర్థము మరుగుపడ్డది. 'చాలా' అంటే అధికముగా అని అర్థము; 'చాలన్' అంటే సరిపోవన్, చాలునట్లు అని భావము. 'కూడా, సముచ్చయార్థకము; నేనుకూడా అంటే నేనున్ను అని అర్థము; కూడన్ అంటే, 'కూడుటకు' 'కూడేటట్లు' అని భావము. వాఁడు ధనము కూడ(న్) బెట్టెను అనే వాక్యములో 'కూడ (న్)' అనే శబ్దము 'కూడా'గా మారదు. దానిని తాక (న్) బోకు' అనే వాక్యములో 'తాఁకు' ధాతువుయొక్క అర్థమున్నది. 'ఆచెట్టుదాకా రా'; "(అంతదాకా) అందాకా పో" అనే వాక్యాలలో ఆ అర్థము మరుగుపడ్డది. చెప్పకుండన్=చెప్పకుండా, నేను రాకుండా మొ॥ ఈలాటివే.

ఇట్లే చేసినన్, అయినన్ అనే చేదాద్యర్థకములు; 'చేసినా', 'అయినా' గామారి చేసినప్పటికిన్ని అయినప్పటికిన్ని అనే అర్థములను బోధిస్తున్నవి.

సముచ్చయార్థకములయిన ఉన్, ఇన్, మొ॥ వాటిలోని నకారము లోపించడమువల్ల అపూర్వమందున్న అచ్చులు దీర్ఘములయినవి. అందరున్, అందరూ; అన్నియున్, అన్నిన్, అన్నీ; ఏమియున్, ఏమిన్, ఏమీ; ఎమిన్నీ; చెప్పియున్, చెప్పిన్, చెప్పీ, చెప్పిన్నీ; అదియున్, అదిన్, అదీ, అదిన్నీ; మరియున్, మరిన్, మరిన్నీ; అంతయున్, అంతా, అంతాను; ఎల్లయున్, ఎల్లా, ఎల్లాను; తలా.

[కన్నడ జైమిని భారతమందు 'కూడా' ప్రయుక్తము; ఇవుమూరూ= 'ఇవిమూడూ', ఇవుగళెల్లా='ఇవిఎల్లా', అవనూ ఇవనూ='వాడూ వీడూ' ఇట్లు దీర్ఘములు నేటి కన్నడభాషలో సాధువులే.]

తృతీయాద్యర్థక ప్రత్యయము అన్ లోని నకారములోపించి అకారము దీర్ఘమయినది. చేతా వాతా కానిది; ఇంటా వంటా లేనిది; గోళ్ళా గోకళ్ళా; ఏంటక, ఏటూ; ఇంకక, ఇంకా మొదలయినవి. ఇటువంటి మాటలేకాక, రూపాంతరములు దీర్ఘాలుంగలవి వందలకొలదిగా తెలుగు కావ్యములలో ఉన్నవి; వాటిలో కొన్ని నిఘంటులోని కెక్కినవి. గుడారము, గూడారము; కిలారి, కీలారి; కుయి, కూయి; నరాజి, నారాజి, నారాజీ; కీచకిచ, కిచాకిచ; గోణము, గోణాము; కుందెలు, కుందేలు; తంగెడు, తంగేడు; బంగరు, బంగారు; అకట, అకటా; గరిడి, గరిడీ; నెఱ, నెఱా; లకోరి, లకోరీ.

దీర్ఘాలుంగల అన్యదేశ్యాలు అనేకము తెలుగులో చేరినవి; వాటికి బహువచన రూపములు, దీర్ఘాలకు పరముగా లువర్ణము చేర్చడముచేతనే నిష్పన్నమవుతున్నవి. ఉ॥ బస్తా-బస్తాలు; కిటికీ-కిటికీలు; లాడూ-లాడూలు. వేదమందున్ను సంస్కృతమందున్ను దీర్ఘాలు రూపాంతరములందున్నవి. అద్య=అద్యా (చూ. అద్యా చ మృడయ), అత్ర= అత్రా (చూ. దేవం దేవత్రా). చకార, చకర; ఉవాచ, ఉవచ; రవః, రావః; ఇట్టివి వేలకొలదిగా ఉన్నవి. శిష్టవ్యవహారమందున్న దీర్ఘాలు "గ్రామ్యదీర్ఘాలు" అని పరిహాసము చేయడము అవివేకము; తమ్ము తాము నిందించుకొనుటే అవుతుంది. "కొండావారు", "పురాణపండావారు" అని లోకులు అందరూ వాడుతున్నప్పుడు, ఎవరో ఒకరు పండితులు మా యింటిపేరు "కొండవారు", "పురాణపండవారు" అంటే చెల్లదు. ఏకావారు, మేకావారు; ఈగావారు, తురగావారు; పుచ్చావారు, మచ్చావారు; కాజావారు,

రాజావారు; తోటావారు, కోటావారు; గోడావారు, బోడావారు; కొండావారు, బండావారు; పురిపండావారు, ధనపండావారు; తాతావారు, కవుతావారు; వరదావారు; గద్దేవారు; వేపావారు, గంపావారు; బొబ్బావారు, రెబ్బావారు, దోమావారు, తమ్మావారు; బయ్యావారు, బుర్రావారు; చల్లావారు, మూలావారు; కళావారు, శిష్టావారు; ప్రవావారు, మువ్వావారు; వాసావారు, విస్సావారు ఉన్నారు. ఇట్లే పేళ్ళలో దీర్ఘాలున్నవి. ఎర్రాప్రగడ, మల్లాప్రగడ, యల్లాసోమ్యుల, తల్లావజ్ఝుల, రామారావు, కృష్ణారావు, లింగారెడ్డి, వేమారెడ్డి, శివాజీ, తిమ్మాజీ, బ్రహ్మాజీ, మహాత్మాగాంధిజీ మొదలయినవి.

ఇవి అన్నీ "గ్రామ్యదీర్ఘా"లని వాదించేవారు, దీర్ఘాలు తొలగించి హ్రస్వాలు వాడవలెను. ఇకను కవుల ప్రయోగములు చూడండి.

## చాలా, ఇంకా, అయినా

శా॥ బాలా! నిన్ను మదీయజీవముగ నే భావింతు నెల్లప్పుడున్
జాలా నేఁ గలుగంగ నెంతపనికిన్ సంతాపమున్ బొందఁగా
నేలా సిగ్గున గుట్టుఁజేసి హృదయం బింకిట్లు చింతించుటల్
మేలాదాఁపక తెల్పు నీతలఁపు నెమ్మిం బూని కావించెదన్॥
అని. II, 88.

శా॥ చాలాగయ్యముచేసి చిక్కిన మదస్తంబేరమస్వామిపై
అప్ప. IV, 320.

క॥ జాలారి జాతి పడతిన్ గాలారి ముదంబుగదుఁగ గైకొనె ననుచున్
మేలారని లోకుల నం జాలా రసికత్వమబ్బె సర్వేశునకున్॥ గౌరీ.

చౌపదములు.

సతతభక్తియుత సన్మునిజాలా
కృతనుతులనుః రాగిలు పృథుశీలా
కృతయుగసంగనను స్వకృతమయిలీలా
క్షితి వృషగిరి యనజెలఁగును జాలా॥ ప్రబం.

క॥ నీలా శ్రీభూదేవులు హేలాగతితోడ వెంట నేతెంచుటకై
చాలా వేడిన హరి మీ రేలా వలదనిరొ మర్మమీయక యంతన్॥

మృత్యు.

సీ॥ నే నిద్రపోవుదాకా నిద్రఁబోవదే పని చెప్పనోయని పాయకుండు

వైజ. II, 126.

ఉ॥ యాగము నేఁక్రియన్ జరుగు నేలజనించితి భూమిమీఁద నిం
కాగలకార్య మేమి? పట్టాభి.

ఉ॥ మానసవేగవాహములు మత్తగజంబుల వెన్నియున్నవిం
కా నొక కొన్నిగూర్పవలె ప్రబో.

శా॥ ఈరీతిన్ గొనియాడు నారదుని దా నీక్షించినన్ ప్రేమ నిం
కారావోయి వరంబు వేఁడుమను రామస్త.

క॥ ఈడకు వచ్చిన కాదని యాడకునుంబోక మనము హాయిగనెచటన్
కూడా నుండుదుమో యని రాధా.

క॥ అనాఁటి వినోదము లైనన్నా కలనైన దెన్న నాకలుగునో నో
యానారీ పరిరంభం బేనాటికినైన వచ్చు నిది హరి యనుమీ. దశా.

ఉ॥ ఈ కరుణాకటాక్ష మొకయించుక నాపయి నిల్పియున్న చో
నేకడ మేలుగాక వగ పేటికిఁ గల్గెదు దానవేంద్ర! రాయి
నా కలదొక్క విన్నపము నాకు సురాధిప! దశా.

క॥ ఐనా నేనటువలెఁగా నే ననుకోరాదు ,, 78.

శా॥ ఔరెండా యిటువంటి ఛాందసములె నైన్నా గలావిందుసన్॥ ,,100.

క॥ భావమునఁ దలఁచు వర్ధము నీవె చెప్పితివి తిరుగ నే వది చెప్పం
గావలెనా పని లేదయినా వినుమొక లేప యది ఘనంబా నీసక॥

పార్వ.

ఉ॥ తామసమర్త్యకోటికిఁ బ్రధాన శిరోమణి యెంతవారినై
నా మదిలెక్కఁబెట్టక ధనంబులగూరిచి సానం.

శా॥ ఓశీతాచలకన్యకారమణ నా యుద్యోగమింకేరికై
నా శీఘ్రంబున నిచ్చి పంపుమతి సన్మానుండవై

ముక్తీశ్వర శతకము. జ. రామయ్యగారు.

క॥ చాలాలాభము గోరిన కేల గలదికూడ వెచ్చగించక వలయున్ ,,

## రెండో, మూఁడో

క॥ వాఁడా నాలుగు గడియలు నేఁడాదిగఁగడిపి సూర్యుఁడిఁకదూర్పునకున్
రాఁడోయని తలపోఁయగ మూఁడో జామయ్యెనంత మోదమెలర్పన్॥

నిగంటు. II,102.

గీ॥ పుట్టలో వెల్గుచుండఁగా భూతలమునఁ
దప్పకిరువది యెనిమిదోద్వాపరాంత
మందుఁ గలియుగ ముదయించె నపుడు చోళ
రాజు భువినేలు చుండె ధర్మంబు మెఱయ.

కేం. శ్వ. మా. 102.

సీ॥ అంటంగఁ గడలెల్ల నారరేఖలుగీసి క్రిందిపందొమ్మిదోఛందమునకు.

అప్పక. IV, చక్రబంధము

క॥ తోలందొల్లఁ గలయునప్పుడు చెలువుఁడు తేగంబెకరఁగుఁజెలువకురెండో కలయికయందునుఁ గరఁగును. కామకళానిధి II.

## నేనా, తలా

గీ॥ చదివి యతఁడందఱకు నిట్లు సరిదిపెట్టు
నది తలాయొక మద్దెడు నారగించి పరమ. IV, 236.

ఉ॥ అందఱకున్ దలాయొకటి స్వార్థము గల్గుటదోఁపఁబల్కె

ప్రభా. V, 88.

క॥ కాననివాడద్దము చేబూనినిగతి దీక్షకొక్క పురుషుఁడు పూజల్
నేనాగా నొనరించినసానీలగళుండు మెచ్చునా యొందైనన్॥ ప్రభు.

క॥ ఏలానేనామాటలు బాలా నీమీఁద నాదు ప్రాణము విడుతున్

బసవ.

రగడ.

ఈత నీటులోనఁజాటు యినుము సాటికత్తె నొకతె
లోతుగానఁబోయి నేన లోగి నానయొత్తె నొకతె రా. వి. III, 121.

## ఉండిన్; మఱిన్; ఏమిన్, ఏమి; అంతా

క॥ అనుజులకు నడ్డపడి యే
మిని జేయఁగ నీవుఁజూచి మెచ్చితిగా కి
వును సాదురేఁ గనేనిన్
విను తలపాలమునకాని నిలువదు సుమ్మా॥ భార. ఉద్యో. II, 13.

క॥ తనకై కాదేమది పి
ల్లను గోరుట వినుము దాఁ బ్రళయ మొందనయే
నని వారని యుద్యోగం — శల్య. I, 58.

క॥ వినునమ్మయి నిర్దేశం
బున నవ్వాగ్దేవి మూర్ఛవోయిన నట్లే
మిని బలుకకుండి — అశ్వ. II, 21.

శా॥ తల్లిందండ్రియు నన్నుఁగానని మనస్తాపంబునం బొక్కఁగా
మనుచ. III, 98.

మ॥ స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్తంబుగ దంతర్యామివిన్ నీవ — II, 75.

ఉ॥ తండ్రులకెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ నీవు మా
తండ్రివి తల్లివిం బతివి దైవమవున్ సఖివిన్ గురుండవున్
భాగవ. I, 252.

తరలము. నదనఁ గ్రోధవశాఖ్యయున్ సురసాఖ్యయున్ సురభిన్ మునిన్
మొదలుగా — VI, 256.

శా॥ వాలింగీలియు వాయుపుత్త్రిసరియే — నిర్వచ. VII, 99.

శా॥ ఏమిన్ జేయక యున్నఁ గ్రొవ్వి యిట నీ వేతెంచితే

మ॥ చండిక యంతర్హితయైన మామయు మఱందిన్ నిద్రమేల్కాంచు
జైమిని. VIII, 116.

ఉ॥ అప్పలుంకేమి సేయునొకో యా జగదంబ యిఁకన్ వినుందదిన్
జెప్పెదనంచు — కళా. IV, 50.

మ॥ జనముల్ మెచ్చఁగ మున్ రచించితినుదంచద్వ్యాఖరింగారుడం
బును శ్రీరాఘవ పాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మతిన్
దెనుఁగుం గబ్బము లెన్ని యేని — ప్రభా. I, 6.

ఉ॥ ఇంటికి నడ్డమాఁక యొక యింతయులేక చరించువానిచే
నంటినఁ గందుగెందళికులంగమునంగలవాని మిక్కిలిన్
గంటికి నించువాని పాండు. III, 61.

మ॥ విను మున్ శౌరికినోడి సంగమ మరుద్విద్వేషి యెచ్చోటికో
చని వెండిం జనుదెంచి V, 21.

అంతా

శా॥ అంతా సంశయమే శరీరఘటనం బంతా విచారంబె లో
నంతా దుఃఖపరంపరార్జితమె మేనంతా భయభ్రాంతమే
యంతా నాంతశరీర శోషణమె దుర్వ్యాపారమే దేహికిన్
చింతన్నిన్నుఁదలంచి పొందరు నరుల్ శ్రీ కాళహస్తీశ్వరా॥ శ్రీకాళ.

శా॥ నానాదానవితానముల్ గొనఁ బరాన్నప్రీతుఁడై నిత్యక
ర్మానుష్ఠానముమాని శేవగళు లన్యాయార్జిత ద్రవ్యసం
తానుండై పరమార్థమైన సెలవింతాలేక పడ్డప్పుడి
చ్చేనీచుండదది పోవ దుఃఖపడ దానిట్లయ్యె వేయేటికిన్॥ సానంద.

## వల్దు, వద్దు; కొల్ది, కొద్ది; కల్దు, కద్దు; మొల్క, మొక్క; వల్చు

వలదు, కొలఁది, కలదు, మొలక, వలచు మొదలయిన శబ్దములలో మధ్యాక్షరమందున్న అచ్చు అకారము గనుక లోపించ కూడదనిన్ని, అట్లు లోపింపగా ఏర్పడ్డ రూపములు అసాధువులనిన్ని కొందరి మతము. అయితే అనేక శబ్దములలో మధ్యాక్షరమందున్న అచ్చు-ఉకార ఇకారమే కాక అకారమైనా-లోపింపగా ఏర్పడ్డరూపములు నన్నయ కాలమునుండి నేటి వరకు కావ్యములలో తరుచుగా నకబడుతున్నవి.

వలచు నుండి ఏర్పడ్డ 'వల్చు' రూపము నన్నయ తిక్కనలే వాడినారు: (చూ. ఆది III, 39; శాంతి III, 348).

మహాకవి ప్రయోగాలు విమర్శించక అప్పకవి—

"చ. కొలఁదిగ మున్ను చెప్పెఁ జలికొండ నృసింహుఁడు వెల్లయంచు నీ
వల నగసాలరుద్ర పసువాఁడును మొల్కలటంచుఁగూరిచెం,
దెలియక కొందఱిట్లువికృతిం బదపద్యమునన్ లకారరే
ఫల తలపై యకారమును బాపుదురార్యులు నవ్వ నట్లుగన్" అని

ఆక్షేపించినాడు. ఈ పద్యములోని విషయమే కొంచెము భిన్నముగా ఆంధ్రకవుల చరిత్రము (పు. 212) లో ఉన్నది. కంసాలి భద్రయ్య తాను రచించిన సరసజనమనోరంజనము కృష్ణదేవరాయలవారి ఆస్థానములో చదివినప్పుడు "ఎన్నఁడు నేరిచెన్" అనే పద్యములో 'మొల్కలు' అనే ప్రయోగమునకు రామకృష్ణకవి ఆక్షేపించినాడట! ఈ కథ నమ్మదగినదిగా లేదు. తక్కిన విషయము లెట్లున్నా 'మొల్క' ప్రయోగమునకు రామకృష్ణ కవి ఆక్షేపించి ఉండడము అసందర్భము. ఎందుచేతనంటే, పాండురంగ మాహాత్మ్యములో ఈ రామకృష్ణకవి 'మొల్క' రూపము III, 104; IV, 231; V, 128 లోను 'మొక్క' రూపము III, 179 లోను, 'మొలక రూపము III, 191 లోను; 'మొల్వదు' V, 193 లోను 'మొలచు' V, 191 లోను ప్రయోగించినాడు.

చిన్నయసూరి తన బాల వ్యాకరణములో "అచ్ఛికంబులంబద మధ్యంబుల నలదరల యత్వంబునకు లోపంబు బహుళంబుగనగు" నని ప్రకీర్ణ పరిచ్ఛేదమందు 17 వ సూత్రము చెప్పి, దాని తర్వాతి సూత్రములో "లాఁతి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానం

బడియెడి" అని వ్రాసినాడు. అందు కుదాహరణముగా ఇచ్చిన రూపము అలో అత్వమునకు లోపము పొలఁతి, పొల్తిలో కనబరచినాడు. అయితే ఈ శబ్దము పొలంఁతిగాని పొలఁతి కాదు. అందు చేతనే కాబోలు బాల వ్యాకరణ గుప్తార్థ ప్రకాశికలో ఈ ఉదాహరణమునకు మారుగా ఉంగరము-ఉంగ్రము ఉదాహరించినారు. ఉదాహరణ మేదైనా పదమధ్య వర్ణముపైనున్న అత్వమునకు లోపము గ్రాహ్యమైనది.

శబ్దరత్నాకరములో అత్వమునకు లోపము రాగా ఏర్పడిన శబ్దములు అనేకముగా కనబడుతున్నవి. అందులో ప్రమాణముతో ఉన్న శబ్దములు కొన్ని ఎత్తి కనబర్చుతున్నాము.

అల్వరించు. ద్వి. ప్రే. అలవరించు యొక్క రూపాంతరము

"సీ. వ్రేళులు గఱవంగ వెరవల్వరించిరో

నోరఁ జీతులు గ్రుక్కి నోల్గునాఁడ" నిర్వ. ౧.ఆ.

ఉర్లఁబడు. ద్వి. ఉరలఁబడు (స్వార్థమున బడు)

"తరులుర్లంబడి పెల్లగిల్లి పడు." చంద్రా. ౧. ఆ.

తర్లు. దే. అ. క్రి. ప్రయాణమగు. తరలు యొక్క రూపాంతరము.

"ఇటఁ దర్లి పోఁగదే" భాగ. ౯, స్కం.

తల్గు. దే. అ. క్రి. తలఁగు యొక్క రూపాంతరము.

తొలఁగించుటకు.—"ప్రభుత్వ మెలర్పఁగఁ దాల్మి

యూఁది దుస్తరతర మానసవ్యథలు తల్గుము."

భార. అర. ౬. ఆ. వి. తలంగు యొక్క రూపాంతరము.

తల్చు. దే. స. క్రి. తలఁచు యొక్క రూపాంతరము.

తద్భాషణములు చిత్తమునఁ దల్చుచుండుటచేని"

భాగ. ౪. స్కం

నుల్కు. దే. వి. నులక యొక్క రూపాంతరము.

"భద్రగజేంద్రము నుల్కుత్రాళ్లచే..." భో. ౪. ఆ.

బల్గము. వై. వి. బలఁగము యొక్క రూపాంతరము.

"సీ. నిజకుమారులైన నిండుబల్గము లైన
విడుతురు లోభంబు విడువలేక" శివ. ఉ. ౨. ఆ.

బొండ్లము. దే. వి. బొండలముయొక్క రూపాంతరము.

"అరుణంపు బొండ్లముల" ఆము. ౧. ఆ.

సోర్ణగండ్లు. దే. వి. బ. సోరణగండ్లుయొక్క రూపాంతరము.

"ఎ. గీ. తెల్లవాఱుచున్నది, బయలల్లార్చుచు
సోర్ణగండ్లయందుఁ జొచ్చిమడిసి..." భార. ఉద్యో. ౨. ఆ.

ఇటువంటి శబ్దాలు ఇంకా అనేకముగా శబ్దరత్నాకరములో ఉన్నవి. కొట్నము, ఎడ్ద, పొడ్మ, అద్రచు, తల్గడ, దొర్లు నడుమంత్రము మొదలైన శబ్దాలు ఇటువంటివే.

వల్దు, వద్దు—ఈ రూపములు సరిగా పైనిచెప్పిన రూపములవంటివి కావు. వీటి మొదటిరూపము వలవదు. ఇది ఎట్లు నన్నయ ప్రయోగించి నాడో చూడండి: "అనిన వంతకుండిట్లనియె. అయ్యా మీ యానతిచ్చినట్ల మసలవలవదు. తక్షకుండను దుష్టోరగంబు సేసిన విఘ్నంబున వంత మసల వలసె" ఆది. I, 117. ఇక్కడ మసలవలసె అనగా జాగుచేయవలసి వచ్చినది అనిన్ని, మసలవలవదు అనగా జాగుచేయవలసినదికాదు అనిన్ని అర్థము. 'వలవదు' అనే శబ్దము క్రమముగా 'వలాదు', 'వలదు', 'వల్దు' 'వద్దు' గా మారినది. 'వలాదు' అనే రూపమునకు ప్రయోగము కనబడదు; గాని ఈ రూపము ఏర్పడకుండా 'వలదు' అనే రూపము ఏర్పడదని చెప్ప వచ్చును. 'వలదు' అనుటకు చూ. సారంగ. ౧ ఆ. "అక్కట ముద్దు లాడవలదా వలదా యిటువంటి భాగ్యముల్." "వల్దు" అనుటకు (చూ.

కేయూర. 314); (రుక్మాం. 63, 65, 72). 'వద్దు' అనే రూపము ఉత్త రాంధ్రకవులు అనేకులు వాడియున్నారు.

వలదునుండి వల్దు, వద్దు రూపము లేర్పడినట్లే కలదునుండి కల్దు, కద్దు రూపము లేర్పడినవి. వీటికిన్ని ఉత్తరాంధ్ర కావ్యములలో ప్రయోగము లనేకముగా ఉన్నవి. అయితే ఈ మూడురూపాలలోను మొదటి రెండింటి కిని గల అర్థములలో రెండు పోయినవి. ఆమె బుద్ధికలదు-కల్దు; ఆమె ఈ పని చేయఁగలదు-గల్దు. ఈ వాక్యములలో కద్దు ప్రయోగించుటకు వల్లకాదు. ఆమెకు బుద్ధికలదు-కల్దు. ఇక్కడమాత్రము కలదు, కల్దుతో పాటు కద్దుకూడా ప్రయోగించవచ్చును. అనగా 'కద్దు'కు 'ఉన్నది' అనే అర్థముమాత్రమే నిల్చినది.

కొల్ది, కొద్ది—వీటి మొదటిరూపము 'కొలంది'. దీనికి పరిమితి, శక్యము అనే అర్థములు రెండుకలవు. చూ. శబ్దరత్నాకరము "వ. ఇప్పుడు రాజకులంబులు కొలందికి మిగిలి నాకు భరియింపం గొలందిగాకయున్నయవి" హరి. పూ. 2 ఆ. ఈ అర్థములలో పరిమితి అనే అర్థములోమాత్రమే కొల్ది, కొద్ది లోకవ్యవహారమందున్ను గ్రంథములందున్ను ప్రయుక్తములై ఉన్నవి. రానురాను కొద్దిరూపమునకు అల్పము అనే అర్థము వచ్చినది. ఈ అర్థమందుకూడా ఈ రూపము కవులు ప్రయోగించినారు.

శబ్దరత్నాకరములో 'కొల్ది', 'కొద్ది' రూపములు చేర్చుకొన్నారు. చూ. శ. ర. "కొల్ది. దే. వి. విణ. కొలఁది యొక్క రూపాంతరము. "నెవ్వడిఁ జేకొద్దిగఁ జీని" నీలా. 3. ఆ. "కొద్ది. దే. వి. కొలఁది యొక్క రూపాంతరము."

ద్వి. కొద్దిగా ముత్తెంపు కోనల బ్రాఁగెంపు
మద్దికాయల డాలు మలయఁ జెక్కిళ్ల రామ. బాల. కాం.
(ఈరూపము ప్రాచీన కవుల ప్రయోగములందు కనఁబడ లేదు.)

పెనిని బట్టి కొద్ది రూపము ప్రాచీన కవుల ప్రయోగములందు కనబడక పోయినా, ద్విపద రామాయణము రచియించిన రంగనాథుని కాలము నుండి అనగా ఏడువందల సంవత్సరములనుండి గ్రంథస్థమై ఉన్నదని నిశ్చయముగా చెప్పవచ్చును. ఈ రూపము శబ్దరత్నాకరమందే కాక సాంబ నిఘంటు, వేంకటేశ్వరుని ఆంధ్రనిఘంటు, ఆంధ్రభాషార్ణవము, లక్ష్మీనారాయణీయము మొదలయిన నిఘంటువులలో కనబడుతున్నది. ఉత్తరాంధ్ర కవులలో అనేకులు తమ కావ్యములలో ఇంపుగా ప్రయోగించినారు. అద్ది, కొద్ది యని ప్రాసయతులతో అచ్చ తెలుగు రామాయణము మొదలైన గ్రంథములలో దిద్ది సవరించుటకు వీలు లేని స్థలము లందు ప్రయోగము లున్నవి. హంసవింశతిలో "చెక్కులు ముద్దు పెట్టినా। తెలి మొనపంటి కొద్ది కసిదీఱ జాలుగ్గన నొక్కి..." అని ఇంపుగా ప్రయుక్తమై ఉన్నది. ఆధునికులు కూడా ఈ రూపము యథేష్టముగా వాడినారు. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రిలవారు సైతము ఈ రూపము పదహారుసార్లు తమ కథాసరిత్సాగరములో వాడినవారే. అయినా, ఈ రూపము అసాధువని కొబోలు పండవ కూర్పులో ఆ గ్రంథమందు ఈ రూపములు కనబడకుండా సవరించుకొన్నారు. ఈ రూపము నిఘంటువులందున్ను, గ్రంథములందున్ను, శిష్టజనవ్యవహారమందున్ను కనబడుతూ ఉన్నా బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలవారు తమ వజ్రాయుధము (1. i. పు. 7.) లో "పరిమాణార్థమైన కొలఁదికి కొద్దియగు - గ్రామ్య వ్యాకరణము" అని ఎగతాళి చేయుటకు సాహసించినారు.

## వల్దు, వద్దు

ఉ॥ మారవిరోధి యప్పుడు కుమారిక దెచ్చిన పాలకోర దా
కోరికతోడ నెత్తికొని కుత్తుకబంటిగఁ గ్రోల బాల చె
న్నారఁగఁ గాంచి పిన్నవని యారడిఁబెట్టితి విట్లు నన్ను మా
వారికిఁ జెప్పుదుఁ మరువవద్దిది యంతటఁ బోదు మీఁదటన్॥

బసవ పు. III, పు. 105.

శా॥ పంచాబ్దంబులవాఁడు తండ్రినగు నా పక్షంబు నిందించి య
త్క్రంచిత్స్థితియులేక విష్ణుసహితుం గీర్తించుచున్నాఁడు వ
ల్దంచుం జెప్పిన మానఁడంగమునఁ బుత్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీని వధించి రండు దనుజుల్ మీమీపటుత్వంబులన్॥

భాగవ. VII, 187.

ఉ॥ బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్య సం
శీలుఁడు వీఁడవధ్యుఁడని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్రవా
చాలత నందఱుం దివిజ శత్రుఁడు వల్దనఁడయ్యె భూవరా!

VII, 191

ఉ॥ ఈ। చాయఁ జలింపవద్దు పదచాలుననుం జెలియోర్తు రామాభ్యు. I, 197.

చ॥ తలఁచిన నిద్రరాదు చలి దార్కొను మోసలఁ బేర నెవ్వనిం
బిలచిన గుండె జల్లుమనుఁ బేర్చు మనఃపరితాప వేదనల్
నిలిచినచోట నిల్వధృతి నెక్కొన దక్కట! రంగరంగ! తా
వలచిన యింతిఁ బాయువగ వద్దు సుమీ పగవాని కేనియుఁ.

వై. III, 115.

వనమయూరము|| పెద్దలకు దండములు పెట్టఁడెల్లెడలన్
వద్దనఁడు విప్రధనవారములు వాఁడున్
బుద్ధిచెడి యింటికడఁ బోరలిఁడు వీఁడున్
గద్దరితనంబుఁగల కష్టమతి వాఁడున్. సానం. IV, 61.

ఉ|| చక్కనివారిలో మిగులఁ జక్కనిదానవటంచు వేడ్కతోఁ
జొక్కుచుఁ జెప్పిరందులకుఁ జూచినయందుకు నా మనోరథం
బక్కట సిద్ధమయ్యె ఫలమబ్బెను హా యిటులుండ వద్దయో
చక్కెర బొమ్మయంచు సగస ప్రతిభాషల నిచ్చగింపుచున్||
హంస. I, 84.

కొద్ది

ఉ|| కొద్దిగ నున్న సెన్నడుము కూఁకటికందక ఫాలపట్టికన్||
అని. II, 21.

గీ|| పరిపరియనంగఁ జిందఱ వందఱయన
నలరుచుండును గణశోరమగుచుఁ బాట
పాటయనఁ గొద్దికొద్దియన్మాట చెలఁగు
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ|| ఆంధ్రభా. III, 67.

క|| కొద్దిమెకాలకుఁ బోదా పెద్దపులిం గటిచి చంపు బిడుగువలెను దై
నుద్దవిడి దుమికి యిది మా గద్దతి జాగిలము దీనిఁ గను గొనుము నృపా||
కవిరాజమ. పు. 32.

ఉ|| ప్రొద్దునలేచి గుంటలకుఁ బోయి మొగంబులఁ బ్రామివచ్చి మే
ల్సద్దులు పుల్లనీరులును జాలఁగ ద్రావి పొగాకు వీడెముల్
కొద్దిగఁ జీని లోన బలుగోఁచులు పైఁబురిచుట్లు నొప్పఁగా
బద్దులతోఁ జరింతు రరవల్ పురవీధుల భేదమున్నగన్||
చెన్నపురీవి. 4.

మ॥ కడిమింజిల్క పిసాళిజక్కి నెదురక్కం జివ్వనందోవి బ
ల్వేడవింటన్ సునువాఁడి పూములుకులోలింగూర్చి బిట్టార్చి నె
వ్వడిఁ జేకొల్దిగఁ దీసి డాసి మరుఁ డవ్వాల్గంటి చన్దోయి నె
న్నఁడు చక్కన్ గుఱిచేసి యేసె నదరంటంగాఁడిమై సోలగన్॥

నీలా. III,13.

ద్వి॥ వట్టిమాటల చెడువాఁడుగాఁడతఁడు
ఘట్టి సుజ్ఞాని చిక్కఁడు మాయలకును
వారివారల కొల్ది వసుధఁ జెరించు
నీరు కొల్దిని నుండు నీరజంబట్లు॥ ప్రభులిం. ద్వి. 8.

ఉ॥ కోరిచకోర దంపతులు గుంపులు గుంపులు కూడి గంతులన్
జేరిన చంద్రికారసముఁ జేకొని మారొకని పొట్టకొద్దిగాఁ
బారణచేసి ... ...

మొల్లరా. అయో. 17.

చ॥ కృతిగల వీరరాఘవ కవీంద్ర సుతుండవు కొద్దివాఁడవే?

కామకళానిధి. 6.

ద్వి. కొద్దిగా ముత్తెంపుఁ గొనలఁ బ్రాఁగెంపు
మద్దికాయల డాలు మలయఁ జెక్కిళ్ళు॥ రా. బాలకా.

ఉ॥ ముద్దియ మోహ మెంతటిదొ మోహన రూపవిలాస వింటియే
సుద్దుల నొల్లఁ డెవ్వరినిఁ జూడఁగ నొల్లదు సొమ్ములొల్లదే
ప్రొద్దువిడెంబు చల్వలును భోజన మొల్లదు నిద్రయొల్ల దీ
కొద్దికి పచ్చవిల్తుని లకోరుల నేమగుచున్నదో కదా॥ శశాం. IV, 106.

## కలదు, కల్దు, కద్దు

గీ|| పెద్దయేనుఁగు కాలంతగద్దు||
చంద్రవి. I, 80.

చ|| తనుతర గోమవల్లరికిఁ దా నిరువంకలఁగద్దులేదు నా
ననయము సూక్ష్మసూక్ష్మముగ నజ్జలజానను కౌనుమించి లో
చనముల కింపొనర్పఁ గడు సన్నపుఁ గారుమెఱుంగువీఁగె చ
క్కని నిడుపేఁటవాటిక నగాఁ బడునట్లతియత్నదృశ్యమై||
ప్రభా. II, పు. 82.

క|| ముద్దుగఁ దిలకము నుదుటను దిద్దయు దిద్దకను లేచి త్రిపురాంతకునిన్
ముద్దియయోర్తు గనుంగొనె కద్దో లేదనెడు నడుము కంపింపగన్||
శివరహస్యఖండము. III, 54.

సీ|| పురహరుఁ డెఱుఁగంగ నఱకాల నొకకన్ను తనకుఁగద్దన్న గౌతమునికంటె.
సానం. II, పు. 38.

మ|| కనవా తమ్ముల నేడనాడ జనిగో కల్గుంగదా నందివ
ర్ధనముల్ గల్గు శివాలయంబునను గద్దా కాంచనుల్ గద్దు క
ల్గినవారిండ్లనటంచుఁ బల్కు జిగిమేల్మిన్ గుప్పలీలా వధూ
జనముల్ వేడుకకాండ్రతో నెలయు వాచాప్రౌఢిఁ గీర్తింపుమన్||
సానం. III, పు. 46.

క|| అద్దంపు మెఱుఁగు చెక్కులుం దిద్దిన రాయంచనడలు తియ్యనిమోవిన్
ముద్దులుగుల్కు మొగంబును కద్దో లేదనెడు నడుము గలదా చెలికిన్||
సురా. పు. 8.

సీ|| నీకు నామీఁదాన నిజముగాఁ జెప్పుమా నాయందుఁ బ్రేమకద్దా యటంచు||
హంస. II, 169.

## వల్ల

ఇది 'వలన' నుండి ఏర్పడిన రూపము. భారతాది ప్రాచీన గ్రంథము లలో 'వలన' రూపమే కాని 'వల్ల' రూపము కనబడదు. అయితే, ప్రాచీన భాషలో ఉన్న వలను శబ్దము విశేష్యము. ఉదా: "కలహంస పలికిన పలుకులు గణియించు వడి దాని పోయిన వలన చూచు". దీనికి బహువచన రూపము 'వలంకులు'. ఇది ఔపవిభక్తికము గనుక, 'వలనన్' 'వలనికి' మొదలయిన ప్రథమేతర రూపములున్నవి. 'వలనన్' హేత్వర్థకముగా వాడుటచేత క్రమక్రమముగా పంచమీవిభక్తి ప్రత్యయమైనది "జనిసఉచ్యతే వలనః" అని ఆన్ధ్రశబ్ద చింతామణిలో ఉన్నది. అయితే, ఉత్తరాంధ్రములో బమ్మెరపోతరాజుగారి కాలమునకు (చూ. భాగ. v. ii. 161 'పుణ్యపాపముల శేషములవల్ల). 'వలన' 'వల్న' గాను, 'వల్న' 'వల్ల' గాను వాడుకలోనికి వచ్చిఉండును. శిష్టజన వ్యవహారము ననుసరించి, పోతన పెద్దనాది మహాకవులు నిరాతంకముగా 'వల్ల'రూపము వాడినారు.

నూతన శబ్దము నూత్న అయినట్లే వలన శబ్దము వల్న అయినది. అనేక శబ్దములలో మధ్యాక్షరమందున్న అచ్చు— ఉకార ఇకారములే కాక అకారముకూడా— లోపించినది. ఈ విషయము కల్దు, కద్దు మొదలయిన రూపములక్రింద విస్తరించి చర్చించినాము. స్వరతత్త్వమును బట్టి ఉచ్చారణలో లకార నకారములు కలిసి పోవుటచేత 'పాలకొలను', 'పాలకొల్ను' 'పాలకొల్లు' గాను, 'నెలనాళ్లు', 'నెల్నాళ్లు' నెల్లాళ్లు' గాను మారి నట్లే, 'వలన' 'వల్న' 'వల్ల' గా మారినది.

'వల్ల' రూపము పోతనాది మహాకవులు తమ గ్రంథాలలో ప్రయోగించిఉన్నా అప్పకవి, చిన్నయసూరి మాత్రము పంచమీవిభక్తి ప్రత్యయము లలో 'వల్ల' పేర్కొనలేదు. అయితే, చిన్నయసూరి తాను రచించిన

మిత్రలాభమునందు 5వ పేరాలో 'లోభమువల్ల' అనిన్నీ, 6వ పేరాలో 'ఈమాటలవల్ల' అనిన్నీ ప్రయోగించి ఉండిన్నీ తాను రచించిన వ్యాకరణములో దీనికి అనుశాసనము చేసి ఉండలేదు. చిన్నయసూరి చెప్పమరచిన లక్షణము చెప్పడానికి సంకల్పించుకొన్న సీతారామాచార్యులవారయినా తమ ప్రౌఢవ్యాకరణములో 'వల్ల' కు అనుశాసనము చేయలేదు. గాని ఆ వ్యాకరణములోనే కొట్టికొనను ముక్తలక్షణవివేచనము రెండవసూత్రమందున్న వాక్యములో "యవిపూర్వరేఫంబులే యనుటవల్ల కాదు" అని 'వల్ల' రూపము ప్రయోగించినారు; అంతేకాక, తమ శబ్దరత్నాకరములో 'వల్ల' శబ్దము చేర్చుకొన్నారు. అందుకు ప్రమాణముగా "చలిమలవల్ల నుల్లసిలం చల్లదనంబున" అని మనుచరిత్రములోని పెద్దనగారి ప్రయోగమున్ను, "దక్షిణాంస మూచుకనయనప్రకంప గుణసూచన లేమియు వల్లగావు" అని పారిజాతాపహరణములోని ముక్కు తిమ్మనగారి ప్రయోగమున్ను ఉదాహృతములై ఉన్నవి. గనుక, ఆచార్యులవారి మతమందున్ను 'వల్ల' సాధువే కాని అసాధువు కాదు.

ఆచార్యులవారికి పూర్వమే చాలా కాలము క్రిందట పుట్టిన ఆంధ్ర వ్యాకరణములు సంస్కృతమున రచించినవి రెండు మేము చూచినాము. అందొకటి ఆంధ్ర కౌముది. ఇది నాగరాక్షరముల ముద్రితమైనది. రెండవది అముద్రితముగా ఉన్న అథర్వణ వ్యాకరణము. కీర్తిశేషులయిన కొమర్రాజు లక్ష్మణరావుగారు గవర్నమెంటువారి గ్రంథాలయమందున్న ప్రతిని బట్టి వ్రాయించినది. ఈ రెండు గ్రంథాలలోను 'వల్ల' రూపమునకు అనుశాసనమున్నది:—

(1) ఆంధ్ర కౌముది:— "సునునుల చేత కొరకు వల్లక్వాందుప్–సుప ఏతేస్యుః" 117వ సూత్రము.

"ఉంచి, కన్న, పట్టి, కంటె, నుండి, వల్ల, వలన, వంటోండ్రోః జనిసః" 126వ సూత్రము.

(2) అథర్వణవ్యాకరణము:— "ఉంచి, కూడా, వల్ల, వలన, వంక, యుండీతి పంచమీ, నిర్ధారణే కన్నకంటె దేశ్యే పారుడిరివ్యతే".

గణపవరపు వేంకటకవి రచించిన ద్విరూపకోశమందు 'వలన'కు 'వల్ల' రూపాంతరమని ఉన్నది.

"క. కల్లలు కల్లెములనగ న, వల్లు నగళ్ళనఁగ వలన వల్లని యనఁగా
నొల్లము వల్లము నాఁగను, మళ్ళాయి మళాయి నాఁగఁ గొలుపు నుపేంద్రా"

1834వ సంవత్సరములో ముద్రితమైన రావిపాటి గురుమూర్తిశాస్త్రిల వారి వ్యాకరణములోను, ఆ పిమ్మట పుట్టిన వ్యాకరణాలలోను 'వల్ల' రూపమునకు అనుశాసనము కనబడుతున్నది.

ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజములో 'వల్లబెల్లమయినదట!" అనే శీర్షిక క్రింద 102-105 పేరాలలో ఈ రూపమును గురించి చెప్పి సవిస్తరముగా ఉన్నది; 106వ పేరాలో ఉత్తరాంధ్రకవుల గ్రంథములనుండి ఎత్తి వ్రాసిన 26 ప్రయోగములున్నవి; చూడండి ఆ వ్యాసములోనే కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రిలవారు 'వల్ల' రూపము తమ గ్రంథాలలో చాలాసార్లు ప్రయోగించి ఉండెన్ని తమవలెనే ఈ రూపము ప్రయోగించిన కీర్తిశేషులయిన మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులు గారిని నిందిస్తూ 'ఏ సాంబాటుననో ఈ భాషకెల్ల ఒకమాలు మనుచరిత్రలో పడిన వల్లను బెల్లముగా ప్రయోగించుకొన్నా'రని ఎట్లు ఆంధ్రకవితా పితామహుని సైతము వివేకములేక ఆక్షేపించినారో తెలియజేసినాము.

### వల్ల

ఉ|| చెల్లెలుపడ్డ బాములకుఁ జింతిలి జానకిఁదెచ్చి రామభూ
వల్లభుతోడ నోటమిని వాకజేసితి గాని తప్పు నా
వల్లనుగల్గెనంచు జనవల్లభు దేవినొసంగనైతి మీ
కల్లలు నమ్మి నెమ్మదినిఁ గార్యముఁ గోల్పడితింక నేటికిన్||

నిర్వ. విచి. రా. VI, 213.

క॥ అల్లేమ చను హాళాహాళి
వల్లనె కాదల్లవళి వివాదావళి రా
నల్లవళావళిగల యా
కల్లోలము లెసఁగ హల్లకల్లోలముగన్॥ బహులా. II, 56.

సీ॥ ఈ కళానిధివల్ల నేకదా దిక్కుదిక్కులవార లెల్లను దెలివిఁగనుట
యీ వసుథనివల్ల నేకదా విబుధులుం గోరికల్ దీరంగఁ గుడుపుఁగనుట
యీ మహావిభువల్ల నేకదా సభ్యులెన్నగ నిశాచరులెల్ల దిగులుంగనుట
యీ సత్ప్రభునివల్ల నేకదా మోదించి కువలయంబెచ్చుగాఁ గూర్మిఁగనుట॥
బిల్హ. II, 55.

ఆ॥ ఎలమిఁ బుణ్యపాపముల శేషములవల్లఁబుట్టుచుందు రవనిఁ బుణ్యచరిత॥
భాగ. V. i, 161.

సీ॥ బహుళావధానముల్ పఱపి నాలుగునగల్
తేజానందితి మల్లధీయువల్ల మధు.

చ॥ విలయకృశానుకీలముల వేఁడిమిఁ బోఁడిమిమాలి వెల్మ్రడిం
గలసిన భూతధాత్రిమతి క్రమ్మఱరూపయినిల్చి యౌషధుల్
మొలవఁగఁ జేయునట్టి నయముం బ్రతికల్పము నెట్లుగాంచు నీ
చలిమలవల్ల నుల్లసిలుఁ జల్లఁదనంబును నూనకుండినన్॥ మను. II, 10.

ఉ॥ తల్లియుదండ్రియుం గురుడు దైవము భ్రాతయుఁ జుట్టమీవ మా
కెల్ల త్వదాజ్ఞమీఱుటకు నెంతటివారము విశ్వమంత నీ
వల్లను సంభవించు మఱి వ్యష్టివి నీవఖిలంబు...... శివర. పుట 18.

ఉ॥ ఎవ్వనివల్లఁ బుట్టుజగమెల్లను సంతతముం బ్రవర్ధనం
బెవ్వనివల్ల లీనమగు నెవ్వనివల్ల తిరోహితంబునౌ
నవ్విభు దేవదేవు నిను నాత్మభజించెద మేము భక్తితో ,, పుట 22.

గీ॥ చెల్లబో! నీకు సాధ్వీమతల్లివైన
తల్లికిఁగతి యొదవెఁగా దన్నుఁగనుట
వల్ల నీవల్ల ధారుణీవల్లభాజ్ఞ
మీఱి యీరీతివచ్చుట మేరఁటమ్మ॥ సార. III, 95.

## ఇరువై

సంస్కృతమందు 'వింశతిః' అంటే రెండు పదులు అని అర్థము. "ద్వి" శబ్దములోని దకారము పోయినది. (ఇంగ్లీషుశబ్దము twenty=twegen=two+tig (=tigjus=ten) లో తకారవకారములున్నవి. వింశతి శబ్దము ప్రాకృతమందు వీసఈ, వీసా, వీస్ అయినది. సం. త్రింశత్ ప్రాకృతమందు తీసఅ, తీసా, తీస్ అయినది. ద్వాదశ శబ్దము ప్రాకృతములో బారహా, హిందీలో బారా, గుజరాతీలో బార అయినది. త్రయోవింశతి శబ్దము హిందీలో తేఇస్, తేఈస్, పంజాబీలో తేఈ అయిపోయింది.

ఇట్లే తెలుగులో ఇరువది మారి ఇరువై, ఇరవైగాను; అరువది అరువై, అరవైగాను నేటి వ్యవహారమందు శిష్టులు వాడుకున్నారు. శ్రీనాథుని కాలములోనే ఇరువై అని వాడుక ఉండేది. శాసనములలోవలెనే కావ్యములలోనూ శబ్దముల మార్పులు కనబడుతున్నవి. అయితే అచ్చు పుస్తకాలలో పరిష్కర్తల మోసమువల్ల కొన్ని కానరావు.

## ఇరువై

మ॥ హరిదాటించెఁ బుగోపకంఠమున వాహ్యాళి ప్రదేశంబునం
దరుదే యల్లయరెడ్డి నందనుఁడు దొడ్డయ్యక్షమాధీశ్వరుం
డిరువై నాలుగు మూళ్ళ మేరయను గోసెక్కింపఁగానేల యు
ద్ధరణీనాథుని కీర్తి దాఁటెఁగదునుద్దండించి బ్రహ్మాండముల్॥
కాశీఖ. I, 9.

వ|| ఇంక రాఁగల యిరువైతొమ్మిదవ ద్వాపరంబున నీవు వ్యాసుండవై వారణాశీపురంబున వేదపురాణసంహితా ధర్మశాస్త్రంబులు వక్కాణింపం గలవాఁడవు|| " III, 51.

క|| ఈ యెనిమిది భేదంబులఁ
బ్రేయసులు పదార్థురుం బ్రభిన్నాత్మక లై
యాయతి గతి నిల నూటిరు
వై యెనిమిది భేదములను వఱలుదు రెలమిన్|| నరస. II, 50.

మ|| అఱచేయింబలె మేఘపుష్కరక మహాహార్యాంతరాళంబునం
దఱువైయోజనముల్ వెడల్పును శతాయామంబునుంగల్గి య
త్తటి పీఠత్తరు శూన్యమైన బయలందంబొందు నన్నేల కుం
దఱుచై నల్గడలం గొలంకులునుగానల్మించుఁ జిత్రంబుగన్|| వరహ. 13.

మ|| ఇరువై పంబశరంబులేసెఁ గపటీభేంద్రంబునా బాణముల్ XI, 106.

క|| తొమ్మిది దేవరగుళ్ళకుఁ
దమ్ములం నేళోనశతము తడయక పెట్టన్
దొమ్మిది నూఱులు తొంబై
తొమ్మిది భవనములకెన్ని తోయజములగున్|| సారసం. గణి.

## వాటి, వీటి, వేటి

అవి, ఇది, ఏవి అనే సర్వనామముల ద్వితీయాది విభక్తులు 'వాని', 'వీని' 'వేని'—ఇత్యాదులు ప్రాచీనాంధ్రమందుండేవి. వీఁడు, వాఁడు, వేఁడు (=ఎవఁడు) అనే సర్వనామముల ద్వితీయాది విభక్తులు కూడా ఇట్లే ఉన్నందున సందిగ్ధత కలిగినది; దానిని తొలగించుటకు వాటి, వీటి, వేటి వాడుకలోకి వచ్చినవి. ఇవి పూర్వము సబిందుకములుగా ఉండినట్లు తాటాకు పుస్తకములలోను, 50 ఏళ్ళ క్రిందట అచ్చుపడ్డ పుస్తకములలోను కనబడు

తున్నది. పెక్కు—పెక్కింటి—పెక్కిటి, అన్నింటి-అన్ని-అన్నిటి; ననుబోని—ననుబోంటి-ననుబోటి మొదలయినవి సాదృశ్యములు. అట్లే వానిలో—వాంటిలో-వాటిలో. అరవములో :అవైగళై - అవత్తై-అవైగళుక్కు-అవత్తుక్కు అనే రూపములు (వాటిని, వాటికి అనేఅర్థము గలవి ఏర్పడ్డవి) ఇంగ్లీషు భాషలో కూడా, తెలుగు 'వాని' వంటిదే, his అనే రూపము రెండర్థములు గలిగి ఉండేది; రానురాను its అనే రూపము వాడుకలోకి వచ్చి నెలకొన్నది. ప్రాచీనాంగ్లమునకున్ను నవీనాంగ్లమునకున్ను గల వ్యత్యాసములలో ఇది ఒకటి.

English has devised new grammatical material to improve the old and replace the lost. One of the most striking inventions is *its*. A clear and unambiguous possessive was required for neuters in place of the old *his* and the stop-gap *it*, both felt to be inconvenient. It does not occur in the 1611 Edition of the Authorised version. A few examples appear in Shakespeare but only in Plays printed after his death, while only three are met with in Milton's poetry. *Its*, however, was too useful to be ignored and by 1660, had won a place in the language.

అట్లే తెలుగులో వాటి మొదలయినవి; అపరిహార్యములు. ఇక ప్రయోగములు చూడండి. వచన కావ్యము లన్నిటిలోను 'వాంటి', 'వీంటి' మొదలయిన శబ్దములు అపరిమితముగా వ్రాతప్రతులలో కనబడుతున్నవి. మొట్టమొదట అచ్చుపడ్డ పుస్తకములలో పరిష్కర్తలు "దిద్ద" లేదు; రాను రాను ఆ శబ్దములు తొలగించి, 'వాని' 'వీని' చేర్చినారు (మా. ఆంధ్ర

సాహిత్య పరిషత్పత్రిక. సం. 1. సంచిక 2, పు. 95. అమహాదర్థకమగు తచ్ఛబ్దమునకు "వాటిని" మొదలగు రూపములు వాడఁబడినవి). పరిషత్తు వారు సంపాదించిన జైమినిభారతము వ్రాతప్రతిలో స్పష్టముగా కనబడు తున్న ఈ రూపములు వారు అచ్చువేయించిన గ్రంథములో కనబడవు. పద్యకావ్యములలో ప్రాసస్థానమందు ప్రయుక్తమయినవి కొన్ని ప్రయోగ ములు అచ్చుపుస్తకాలలో నేటికిన్ని ఉన్నవి. అప్పకవీయము (IV, 266. సీసపాదము) "వీఁటిలోపల నొక మూఁటిచే వడిలేని హీన పాదము ముందు గానఁబడును." చూచి, బ్ర. శ్రీ. వడ్డాది సుబ్బారాయ కవిగారు ఆ పాఠము తప్పని ఆక్షేపించినారు. అచ్చుకూర్పు లన్నిటిలోనున్ను, వ్రాత ప్రతు లన్నిటిలోనున్ను అట్లే పాఠమున్నదన్నా విశ్వసించక, "ఒకమూఁడు" అనేది అప్రయోగమని తిరస్కరించినారు. (చూ. తెలుగు పత్రిక సం. 8, పు. 62) "ఒకమూఁడు" సాధువు అన్నందుకు ఈ క్రింది ప్రయోగము లున్నవి:—

క|| మనమొక యేవురమీయం, గనయుం దోనరుగు దేరఁగా నెయ్యేడఁబో,
యిన నెఱుఁగకుండుదురె. విరాటపర్వం 1, 59.

చ|| ముదితకు రాకపోక లొక మూడుమహార్థములయ్యె నయ్యెడన్.
ఉ. హరివంశము. V, 190.

ఉ|| మోసల మొగ్గిలనిల్చి రొకముప్పదికోటులు మూఁడు కోటులున్.
పాండు. 1, 159.

మ|| ఒక మున్నాఱు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు.
భోగ. IX, 262.

## వాఁటి

టీక. వాఁటిలోపలను గురువులక్రిందివి
అప్ప. IV, 150.

సీ॥ నలగగ భజస గణంబు లేను నె కాని
కందంబునకు నొండు గణము సారదు
పీఁటిలోపల నొక మూఁటిచే వడిలేని
హీనపాదము ముందు గానఁబడును॥ IV, 270.

సీ॥ పీటిసాటిని మేటి నీబోటిబోటి ఉపాక. III, 52.

గీ॥ శ్రుతి మహారాష్ట్రభాషచేఁ జెప్పబడెడు
భీకరోక్తులు బిరుదులై పెక్కుదనరు
వాఁటి బిరుదావళి యొనర్ప వలయు నందు
బుధుల సంబుద్ధిపదములు పొసఁగఁ గూర్చి॥ IV, 359.

## ప్రాణాలు, ప్రాణాన

బాలవ్యాకరణమందు ఈ రూపములగురించి "లులనలు పరంబు లగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు" అని చెప్పిన సూత్రములో "ఒకానొకచో ననుటచే నీ కార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు సూచింపంబడియె" అని చిన్నయసూరిగారు వ్రాసియుండుటచేత, గుప్తార్థప్రకాశికాకారులు "ఇట్టి ప్రయోగంబులు తఱచుగా నుండవు" అని వ్రాసినారు.

కూచిమంచి తిమ్మకవిగారు తమ సర్వలక్షణ సారసంగ్రహము (విభక్తి ప్ర. 14)లో "వనము కాలము ప్రాణము ధనము డెంద మన ముకారాంతములకు నాలెనయు నొక్కతరిని మూల్వోయి దీర్ఘముల్ దాపలి దెస వర్ణములను విభక్తుల వచ్చునభవ." అని లక్షణము చెప్పి తిక్కన భారతమునుండి ప్రయోగము లెత్తి చూపించినారు. అయితే ఈ రూపములు గ్రామ్యములన్న అభిప్రాయము వీరికి పోలేదు,

"తగిలి వర్ణంబు లెక్కువ తక్కువలుగ
నియమ మెడలించి పల్కునవియె తలంప
గ్రామ్యమగుచుండె నొరుల దగఁడదు చోట్లఁ
జెప్పఁదగు నది కలధౌత శిఖరి సదన !
"ప్రాకటముగఁ గృతుల నాకడ నీకడ
యనుచుఁ బల్కుచోట నాడనీడ
యనిన వర్ణలోపమగు ఫలములకు ఫ
లాలనంగ హెచ్చు నీలకంఠ

"ఇటువంటి గ్రామ్యపదంబులయినను సుశబ్దంబు లగుట కుదాహరణ మహాకవి ప్రయోగము..." అని "వర్ణాధిక్యమగుటకు" వరాహపురాణము నుండి 'పలాలు' 'ప్రాణాలు' గల పద్యపాదమున్ను, భీమఖండమునుండి 'దినాలు' 'కతాన' గల పద్యమున్ను ఉదాహరించినారు.

లోకవ్యవహారమందును, గ్రంథములందును ఉన్న శబ్దములలో వర్ణలోప వర్ణాగమ వర్ణాధిక్యము లున్నప్పుడు వాటిని నిరూపించి శబ్దనిష్పత్తి తెలియజేయడమే వ్యాకరణము. అంతేకాని వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములున్న మాత్రాన శబ్దములు గ్రామ్యములనుట అవివేకము. ఈ విషయము సరిగా గుర్తించక పోవుటచేతనే తిమ్మకవివంటి పండితులు సైతము పైని పేర్కొన్న రూపములు గ్రామ్యము లనుకొనుట సంభవించినది. ఒకర్తు నుండి ఓర్తున్ను మొగమునుండి మోమున్ను వచ్చినట్లే ప్రాణమునుండి ప్రాణానవచ్చినది.

మరియొక విషయము. పైని చెప్పిన బాలవ్యాకరణ సూత్రములో "తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును" అనుటచేత, ముపర్ణమునకు పూర్వమందున్న అచ్చు అత్వమే అయి ఉండవలెనన్న నియమము లేదు. గనుక,

బల్లెములు, బల్లేలు, ముత్తెములు, ముత్తేలు మొదలయిన రూపములుకూడా సిద్ధిస్తున్నవి. వీటికిన్ని కవిప్రయోగాలు కలవు.

ప్రాణాలు—ప్రాణాన

ఉ|| మేరువుచుట్టిరాఁ దిరుగు మెచ్చులవచ్చుగురాలకంటె దై
త్యారినిఁ గల్కిరూపు సమయంబునఁ బూనెడి వాజికంటె జం
భారికి నింపు సొంపొదువ నాడెడి వెల్లపతాణికంటె యీ
వారువముల్ రయోన్నతిని వాసిఁదనర్చు నరావరోత్తమా|| ఉ. నై. 70.

క|| అయ్యైరువురు గదలదరఁగ
వ్రయ్యంగ్రుయ్యంగ వేగ్రేగవమున జలధుల్
వియ్యాలందఁగ మదమున
డయ్యకపోరిరి వికంకట బలోద్భటులై|| ఉ. హరివం. III,82.

మ|| అనినం గన్నెలు చిన్నబోవగనుఁ బౌర్ణిధాంభోజపత్రేక్షణల్
వినమేమంటిమి కృష్ణకృష్ణ వినరా వేసాలు మాతోడనా
యనరా దింతియెకాక కన్నయపుడల్లా తప్పు దండాలు బె
ట్టిన మాసామివి నీవకాక వలపంటే వచ్చెనా బింకముల్|| దశా. 313.

క|| లలిత నిజవామకరతల
కలిత కనత్కంబుకాంతిఁ గలకల నవ్వన్
గలువల చెలి గిలిగింతల
నలువగు టాలన్ బిసాళి నలువ గుటాలన్|| పాండు. II, 38.

మ|| చంద్రుని పెన్నుద్ది సమగ్రకాంతి మహిమన్ నూనూఁగు మీసాలతో
గొనబుం బ్రాయపుఁ దేజుకూన యతఁడుతోఁ చుండు వాచాలతన్||III,66.

సీ|| అలుపాలఁ బోనుపడునట్టి చిచ్చే యిది పెనుగద వట్టిన భీమసేను||
భార. ఉద్యో. III,117.

ఆ|| ఎచట నున్నవాఁడ వేమైతి ప్రాణానఁ
గలవె యేను నిన్ను గానకునికిఁ
దలఁచుచున్నవాఁడ ధైర్యధౌరేయ నీ
యెలుఁగు సూపవే సురేంద్రతనయ|| ద్రోణ. I, 262.

గీ|| ఇంక ననుఁ బోఁటిఁ దొరకిన నింతకంటె
నెడరువాటిల్లు వేగ పొమ్మింటికడకు
హరియుఁ బార్థుఁడు నున్నెడ కైన నరుగు
మేను దెగ నీదు ప్రాణాన కింత నిజము|| కర్ణ. II, 94.

సీ|| సన్నుతికెక్కిన సకల గుణముల నిమ్మహీతాత్మ చందాన మమ్ముఁ బ్రోచు
ఆశ్ర. I, 103.

గీ|| అధిప నీ తనయుండు గయ్యంబు వోడుచు
తెంపువదలక విభవంబు పెంపు మిగసె
సాసానకు వచ్చిన చందమునను
నెలమిఁ బొందరి పాండవేయులును హరియు|| భీష్మ. I, 142.

శా|| తల్లీ యిన్నిదినాలకేనియు సుధాధారాసస్యందియై
యుల్లంబున్ సుఖియింపఁజేయు పలుకెల్లోవింటి నివ్వేటిలోఁ
జెల్లాఁకొన్నతనాన నే నొకడనే భిక్షాశనున్ వత్తునో
యెల్లన్ శిష్యులఁగొంచు వత్తునో నిజం బేర్పాటుగాఁ జెప్పుమా||
భీమేశ్వరపురా. II, 120.

మ|| విమలాత్మా! ఒక విన్నపంబు వినుమా వేపల్లెలో నున్న పా
పమునన్ మానితొ నన్ను నేను మెలఁగే పాపాన రేపల్లెపై
మమతల్ మానితొ యింతమాత్రము వచింపన్ లేని పుణ్యంబు నీ
కమరున్ కారణకార్యముల్ దెలసి యోగ్యాయోగ్యముల్ చూచెదన్||
రాధా. III, 45.

సీ॥ యయుడువులో యువిగావు మృదునంబరంబున
దాపించినట్టి ముత్యాలుగాని శృ. నై. VIII, 161.

గీ॥ చాన మోమంద మెల్ల లోచనమయంబు
కొమ్మ యొమ్మంద మెల్లను గుచమయంబు
కలికి వెన్నంద మెల్లను గటిమయంబుఁ
గాన దానికి సాటి జగానఁ గాన॥ రాధికా. 13.

ఉ॥ మైనపుటంటు పల్వగల మచ్చుల చాళ్ళొరగల్లు కట్టెలున్
దూనిక నాలుగేన్బొరలతోఁ దగు వట్టములోన నున్న నా
నానగరోద్భవంబులగు నాణెములుండెడు సంచిఁ గొంచు చే
రానకు వచ్చు నన్నయ ధురంధరుఁ డంగడికిన్ గణింపఁగన్॥ శుక.పు.47.

మ॥ ...చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై దేనియల్. మను.

## వాండ్లు, వాళ్ళు

'వాఁడు' శబ్దమునకు బహువచనమందు 'వారు' అనే రూపమే కాక, 'వారలు', 'వాండ్రు' అనికూడా ప్రాచీన గ్రంథములందు కనబడుతున్నది. ఉత్తరాంధ్ర కవులు 'వాండ్లు' అని వాడినారు; దీనికి పండితులు అను శాసనము చేసి ఉన్నారు. ఆంధ్ర కౌముదిలో సూ. 285 నిత్యం జశ్శసోర్లులౌ తస్మాత్ సూ. 286 వాండ్లుర్ బహువచనే పి వా స్త్రీయాంచ. ఆడవాండ్లు, విధవవాండ్లు. పుంవాచకపదానామపి బహువచనే వాండ్లుర్ నిత్యం స్యాత్ - మగవాండ్లు. అధోక్షజ ఫక్కికలో గాండ్లుర్ బహౌ అని వేషగాండ్లు మొదలయిన వాటికి కూడా అనుశాసన మున్నది. చిన్నయసూరికి పూర్వము వ్యాకరణము రచించిన రావిపాటి గురుమూర్తిశాస్త్రి మొదల

యినవారున్ను— వాండ్లు,— గాండ్లు సాధువులుగానే అంగీకరించినారు. చిన్నయసూరి వీటిని విడిచినందున, నేటి పండితులు అవి గ్రామ్యములనుకొంటున్నారు. ఈ కాలమందు ఉత్తమ సర్కారులలో 'వాళ్ళు' అనే రూపము వాడుకలో ఉన్నది. ఆ శబ్దము పెద్దలు గ్రంథాలలో వాడుతున్నారు. (చూ. కందుకూరి వీరేశలింగం పంతులుగారి సత్యవతీ చరిత్ర— 'మీవాళ్లు,' పు. 8; ఆడవాళ్లు, పు. 9; చిలకమర్తి ల. నరసింహాంగారి సుధాశర. వాళ్ళ తల్లి. వీళ్ళ సంరక్షణ.

రామ. వాళ్ళము, పు. 7; 28. వాళ్ళ కు పు. 10; వేంకటపార్వతీశ్వరుల సీతారామ, గ స్త్రీవాళ్ళ తప్పు.

'వాఁడు' లోని బిందువు ఉచ్చారణలో వినబడనప్పుడు, బహువచనమందు '*వాడ్లు' వాళ్లుగాను, '*గాడ్లు' గాళ్ళుగాను మారక తప్పదు. ఇట్లే 'నాఁడు' కు బ. వ. 'నాళ్లు' అయినది. కొన్నినాళ్లు, అన్నినాళ్లు ఇన్నినాళ్లు ఎన్నినాళ్లు=కొన్నాళ్లు, అన్నాళ్లు, ఇన్నాళ్లు, ఎన్నాళ్లు. నెలనాళ్లు= 'నెల్లాండ్లు'='నెల్లాళ్ళు' అని నేటి వారు వ్రాస్తున్నారు. (చూ. ఆంధ్రపత్రిక తే. 15-12-24 ది, పు. 18.)

'తామరతూఁడు' లోని బిందువు పోయినపిమ్మట, 'తూడు' కు బ. వ. 'తూళ్ళు' అయినది; శ్రీకృష్ణభారతమందు కవిసార్వభౌములే ఆశబ్దము ప్రయోగించినారు.

శా. తోళ్ళుం దొక్కలుఁ గట్టి కాఱడవులందుం బందులుందున్నలున్
లేళ్ళుందుప్పులులోను గానగు మృగాళింగూడి యేదుంపలో
తూళ్ళో తిండికిఁగా అరణ్య. ఆ. 8, పద్యం 30.

'ఒడలు' శబ్దమునకు రూపాంతరముగా 'ఒళ్లు' శబ్దరత్నాకరమందున్న ది; "ఇది వెళ్ళుసళ్ళులవంటిది" అని కోశనిర్మాతలు సమాధానము చెప్పినారు. ఒడలు=*ఒడ్లు=ఒళ్లు. ఒడలు శబ్దము ఔపవిభక్తికము;

ద్వితీయాది విభక్తులు, ఒడలిన్, ఒడలిచే, ఒడలికి, ఒడలన్; బ. వ. ఒడళ్లు. అయితే, 'ఒళ్లు' శబ్దమునకు ఒంటిన్, ఒంటిచేత, ఒంటికి, ఒంటన్ అనే రూపములు కలుగుతున్నవి. "ఇంటా ఒంటా" (=వంటా) అనే వాక్యము సర్వసామాన్య మైనది; నేటి గ్రంథాలలో కనబడుతున్నది. వెడలు శబ్దము *వెడ్లు=వెళ్ళుగా మారినా, ఆ రెంటికిన్నీ అర్థములో భేదమున్నది. 'గ్రామము వెడలి' అంటే 'గ్రామము విడిచి' అనిన్ని 'గ్రామము వెళ్ళి' అంటే 'గ్రామముపోయి' అనిన్ని లోకవ్యవహారము. ఇట్లే, నన్నయాదికవుల కాలములో అల్లుఁడు శబ్దమునకు బ. వ. అల్లురు అని ఉన్నా, పిమ్మట అల్లుండ్రు, అల్లుండ్లు, అల్లుంళ్లు, అల్లుళ్లు అని అయినది. అట్లే కోడలు శబ్దమునకు బ.వ. కోడండ్రు కోడండ్లు=కోడళ్ళు అయినది. కన్నులు, కండ్లు, కంళ్లు, కళ్లు; పండులు, పండ్లు, పంళ్లు, పళ్లు; బండి, బండులు, బండ్లు, బంళ్లు, బళ్లు; ఇండ్లు ఇంళ్ళు, ఇళ్ళు— ఇట్లు శబ్దరూపములు మారినవి. "తెనుఁగున బిందు పూర్వక స్థిరంబు లే"దనుటకు కారణము లేదు. లోకములో వినబడుతున్నది. "కంసాలి" తెలుగులోని శబ్దము కాదా? భోజరాజీయములో ఉన్నది. (V, 265) శ. ర. లో లేదు.

పెండిలి మొదలయినవి కూడా పెండ్లి, పెంళ్లి, పెళ్లి అయినవి. ఏ.వ. కొమారుఁడు, బ. వ. కొమారులు, కొమార్లు=కొమాళ్ళు అని వాడుకఉన్నా కళాప్రపూర్ణ శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు గ్రామ్య మన్నారు! (మా. సారంగ. ఆ2. 84.) అయితే శబ్దరత్నాకరమందు అది సాధువుగానే ఉదాహృతమయి ఉన్నది. కవులు అది వాడినారు. దకార లకారములు కలిసి ళకారములయినట్లే, కొన్ని శబ్దములలో రకార లకారములున్న ళకారము లయినవి. ఉదా. నీరులు=నీళ్ళు, విస్తరులు=విస్తళ్ళు, పందిళ్ళు, గోళ్ళు, వేళ్ళు, మొదలయినవి; మరికొన్నిటిలో అట్లు కావు. తేరులు, సుంకర్లు. అనుశాసనము చేసేవారు గణాలు ఏర్పర్చవలెను. లోకములో నున్న శబ్ద

మునకు అనుశాసనము లేకుంటే, శబ్దము దుష్టము కాదు; అనుశాసనమే దుష్ట మవుతుంది. శిష్టవ్యవహారమునకు అనుశాసనము ఆధారము కాదు; అనుశాసనమునకు ఆధారము శిష్టవ్యవహారము. 'శిష్టానాం ఉక్తౌ సూత్రాణామభావే అనుశాసనకారిణ ఏవ వందనీయాః' అని పండితాభిప్రాయము.

నేడు తెలుగు దేశమందు 'వాళ్ళు' అనే రూపము సర్వసామాన్యముగా వాడుకలో ఉన్నందుకు ఆంధ్రపత్రిక, భారతి మొదలయిన వాటిలో నుంచి అపరిమితముగా ప్రయోగములు ఎత్తి చూపించవచ్చును. అంతేకాక శ్రీయుత జయంతి రామయ్యపంతులువంటి మహాపండితులు ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రికవంటి గొప్ప పత్రికలో (చూ II, పు. 125) 'మూగవాళ్ళు' అనిన్నీ తమ సర్వోత్తమ గ్రంథము 'ఆంధ్రోత్తరరామచరిత' మందు పద్యములో (చూ. పు. 153) 'పదియారు, రెండు నేళ్ళ వయసు గరగ' అనిన్ని ప్రయోగించినారు. కీ॥ శే. కొ. లక్ష్మణరావుగారు విజ్ఞాన సర్వస్వములో (చూ. పు. 636) 'లంబాడీవాళ్ళు అనిన్నీ, కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు సత్యవతీ చరిత్రలో (చూ. పు. 8,9.) 'మీవాళ్ళు', 'ఆడవాళ్ళు' అనిన్నీ, శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు సుధాశరచ్చంద్రములో (చూ. పు. 23) 'వాళ్ల తల్లి,' అనిన్నీ, శ్రీయుత బాలాంత్రపు వెంకట్రావు పంతులుగారు తమ 'సీతారామ' లో 'గ స్త్రీవాళ్ళ తప్పు' అనిన్నీ ప్రయోగించి ఉన్నారు. శతకాలలోను, పదాలు, పాటలు, మొ॥ వాటిలోను, టీకలలోను, కోశములలోను, వాళ్ళు మొ॥ రూపములు తరుచుగా కనబడుతూనే ఉన్నవి. శిష్ట వ్యవహారమందు నెలకొన్న శబ్దములు అసాధువులని గ్రామ్యములని దూషించరాదు.

ఇకను ప్రయోగాలు చూడండి—

## వాండ్లు, వాళ్లు

గీ॥ పొగల తెగల జగాజెగి మిగుల వంచి
దండి తెక్కలిగాండ్లకు మిండగీండ్ల
కింపుగా మబ్బు మనీ చల్లు నింపు దోఁప
నెల్లకడలందు నంతంత నిరులు గవిసె॥ అచ్చ తె.భా.పు. 583.

శా॥ వాండ్లు న్వీండ్లు ననున్ బడంతి యనుచుఙ వార్త్రుచ్చఁగా వించు తా
విండ్లంబుల్ శిశుపాలుఁ డందుకొని శీవిఙ భైకొనందోడ వి
ల్లాడఙ వారి జయించి రుక్మిణబల న్వంశాభిమానంబుకై
పెండ్లాడఙ వలసెన్ బయోజముఖి తప్పై వ్వనఙ శమింపదగుఙ॥
రాధా III. పు. 49.

ముత్తుగాండ్లు (బసవ. III, పుట 79) సంగడికాండ్లు (రాధా. I, 8) జూదరికాండ్లు (సానం. II, 29) కొండెగాండ్లు (సానం. IV, 64) కోడెకాండ్లు (సానం. V, 88) పందెగాళ్ళు (హంస. III, 212) అర్ధివాండ్లు (న. శతకము పుట 4) ఆండ్లు, లంచగాండ్లు (వేణుగో. శతకము 52)

## కోడండ్లు, అల్లుండ్లు

సీ॥ అలరి మేధాశక్తి నచటి భూదేవతల్
వావిదప్పని బ్రహ్మ వార్త నగుదు
రపజయంబెఱుఁగని యచటి రాచకొమాళ్లు
రణమున వెనుకయౌ రాము నగుదు ॥ రాధా. II,38.

మ॥ అవి చేసంటి చెనంటిఁ జూచి యతఁడి ట్లఙ దల్లిదండ్రుల్ మనం
బు విరాజిల్లఁగఁ గూడఁబెట్టిన ధనంబుల్ లోకమందుఙ గొమా
ళ్ళవి గా కెవ్వరివమ్మ ? కావలయు వేళఙ వచ్చి కొంపోదునేఁ
డివి నీపెట్టియ నాదు దాఁపుకముగా నిందుంచనిమ్మన్నియుఙ ॥
సార. II, 84.

శా॥ ఏరా యోరి వివేకహీనమతి! ద్రోహీ! నందనుండంచు ని
న్నారా నమ్మిన దంతయుం గలిగె నెందైనన్ నగర్లోనికిన్
బోఁగోరారో కొమాళ్ళు వావివరుసల్ బుద్ధిన్ విచారింపకే
గారాబుం బినతల్లిఁ బట్టితివి యోగ్యంబె నినుం జూడఁగన్?

,, III, 10.

సీ॥ నెనరుతోఁ బినతల్లి యని కొమాళ్ళింటికి
వచ్చిన దయఁజూచువారు లేర? ,, III, 47.

చెల్లెండ్లపై (విజయ II, పుట 23) కోడండ్లపన్ (శివసుధా III,89.)
కోడండ్లె (శుక. I, పుట. 11) కుమాళ్లు (హంస III, 29, 30).

## కండ్లు—వండ్లు

చ॥ నునుకురులం గరం బగరునూనియు ద్రువ్వి పొంగుఁ గీజెడన్
బెనచి పసిండి సొమ్ములను బెట్టు మొగంబున బొట్టుఁదిద్ది యం
జనమును కండ్లఁ దీర్చి విరి చల్వపుఁ బావడఁ గాలిచెంగెలం
జినుఁగులఁగట్ట నిచ్చి కయిసేసి దయంబున మత్స్యనేత్రినిన్॥

కవిజనచ. చ. IV,178.

ఆ॥ తపము చేసి లెస్స యుపవాసముల డస్సి
విగతకాయములను సుగతి నొంది
యేమహాత్మురాలి నీక్షింతు మది నేఁడు
గలిగెఁ జూడఁ గళ్ళ కరువు తీఱ॥ నిర్వ.వి.చి.రా, పుట. 35.

సీ॥ కడగండ్లఁ బడువారిఁ గడగండ్ల నీక్షించి
తొలఁగించువారిఁ దుర్దోష మెల్ల ,, పుట. 147.

క॥ కళ్ళంగివేసి నట్లా త్రుళ్ళపమున మోహుఁబట్టి తురుమాడక యీ
పిల్లఁడునుమునఁటు కూంకటి వేళ్లుండ మునిండి కొనలు విరుగుటగాదే?
ప్రబో. V, పుట 41.

చ॥ గడియకుఁ బెక్కుమార్గములు కల్లలు పల్కుచు సాధుకోటిత
న్నొడయఁడటంచు మ్రొక్కునపు డూరకయుండుచు వింతచేష్టలన్
గడుపడిఁ దానొకొక్కయెడఁ గండ్లలఁజేయుచు రాజ్యసౌఖ్యముల్
గడుకొనులాహిరీమసక గ్రమ్మిన మత్తులుగార భూపతుల్ ॥
రాజశే. III, 23.

గీ॥ కోలకొక్కరాయిఁ గూల్ప నొక్కఁగఁ జేసి
ముండ్లకట్టె నొకని కండ్లు పెరికె
వేఁడి కొఱవులెత్తి మాడుదురొక్కని
భల్లతతుల నొకని బ్రుల్కడంచి ॥ సాసం II, పుట 26.

గీ॥ పదును గోరుగండ్లు బడసిక కొండటి
కండ్లు వెతికె నిమ్మపండ్లు గుచ్చి
చెట్లకంటగట్టి సింగాణికోలలఁ
జెండి కొండఱోడలు జిందుపఱచి॥ ,, III, 57.

పెల్లి, ఒల్లు, మల్లు, వెల్లు

గీ॥ జరిగె నూడెను జాఱెను నురికె వెళ్ళెఁ
బాఱఁబఱచెను దొలఁగెనన్ బలుకులెల్ల
నవనిలోఁ బలాయితుం డయ్యెననుట
కాఖ్యలై యొప్పు చంద్రరేఖావతంస ॥ ఆంధ్ర. మానవ 44.

గీ॥ ఘూకరవముల చాడ్పున ఘోరవృత్తిఁ
దనరుఘనకాన కుహూకుహూ ధ్వనులవలన
భావజుఁడు వెళ్ళిపోయిన పాడుమేడ
పగిదిఁ గాన్పించు ముదుసలి పడఁతి యొకతె॥ కళా III, 83.

ఉ॥ ఒళ్ళారకమున్న వచ్చి యొక యంగన చూచె నరేంద్ర చంద్రునిన్
కవిక. III, 6.

సీ॥ ఒక్క నిబ్బరముగా హుంకరమత్తు పరుగెత్తు
 పల్లించు కళ్ళెముల్ ఘుళ్ళునంగ  కృష్ణరా. వి. I, 53.

ఉ॥ ఆడదు భర్తమాట కెదు రాడదు వచ్చినవారి పీడcగా
 నాడదు పెక్కుభాషలెడ నాడదు వాకిలివెళ్ళి కల్లమా
 టాడదు మిన్నలేని సుగుణావళి కందిరగాక సాటి యే
 చేడియ లేదు చూరసిల శేఖరు కన్వయముమ్మ దమ్మునన్॥ భాగ. VI,27.

సీ॥.........ఉద్ధతిc జెంది
 మళ్లువారును నిల్చి త్రేళ్లువారు.  మిత్ర. VI, 81.

గీ॥ హారు నుదిటికంటి మంటల నంటిబెదరి
 త్రుళ్ళి రౌతును బడవైచి మళ్ళివచ్చు
 తియ్యవిలుకాని సాంబ్రాణి తేజియనcగ
 గగనమార్గంబునను దోcచెc గలికి చిలుక॥  రాధికా II, 121.

సీ॥ మల్లికావల్లికల్ గిల్లc జెల్లదటన్న
 నోళ్లేల విరచెదే యుజ్జ్వలాంగి  రా. వి. III,115.

క॥ తొల్లిcటి సేవకు నొక భూ
 వల్లభునకు నెగ్గు సేసి వచ్చిన తులువన్
 వెళ్ళింపcగాcగc దగు దగ
 దుల్లంబున హితుcడటంచు నూcడియుండన్॥  రుక్మా. III, 17.

మ॥ ఘనతాపంబు హరింప నోపమనుచున్ గానీ క్రియాద్వేషమే
 చినc గానీ హృదయేశుc జన్నులపయిం జిత్రింపcగానీతమున్
 వనజాక్షుల్ నిరసింపcగాc జనుట హైన్యంబంచు మున్మున్న నై
 ళ్ళిన రీతింబడుc ద్రేలి మౌక్తికమణుల్ మెట్టించి దూరంబునన్ ॥
 వరాహ IV, 35.

ఆ॥ తొట్టు పేరఁ బెట్టి దొడ్డకు పేరను బెట్టి
పిల్లికూన పేరఁ బెట్టి యిల్లు
వెళ్ళ లేదటంచు మెల్లన ముద్దుగులు
పాలవిడుచుచుండుఁ బాటఁబాట ॥ వైజ. III,93.

## రక్షించు, రక్షించక

ఆంధ్రశబ్దచింతామణి క్రియాపరిచ్ఛేదము (సూ. 15)లో "అనుబన్ధ ప్రార్థనయోర్ణా వ్యతిరేకాదికే చో ఃపస్స్యాత్" అని ఉన్నది. ఇది "భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమః శేశ్చ" అనే సూత్రములతర్వాత వచ్చుటచేత ఇంచుగాగమ సంబంధమైన చువర్ణమునకే పైని చెప్పిన అనుబంధక ప్రార్థనార్థక వ్యతిరేకార్థములు పరమైనప్పుడు చకారమునకు పకారము ఆదేశముగా వచ్చునని అర్థము.

సూత్రములో 'వ్యతిరేకాదికే' ఉన్నది గనుక అదిశబ్దమువల్ల తుమర్థక సతిసప్తమ్యర్థకములు పరమైనప్పుడు అని కొందరు వ్యాఖ్యాతలు నిరూపించినారు. ఇక్కడ సతిసప్తమ్యర్థకమనగా నావుడు, అనవుడు వంటిదే. అయితే, 'పోషించుడు' అనే రూపములో గల చకారమునకు పకారము రావలెనని తేలినది. కాని, నన్నయాది ప్రాచీనకవులు పోషించుడు అనే కాని పోషింపుడు అని సతిసప్తమ్యర్థకముగా ప్రయోగించలేదు.

ఈ సూత్రము ఆధారముచేసుకొని చిన్నయసూరిగారు "ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబునకగు" అనిన్ని, "అగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తుపరంబగునపుడు పవలగు" ననిన్ని రెండు సూత్రములు చెప్పినారు. (బా. క్రియ. 87, 88).

ఈ సూత్రములనుబట్టి ఇంచుగాగమ చకారమునకే పకారము వచ్చుననిన్ని సూత్రసాధ్యము కాక పదమందు సిద్ధమైఉన్న చకారమునకు పకా

రము రాదనిన్ని తేలినది. పిలుచు శబ్దములోని చకారము పదమందు సిద్ధమైఉన్న చకారము గనుక వకారము వచ్చునని సూత్రార్థము. అయితే 'విఱుచు', పిలుచు వంటిది కాదు; విఱుగుయొక్క ప్రేరణార్థకరూపము. విఱుచులోని చకారము పదమందు సిద్ధమైఉన్నదా? లేక సూత్రసాధ్యమైనదా? అన్యచకారమా? ఆగమచకారమా? ణిజర్థమందున్నది గనుక ఆగమచకారమే అయితే పకారము రావలెను. గాని 'పిలువక' వలెనే ఇది 'విఱువక' అగును గాని విఱుపక కాదు. ఇందుకు సమాధానముగా ఇది ణిజర్థమందున్నా ఇంచుగాగమమువల్ల అయిన రూపము కాదు గనుక పై సూత్రము దీనికి చెల్లదు అని చెప్పవలసివచ్చును. ఇట్లే విడువక, మఱవక, తెఱవక మొ॥ అయితే పఱచునుండి పఱవక వచ్చునా? శబ్దరత్నాకరములో పఱపు శబ్దమునకు పఱవఁజేయు అని వ్యుత్పత్తిచెప్పిన సీతారామాచార్యులవారి మతమున పఱచునుండి పఱవక రావచ్చునని తేలినది. గాని కవిప్రయోగములు కనబడవు. ఈ సీతారామాచార్యులవారే పఱచు శబ్దమునకు ప్రయోగాలిస్తూ ఈ శబ్దములోని చకారమునకు పకారాదేశము వచ్చిన రూపములే చూపించినారు: "కడుదుర్భరంబునం బఱపకుమయ్య (భార. అర. ౫ ఆ.); ఆ కల్మషులంబఱపంగఁ బాడియే" (భార. ఉద్యో. ౧ ఆ.). ఈ ప్రయోగాలు తాము చూచి, నిఘంటులో కనబరచియుండిన్నీ సీతారామాచార్యులవారు పఱవఁజేయు అని ఎట్లు వ్రాయగలిగినారో తెలియదు.

పైనిచూపించిన భారతప్రయోగములలోని పఱపకు, పఱపంగ రూపములు పఱపు ధాతువునుండి వచ్చినవని కొందరు వాదించవచ్చును గాని వారి వాదన చెల్లదు. ఈ ప్రయోగములు పఱచు ధాతువుక్రిందనే శ. ర. లో ఇచ్చినారు, పఱచు, పఱపు ధాతువుల అర్థభేదములు ఆయా శబ్దముల క్రింద తెలియజేసి ప్రయోగాలిచ్చినారు.

బాలవ్యాకరణములో "ఖండబిందువుమీఁది సిద్ధ చకారంబునకు ముత్తు పరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగనగు" అనిన్ని, ఈ సూత్రముక్రింద "తలఁపక-త్రేఁపక-తోఁపక; ఏఁచునకు వైభాషికంబు ఏఁపక-ఏఁచక; నోఁచునకుం గలుగదు-నోఁచక" అన్ని ఉన్నది. (చూ. సూ. 89). ఏయే శబ్దములలోని చకారమునకు పకారము వచ్చునో ఏయే శబ్దములలోని చకారమునకు పకారము రాదో గణము లేర్పరచలేదుగదా వ్యాకరణసూత్రములనుబట్టిగాని, వాటినిగురించి వ్రాసిన వ్యాఖ్యానములను బట్టిగాని ఎట్లు తెలుసుకొనేది? పోనీ, వ్రాసినంతమట్టుకైనా సరిగా ఉన్నదా అంటే లేదని చెప్పవలసివస్తున్నది. తపమాచరించు అనే అర్థమందు నోఁచు, నోము క్రియల రూపములలో నోమి, నోమని, నోఁచిన రూపములు గ్రంథములలో కనబడినవి. తోచులో వాస్తవముగా ఖండ బిందువులేదు. ఉన్నదని ఋజువుచేయుటకు తగినట్టుగా ప్రాసస్థలమందు ప్రయోగమేమీ కనబడలేదు. లేదని చెప్పుటకు తగినట్టు

"నా చెలికాఁడుహిరణ్యకుఁ
డీ చేరువనుండునెపుడు నిటుఁదా మనపైఁ
<u>దోచిన</u> దుర్దశ మాన్పఁ

జూచునతఁడు నన్నుఁదెలియఁజూచినమాత్రన్"—అని నారాయణకవి పంచతంత్రము (సుహృ. 13)లో ప్రయోగమున్నది. ఖండబిందువు తోచులో లేదు గనుకనే తోతెంచులోసైతము లేదు. శబ్దరత్నాకరములో ఖండ బిందువుతో తోఁతెంచు కనబరచినారు గాని అందు నుదాహరణములుగా ఇచ్చిన తిక్కన సోమయాజిగారి భారతప్రయోగములనుబట్టి తోతెంచులో ఖండబిందువులేదని స్పష్టమగుతున్నది. ఖండాఖండప్రాసము కవిత్రయము వారే ప్రయోగించినారంటే అర్ధానుస్వారవివేచనము మరిఉండదు. తోచులో

అర్థానుస్వారమున్నదని నమ్మకొని పైసూత్రి మాధారముగా చేసుకొని తోఁపదు అని కొందరు వ్రాస్తున్నారు.

ముత్తు పరమైనపుడు 'వచ్చు'కు 'రా', 'చొచ్చు'కు 'చొరు', 'ఇచ్చు'కు 'ఈ', 'చచ్చు'కు 'చావు'-'చా', 'నొచ్చు'కు 'నోవు'-'నో' అగు నని సూత్రములలో చెప్పినారు. సూత్రములలో చెప్పక విడిచిన శబ్దముల మాట ఏమిటి? త్రచ్చు, పుచ్చు, గ్రుచ్చు, ఎచ్చు, విచ్చు, నచ్చు మొదలయిన శబ్దములకు ముత్తు పరమైనపుడు చకారము నిలిచిపోవునా? లేక దానికి పకారము వచ్చునా? వకాగమము వచ్చునా?

వ్యాకరణసూత్రములు ఈ విషయము స్పష్టపరచలేదు. కవిప్రయోగములే ఆధారమంటే ఇంచుగాగమ సంబంధియైన చకారమునకు పకారాదేశము ఒక్క కవిత్రయమువారి ప్రయోగాలలోనే నిత్యముగా కనబడుతున్నది. అందుచేతనే, సీతారామాచార్యులవారు తమ ప్రౌఢవ్యాకరణములో "కవిత్రయేతర ప్రయోగంబులం గొన్నియెడల సత్ప్రత్యయాదులం పరంబులగునపుడు పకారంబించుక్ప్రకారంబుఁ గానిఁ గానఁబడదు" అని చెప్పినారు.

కవిత్రయేతరకవులలో సుప్రసిద్ధకవులు సైతము లోకవ్యవహారమును బట్టి ఈ రూపములు వాడుతూఉండగా గ్రాంథికభాషాభిమానులమనుకొన్న కొందరు ఏతెంచక, తాకుదెంచగన్ అని వ్రాసి ఇవి లక్షణవిరుద్ధములైన ప్రయోగములని ఆక్షేపిస్తే, ఎందుకు లక్షణవిరుద్ధములైనవో సరిగా చూచుకోక, ఏతెంపక, తాకుదెంపగన్ అని రెండవకూర్పులో సవరించుకొని గ్రంథాలు ప్రకటిస్తున్నారు! గ్రాంథికభాషకు ఎట్టి దుర్దశ ఎవరివల్ల కలుగుతున్నదో చూడండి!

## రక్షించు; రక్షించక

సీ॥ ఇనమూనుఁ డోట ధాత్రినధార్మికులఁ దన్ను
నేర్చినట్లంఘ్రుల్ విదుర్చఁ దొడఁగె ॥ ఇందు. ప. II. 16.

ఉ॥ అంచితలీల భోజవసుధాధిపుఁ డప్పుడ బాహ్యాసీమ ని
ర్మించగఁ బంచె రాజులెల మిఱ వసియింపఁగ మంచి గాగస
త్కాంచన నూత్నరత్న ఘన కాంతి తతుల్ తగుచై నభస్థలిన్
మించు మరుద్విమానతతి మీద వసంతపు జల్లు జల్లగాన్॥ ,, V, 60.

చ॥ కువలయపత్త్రి! వీనిఁగనుఁ గొంటివె? నీవు వరింతువో వరిం
చవో యని యెన్నుచుం గుడి భుజంబదరన్ శుభసూచనాప్రద
ప్రవణమెసంగ నిన్నిపుడు పల్మరు చూడఁ దొడంగె నౌర! ఈ
యవిరళ దివ్యతేజుఁడు మహాద్భుత విక్రమశాలియెంతయున్॥ ,,V,165.

మ॥ వరుసన్ దిక్కన యజ్వ నిర్వచన కావ్యంబై తగన్ జేసెను
త్తర రామాయణ; మందునన్ మఱి ప్రబంధంబూని నిర్మించుచో
సరసత్వంబని ప్రాజ్ఞులార! నిరసించన్ బోకుఁడీ రాఘవే
శ్వరు చారిత్రము లెందఱెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే?॥ ఉ.రా. I.

మ॥ కడులేఁ బ్రాయపుఁ బూపచన్నుగవ సింగారంబుఁ బోనాడి యీ
కడుపున్ నేనును బోయి మ్రోలనిలువన్ గన్నయ్య కాపట్యమెం
చడె? విన్నయ్యలు విశ్వసింపుదురె? ఏ సంబంధమున్ లేని యీ
సడి నావంటి లతాంగికిన్ విధి ఘటించన్ జెల్లునే? అక్కటా!॥ ,, I.

మ॥ స్తనభారానతయై మదావృత సముద్యద్గర్భ దౌర్బల్య సం
జనితోచ్ఛ్వాస పరంపరాగతకవోష్ణమ్లాని తాస్యాబ్జయై
కనదాలోక నిరోధి బాష్పకణయై గాఢత్రపాక్రాంతయై
జనకున్ జేరి కుమారి యేమియు గణించన్ జేరకున్నంతటన్॥ ,, I.

సీ॥ మునువిష్ట సల్లాప మున నున్న జెంగటఁ జంచరీకము ఝుంకరించ వెరచు

* * *

మానులు మణులు వోపిననున్న వియంచుయంచ శ్యామగకాయ చించ వెగచు॥

కకుత్స. I, 151.

గీ॥ పెంచి యొకచోట ననునై నటించఁ జాలు
మించియొక చోట విభుపైఁ జరించఁజాలు
దివ్యమీతేరు మీకు నతిప్రయత్న
మున నొనర్చితి గైకొమ్ము మనుజనాథ!॥ ,, II, 32.

చ॥ అమరవిరోధిఁ ద్రుంతు నిదె యంగన! భీరులకెల్ల భీతి క్రై
ర్చుము వెసఁ బొమ్ము నమ్ముమనుచున్ గదలెన్ గయమొప్ప దర్ప దు
ర్ధమ రిపు ఖండకాండ భుజదండమునందుఁ బ్రచండ మండలా
గ్రము ఝుళిపించుచున్ గిరగిరన్ దిరుగన్ నెగనైచి పట్టుచున్॥

కళా. VI, 13.

క॥ మించుగ మాగురువులు శి
క్షించిన యా యొక్కరింత సింగమ్మున నూ
హించ నొక నాల్గు గడియలు
సంచారము వలయు నతని సన్నిధిఁ జేరన్॥ ,, III, 60.

క॥ ......ఎవ్వారినిఁ బో
రించని లక్షణ మొకటి ద రింపఁగ వశమే? ,, II, 5.

గీ॥ సగము చచ్చినవానినె చంపుటనను
జేతకాదయ్యె నా నల్వ వ్రాత ననుభ
వించకయె భువిలోనఁ దప్పించుకొనుట
కేరికైనను శక్యంబె యెంచి చూడ॥ కవిజనచ II, 27.

గీ॥ అట్లు పెదరంగమాంబా మృగాయతాక్షి
తనయుఁడైనట్టి రఘునాధ ధరణి విభుఁడు
తరణి నిభుఁడు ప్రతాప సంతతుల వలన
నంచు బుధలోక మెల్ల వర్ణించ మించు॥ కువల I, 54.

ఆ॥ విన్నకన్న కొన్ని వింత లెంతయు మీకుఁ
దెలుప వలయుఁ గానఁ దేటపడగ
విన్నవించి నార మిన్ని యాకర్ణించి
కొంచెమనక చిత్తగించ వలయు॥ కృష్ణరా. II, 138.

గీ॥ కల్బురిగె కోట మీఁద లగ్గలకు నెక్కి
కార్యమొనరించు జయలక్ష్మిఁ గాంచి యచట
నుంచి తన రాజ్యమునఁ గల్గు నొరపు మీరు
మంచి దేవస్థలంబు వీక్షించ నెంచి॥ ,, IV, 134.

లయగ్రాహి॥ మించ మణిఘంటలు గ హించఁ గటిచక్రములు॥ చంద్రభా.

ఉ॥ గర్జించగ నేమి కారణము దెల్పఁగదోయి భవత్ప్రతాపముల్॥ II, 108.

శా॥ స్వామీ! తావక భుక్తశేషము భుజించం గల్గి॥ చెన్నబ III, 28.

క॥ మంచిది! మీరీసతిఁ బో
షించుండని యొప్పగించి సేనలు గొలువన్
వేంచేసెఁ బురికి హరి యిటుఁ
జంచలలోచనయు మిగుల సంభ్రమ మొదవన్॥ దశా. IV.

క॥ మంచిదని తండులంబులు
వంచింపక నిచ్చి యెల్ల వారలు విన నో
పంచశరాకృతి! మదిలో
భించక నిటురమ్ము కేపు ప్రియమలరారన్॥ నిర్వ వి. రా.

ఉ|| నీచత వాయుపెట్లనిన నిగ్గరవల్లభుఁ డంత నెమ్మదిన్
దోఁచక దోఁచి యిట్లనె... ,,

ఉ|| మంచిదటంచు నత్తరుణి మానసమందు నిజేశుతో గా
వించగ నిశ్చయించి... ,,

ఉ|| సంగత నిష్ఠ నేతపము సల్పగ నెన్నఁటికైనఁ నోనుతిం
చంగల దేవతాపదవి సాధి......... నిరంకు. II, 67.

సీ|| ఎవలేని మగఁటిమి నెసఁగువాఁ గుటుకుఁ
బాంచుండి కోఁతిని బ్రదుచఁదేని...... నీలా. I, 43.

సీ|| మునిఁడి మ్రాఁకునఁ బండ్లు పసపుటాఁకు గట్టించి
యించుక పేలపుట్టించ... || ,, I, 111.

గీ|| కుడిభుజంబునఁ జక్రము గ్యోదము వలన
శంఖమును గాఁగ గురుఁడు గూర్చంగవలయు పద్మ ఉ. భా. V. 31.

ఆ|| అంత ముచ్చుబండ్ల నందఱ రాపించి యాదానమున పీడియంబులాసఁగి
కలదె సొమ్ము వెరవు ఖిలమైన కోటఁ గట్టింప వలయునని తలంచినాఁడు||
పా.ము. V, 9.

సీ|| పరమేష్ఠినుండి నీ వరము దాఁక విశుద్ధ
తరమైన వంశంబు దలఁచవైపు
దటేఁ బ్రోక్కియున్న యీ తల్లి దండ్రులఁజాల
పఱచవై సంతోష పఱచవైతి పాండు. III, 36.

క|| తోఁచిన వగ రచి యించెదఁ గోఁచని చోఁ జిలువకట్టు వరతోడై వా
యాఁచకనె యానతియ్యగఁ దోఁచదసాధ్యంబు కవనధోరణి పట్టన్ ||
ప్రబం.

సీ॥ హెచ్చి చేపట్లకు వచ్చునాతని విలోకించి ప్రార్థనము గావించ వలయు ॥
ప్రబో.

ఉ॥ కాంచన దీప్తిచేఁ బసిఁడి గట్టు తెఱంగు నగళ్ళ కోఁట సూ
చించఁగఁ దాను భాస్కరని చెన్నువహించెను దానిఁ జుట్టిరా
సంచరణం బొనర్చుచును శౌరి తనూజుఁడు కోఁట చుట్టునున్
డించిన దైత్యసైన్యము వడిన్ దమమున్ వలె విచ్చి పాఱఁగన్ ॥
ప్రభా. V, 198.

మ॥ .............శాకీరభా
జనయంత్రంబు ఘటించి దానిఁ దిరిగించన్ యుక్తి చింతించి ॥
బసవ.

శా॥ .............గ్రామ్యబ్రహ్మచారుల్ దువా
లించం బచ్చన ప్రాఁత లూడిపడు మే లిక్కల్గుఱ్ఱపుసస్యంబుకా ॥
బహు.

గీ॥ సత్రపాత్రమాదిగోప దంశక శతంబు నంచుకొంచు నొకించుక దింపుబోక ,,
సీ॥ అధిపుపై సుమనోమ యాంబక వ్రాతంబు
నించ నల్లునిఁ బ్రతిష్ఠించదేని ॥ ,, I, 46.
సీ॥ నభమందుఁ బరచు నందపు తేరు గలదంచుఁ
జంచలాకార ! నిర్జించఁ దగునె ? భాను.
ఆ॥ అతివ క్రోఁతిఁ జూచు నతనిదిక్కును జూచు మర్మకర్మమైనమాట యతని
యందుఁ గల్గకునికి సందేహపడు నిశ్చయించలేక మోము వంచి నడుచు॥
భోజ. V, 244.
క॥ పంచగ్రహమిహిరుని వర్తించని లగ్నమున దిశలు తేజము మించన్
పంచాస్య మధ్యధీరున్ బంచాస్త్రాకారునిం గుమారుని గాంచెన్ ॥
రా. వి.

శా|| ............కుంతలశ్రేణి స
్తరించఁగా నీలగళుం గనుంగొనుట కే తెంచెన్ సిరుల్ మించఁగన్ ||

రాజశే. II, 129.

సీ|| మడిగట్టు వడి దాఁటఁ దనబడు తెట్టువ
మించి వారాశి లంఘించఁగలఁడె? ,, III, 24.

మ|| శరణన్ వారల యాపదల్ పరిహరించన్ రాముఁడుండంగ

రామ స్త.

సీ|| గోటిచేతను వీణె మీటి తేనే సరా
గించక రాల్గరించఁగలదె? రాధికా III, 14.

తే|| గీ|| ఎంత వేఁడిన బదులాడ వేమి చిలుక !
కాలగతు లెట్టులున్న వో గనవినావొ ?
కాఁగలది కాకమానదు కానఁ దెల్పు
చిల్లకై వచ్చి మంత దాఁచంగ నేల ? ,, II, 126.

మత్త|| పంచసాయకు సాయకంబుల బాధ కోర్వఁగఁ జాలకే
నంచయాన వరించు వేళ నొ కప్పుడున్ మిముఁగూడి వ
్తరించరాదని యింతి నన్నుఁ బ్ర తిజ్ఞచేసిన నట్ల కా
వించఁ జాల్పడినాఁడ నట్లొనరింపఁగాఁ దగు మీరలున్ ||

రుక్మాం.

క|| కొంచెపు విలుకొని నన్నెదిరించంగా లేవు ఖల దర్పశిఖ విన వే
మంచున నిడిన తుషారము లెంచంగా గాదిఁ బెట్ట నేత్రియ నోర్తున్ ,,

గీ|| కాన మకరంద గరళ దిగ్ధ ప్రసూనశర పరంపర విహతుల సంహరించు
మంచుబోధించు శుకభాషణాలకించు క్రించునను విరహీవ్యథ దుర్జయించరాదు||

వరా. IV, 18.

ఉ॥ మంచు మునుంగు పూని లవ మాత్రము పద్మిని మోము దమ్మి ప్రే
పించమిఁ జన్ను మొగ్గల నిభేద్యతరచ్ఛద గుప్తి నేమియుం
మించమి నొక్కటం గడు భ్రమించుచుఁ దత్సుమనోవికాసవే
ళాంచితవైభవంబునకు నాసపడుం నృపనేత్ర భృంగముల్
వసు. VI, 82.

గీ॥ చక్రవిజయంబొనర్చి నీ సన్నుదోయి కంచుకంబేల యింకఁ జాలించరాదు
నిర్మలామూల్యగుణరత్ననిధికి నీకు వనజముఖి! త్రాసమిదియేల? వదలరాదె?
,, VI, 84.

శా॥ అంచుం మమ్ముల నూడించి విన యాహ్లాదంబు లెంతే విజృం
భించం ద్రొక్కి జగంబులందుల మిముం జేపొన్నమాత్రం బటా
పంచంబై దురితంబులెల్లఁ జనగా భక్తిం మిముం నేఁడు ద
ర్శించం ఖేదముపోయి మోదము మదిం జెన్నారదా నారదా!
విజయవి. II, 65.

ఉ॥ వంచనఁ జేసి యిట్లు చెలువంగొనిపోవఁ బ్రబలంబనైరి సై
రించునె దుర్మదాధిప వరేణ్యుల భూములఁ గొట్టి దూళిఁ గా
వించఁడె పిండిగాఁగ ఘన వీరవిరోధి కిరీటరత్నముల్
దంచఁడె ఘోరసీరముసలంబులు వ్యర్థములే ధరించుటల్?
,, III, 59.

గీ॥ కరుణ మీరఁగ నడిగిన కతన నేను జిత్తమందిట భావించి చెప్పినాఁడ
నంతెయేకాని శ్రీవేంకటాద్రియందు జూచిచెప్పితినని మీకుఁదోఁచవలదు.
వేం. శ్వా.

ఉ॥ కొంచక రేయునుం బవలుం గోవెల కీతఁడు పువ్వుదండల
ర్పించు నెపంబునం బరిచరింపుచు నుండిన టుండి యొయ్యనే
పంచను బొంచి యప్సరసల వద్దఁ దొలంగిన సందుఁజూచి లం
కించఁగ నోపు నీ పసిఁడి గిన్నియ; సంశయ మేల పెనికిన్ ॥ నైజ. IV, 109.

గీ॥ తెలివ! మీశీలమెల్లను దివ్యదృష్టిఁజూచినాఁడను నీవింక దాఁపవలదు
నీవె చెనకితివో లేక నిన్ను వాఁడె చెనకెనో తెల్పు; తెలిసి శిక్షింతుననిన ॥

శశాం. IV, 18.

మ॥ చపలాక్షీమణినిన్ వివాహ మొనరింపన్ గార్య మూహింపుచున్ ॥

శుక.

గీ॥ ఓపకిటువలె నీవింతవాఁడవేని మించి తెగినట్టు బుద్ధి చెప్పించవచ్చు
గ్రామమునకెల్ల మాలిమి కాఁపవగుట బ్రతికపోతివి; పోర బాపఁగిరాస!

సీ॥ విష్ణుసంకీర్తన విడిచి శంకరహర శబ్దము లుచ్చరింపంగ వచ్చు ॥

గీ॥ కాన శరదభ్రములు మగవానిమాట లెంచి చూచిన మదివిశ్వసించరాదు;
వట్టి తెచ్చిన లటుగట్టి పెట్టిపొమ్ము నీవువచ్చిన జాడనే నృపవరేణ్య!

షట్చ. VI, 116.

క॥ ఒక యింతియుఁ దానఁ జలింపక యున్నన్ గినిసి శంబ సాధనుఁడరుణాం
బకుఁడై శూలముఁగైకొని పకపక నగి వైచె చీన బ్రతుకుసమటంచున్ ॥

సమీ. I, 171.

ఉ॥ అర్చనొ తీర్చనో తెలుప నయ్యెడిదేమని యంతఁ దేరిహో
యోర్చు పెటుంగ కంటి సవ యోత్తమ నీ వెవరయ్య నన్ను నీ
డేర్పఁ దలంచి మానవుని శేవను వచ్చిన శంకయుండవో
కూర్చిన ప్రాణబంధుఁడవొ కూరిమి రాఁగదె మెయ్యదియ్యెడన్ ॥

సారంగ. III, 185.

## పట్టుక

పట్టుకొని, పుచ్చుకొని, చేసికొని మొదలయిన క్రియారూపములలో ఆత్మనే పదార్థమందు అనుబంధముగా ఉన్న 'కొని' కొను ధాతువు యొక్క క్త్వార్థక రూపము. అనుబంధముగా గాక ప్రత్యేకించి ఉండే 'కొను' స్వతంత్ర క్రియ గనుక దాని క్త్వార్థక రూపమయిన 'కొని' లోని అంత్యవర్ణమునకు లోపమురాదు గాని అనుబంధముగా ఉండే 'కొని' ప్రధాన క్రియా రూపమునకు పరముగా దానితో కలిసి ఉండడంవల్ల ఉచ్చారణలో బలము లేనిదై అందులోని అంత్యవర్ణమైన 'ని' లోపించడమే కాక కవర్ణము పైనున్న అచ్చుకూడా అస్పష్టముగానో వివిధముగానో ఉంటుంది. అందుచేత, పట్టుకొ పోయెను, పట్టుకుపోయెను, పట్టుకపోయెను, చేసుకు పోయెను, అనే రూపములు వినబడుతున్నవి.

ఈ రూపముల గురించి బాల వ్యాకరణగుప్తార్థ ప్రకాశికాకారులు క్రియాపరిచ్ఛేదము 53 వ సూత్రమునకు తాము వ్రాసిన వ్యాఖ్యలో "చేసికొని, చదువుకొని ఇత్యాదిక్త్వాంతంబులకు బదులుగా చేసుక, చదువుక ఇత్యాదిక్త్వాప్రత్యయాంత సంగ్రహ రూపంబు లనంతామాత్య తిమ్మకవ్య ప్పకవ్యాది లాక్షణికులచేఁ దమ గ్రంథంబులయందు వాడంబడినవి. కాని రూపంబు సూత్రంబున నిరూపింప బడలేదు." అని 28 ప్రయోగాలు ఉదాహరించినారు. హరికారికలలో ఈ సంగ్రహ రూపములకు లక్షణమున్నది.

ఈ రూపములు కవిత్రయము వారి గ్రంథములలో మాకు కనబడ లేదుగాని చాలాకాలమై సుప్రసిద్ధకవులు వీటిని తరుచుగా ప్రయోగిస్తూ ఉన్నారు. మడికి సింగన తన పద్మపురాణంలో కూడుక (చూ. I. 100) సంధించుక (చూ. III, 72) అని ప్రయోగించుటచేత అతని కాలానికి ఈ సంగ్రహ రూపము వాడుక లోనికి వచ్చి ఉండును. గాని పిల్లలమర్రి పిన వీరభద్రుని కాలమువరకు ఈ సంగ్రహ రూపములు కవులు తరుచుగా

వాడినట్లు కనబడదు. శ్రీనాథుడు రచించిన హరవిలాసము (II, 115)లో "అంటుక", పల్నాటి వీరచరిత్రలో 'పట్టుక', 'తలచుక' ప్రయోగములు కనబడినవి. శబ్దరత్నాకరములో చీకిలించుట అనే శబ్దము క్రింద కాశీఖండము లోని "చీకిలించుక యుండు" అనే పద్యము ఉదాహరించినారు. అచ్చు ప్రతులలో ఈ పాఠమే కనబడుతున్నది; గాని, వ్రాత ప్రతులలో 'చికిలించుకొని యుండు' అని ఉన్నది. ఏదైనా సుమారు ఆరు వందల సంవత్సరములయి ఈ సంగ్రహ రూపములు గ్రంథస్థమై ఉన్నవని చెప్ప గలము. ఇవి ఈ విధముగా కవి సమ్మతములై ఉన్నా కొందరు పండితులు వీటిని తప్పుగా భావించి అచ్చు ప్రతులలో దిద్దుటకు సాహసిస్తున్నారు. ఆముక్త మాల్యద (1, 75) లో "కలమపుటెండుగుల్ ద్రవిడ కన్యలు ముంగిటఁ గాచుకుండి" అని వ్రాత ప్రతులలోని పాఠము. ఈ పాఠమే శబ్దరత్నాకరములో 'ఎండుగులు' శబ్దము క్రింద ఉదాహరించినారు. గాని వావిళ్లవారి ప్రతిలో 'గాచియుండి' అని దిద్ది సవరించిన పాఠము కనబడుతున్నది.

ఈ సంగ్రహ రూపములను గ్రహించిన వారిలో కొందరు 'చేసుక' సరియైన రూపము కాదనుకొని 'చేసిక' అనే ఇకార మధ్యము రూపములు—వాడుక భాషలో గాని గ్రాంథిక భాషలోగాని—ఎక్కడా లేని రూపములు వాడుతున్నారు. శ్రీయుత కూచి నరసింహముగారు తమ గౌరాంగ చరిత్రములో "మూసుకు" అని వాడుక భాష ననుసరించి ప్రయోగించి, గ్రంథము అచ్చయిన తర్వాత ప్రతులు పాఠకులకు పంపించి నప్పుడు, ఎర్రసిరాతో 'మూసిక' అని దిద్దిమరీ పంపించినారు. ఇందుకు వారికిగల కారణ మేమంటే, చిన్నయ సూరిగారు తమ బాలవ్యాకరణము—క్రియాపరిచ్ఛేదము 53 వ సూత్రములో "కొను ధాతువు పరంబగు నప్పుడిగాగమంబు బహుళంబుగా నగు-వండికొనియె, వండుకొనియె; బహుళంబనుటచే యాంతంబునకు నిత్యంబు-చేసి కొనియె" అన్నారు. అందుచేత

'చేసికొని' అనే శబ్దమునకు 'చేసిక' రావలెనని వీరి అభిప్రాయము. అయితే చేసిక వంటి సంగ్రహరూపములు ఇకార మధ్యమముగా గ్రంథము లందు గాని వాడుకలో గాని కనబడలేదు. అసలు ఈ సంగ్రహరూపము లను చిన్నయ సూరిగారు గ్రహించనే లేదు గదా. గ్రాంథిక భాషాభిమాను లైన కూచి నరసింహము పంతులు గారు ఈ కృతకరూపమును ఎట్లు ప్రయోగించినారు? ఇప్పుడు దురభిమానమువల్ల ఇటువంటి కృతకరూప ములు కలుగుతూ ఉన్నవి.

'కనుధాతువు'కు కొని అను బంధముగా చేర్చి 'కనికొని' అనే ప్రయో గము తిక్కన సోమయాజిగారు తరుచుగా వాడినారు. ఇది రాను రాను వాడుకలో 'కనుక్కొని' గా మారినది. అట్లుమారిన తర్వాత 'పట్టుక, సాదృశ్యమును బట్టి "కనుక్కొచ్చారు" అనే ప్రయోగము వాడుకలోనికి వచ్చినది.

'మొదలు కొని' లో 'మొదలు' క్రియారూపము కాదుగనుక 'మొదలుక' అనే సంగ్రహరూపము రాదు.

పట్టుకొని, చేసికొని మొదలయిన రూపములలో అనుబంధముగా ఉన్న 'కొని'కి పూర్వమందుండే క్రియారూపము వాస్తవముగా క్త్వార్థక రూపము. వండికొని, పట్టుకొని, తెచ్చికొని, చేసికొని మొదలయిన రూప ములలో క్త్వార్థక రూపము స్పష్టము. పట్టుకొని, వండుకొని తెచ్చుకొని మొదలయిన రూపములలో పట్టు, వండు, తెచ్చు మొదలయిన క్రియా రూప ములు క్త్వార్థకరూపము లంటే నేటి తెలుగువారికి వింతగా తోచక మానదు. గాని సజాతీయమైన కన్నడ భాషలోను అరవభాషలోను ఉకారాంతముగా ఉన్న క్త్వార్థకరూపములు చూచిన యెడల ప్రాచీ నాంధ్రములో కూడా క్త్వార్థకములు ఉకారాంతముగానే ఉండి యుండ వచ్చునని తోచకమానదు. కన్నడభాషలో,

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆను | (=అనుకొను) | – | క్త్వా. | ఆతు | (=అనుకొని) |
| ఈ | (=ఇచ్చు) | – | ,, | ఇత్తు | (=ఇచ్చి) |
| ఈను | (=ఈను) | – | ,, | ఈదు | (=ఈని) |
| కొళ్లు | (=కొను) | – | ,, | కొండు | (=కొని) |
| బరు | (=వచ్చు) | – | ,, | బందు | (=వచ్చి) |
| బిగు | (=బిగియు) | – | ,, | బిక్కు | (=బిగిసి) |
| సా | (=చచ్చు) | – | ,, | సత్తు | (=చచ్చి) |
| హోలు | (=పోలు) | – | ,, | హోతు | (=పోలి) |

ఇకారాంత క్త్వార్థక రూపములు లేకపోలేదు గాని చాలా తక్కువగా ఉన్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అగు | (=అగు) | – | క్త్వా. | అగి | (అయి) |
| హోగు | (=పోవు) | – | ,, | హోగి | (పోయి) |

వీటిని బట్టి గకారాంత ధాతువులకే క్త్వార్థక రూపములు ఇకారాంతములగునని చెప్పలేము; ఉకారాంతములుగా కొన్ని ఉన్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| ఉగు | (=విసరు) | క్త్వా. | ఉక్కు | (=విసరు) |
| నగు | (=నగు, నవ్వు) | ,, | నక్కు | (=నగి, నవ్వి) |

గకారాంత ధాతువు కాకపోయినా

బినుడు (=పారవేయు) క్త్వా. బినుటు / బినుడు } అని రెండు రూపాలున్న ఉన్నవి.

అరవములో వందు (=వచ్చి), సెయ్దు (=చేసి), అరిత్తు (=కోసి) ముడిత్తు (=ముగించి), సాత్తు (=చచ్చి) మొదలయిన క్త్వార్థక రూపాలు చాలా ఉకారాంతముగానే ఉన్నవి. పోయ్ మొదలయిన క్త్వార్థకరూపాలు కూడా కొద్దిగా లేకపోలేదు. నా౯ పోయ్ అప్పడిసెల్లువే౯.

తెలుగుభాషలో ఉన్న కొను ధాతువుకు సరియైన అరవభాషలోని ధాతువు కొండు; కన్నడ భాషలోని ధాతువు కొళ్లు, దీని క్త్వార్థకరూపము కొండు; అరవ భాషలో సైతము క్త్వార్థక రూపము కొండు అనే ఉన్నది. కొండు పోనార్ (=కొనిపోయినారు). కొండువందు (=కొనివచ్చి) ప్రాచీనాంధ్రములో సైతము కొండు ధాతు వుండేది అనుటకు కొండాడు (=కొనియాడు) కొండాటము (=కొనియాడడము, సంతోషము) నిదర్శనములు. ఇవి కవులు ప్రయోగించినారు. ఈశబ్దములు కన్నడములోను, అరవములోను ఉన్నవి. 'కొండు పోయినారు' అనే ప్రయోగం శిష్టజన వ్యవహారములో లేక పోయినా అనాగరికుల నోటను నేటికిన్ని నిలిచి యున్నది. పైని చెప్పిన విషయములను బట్టి చూడగా ఇది చాలా ప్రాచీన రూపముగా కనబడుతున్నది.

నన్నయ నాటికే క్త్వార్థక రూపాలు ఇకారాంతములయినవి. ఈ విధముగానే ద్రావిడ భాషలలోనే చేరిన గోంది భాషలో కూడా క్త్వార్థక రూపములు ఇకారాంతములైనవి; తూసి (=పంచి), కీసి (=చేసి), హాంజి (=పోయి), సాసి (=చచ్చి), కేయిసి (=పిలిచి) మొదలయినవి.

తెలుగు భాషలో అనుబంధముగా ఉండే 'కొని' గోంది భాషలో 'కున్' అయినట్టు కనబడుతుంది. కీసికున్ (=చేసుకొని), మూనికాఙ (=కలుసుకొని), విచ్చికున్ (=పరుగెత్తుకొని) మొ|| (చూ. లింగ్విస్టిక్ సర్వే)

క్త్వార్థక రూపములు అరవములోను, కన్నడములోను, కొండాడు అనే తెలుగుభాషలోని క్రియారూపములోను తరుచుగా ఉకారాంతముగానే ఉండంచేత, కొని అనుబంధమునకు పూర్వమందున్న క్రియారూపములు ఉకారాంతములయినా, అవి క్త్వార్థక రూపములే అనిన్ని, పట్టుకొని, వందుకొని మొదలయిన శబ్దాలలోని పట్టు, వందు రూపాల ఉచ్చారణ సాదృశ్యమును బట్టి చేసికొని, పోసికొని మొదలయిన శబ్దాలలో ఉన్న చేసి,

పోనీ మొదలయిన ఇకారాంత రూపాలుకూడా తెలుగువారి ఉచ్చారణలో ఉకారాంతములయిన వనిన్నీ, అందుచేత పట్టుక, తెచ్చుక, తీసుక, మొదలయిన రూపాలు ఉకారమధ్యముగానే ఉండడము విపరీతము కాదనిన్నీ విషయంబాగా విమర్శించిన వారికి తోచక మానదు.

క॥ యరలవలంతస్థలు నాఁ
బరఁగును శషసహాలు దేఁటపడునూష్మలనన్
సొరిది ఋకారము గూడుక
సరి నేఁబదియయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్॥ అనంత. ఛంద.

ఉత్కళిక॥ మందుపావకుఁగొల్చి ఖాండవాహుతి వ్రేల్చి
పార్థివేశ్వరుఁగాంచి పార్థునక్కడనుంచి
దారకుండమరించి చేరఁదెచ్చిన మంచి
యరద మెక్కుక పూని పురికివచ్చినవాని॥ అప్ప. IV, 316.

క॥ శమితాఘ కర్మధారయ
సమసనమునఁదుదివి గొమ్ము సంధిల్లెడు శ
బ్దములు వికృతిఁ బొల్లు టకా
రము వెట్టుక సంధిఁ జెందుఁ బ్రాణముతోడన్॥ ,, V, 91.

ఉ॥ అంతటఁ బొంత బెద్దరువునం దరుదెంచు పిఱిందిమంది ను
త్కాంత సహోదరుండును నొకం దరుదెంచుచు సాతువద్ద వృ
త్తాంత మెఱింగి నన్నరసి తాఁగని యార్తినొకండు దానవి
క్రాంతుని నమ్మఁగావలు దిసంతులుగొట్టుచు మోచుకేఁగుచోన్॥
ఆము. VI, 84.

సీ॥ కొంగవాల్న అంకులంగుళులఁ బట్టుక జబ్బ
లంటఁగట్టిర వెజ్జు నరయువారు॥ ,, VI, 85.

సీ॥ ముసుకు వేసుక మూలమూలఁ డాఁగిన దిశా
ధిపుల కిప్పుడు బయల్దేరఁగలిగె॥ ఉ. రా. I, పుట 10.

క॥ పిచ్చుకపయి బ్రహ్మాస్త్రము
విచ్చలవిడి నిగుడఁ జేయువిధ మింతేకదా
మచ్చరము మనుజతతిపైఁ
దెచ్చుక పోరియింప నీవు దిరుగుట లెల్లన్॥ ,, I, 107.

ఉ॥ మించిన వేడ్కఁ గర్కశులు మీసలు దీటుచు దిక్కుడుంగముల్
చించుక పాఱనార్చుచు మషీమలినాంగ వినీలిమచ్ఛటా
వంచితభానులై కయిదువల్ ఝళిపించుచు లోకమెల్ల భ
క్షించెదమంచు వింధ్యగిరిఁ జేరఁగవచ్చిరి తండ్రిపంపునన్॥
కాశీ. మా. II, 155.

సీ॥ చీకిలించుక యుండుఁ జిగురుటెప్పలలోనఁ
గుసుమసాయకవైరి నొసలికన్ను॥ కాశీఖం.

ఉ॥ భామిని కన్నులం దొగరుపట్టఁగఁ జూచి మనోహరుండు దా
నేమియుఁ బల్కఁడయ్యె మఱి నేమియుఁ జెప్పకయుండె వీదియం
బేమియుఁ జేయకుండెఁ దలయించుక వంచుక శయ్యయోరము
క్తామణులేఱి పేరులను గ్రక్కునఁ గూర్చుచునుండెఁ బేరులన్॥
గంధ. 26.

ఉ॥ అక్కమలాక్షపార్థుల రథాశ్వయుతంబుగ బాణరాశిలోఁ
జిక్కుపడంగఁజేసె నవి చిత్రముగాఁ దునుమాడి క్రీడితో
నుక్కున వానితేరు దివి కుప్పర మెత్తుకపోవ నేసినన్
జెక్కలతోడి మేరుశిఖరిం దలఁపించె నిలింపకోటికిన్॥
జైమిని V, 62

క॥ ఇచ్చిన మచ్చిక బుచ్చుక
యచ్చెలి మెచ్చుచు మునీంద్రుఁ డౌదలఁదాల్చెన్
జిచ్చుఱకను దేవరపై
నచ్చరనది దాల్చు చెలువ మచ్చుపడంగన్॥ దశా. 45.

క॥ వచ్చెఁగద విటులపాలిఁటి
చిచ్చుఱపిడుగింక నేమి సేయుదుననుచున్
ఱిచ్చపడి యంతలో ధృతి
దెచ్చుక రక్షకుఁడు నాకు దేవుఁడెయనుచున్॥ నిరంకు. II, 122.

క॥ ఒకతెవలెనాడి యాడిం
చుకొనుట నే యిరుగుపొరుగు చూచెనొకో యు
ప్పుకుఁజప్పుకుగా ననుజూ
చుక నడువఁగవలెఁ గులీనకుకసల్లాపల్॥ „ II, 58.

చ॥ అనలములో ఘృతం బొలికినట్లుగ మండుచు రామభద్రభూ
జనపతిఁ గాను నేను చెరసాలను నుంచిన పత్నిఁ దెచ్చి గా
దనకను రాజ్యమేలం విహితంబుగ నాయిలువెళ్ళి వచ్చి బం
తనెసరిపోయెఁ బొమ్మనిన తర్లిరి పుత్రిని వెంటఁ బెట్టుకన్॥
పట్టాభి. II, పుట 45.

క॥ బంధుజన దాసదాసీ
బంధుర సంపత్ప్రపూర్ణ భవనంబున ని
ర్బంధమును విడిచి సుఖమును
సంధించుక దృఢవిరక్తి సంపద పేర్మిన్॥ పద్మ. ఉ. ఖ. III, 72.

శా॥ అంగజ్ఞానపరీక్షకై చరణ నాసాస్వాదులేదేది యం
చుంగందోయి క్రమంబుగా నడుగుచో సూర్యేందులం జూప యా
త్సంగాలంకృతయైన యా శిశువు యాథార్థ్యోక్తి కాదంచుఁ దాఁ
గెంగేల్ దట్టుక నవ్వుమోనక తదుక్తి ......॥ పార్వ. 16.

సీ॥ అక్క మహాదేవి గ్రక్కున మద్దెల
గట్టుక ముట్టము గతులఁగూడ॥ బసవ. 78.

క॥ అకటకటా యనుహరుఁ జు
ట్టుకచుట్టుక తిరుగు భ్రమ నిటునటును మదిలో
వికలతనొందున్గన్ని
టికి కాఁగణమరయు మఱియు డెందములోనన్॥ ,, పుట 118.

రగడ॥ బంతులాడుదము వంతులుంగట్టుక
చెంతకురమ్మా చెలిఁ జేపట్టుక
ఏతెంతము మఱి యిందరు వేడుక
నాతపకేళుల నందఱుఁగూడుక॥ బిల్హ. II, 29.

క॥ క్రిమిభోజనమనియెడి నర
కమునంబడి క్రిములై కూడుగాఁగుడుచుచుఁ దాఁ
గ్రిమియగుచు లక్ష పరిమా
ణముఁగల క్రిమిగుండమందు నాఁటుకయుండున్॥ భాగ. V, 2-145.

శా॥ విండాజ్ఞ నోపఁగిరిట్లో చండాయో ముండ! సమద సైన్యముతో దగ్
జండగతి నేఁగి యీడ్చుకు రండిప్పుడ కడఁగి దుష్ట రాముని బలిమిన్॥
మార్క. 358.

ఉ॥ అత్తఱి మిన్నుముట్టిన మహాసుర మూఁపులు గ్రుంగ లావుమై
నొత్తినవాఁడు నొచ్చియు మహోద్ధతితో నతి ఘోరమూర్తియై
యొత్తుకపోవఁగా నృపతి యోఁగఁగనిమ్మెట కేఁగెనని వీఁ
డెత్తెరువేఁగె నత్తెరువ యిష్టము వోమనకంచు నుండఁగన్॥
భా.రా. I, 30.

గీ|| కనక భూషణ హరినీల కాంతితతుల
తోడశోడుగఁ గూడుక క్రీడసేయు
కరణిఁ దనరెడుఁనట్లు జొక్కముగ మెఱయు
బవిరి గడ్డంబు సొగసు శేర్వడఁగ దువ్వె || రాజశే. I, 112.

చ|| ప్రకట మనోజ రూప! పసి బాలుఁడవంచును నమ్మి ప్రక్క నుం
చుక నిదురించగా రాధా. I, పుట 10.

చ|| వెడవిలుకాఁడు లోపలను వెల్వల గాలియు బైనిఁజంద్రుఁడున్
జడగొని బుట్టు గిరములుం శారికలున్ బికహంసముల్ సెరా
యిడునులఁ బెట్టఁగాఁ గలికి యిట్టటు బెట్టుకగొట్టుకాడుచున్
బడలి విరాళిచేఁ గుముద బంధునిఁ గన్గొని సైఁచకిట్లనున్ || రాధికా.

ఆ|| వెండిగిన్నెలోన వెన్నయు బువ్వయుఁ
బసిఁడిగిన్నెలోనఁ బాలు నిడుక
చందమామ రావె జాబిల్లి రావె మా
పాపతోడ నాడ మాపులనుచు || రుక్మి. ప. I, 82.

రగడ|| కనకయు నందయు మొదలగు నదుల
గట్టుకుఁ బుట్టునుఁ గల కన్నెనియు|| వరా. X, 144.

ఉ|| ఊఁదుకపోవు శంఖమున హోగళరేఖ|| విజయ. I, 134.

ఉ|| ప్రొక్కిన నెవ్వరేమనఁడు మోమటుపెట్టుక చక్కఁబోయె నీ
దిక్కును జూడఁడాయె నొక దీవెనమాటయు నాడఁడాయె కేఁ
డెక్కడి వైష్ణవుండు మన మేటికి ప్రొక్కితిమమ్మ యక్కటా !
నెక్కొని వెఱ్ఱిబుద్ధి మెయి నిద్దురవోయిన వాని వాళ్ళకున్ ||
వై జ. II, 10.

మ|| పురికింబోయెద నన్నమాత్రమున నంభోజాస్య యిట్లాదురే
ధరణీనాథులు భూమి పాలనము చేతల్ మాని క్రీడారతిన్
సరవింటంగొని యున్న పూజ్యయగు రాజ్యశ్రీకొనల్ సాగునే
యరయంగా మొద బట్టు కొయ్యఁ దిరుగన్ హారంబులే భామినుల్||

శకుంత. 80.

ఉ|| అందుక యుగ్రతుండమున నందుక నబ్ధి పరిభ్రమించు న
మ్మందర శైలమోజున న మందరమా దివిజేంద్రుఁ డంతి వీ
కందగదొడ్డునిల్చు తురగంబురగంబురగారిఖడ్డు బా
యందగఁ బట్టె కందమున నంపఱు నం దరుదంది చూడఁగన్||

శశాంక V, 31.

ఉ|| క్రోధము గల్గి చెల్లెలను గొబ్బున పుత్రిని వెంటఁబెట్టుకన్
బాధలు బొందుచున్ వగపు బాసి ఘటోత్కచుఁ జేరి యుండుటన్
మాధవుఁ డాత్మలోఁ దెలిసి మర్మము రామునికిక దుష్ట దు
ర్యోధను త్రుళ్ళడంచుటకు యోచన సేయుచు నుండె నానియై||

శశి. 43.

సీ|| ఇనుఁడుఁ గన్పడని సు శ్వేతఁగిమందేహుబు
కొంచక నిల నల్లు కొని రనంగ
సకలంబు నాక్రమించుక నొక్క రూపమై
పరఁగిన మాయా ప్రపంచమనఁగ||     శ్రీ. ప్రబ. వేం. వి. 64.

ఉ|| కూరిమిఁ దోడిచేడియలఁ గూడుక వేడుక నొక్కనాఁడు బం
గారపువన్నెకన్నె తొలుకారు మెఱుంగు తెఱంగు రంగు సిం
గారమెసంగ సంగతిఁగ గమ్మని క్రొవ్విరితేనె సోనలన్
జీరుకు వాలుకేళివన సీమ విహారము సేయుచున్నచోన్ ||

సమీ II, 44.

లయగ్రాహి॥ పొంచుక మదించి నిరసించి జిగమించి నడ
సంచు ధరమించు దగనంచు మదినెంచుకా॥ సానం. 46.

గీ॥ మ్రానుమీటుగ నెగయు గోమాయువప్పు
డేకతాళప్రమాణ మట్లెగసికూన
గుంతలోఁబడ గ్రుడ్లువెల్కుఱుక నాల్క
నడుముగఱచుక నరచుచు బెడసిమడిసె॥ హంస. I,193.

సీ॥ చన్నిచ్చుచాఁగున జనయిత్రి తొడలపైఁ
బసిబిడ్డఁ బవ్వళింపంగఁబెట్టెఁ
జందని కతన హస్తప్రణాలంబుల
గ్రింద నంటుక సంతరించుకొనియె॥ హరవి. II, 115.

సీ॥ ముక్కుపట్టుక సంధ్య మొనసి వార్చఁగవచ్చు॥ నృ. శతకము.

సీ॥ ఆడుబిడ్డల సొమ్ము లపహరించుటకంటె
బిండఁగట్టుక నూతఁ బడుట మేలు

ఉ॥ గిట్టుట కేడ గట్టడ లిఖించిన నచ్చటగాని యొండుచోఁ
బుట్టదు చావు జానువుల పున్కలు నేసు కాశిఁజావఁ గా
లట్టిన శూద్రుడుకా భ్రమలు గప్పుచుఁ దద్విధి మాయగుట్టమై
పట్టుకవచ్చి మట్టికడఁ బ్రాణముఁ బెరెఁగదయ్య భాస్కరా॥
భాస్కరశతకము.

క॥ అడిగిన జీతంబివ్వని
మిడిమేలపు దొరనుగొల్చి మిడుగుట కంటే
వడిగల యెద్దులఁగట్టుక
మడిదున్నుక బ్రతకవచ్చు మహిలో సుమతీ॥ సుమతిశతకము.

క॥ ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికామాటలాడి యన్యుల మనముల్
నొప్పింపక తా నొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుడు సుమతీ॥ ”

నుంచి

బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికలో కారక పరిచ్ఛేదము నందున్న “ఉండిశబ్దము పరంబగు నపుడు వలనకు ద్వితీయ సప్తములు ప్రాయికంబుగ నగు” అనే 11-వ సూత్రమునకు వ్యాఖ్య వ్రాస్తూ “‘వనమునుంచి’, ‘ధనము నుంచి’ యని ‘యుంచి’ శబ్దాను ప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరు గాని యది సాధుకవి ప్రయోగారూఢంబు గాదని యెఱుంగునది” అని చిన్నయసూరి వ్రాసిన వాక్యానుసారముగానే కల్లూరి వేంకటరామ శాస్త్రులవారు తమ యభిప్రాయము తెలియజేసినారు. గాని సాధుకవి ప్రయోగములు లేక పోలేదు. మాకు కనబడిన లక్ష్యములు ఈ అవతారిక దిగువను ఉదహరించినాము.

పంచమీ విభక్త్యర్థమును సూచించే ‘ఉండి’ ఎట్లు ‘ఉండు’ ధాతువు నుండి వచ్చిన క్త్వార్థకావ్యయమో అట్లే ‘ఉంచి’ కూడా ‘ఉంచు’ నుండి వచ్చిన క్త్వార్థకావ్యయమే. 10 వ సూత్రమునకు వ్రాసిన వ్యాఖ్యలో “నాకంబు వలన నుండి నారదుండు వచ్చెను” ఇచ్చట నారదుండు నాకంబును విడిచి వచ్చెనని ఫలితార్థము. నారదుని యెడఁబాటునకు స్వర్గమవధి (మేర) యైనది కావున నట్టి యర్థమందు వలన వర్ణకంబు విధింపఁ బడఁగాఁ దాదృశార్థంబును స్పష్టపఱచు నిమిత్తము ‘ఉండి’ పదంబు వలన వర్ణకంబునకు జోడింపఁ బడియె. కాఁబట్టి ‘ఉండి’ అను దానికిని ‘వసియుంచి’ యన్న యర్థం బిట్టి చోటుల నెప్పుడును లేదని యెఱుంగునది”

అని సూత్రార్థ ప్రకాశికా కారులు వ్రాసినారు. గాని వారు చెప్పినది సరికా లేదు. నారదుని యెడఁ బాటునకు ఏది హేతువై ఉండెనో దానిని విడువక మునుపు అక్కడనే ఉండెను అనే అర్థము ఎందుకుంచేయరాదు? "సనత్కుమారుఁడు మహికిఁ జనుదెంచె బ్రహ్మలోకంబున నుండి..." (ఆది. III, 90) అనుటచేత మహికి రాకమునుపు సనత్కుమారుడు బ్రహ్మలోకమందు ఉండెను అని అర్థము కాదా? రాను రాను 'ఉండి' అనే రూపమునకు ఇట్టిచోట్ల 'వసించి' అనే అర్థము అప్రధానమై పంచమీ విభక్త్యర్థము ప్రధానమైనది. 'ఉంచు' అనే క్రియకు ప్రేరణార్థక రూపమైన 'ఉంచి' కి సైతము మొట్టమొదటను గల ఉండనిచ్చి అనే అర్థము రాను రాను అప్రధానమై పంచమీ విభక్త్యర్థమే ప్రధానమైనది. ఈ శబ్దములకు సహజముగా గల అర్థములు స్మరణలో ఉన్నప్పుడు "వాడు స్వర్గమునుండి భూలోకమునకు వచ్చెను; వాడు ఇంటిలో నుంచి పుస్తకము తెచ్చెను." అని ప్రయోగించడమే సహజముగా కనబడు తున్నది. ఇట్టి అర్థ విశేషం ఉండం వల్లనే 'ఉంచి' రూపము వచ్చి యుండును. రాను రాను రెండు రూపములున్ను సమానార్థకములు గానే వ్యవహారములోనికి వచ్చియున్నవి.

కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులవారు శృంగార నైషధమునకు తాము రచించిన సర్వంకష వ్యాఖ్య (పుట. 617) లో 'ఉండి'కి మేము చెప్పినట్లే అర్థము చెప్పినారు గాని 'ఉంచి' కి మాత్రము వదలి అనే అర్థము చెప్పి ఎట్లుసాధుత్వ మంగీకరించినారో చూడండి: "సప్తమికను పరియుక్తమగు 'ఉండి' పదము ఉండు ధాతువు అస్త్యర్థకము క్త్వార్థకము. ఇంటనుండి వచ్చెను. మింటనుండి దిగెను;—రాకముందు ఇంటను, దిగక ముందు మింటను ఉండెననుట స్పష్టము. సమానాశ్రయత్వ పూర్వకాలికత్వముల చేత క్త్వార్థక రూపము. పూర్వపదము ఉనికికి అధికరణము

'వలన' యు 'చోటియందు' అను నర్థముచే సప్తమియగావున దానికిని 'ఉండి' అను ప్రయుక్తమగుచున్నది. 'గృహామునుండి' అను వ్యవహారము 'యొక్క' లోపము వంటి 'అందు' లోపము చేత శిష్టాచారముగా వచ్చినది. 'ఉంచి'కి వదలియని యర్థము. అపాయమందు పూర్వాది కరణమును వదలుట తప్పదు." అని వ్రాసినారు. 'ఉంచి'కి వదలి అనే అర్థము ఎట్లు చెప్పగలిగిరో మాకు తెలియదు. ఈ అర్థము మనసులో పెట్టుకొని 'ఉంచి'ని ద్వితీయతోను, 'ఉండి'ని సప్తమ్యర్థముతోను అను ప్రయోగించుట న్యాయ్యము. ఇప్పుడు ఈ రెంటి వ్యవహార మందును ఆ స్వర్థ స్ఫూర్తి లేదు. ఆ స్వర్థమును తలంపునకుఁ దెచ్చుకొనక కొందఱు నియతద్రుత పూర్వత్వ హేతువుచేత వీనిని 'నుండి' 'నుంచి' శబ్దములని వ్యవహరించుటయుఁ గలదు. అర్థములు ఈ పాటి మార్పు జెందుట సర్వభాషా స్వాభావ్యము" అని వ్రాసినారు. దీనిని బట్టి '-నుంచి' కి సాధుత్వము చెప్పడమేగాక శబ్దములకు మొదట నుండిన అర్థములు మార్పుజెందుట సర్వభాషా స్వభావ్యమని అంగీకరించినారు.

"ఉండి శబ్దము పరంబగు నపుడు వలనకు ద్వితీయ సప్తములు ప్రాయికంబుగ నగు" అని చిన్నయ సూరిగారు చెప్పినారుగాని ద్వితీయా విభక్తిపై 'ఉండి' పరమగుట ప్రాచీన కవిప్రయోగములలో కనబడలేదు. ప్రాసస్థలములందు ఈ రూపములు గల ప్రాచీన కవి ప్రయోగములు చూడండి:— "లోకం । బున నుండి (ఆది. III, 90); గిరిగహ్వరం । బున నుండి (ఆది V, 116); బాల్యం । బున నుండి (హరి. ఉ. IV, 241); ఎచ్చో, ట నుండి (కళా. VI, 47), వీటిలో 'ఉండి' సప్తమ్యర్థకముతోనే అను ప్రయుక్తమై ఉన్నది. రాను రాను ఉత్తరాంధ్రకవులు ద్వితీయా విభక్తి మీద 'ఉండి' ప్రయోగించినారు. ఈ ఉత్తరాంధ్ర కవుల ప్రయోగములే మనసులో ఉంచుకొని చిన్నయ సూరిగారు ఈ విధముగా సూత్రము చేసినారు.

లోక వ్యవహారములో ప్రాచీన శబ్దముల రూపములున్ను అర్థము లున్ను మార్పు చెందుట చేత నిత్యముగా దృతముపైనున్న ఉండి, ఉంచి, రూపములు నుండి, నుంచి అనే ప్రత్యయములుగా ఏర్పడి షష్ఠిరూపముల మీద పంచమీ విభక్త్యర్థమందు కనబడు తున్నవి. గౌరాంగ చరిత్ర (I, 86) లో మ॥ కూచి నరసింహముగారు 'తన నుండి' అని ప్రయోగించినారు. ఇట్లే ఉత్తరాంధ్ర కవులు నా నుండి నీ నుండి మొ॥ ప్రయోగించినారు.

ప్రాచీ నాంధ్రులకు 'ఉండి' అనే క్త్వార్థక రూపమే మనస్సులో ఉండేవనుటకు అందుండి, అందయుండి మొదలయిన ప్రయోగములే నిదర్శనము. ఎందుండి (ఆది. VII, 2. 217) అంద యుండి (ఆది. III, 121) అచటన యుండి (అను. IV, 438). "ఎందుండివచ్చి తిందుల, కెందులకేఁ గదు" (ఆది. IV, 230) దీనిని అనుకరించే "ఎందుండి యెందు వోవుచు నిందులకే తెంచినారరు?" అని మను చరిత్రలో పెద్దనగారు చెప్పినారు. ఈ వాక్యము నేటి వాడుక భాషలో •చెప్పవలెనంటే 'ఎక్కడి నుండి (ఎక్కడి నుంచి) ఎక్కడికిపోతూ ఇక్కడికి వచ్చినారు?' అనవలెను. అందయుండి, అచటన యుండి మొదలయిన ప్రాచీన రూపములలో ఏవార్థకమైన అకారము సప్తమ్యర్థక పదముల మీద నున్నది. నేటి వాడుక భాషలో ఏవార్థకమైన ఏ కారము 'నుండి', 'నుంచి' మీద నే ఉంచి 'అక్కడనుండే' 'అక్కడి నుంచే' అంటున్నారు. "గుడినుండే గుడి రాళ్లు మ్రింగుట" అని రుక్మాంగద చరిత్ర ప్రయోగము కనబడుతున్నది.

ఉంచి (–నుంచి) పంచమీ విభక్త్యర్థమందు ఎప్పుడు వాడుక లోనికి వచ్చినదో సరిగా చెప్పలేము గాని అధర్వణ కాలమునాటికి వాడుక లోనికి వచ్చినట్లు స్పష్టమైనది. "ఉంచి కుండా వల్ల వలన వంక యుండీతి పంచమీ" అధర్వణ వ్యాకరణము IV. కాండ.

"పరేషూంఙ్యాది శబ్దేషు" అనే అధర్వణకారిక (అజంత పరిచ్ఛేద మందున్న కారిక) లోని 'ఆది' శబ్దమువల్ల ఉంచి కూడా 'కలదని టీకలో ఉన్నది.

"ఉంచి కన్నపట్టికంటే నుండి వల్ల వలన వంగోండోక్యాః జనిసః ఏతే పంచమ్యాంస్యుః" ఆంధ్రకౌముది—1261 సూ.

ఉత్తరాంధ్రకవులు '-నుంచి' ప్రయోగించినారనుటకు దిద్దుటకు వీలులేని ప్రయోగములున్నవి చూడండి:—

"గీ|| కాంచియమ్మంత్రి యెచ్చోట నుంచి వచ్చె"

కృష్ణరాయవిజయము IV, 26.

"శా. ... న। న్నుంచే..."

శిష్టు సర్వశాస్త్రిరచించిన జ్ఞానప్రసూనాంబికాశతకము 39 వ పద్యము (చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక VI, 8.)

ఉత్తరాంధ్రకవిప్రయుక్తమై లాక్షణికసమ్మతమై ఉన్నా, "వనము నుంచి", 'ధనమునుంచి' యని యుంచి శబ్దానుప్రయోగముతో గొందఱు వ్యవహరించెదరు గాని యది సాధుకవి ప్రయోగారూఢంబుగాదని యెఱుంగునది" అని చిన్నయ సూరిగారు వ్రాసినారు.

చిన్నయ సూరిగారు 'గ్రామ్యములు' 'అసాధువులు' అని నిరాకరించిన పోతిని, చేతురు, నుంచి మొదలయిన రూపములు కవులు ప్రయోగించి ఉండడముచేత ఈ ప్రయోగములు దుష్టములు కావుగాని, వీటిని అగ్రామ్యములుగా భావించి చేసిన లక్షణము మాత్రము దుష్టమవుతుంది.

## నుంచి

టీక||...... మొదలి ఛందము వద్ద నుంచి వారడిగిన దాని వద్దకి నాయెనని చెప్పెడిది.

అప్ప. IV, 140.

ఉ॥ విన్నఁదనంబు మించెఁబురి వెల్వడి నప్పటినుంచి నీ మొగం
బున్న తెలుంగుఁ గాంచిదిగు లొందుచు నుందుని దేమొయంచుమీ
యన్నకుఁ దత్సహోదరుల కాప్తులకున్ శుభమే కదన్న నీ
కన్నుల నేల నశ్రువులు గ్రమ్మెడిఁ దెల్పఁ గదన్న లక్ష్మణా॥

ఉ॥ రా॥ పుట. 231.

క॥ కనరాని దుశ్శకునములు
గనినప్పటి నుంచి మనసు గలగెడు నాకున్
వనులేల మరలి పోదమె
నినుఁ జూచిన నినుమడించె నెవ్వగలనినన్॥

,, పుట. 231.

క॥ మీరలు వచ్చుటమాకుం గోరికబహు వాళ్లనుంచి పదుగ్గె మదిలో,

సకల కథాసారసంగ్రహము. II, 47.

ఎప్పటినుంచి (చెన్న.బ. 1–223) పరిణయమాటనుంచి (పట్టాభిరా. II, పుట 53) ఇంద్రలోకమునుంచి (పట్టాభిరా, II, పుట 72) జిల్లాలో నుంచి (రంగ. చ. II, 155) ఎక్కడ నుంచి (విజయ. I, 109. old Edn. పల్లెపట్టుల నుంచి (హంస. V, 40) తల్లిగర్భమునుంచి (నృ. శత V, 5).

## వద్ద

నన్నయాది ప్రాచీనకవుల గ్రంథములలో ఒకారాదిగా ఉన్న శబ్దములు కొన్ని ఉత్తరాంధ్ర కవుల గ్రంథములో వకారాదిగా ఉన్నవి. సంస్కృతములో వకారము ఉకారముగా మారుతుంది. దానికి సంప్రసారణ మంటారు. వచ్-ఉక్త, ఉక్తిః, ఉవాచ. తెలుగులో ఒకార వకారములకు అట్టి సంబంధమున్నది. ద్వాదశి, ద్వారము, స్వామి శబ్దములు దోదసి,

దోరము, సోమి అని తెలుగులో మారినవి. ఇంగ్లీషు భాషలో only, alone శబ్దములలోని on, one ఏలాగున ఉచ్చరిస్తున్నారో one కూడా పూర్వము అలాగుననే ఉచ్చరించేవారు; నేడు 'వన్' అని పలుకుతారు. ప్రాకృతము ద్వారా వచ్చిన ఉపాధ్యాయ శబ్దము తెలుగున 'ఒజ్జ' అయినది. 'ఒజ్జలవారు' నేడు 'వజ్ఝలవారు అయినారు'. తల్లావజ్ఝలవారు 'నూరావజ్ఝలవారు' అని. ఇంటిపేళ్ళు మార్చశక్యము కాదు. 'ఝవర్ణము 'ఓఝ'లోనిది.

శబ్దరత్నాకరమందు కొన్ని శబ్దములు ఒకారాదిగాను వకారాదిగాను ఉన్నవి. (చూ. ఒంటి, వంటి; ఒరవడి, వరవడి; ఒరగోడ్డెము, వరగోడ్డెము; ఒద్ద, వద్ద; ఒద్దిక, వద్దిక.) కవులు వకారము యతిస్థానమందుండేటట్టుగా ప్రయోగించిన శబ్దములు కొన్ని ఉన్నవి.

కన్నడములో ఒంగు తెలుగులో వంగు; ఇల్లె ఒల్లెఅనే కన్నడశబ్దము తెలుగులో వల్లే, వల్లె అని వకారాదిగా ఉన్నది. హిం. ఉస్తాద్ తెలుగువారి నోటను వస్తాదు అయింది. వకీల్-ఓఢ్రులు ఒకీల్ అంటారు. ప్రాచీన శాసనములందు "శిలాక్షరములు" గా ఉదాహృతమైన గ్రామ నామములు, 'ఓడ్రేవు', 'ఒడ్డవాది' కొంతకాలానకు వాడరేవు, వాడ్రేవు, (వడ్డవాది) వడ్డాదిగా మారిపోయినవి. ఈ పేళ్ళు కొందరికి ఇంటిపేళ్ళుగా నేటివ్యవహారమందున్నవి; పూర్వకాలపు శబ్దములు రాళ్ళమీద, రాగిపట్టాలమీద, మొదట చెక్కినట్టే ఉన్నా రానురాను తెలుగువారినోటను అవి మార్పుచెందినవి. నేడు అవే సాధుశబ్దలు. బ్ర.శ్రీ. వడ్డాది సుబ్బారాయ కవిగారు తమ యింటిపేరు మార్చుకోలేరు; మార్చుకొంటె వ్యవహారహాని. ఓరుంగలు నేడు వరంగల్లు అయినా పూర్వకాలమందే ఓరుంగంటనుండి మన దేశము వచ్చినవారి యింటిపేరు నేమన్న ఓరుగంటివారే. దేశభాషలోనిశబ్దములు

కూడా ఇట్టివే అని పండితులు తెలుసుకోలేకపోవడమువల్ల నేటి దేశభాష గ్రామ్యభాషగా నింద్యమయినది !!

వకారాది శబ్దము సమాసములోగాని, వాక్యములోగాని మొదట నుండనప్పుడు తరుచుగా వకారము ఒకారముగా మారుతుంది. అగరు వత్తులు=అగరొత్తులు (శతావధాని కృత్తివెంటి సుబ్బారావుగారు ప్రయోగించినారు); కొవ్వొత్తి, ఊదొత్తి, మయినపొత్తి-వీటిలోని ఒత్తి వత్తి శబ్దమే కదా. 'వంగవోలు' వంగోలు, ఒంగోలు అయినది. మొదట 'వంగ ప్రోలు' అని ఉండును. వచ్చు, వండు, వద్దు వడ్డించు మొదలయినవి కూడా వీటివలెనే వ్యవహారములో మారడము తెలుగు భాషాస్వభావమునకు విరుద్ధముకాదే. అందుచేతనే, ఎప్పుడొస్తావు?" "ఇప్పుడొచ్చాడు" 'ఏమొండుకొన్నారు.' 'అన్నమొండుతున్నాను', 'నాకొద్దు'. కొందరు 'రావద్దు' 'రావచ్చును' 'వద్దంటే ఎందుకొడ్డిస్తావు?' అంటారు.

ఇట్లు గ్రంథాలలోకూడా కనబడుతున్నవి ప్రయోగములు. వేంకటేశ శతకమందు ( చూ. పద్యం 31, 34 ) 'వంచుకు' మారుగా 'ఒంచు'; (చూ. 64) 'ఒరకు' మారుగా 'వర'; నరసింహశతకమందు (చూ. 51) 'తన గృహంబునకు నీదాసులొచ్చిన చాల'; భజనకీర్తనలలో, 'రాముడొచ్చెను జూడరే', 'ఎదురుగా శ్రీరాము డెప్పుడొచ్చునోయని'; భక్తులు పద్యాలలోను పాటలలోను ఇట్లు ప్రయోగించి ఉన్నారు. ద్విపద భాగవతములో కోనేటి నాథుడు, "మెఱయు నీతఁడు దోవ మీఁదటఁ జాల, నొఱకటంబున నొత్తురొగిఁ బ్రజలెల్ల" అని ఒత్తురు ప్రయోగించినాడు. ఈ ద్విపద శబ్దరత్నాకరమందు ఉదాహృతమైనది (చూ.ఒఱకటము) పట్టాభి రామాయణమందు (చూ. అ. 2) చ. మతులును వృద్ధిపొందెదరు సోదరులొత్తురె-అని కవివ్రాసినాడు.

కవిజీవితములో గురజాడ శ్రీరామమూర్తి గారు కృష్ణానది వద్దున (చూ. పు 512) అని, వట్టుపెట్టుకొని (చూ. పు. 528) అని వ్రాసినారు. ఇట్లే వగరు, ఒగరు; వల్లెవాటు, ఒల్లెవాటు; వయ్యారము, ఒయ్యారము; వార, ఓర; వాడ, ఓడ; వడంబడిక, ఒడంబడిక; వప్పగించు, ఒప్పగించు; వదులుగా, ఒదులుగా; వసులు, ఒసులు (ఉసులు); వడ్డర్లు, ఒడ్డర్లు; వకటి, ఒకటి; వామ (ఓమము) లోకములో ఉన్నవి; వ్రాతలలో అనేకులు ప్రయోగిస్తున్నారు. కొందరు ఒకారము వో వలె పలుకుతారు. అట్టి రూపాంతరములు పాణిన్యాదులు అనుశాసించినారు.

ఉ. కిమ్వుక్తమ్; ఊఢః వోఢా; వేదమందు వోచః, వోచత్, వోచామ ఉవాచ, వవాచ మొ॥ అనేకమున్నవి; (వచ్ ధాతువు) అవోచత్ వంటివి పాణిని కాలమందుండేవి; అవి శిష్టశబ్దములుగా ఎత్తుకొని అనుశాసించినాడు.

సంప్రసారణమును గురించి చెప్పినప్పుడు, తెలుగులో వకార ఉకారములకు సంబంధము వంటిదే యకార ఇకారకముల కున్నదని చెప్పవలెను. ఎర్రన్న, ఎల్లయ్య, ఎంబన్న వంటి శబ్దములు యర్రన్న, యల్లయ్య, యంబన్న అని వాడుతున్నాము. అవి అసాధువులనగూడదు. శిష్టవ్యవహారమందున్నవి. గొప్పకవులు ప్రయోగించినారు: శృంగార శాకుంతలములో పిల్లలమర్రి పినవీరభద్రుడు "యఱ్ఱనామాత్యుననుజన్ము (డహీపభూప ణాంఘ్రి"...అని యతిస్థానమందు యకారముంచి మరీ ప్రయోగించినాడు. 'ఎతి' అని పండితులే వ్రాస్తున్నారని కీ॥ శే॥ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు చెప్పినారు. సాహిత్యరత్నాకర కర్త తస్మాత్పర్వతనాథసూరి జలధేశ్శ్రీ యల్లమాంబావియద్, గంగాసంగజాపోల సద్గుణ మణోర్వబ్ధోదయ శ్చంద్రవత్। అని "యల్లమ" శబ్దము వాడినాడు. మల్లికార్జున పండితారాధ్యుడు శివతత్త్వసారమందు "...శివలో, కావాప్తిం బడసెం గాద

యంబనసీచేన్" (చూ. పద్య. 425) అని యవర్ణము యతిస్థావముండుంచి కాదు. అది "అంబన" అని భ్రమపడకూడదు. ఇట్లే 'యదవల్లి' 'యణ మంద్ర' అనే గ్రామనామాలు ఇంటిపేర్లుగా ఉన్నవి. యకారాది సంస్కృత శబ్దాలు అరవములో ఎకారాది శబ్దాలయినవి. తెలుగులో కూడా ఎగ్గన్న, ఎతిరాజాలు ఎజమాని మొ॥ ఉన్నవి. 'సిద్ధిర్లోకాత్' అనే వచనమునకును, "అపభ్రంశము" "అనుశాసనము" అనే శబ్దములకున్ను అపార్థము కల్పించుకొని, తెలుగు వైయాకరణులు తాము మోసపోయి దేశభాషకు దురవస్థ తెచ్చిపెట్టినారు.

1911 వ సం. నవంబరు నెల 24 తేదిని చెన్నపట్టణములో పచ్చయప్ప కళాశాలాభవనమందు కూడిన "గ్రామ్యాదేశ నిరసనసభ"లో అధ్యక్షులుగా నుండి కీ॥ శే॥ రా. బ. కందుకూరి వీరేశలింగము పంతులుగారు "గ్రామ్యభాషలో గ్రంథములు వ్రాయుటవలన వాఙ్మయాభివృద్ధి కానేకాదు" అని తమ అభిప్రాయము చెప్పి, " 'వాడొచ్చాడు' అని వ్రాసిన యెడల రెండవది వచ్చుధాతువా? ఒచ్చుధాతువా యని సందేహము గలుగును" అనే ఆక్షేపము ఉదాహరించినారు (చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక I, 11. పు.157). ఈ ఆక్షేపోపన్యాసము నేనుచూచినవెంటనే పంతులుగారికి మీద వివరించిన సమాధానము తెలియజేసినాను. ఉక్త' అవోచత్, ఉవాచ ఉవచ, ఊచుః, వచ్మి వక్తి, వాక్యం మొదలయిన రూపములన్నీ వచ్ ధాతువునుండే కలిగినవని పాణిని అనుశాసించినట్టే తెలుగుపండితులు వచ్చు, ఒచ్చులు అనుశాసించవలెను అని నేను చేసినవాదము నిరాకరించక నేను సంగ్రహించిన 'ప్రయోగములు' తమకిస్తే తామే ఒక వ్యాకరణము రచిస్తామని చెప్పినారు. వారు కోరినప్రకారము నావద్దనున్న ప్రయోగములు పంపినాను. 1919 వ సం॥ ఫిబ్రువరి నెల 28 తేదిని పంతులవారి ఆనందాశ్రమములో కూడిన విద్వత్సభలో తాము అధ్యక్షత వహించి "వర్తమానాం

ధ్రభాషాప్రవర్తక సమాజము" స్థాపించినారు. అయితే ఆ సంవత్సరమే మే నెల 27వ తేదిని వారు దేహత్యాగము చేసినందున వారు చేయదలచుకొన్న పని జరగలేదు. నా ప్రయోగసంచయము నాకు మ॥ జయంతి గంగన్న పంతులుగారు పంపించివేసినారు. అవి బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు తమకిమ్మని కోరితే వారికిచ్చినాను. వారు వీటిని తమ "ఆంధ్రభాషానుశాసనమందు" ఇమిడ్చినారు.

గీ॥ వద్దఁబాయక కవగూడి ముద్దరాలు
పదము లొత్తంగనలరు భూపాలుదేవి
కొంనసికంటిరె యదె చిన్ని ముద్దరాలు
పదములొత్తంగఁజనెడు దుష్పదమునందు ॥ ఉ॥ వై. 28.

గీ॥ చేరి భుజియించి దూర్వాసశేఖరుండు
వామదేవవసిష్ఠుల వద్దనిలిచి
మ్రొక్కి కూర్చుండె యమ్మునిపుంగవులకు
నవరస మెటింగి యొకమాట యనియెనపుడు ॥ పట్టాభిరా. II, పు. 60.

ఉ॥ ముద్దులగుమ్మ కెంతయును మోడికనంబడు నేను ప్రేమచే
వద్దికిఁజేరరాగఁ దలవంచుట గన్గొని మోడి యుండునా॥ పార్వతీ. 79.

గీ॥ సర్వదివిజాలు దిక్పతుల్ సన్మునులు
గొలువఁదన్మంత్రమహిమంబుఁ దలఁప నరిది
గాన శాకంజగర్భుండు కడురయమున
వచ్చి యానరనాయకు వద్ద నిలిచె ॥ భార. (చిత్ర) V, 168.

క॥ ముద్దిచ్చును గోపాలుఁడు
వద్దను నడయాడుచున్న వార్తలు విన్నన్
గద్దించును లేదన్నను
బద్దించును జాడకున్న పరితాపించున్ ॥ రాధా. 5.

గీ|| అంచుఁ దనుగేలి యొనరించు మించుఁబోండ్లఁ
గాంచి తలవంచి సిగ్గుచేఁ గలఁక బాలు
వారిజానన వీనుల వద్దఁజేరి
బుద్ధిరా నిట్టులను రాధ బుజ్జగించి || రాధికా. 107.

ఉ|| కొంచక రేయుఁబవలు గోవెల కీరఁడు పువ్వుదండ ల
ర్పించు నెపంబునం బరిచరింపుచు నుండి నటుండి యొయ్యనే
పంచను బొంచి యర్చకులు వద్దఁ గొలంగిన సందు చూచి లం
కించఁగ నోపు నీపసిఁడి గిన్నియ సందియమేల దీనికిౕ|| వైజ. IV, 109.

ద్విపద|| వచ్చి యా దశకంఠువద్ద నిల్చి రంగ. రామా. 28.

సీ|| కన డొద్ద నున్న... ప్రభా. II, 108.

ద్విపద|| ఏవిధిఁ బ్రాణంబులిక ధరియింతు నావద్దబాయఁడు నా ప్రాణపదము
ప్రభులింగలీల XII.

ద్విపద|| వచ్చియున్నది మనవద్దకు మాట „ XVII.

## పట్టుకో

ప్రార్థనార్థక రూపమైన 'పట్టుకొనుము', తుమర్థక రూపమైన 'పట్టుకొన(న్)', వ్యతిరేకక్త్వార్థక రూపమైన 'పట్టుకొనక' లోకవ్యవహారములో 'పట్టుకో', 'పట్టుకో (న్)', 'పట్టుకోక' అయినవి.

ఈ మూడు విధములయిన శబ్దములలోను మొదటిదానికే బాలవ్యాకరణము (క్రియా, సూ.60.)లో "ముద్బుపరంబగునపుడు 'కొ' శబ్దంబు కొనునకు బహుళంబుగా నగును" అనే సూత్రము ఆధారముగా ఉన్నది. మిగిలిన రెండంటికిన్ని బాలవ్యాకరణములో ప్రత్యేకించి సూత్రమేమీ లేదుగాని పై సూత్రముక్రింద "బహుళంబనుటచే దీనికి నొకానొకచో నతిచారంబని యెఱుంగునది" అనే వాక్యము ఆధారము చేసుకొని "సూత్రంబులోఁజెప్పిన

ము వర్ణకదుజ్వర్ణకంబుల యొద్దఁగాక తక్కిన 'మిఁజే, నుఁజే' ప్రత్యయాది సమావేశంబునందును నీయాదేశంబు కానంబడియెడి. దానం జేసి 'చదువుకొనేర్చిను, కైకొమి, ఇచ్చుకొలు, పుచ్చుకొలు' ఇత్యాది ప్రయోగంబులు రక్షితంబులయ్యె" అని గుప్తార్థప్రకాశికాకారులు వ్యాఖ్యవ్రాసి రాజశేఖర చరిత్రనుండి 'అందుకొ నలవిగాదు', 'అనుకొన్నిగ్గయ్యెడిన్' అనే ప్రయోగములుగల పద్యము లుదాహరించినారు.

పైని చెప్పిన మూడువిధములయిన రూపములందున్ను 'కొ' ఆదేశముగా వచ్చుటకు ప్రయోగములు ప్రాచీనాంధ్ర గ్రంథములందు కనబడలేదు గాని 12 వ శతాబ్దాంతము మొదలుకొని నేటివరకున్ను గల సుప్రసిద్ధకావ్యములందు కనబడుతున్నవి. పాలకురికి సోమనాథకవి ప్రార్థనార్థకమందు ఈ రూపములు ప్రయోగించినాడు. భాస్కర రామాయణములో ప్రార్థనార్థకమైన "నాటుకొ" అనే ప్రయోగమే కాక, వ్యతిరేక క్త్వార్థకమైన "కైకొక" అనే ప్రయోగము కూడా కనబడుతున్నది. శ్రీనాథుడు ప్రార్థనార్థకమైన 'చేయించుకొ', వ్యతిరేకార్థకమైన 'కైకొవు' మొదలయిన రూపాలు ప్రయోగించినాడు. వసుచరిత్రలో తుమర్థకమైన 'కొనఁ'కు 'కొ' అనే రూపము "కన్గొఁజాలక" అనే ప్రయోగములో కనబడుతున్నది. (మా. అ. 2. ప. 48).

అనుబంధముగా ఉన్న 'కొను' కే కాక స్వతంత్ర క్రియగా ఉన్న 'కొను'కు కూడా 'కొ' ఆదేశముగ వచ్చిన ప్రయోగములు సైతము కనబడుతున్నవి. ఇవి సాధారణముగా శబ్దపల్లవములై ఉంటవి.

"కామును జీరికిఁగొక" (హరవిలాసం IV, 32); "కొరా" కాశీఖండము పు. 92),"మదిమిగొఁజాలము"(విష్ణుపురాణం. VI. 177).

## పట్టుకోక, పట్టుకో

చ॥ గిఱిగొను గోపురాగ్రపరికీలిత పంకజరాగ రశ్మిక
ట్టెఱయగు చాయఁ బొల్చు దివసేంద్రుఁడు సక్కని మింటఁ బోవుచో
మఱచి విధాత పాటలిమమధ్యమ సంధ్యకుఁ జేయలేని యా
కొఱతయుఁ దీర్చుకోఁదొగరు కొల్పిన కైవడిఁ బట్టణంబునన్॥

ఆము. II, 18.

క॥ ఆకలియును నాకలియును బైకో పైకొక్కువాని పైపైచిన నా
నాకపటపు విహగములది కైకొని కడువేగ నింగికడకై చనియెన్॥

ఉ. నై. 30.

గీ॥ ఆ చకోరాక్షిఁ జూచి యా యలరుఁబోఁడి
యేను బ్రార్థింపఁ గైకొక యిట్టివానిఁ
గాని వరియింప నంటివి గర్వవృత్తి
నల్లనాఁడొక వనములో ననుచుఁ బలికె॥ కళా IV, 49.

చ॥ యలరులవింటిజోదునకు నప్పటికప్పటి కప్పళించుకో
గలిగెదు...................... శృం. నై. I, 94.

గీ॥ నిగ్రహములకేమి నీవును నేమున
న్యోన్యమైత్రి బొదలుపట్టి తెఱగు
వడపవలయు గాక యొడసిపోనాడు కో
దడవె వేగిరింపదగునె యనఘ॥ ప్రభా. I, 89.

సీ॥ సేవసేయించుకో జిత్తగింపఁడు సుమీ
నా చేత శ్రీ విశ్వనాయకుండు॥ కాశీఖం. 122.

గీ॥ అఖిల కళ్యాణగుణగణా యత్ర యత్ర
మామ యౌదార్య తేజః క్షమా మహితుఁడు
ధైర్య నిర్జిత మందరా హార్య భార్య
తనయ యేలయ్య కైకోవు ధర్మబుద్ధిః॥ „ 82.

శా॥ కుంతీ ద్రౌపదులం బ్రభావతి కనుంగో నేఁగెదుగా మీరు శు
ద్ధాంత స్త్రీనికురుంబులై కదలిరండంచున్ బ్రియోక్తిన్ మహీ
కాంతుం డాప్తుల నంపి పాండవుల జోకన్ సాత్వికాన్నంబు ల
త్యంతాభీష్టత నారగించి సుఖనిద్రన్ జెంది యావేకువన్॥
జైమిని II, 104.

మ॥ మడుగున్ నిండఁగ నిండి గండకమనున్ క్ష్మామండలాధీశ యి
క్కడనుండం దరమే జడాశయము యోగ్యంబౌనె నావంటి యె
క్కుడు రూపంబున మించువాని కిట గైకోవయ్య విస్తారమౌ
కడ నిల్వంగదవయ్య యార్తజన రక్షాదక్ష దీక్షానిధీ॥ దశా. 22.

క॥ ఏరా యోరి నిశాచర
యేరా వృత్తారి యెఱుఁగవే నాతోడన్
పోరాడలేవు పోరా
కోరా యభయంబు నిల్వకోరా తనువున్॥ దశా. 92.

మ॥ ధరణింబొందని కోమలాంఘ్రి కమలద్వంద్వంబులున్ ఘర్మశీ
కరయుక్తంబులుగాని ఫాలములు వక్షశ్శోణులన్ బ్రతకే
సరముల్ గందని పూవుదండలు నిమేషవ్యాఖ్యగైకోని దృ
క్సరసీజమ్ములు నల్వఁగందుఁగనియెన్ గాంతాలలామంబొగిన్॥
నైష. V, 182.

గీ|| అనినఁ బూరుఁడుదక్క దక్కిన తనూజు
లందరును దండ్రిపలుకుల కపహసించి
జవ్వనంబిచ్చి ముదిమిఁగోఁజాలమనుచుఁ
దఱఁగిపోయిన నహుషపుత్త్రకుఁడు కినిసి|| విష్ణు. VI, 177.

శా|| అర్కేందూపల రత్ననిర్మిత మహాహర్మ్యాగ్రభాగంబులం
దార్కొన్ దారకమండలంబుఁగని ముగ్ధస్త్రీలు కేలప్పరిన్
కర్కంధూపలసన్నిభంబయిన ముక్తాజాలమం జింతచేఁ
దర్కింపన్ దిలకించి నవ్వుదురు గంధర్వాంగనా పల్లవుల్||
శ్రీనాథుని భీమే. III, 93.

చ|| దిగదిగఁ జేరవచ్చి రతిదేవి యపాయముఁ బొందకున్కికై
తగవున రత్నకుండల కదంబకముందను వేఁడి పుచ్చుకోఁ
దగువ మనోభవుండు తియతియ్యని సింగిణి వింటికొప్పనన్
దగిలిచె దక్షవాటి వనితావిసరంబులఁబోలు శింజినిన్|| ,, V, 95.

గీ|| ఐంద్రమును నాగ్నేయమైన బలము
వాయువీయమైశానంబు వారుణంబు
యామ్యమును మున్నుగాఁగల యష్టదిశలు
తానగై కొనికై కోఁడతండు సురల|| హరివి.

శా|| బీజాపూరఫలేక్షుచారుమణి కుంభీమేచకేందీవరాం
భోజంబుల్ సముదాయోచితంబులుగ శంభుండేర కుంభస్థలీ
రాజారాధరణంబు దక్షనగరీగామాసముత్తుంగ వ
క్షోజద్వంద్వ శిఖాంకురస్ఫురణఁ గైకోన్ విఘ్నరాజర్మిలిన్|| భీమే.

శా|| కామంజీరికిఁగోక క్రోధము నహంకారంబు లోభంబు నీ
ర్ష్యామాత్సర్యము దావలేపకుహనారాగంబులం జేరి నీ
కామప్యాయణులై ప్రశాంతమతులై యయ్యాశ్రమాంతంబులన్
నేమంబొప్పఁగ సంచరింతురు మునుల్ నీవాగ్ముష్టింపచుల్|| హర.

తే|| వానిమాన్పన జేకోని మానవతియు|| శృం. నై. I, 62.

## చేయడము

ఈ మొదలగు శబ్దము లసాధువులని అధర్వణుడు నిషేధించినాడు. "ప్రతిక్రియనుడాంతత్వం ప్రతీతంతునగీయతే" (కారికావళి. అజ. సూ. 98). లోకములో ఈ శబ్దాలు శిష్టులు వాడుతున్నారు గాని కవులు ప్రయోగించ లేదు. అందుచేత అసాధువులు అని అతని అభిప్రాయము. అయితే, అధర్వణుని అనుశాసనము మన్నించదగినదికాదని మొదటి ప్రసంగములోనే రుజువు చేసిఉన్నాము. శ్రీనాథుడు వాడిన "కొంట" అసాధువని పేరుపెట్టి నిందించిన అధర్వణుని అనుశాసనము ప్రమాణముకాదు. తిక్కనకూడా ఇట్టి శబ్దములు ప్రయోగించినాడని అధర్వణుడు ఎరుగడు. ఈ అధర్వణ కారికనుగురించి బ్ర. శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిలవారు వసు చరిత్ర విమర్శనములోను (పు. 107), హరిశ్చంద్ర నలోపాఖ్యాన పీఠిక లోను (పు. 114) వ్రాసిన వ్యాఖ్యానము చూడవలసినది.

త్రివిక్రమ వ్యాకరణమని ఒక వ్రాతపుస్తకమున్నది. దానిలో (పు. 49) అడమటమాంతములు భావార్థకములని సూత్రించి,

గీ॥ కప్పడంబులదిరె కల్వడంబులువీరె
పిల్వడములులేక పెండ్లివారు
రావడంబులెచటలేవు మీ పోవడ
మింతప్రొద్దు తట్టలెత్తడమున॥ అని ఉదాహరణములు ఆ లాక్షణికుడు వ్రాసినాడు.

ఆంధ్రభాషార్ణవములో (II, 219) "కదలుడు, కదలిక, కదలు, కదలడమ్ము" అనిన్నీ "దోగురుసాఁగను దోపడమనగను దోపుడుసాఁగను దోపునాఁగ" (II, 292) అనిన్నీ అడమంతశబ్దాలు పర్యాయపదములుగా అంగీకరించబడినవి. అంతేకాక మూడవకాండము, క్రియావర్గములో (142) "గీ॥ భావమునఁ బ్రోపు ప్రోచుట ప్రోవడమనఁబరగు" అని అనుశాసనము

కూడా ఉన్నది. ఈ కోశమందు గ్రామ్యములు చేర్పలేదని గ్రంథకర్త ప్రమాణీకరించినాడు.

ఇట్లే ఆంధ్రరత్నాకరమందు "మోవడంబనంగ మోచుటయును"(97) అని పైడిపాటి లక్ష్మణకవి చెప్పినాడు. ద్విరూపకోశములో గణపవరపు వెంకటకవి ఇట్టి శబ్దములు చేర్చినాడు. శబ్దరత్నాకరమందు "ఒత్తడము వి. ఒత్తుట", "త్రవ్వటము. వి. త్రవ్వుట"—ఇట్లు అనేక శబ్దములు ఇట్టివి కనబడుతున్నవి.

ఉత్తరాంధ్రకవులు ప్రబంధములలోను, శతకములలోను, పాటల లోను యథేచ్ఛముగా వాడిఉన్నారు.

నేటి వ్యవహారములో ఇట్టి శబ్దములు అపరిహార్యములు. ఇందమూలముగా ఈ క్రిందివిధమున శాసించడమయినది" అని శాసనములలో వాడుక ప్రచురముగా ఉన్నది. "తీర్మానించడమయినది" అని అన్ని సంస్థల వారున్ను, సమితులవారున్ను, సమ్మేళనములవారున్ను తమ తీర్మానములు ప్రకటిస్తున్నారు. పెద్దఅక్షరాలతో "గాంధిమహాత్ముని ఎట్టి షరతులను కోరకుండ కారాగృహమునుండి వదలడమయినది" అని ఆంధ్రపత్రికలో ముఖ్య వార్తలు ప్రకటించడము ఆచారమయినది (చూ. తేది 5-2-24 సంచిక).

నేటి తెలుగువారు ఇట్టి అదమంతశబ్దములద్వారా తెలియజేసే భావములు నన్నయాదులు ఏలాగున తెలియజేసేవారో తెలియక కొందరు ప్రాచీనాంధ్రభాషాభిమానులు కృతకభాష వాడుతున్నారు. "నీయందుల మాకు నొండుగార్యంబు గలుగుటంజేసి" (సభా. I, 183), "అహితమాచరించినది లేదు" (సభా. I, 184), "మీరు వచ్చినదానికిం గతంబెయ్యది" (విరా. I, 190), "ఒక్కరుడుగ నేగెడుదానికి నొర్వను"(విరా. I, 148). రాయలసీమవారు నేడున్ను "ఇట్లు జరిగినదిలేదు" అని వాడుతున్నారు. అరవములో సెయ్‌గిరదు, అడిత్తదు మొ॥ శబ్దములు వాడుతారు. ఇంగ్లీషు

భాషలో building, writing మొ॥ రూపములు క్రొత్తగా పరిణమించి నవే. నన్నయాదుల కాలములో కలిమిన్, రామిన్ వంటి కృదంతరూప ములు తరుచుగా వాడేవారు. పూర్వుల వాడుకలో ఉన్న నమ్మిక, అర కటు, అక్కటికఁ, పడిగ, లంపటు, మొగమోటు, పుయిలోటు, గాబు, విడియ, వింజామర తత్తఱ మొ॥ అనేక శబ్దములకు నేడు అము చేర్చి కవులు ప్రయో గిస్తున్నారు. కన్నడభాషలో ఇట్టి శబ్దములు మువర్ణాంతములు కావు. తల్లణ, తల్లణిసు (=తల్లడము, తల్లడించు). సంస్థాపనవంటి శబ్దములు కొన్ని తోపణవలె కన్నడములో మారినవి; ఇట్టివి తెనుగులో డకారాంతము లయినవి; రానురాను మువర్ణాంతములైనవి.

తెలుగులోనయినా, భావార్థమందు టవర్ణకము రాకపూర్వము తవర్ణముండేది. ఈను ధాతువునుండి వచ్చిన ఈఁత (కన్న. ఈ స్త.); వండు ధాతువునుండి వచ్చిన వంట—ఇట్టి శబ్దములలోని ప్రత్యయము అకారమే; రానురాను తవర్ణకము కృదంత ప్రత్యయము, టవర్ణకము భావార్థక ప్రత్య యము అని వైయాకరణులు విడదీసినారు; పిమ్మట చేయటము, చేయడము మొ॥ ఏర్పడ్డవి.

ఈ అడమంతశబ్దములు ఇప్పుడు మువర్ణాంతశబ్దములలో చేరినవి; వాటితోపాటు వీటికిన్ని మువర్ణమునకు పువర్ణాదేశముకూడా నేటి వాడు కలో కనబడుతున్నది. ఉ॥ "ఈ పని చేయడపు తలంపుతో వచ్చినారు". (ఆంధ్రపత్రిక తేది 8-9-22 సంచిక; పుట 12.) ఇట్లు భావమును బోధిం చుటకు సౌకర్యములు వాడుకలో వాటంతట అవే ఏర్పడుతూఉంటవి. ఇట్టి సౌకర్యములు మనోభావములు వ్యక్తపర్చడమునకు మిక్కిలి అనుకూలమయి నవి. వీటిని తృణీకరించడము వివేకమనిపించుకోదు.

మీదను వివరించి చెప్పిన హేతువులనుపట్టి చేయడమువంటి శబ్దములు సాధువులు అని సిద్ధాంతము కాదా?

## చేయుడము

సీ॥ కడవన్నెబొమ్మ చెక్కడపుఁ జొక్కపుఁ గోళ్ళ
పగడంపు నికరంపు పట్టియలను — ఉ. రా. పుట 222.

సీ॥ తొలువేల్పురా ప్రతిమల చెక్కడపు గండ
పెండెంబు డాకాల దండిజాళు — ,, పుట 43.

సీ॥ నెలఱాలమంచి వన్నెలమీఱ గట్టున
కట్టడమడుగున గ్రాలుచుండ — కవిజనచ. చ. 28.

గీ॥ దాని చక్కదనంబును దాని మెఱుఁగు
దాని కట్టడపుంబని — ,, పుట 24.

సీ॥ నీరత్తు వేళల నీరత్తుఁ బాదు పా
దునకుఁ గాలువలుపొందుగ నమర్చి
త్రవ్వటంబులతటి ద్రవ్వటంబులు పెట్టుఁ
దగినట్టు కట్టుగుద్దలిగడించి — శశా. IV, 78.

గీ॥ అనిన నాచార్యవచనంబు లాదరించి
యింద్రుఁడనుపఁగ ధాత్రికి నేఁగి యగ్ని
మొదలఁ గాశీపురమునకు ముట్టడముగ
సకలగృహములఁ దనమూర్తి సంగ్రహించె॥ — కాశీఖ. V, 301.

ఆ॥ మనసురాదు నాకు మానినీమణులార
ప్రేలడములు గట్టిపెట్టిరందు
కాకయున్న వన్నుఁగదలింప కూరక
యుండుఁడనిన వారలలుకపుట్టి॥ — చంద్రా. II,

గీ॥ కూర్మిసతని నెదురుకొని కౌఁగిలించి యే
కాంత మండపమున నధివసించి
యటఁ గుళిందు సేమమరయుచుఁ దండ్రివా*
యడము జూచి భక్తినందియందు॥ జైమిని. VIII, 82.

క॥ వెల్లువ ముట్టిన పగిదిం
దల్లడమునఁగూడఁబాతితనుఁ దనసైన్యం
బెల్లను ముసరఁగ దానవ
వల్లభుఁడట్లుఱచుచుండె వావిడిచి వడిన్॥ నిర్వ. IV, 94.

క॥ తలఁచగు పెనుసందడిలో
నిఱుకటమునఁబడ్డ నృపతియీవ్యగ్రహముం
దొలఁగుట యభీప్సితార్థం
బఱచేతికి వచ్చినట్లయని వెత కుడుచున్॥ నైష. IV, 124.

క॥ తనదోఁచడమునకెవ్వా
రును నేఁడింద్రాఁక దొరకరు చకోరవిలో
చన దానఁజేసి చిత్తం
బునఁ జింతిలుచున్నవాఁడు పొదలెడు వెతచేన్॥
హంసయోగి. IV, 202.

సీ॥ నర్మగర్భోక్తులు నక్కుటక్కులు వింత
నయగారములు బహు నాటకములు
పిలుపిచ్చు విద్యలు పిఁకవన్నియలును
బెలుచఁదనంబులుఁ బ్రేలడములు
వక్రభావంబులు వలకారిబాగులు
వలసి యొల్లములును వట్టిపసలు
కేరడంబులు సొళగింపులు కిల్బిషా
క్రీడనంబులు నడకించు వగలు

బాసపోసనములు విడంబములు భ్రమలు
లేని మచ్చిక లివి యాదిగ్గైన వివిధ
దుర్గుణంబుల ప్రోవులు ద్రోహమతులు
వారి కాంతలఁ దడవిన వచ్చుఁగీడు ॥ పాండు. III, 43.

సీ॥ గీ॥ ఓరచూపులు చిఱునవ్వు లాదుగుఁ బాట్లు
తప్పుత్రొక్కుళ్లు మైదునఁ గప్పు పగలు
తెచ్చుకోల్గాంకులును మోరత్రిప్పడమ్ము
అలుకఁ గలిక కరుదెంచె నల్లుఁ డంధి ॥ పా్వ. V, పుట 98.

చ॥ విడిగవఁగుచ్చె మస్తకము విఱతగఁ జీరుచుఁ గెంపుపాళ్ళచే
క్కుటెమునఁ దక్కుతక్కు గనగా ,, V, పుట. 104.

వ॥ ఈ పథబృందంబుల యిఱకటంబు వెడలి నిలుతమని.
భాగవత. విరాట. V, 211.

గీ॥ ఎత్తినప్పుడు విడియబో నిఱుకటంపుఁ
దెరువునందు నడపుసెడి తిరుగఁబడిన
యిట్టియెడ నిద్రవోయెదు నవసరమున
శాత్రవుల కెట్టుపైఁ బడి చంపవలయు॥ సౌప్తి. I, 25.

ఉ॥ నావుడు నవ్వుటాలకనివం బవనాత్మజ యింత యేటికిం
గేవల యోధవే పరుల కిల్బిషముల్ దలపోయ కెమ్మెయిన్
జావడమైనఁ జూచి యిది చందము కాదని యంటిఁ గాక ని
చేవయు లావు నీవు మునుచేసిన భంగులు నేనెఱుంగనే ॥
ఉద్యో. III, 61.

చ॥ స్తుతులు ప్రసంగముల్ కథలు సుద్దులు వార్తలు రాచకార్యముల్
చతురతరేతిహాసములు శాస్త్రములుం దగు జాతి గాథలున్
సతకడముల్ పురాణములు సామెతలుం బరిహాసకంబు లిం
గితములు జారజారిణుల కేళి చరిత్రములన్ వచించుచున్ ॥ హంస. II, 43.

## చేదాము

"ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు" (బాల. క్రియా. 30. సూ.)

"ఉవర్ణంబుతో దుక్ద కారంబు తకారంబగు" (బాల. క్రియా. 103. సూ.)—

ఈ రెండు సూత్రములలో మొదటిదానినిబట్టి మనము చేయుదము, ఆడుదము, విందము మొదలయిన రూపములున్ను, రెండవదానినిబట్టి (మనము) చూతము, గెల్తము, నిల్తము మొదలయిన రూపములున్ను లక్షణ సమ్మతములైనవనిన్ని అందుకు భిన్నముగా ఉన్న చేతాము, చేదాము, ఆడుదాము, విందాము, చూతాము, గెల్తాము, నిల్తాము మొదలయిన రూపాలు లక్షణ విరుద్ధములనిన్ని కొందరి అభిప్రాయము.

చేయుదును ఎట్లు చేతును అయినదో చేతును గురించి వ్రాసిన అవతారికలో చర్చించినాము. చేతుము అనే రూపము వాడుకలోనికి రాగానే చేతము అనే ఉభయ ప్రార్థనార్థక రూపము ఏర్పడినది. దానికి రూపాంతరముగా చేతాము వాడుకలోనికి వచ్చినది. చూతాము, చూదాము అన్నట్లే చేతాము, చేదాము అనికూడా అంటున్నారు లోకములో. ఈ రూపాలు చాలా కాలమయి పదాలలోను పాటలలోను తరుచుగా వినబడుతున్నవి. మధ్యవర్ణముమీది హ్రస్వముగా ఉన్న అచ్చు వాడుకలో దీర్ఘమైనది. ఈ దీర్ఘము ఏమి తప్పు చేసినది ? రెండున్ను సాధువులే అనవలెను. సంస్కృతం మొదలయిన తక్కిన భాషలకు వ్యాకరణాలు వ్రాసినవారు అట్లే అన్నారు. సంస్కృత భాషలో నసంధ్య, ననాంధ్య ; జల్పక, జల్పాక; శ్యామక, శ్యామాక; నియమః, నియామః; విరమః, విరామః; ప్రవహః, ప్రవాహః; నిస్వనః, నిస్వానః; ప్రశమః,

ప్రణామః; ఉవచ, ఉవాచ; చకర, చకార మొదలయిన రూపాలు సాధువులుగానే గ్రహించి వాటికి అనుశాసనం చేసుకొన్నారు.

తెలుగుభాషలో—గలను, గలాను; వలదు, వలాదు; మునుక, మునాక; వినఁగను, వినఁగాను; ఏతము, ఏతాము; ఎవ్వరు, ఎవ్వారుఁ మొదలయిన రూపాలు కనబడుతున్నవి. వాటితోపాటు పోతము, పోతాము, పోదాము మొదలయిన రూపాలుకూడా లోకములో ఉంటే గ్రహించవలసినదే.

అధర్వణకారికావళి వ్యాఖ్య (పు. 120) లో “రామచంద్రుని జూడరారే పోదామిపుడు” అని ఉదాహృతమై ఉన్నది. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (IV, 396) లో ఉదాహృతమైన జగన్నాథ మాహాత్మ్యమందు “పో।తామనుచును” అని ‘తా’ పదాదినిగల ప్రయోగమున్నది.

## చేదాము

మ॥ అనిశం బక్కున నవ్వి బాలకులు చోద్యంబయ్యె రామయ్య నీ
వనువాక్యంబులు నూరులేని పాలిమోగన్నట్లు సద్వృత్తాచా
రిని నీ కొందఱు బిడ్డలన్నగతి నోరి నీకుఁ దోఁబుట్టువే
వినమే కైవడి కావగల్గెఁ జెపుమా విందాము నిక్కంబుగాన్.

చెన్నబ. III, 112.

సీ॥ పూఁబోణులార యా పొదరిండ్ల చెంతను
వసియింతమా దేవపారిజాత
కుసుమముల్ గోతమా మూఁకుఁదేంట్లనుఁదోలి
మధుపానములు సేయ గదలుదామ
పులినదేశములందుఁ నిలిచి బంతులాడితి
యానందమగ్నుల మై యాడుదామ
కాలికాస్తంభ సంకాశదేశములందుఁ
బుష్పశయ్యలమీఁదఁ బొందుదామ

సరిజనములంది కోతాము చలువ చప్ప
రముల విహరించి వత్తమా రాజ్యమింత
హంసలనుబట్టుకొందాము యగరుగంధ
పూఁతలలర విరతి దృష్టిఁ బొందుదాము. పట్టాభి. III, 78.

కం॥ కోటలోపల నిల్తామటుగానిచో రంగా. II, 181.

గీ॥ హరిని గని రాధ యల యాటలాడుదాము
పడకటింటికి రమ్మని తొందరిపిల్వ
నాడనేఁగూడవచ్చెద, నను నిళయును
నవ్వి రాధికామాధవుల్ రవ్వసేయు. రాధికా. I, 57.

సీ॥ గౌతమీ స్నానానఁ గడతేఱుదామంటె
మొనసి చన్నీళ్ళలో మునుఁగలేను. నృ. శతక. 8.

సీ॥ ఎగిరి పొద్యోటందు కేయుపాయంబైనఁ
చేయఁబోదామంటె చేతకాదు. 41

శా॥ శోభావైభవముల్ ప్రవృద్ధమడరఁ జూతాము రమ్మంచు.
చారులీలావిలాసము.

## కోసము

శబ్ద రత్నాకరమందు "కోసము - దే. అవ్య. నిమిత్తమును దెలుపునది. 'ఉ. భూసుతకోసమేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలముం, జేసిన నా తపంబు రహిఁ జెందక నిష్ఫలమౌ' I ఉ. రా. ౮ (8) ఆ". అని యున్నది. ఈ ఉత్తరరామాయణములోనే "వలరాజుకోసమై" అని మరియొకచోట (చూ. పు. 21) కంకంటి పాపరాజుగారు ప్రయోగించినారు. వీరికి పూర్వము ఎంతకాలమయి ఈ శబ్దము భాషలోనికి వచ్చినదో స్పష్టముగా చెప్పలేము గాని, ఇది ప్రాచీనకవుల గ్రంథములందు మాత్రము కనబడలేదు.

ఈ కోసము తెలియజేసే అర్థమందే 'కోసగము' అనే శబ్దముకూడా కొందరు ప్రయోగించినారు. ఇది తరుచుగా కన్నడము సంపర్కంగలవారి వ్యవహారమందు కనబడుతున్నది. తెలుగువారి వాడుకలో కూడా ఉన్నది. వావిలికొలను సుబ్బారావుగారు అముద్రిత గ్రంథ చింతామణి మయూఖము (సంపుట 7. సం. I, పుట 4-1894)లో ప్రకటించిన పంచరత్న సీసములలో మొదటిదానియందు నాల్గవ చరణాన "ఓసరిల్లక విద్దెకోసగంబు" అని ప్రయోగించినారు.

తమిల నిఘంటులో 'ఓసరం' అనే పదముక్రింద ఇది 'కోసగం' అనే శబ్దమునొక్క వికృతి అని ఉన్నది. దీనికి నిమిత్తము అని అర్థము; కన్నడ నిఘంటులో ఓస్కర, ఓసుగ శబ్దములు నిమిత్తమనే అర్థములోనే ఉన్నవనిన్ని చెప్పినారు.

సంధివశమున 'ఉండి' నుండి 'నుండి', 'అంటే' నుండి 'కంటె' వచ్చినట్లే 'ఓసగము' నుండి 'కోసగము' వచ్చినది గాబోలు. 'ఓసగ' శబ్దము 'అపసర' శబ్దమునుండివచ్చినదేమో. 'మూడవ' శబ్దము 'మూడో'గాను, 'అపసరిల్లు' శబ్దము 'ఓసరిల్లు' అయినట్లే 'అపసము' 'ఓసము' కావచ్చును.

లక్ష్మీనరసాపురంలో అష్టావధానం చేసినప్పుడు తిరుపతి వేంకటేశ్వర కవులు విచిత్రంగా కోసము, కోసగము ప్రయోగించినారు:

"ఉ|| కొప్పరపుం గవీశ్వరుల కోసము వేంకటరామకృష్ణులే
దప్పుడు క్రోవనుండి సుపథమ్మునకుక్ మరలించుకోసముం
దప్ప మఱొండుకోసగము తావక భారము పూనలేదు నీ
కప్పని తీర్చు కోర్కె యికె నక్కఱలేదు శతావధాన మా||

ఈ కోసము, కోసగము శబ్దములు ప్రాచీన భాషలో లేవు గనుక, వీటి భావము తెలియజేయవలసినప్పుడు నన్నయాది కవులు 'లోకహితంబు పొంటె, వివాహంబు సేయుపొంటె, చూచు వేడ్కకై, మాఱవేఁడి నీకై, నీకునై, నీకుంగా, నీకొఱకు' మొదలయిన రూపాలు వాడేవారు.

## కోసము

ఉ॥ ఎవ్వతె కోసమీవగల కేమి యిటుఁకన్ బదమంచు — అని. I, 111.

ఉ॥ మానవులార రోగములు మానును లేములు లేవు సంపదల్
జానగు దుఃఖముల్ దొలఁగు జాలుననేకుంబులు మందబుద్ధులై
దీనతనొందనేటికి నతి స్థిరభక్తిని గొల్వుఁడీ పరా
ధీనులుగాక మీరు వసుదేవకుమారకు ముక్తికోసమై॥ — అప్ప. IV, 314.

ఉ॥ భూమిసుతకోసమేఁ గనక బొంకితి నేనియుఁ బెద్దకాలముల్
జేసిన నాతపంబు రహిఁ జెందక నిష్ఫలమౌ జనంబు వి
శ్వాసము నొందఁ జేయుటకు స్వాంతము గల్గిన మీరు కోరిన
ట్లే సభవారలెల్ల విన నియ్యెడనయ్యున్ శపథంబు పల్కెదన్॥
ఉ. రా. పుట 313.

సీ॥ ఎలమిలోఁ గపిరాజు చెలిమి పాటించుట
నీకోసమే గదా నీరజాక్షి — ,, 317.

సీ॥ వలరాజు కోసమ్మొ యలవసంతుఁడు గుంపు
సేసిన చిలుక తేఁటీలసంగ — ఉ. రా. I, 21.

సీ॥ ఒరపారెడు జిలుగ సన్నరుమాలు సొబగంచు
వివరింప నిదె పట్టు అవిక కనును
జెలువారెఁ గ్రొత్తసందుల వస్త్రమని యెంచి
కొననిదె పయ్యంట కోసమనును — నిరం. II, 45.

ఉ॥ వేసవి దగ్గరాయె మిము వీడుటకున్ మనసొగ్గదాయె మా
వాసము దూరమాయెఁ బర వాసమెయిన ర్పుట భారమాయె మా
కోసము తల్లిదండ్రు లిదిగో యదిగో యని మాటలాయె వి
శ్వాసమె సంగవే సెలవొసంగినఁ బోయెదమయ్య భూవరా॥
నానారాజ. తిరుపతి వేం. కవులు.

తొగకంటికోసమై (రాధికా III, 118) ఆడినకోసము (వైజ III, 96) బంటికోసమై (వైజ. IV, 5) దానికోసమై (హంస. III, 36) రాజ్యకోసమై (కాళ. శతక. 28) ముక్తికోసరము (నృ. శతక. 7) కూటికోసరముకై (నృ. శతక. 52).

## అయితే, అంటే

తెలుగులో చేదాద్యర్థకముగా నన్నయాదులు సమాపకక్రియారూపమునకు 'ఏని' చేర్చువారు. నేను జేసితినేని, నీవు సేసితివేని (సేసితేని), వాఁడు సేసెనేని, మేము, (మనము) సేసితిమేని, మీరు సేసితిరేని, వారు సేసిరేని మొదలయిన రూపములు, ప్రాచీనకావ్యములం దున్నవి. ఇవి ఒక్కొక్క క్రియకు మూడు కాలములందు, మూడు పురుషములలోను, రెండు వచనములలోను వివిధముగా ఉంటవి. నేడు వీటికి బదులుగా ఒక్క రూపమే మనము వాడుతున్నాము. నేను చేస్తే, నీవుచేస్తే, వాడు చేస్తే, మేము (మనము) చేస్తే, మీరు చేస్తే, వారు చేస్తే అని, ఒక్క 'చేస్తే' అనే రూపము అవ్యయముగా పరిణమించినది. ఎంత సులువయినదో చూడండి మన వాడుక! ప్రాచీనాంధ్రమందున్నట్టే సంస్కృతమందున్నది; గాని హిందీ మొదలయిన నేటి "అపభ్రంశ జాతి"ములయిన భాషలలో నేటి తెలుగులో ఉన్నట్టు ఒక్కరూపమే పరిణమించినది. భాషాదేవి చాలా కాలము కష్టపడి కన్నది ఇట్టి సుకరమైన చేదర్థకరూపము. సవరభాషలో చేదర్థకరూపము సంస్కృతములో నున్నట్టు, ప్రాచీనాంధ్రములోనున్నట్టు విస్తృతమవుటచేత సవరలు కానివారికి ఆ భాషలో వ్యవహారము కష్టముగా ఉంటుంది. వ్యతిరేకార్థమందు నన్నయాదులు నేను చేయనేని, నీవు చేయవేని, వాఁడు సేయఁడేని, మేము (మనము) చేయమేని, మీరు సేయరేని, వారు సేయరేని అని మూడు కాలములందును ప్రయోగించినారు. కాలము

స్పష్టపర్చువలసివచ్చినప్పుడు అగుధాతువు అనుబంధముగా వాడేవారు. ఉ॥ నేను జేయ నయ్యెడ నేని (వర్తమానము), నేను జేయనయితి నేని (భూతము) నేను జేయనగుదు నేని (భవిష్యత్తు) మొ॥ అయితే ఈ రూపములు విరళముగా ఉన్నవి. రానినాఁడు, కానినాఁడు, రాకున్నేని మొ॥ చేదర్థకములుగా నన్నయాదుల గ్రంథములందున్నవి.

చిన్నయ సూరి మొదలైన లాక్షణికులు ఈ రూపములు ఉపేక్షించినారు. బాల వ్యాకరణము సూ 41 లో కురిసినన్, రమ్మనిన్ మొ॥ రూపములు చేదర్థకములని ఉన్నది, గాని, కావు. నేటి తెలుగులో 'కురిస్తే' 'రమ్మంటే' అనే శబ్దములకున్న అర్థము వీటికి పట్టించినందున చిన్నయసూరికి ఇది చేదర్థకములని తోచిఉండును. 'వాఁడు రమ్మనిన నేఁబోయితిని' అనే వాక్యమునను సంస్కృతమందుగాని ఇంగ్లిషునందుగాని అనువదిస్తే చేదర్థకము ప్రయోజ్యమా ?

ప్రాచీనాంధ్రమందు మధ్యమపురుషైకవచనముగా "నీవు సేసి తేని", "నీవు అయితేని", "నీవు...అంటని", "నీవు చెప్పితేని" మొ॥ శబ్దములు వాడేవారు. అవి రానురాను "చేస్తే" 'అయితే', 'అంటే' 'చెప్పితే' మొ॥ రూపములు పొందినవి; ఉత్తమ ప్రథమపురుషములుగాను బహువచనములుగాను అవి వాడడము సుకరమైనది. అంతకంతకు, ప్రాచీనాంధ్రమందు "చేసితేని" మొదలయిన రూపములకు లేని అర్థములు, నేడు "చేస్తే" మొదలయిన రూపములకు కలిగినవి. శాసనములలో కొన్ని కనబడుతున్నవి. 'మీరు రమ్మంటే వచ్చాను', 'మీరు రమ్మంటేనే వచ్చాను, లేకపోతే ఎందుకొస్తాను' వాడు నన్ను కొట్టితే, నేను వాణ్ణి కొట్టాను' 'ఈపుస్తకం రంగన్నకిమ్మంటే ఎందుకిచ్చావు కావు?— వాడొస్తే ఇమ్మన్నారు; వాడొస్తేనా ఒకటి; వాడిక్కడికి రాకుంటే ఎవడికిచ్చేది'' ఇట్టి వాక్యములు నన్నయ భాషలోనికిని సంస్కృతములోనికిన్ని ఇంగ్లిషులోనికిన్ని మార్చి చూడండి.

ఇప్పుడు "గ్రాంథిక భాష"లో తమ భావములు తెలియజేసేవారు చేదర్థకముగా "చోఁ" "ఎడ" ప్రయోగిస్తున్నారు. నన్నయాదులీని ఏ అర్థమందు వాడినాడో, వీరికి తెలియదుగాబోలు. శబ్దరత్నాకరమందు "(చోన్) ఇది కొన్నియెడల 'అప్పుడు' అను నర్థము నిచ్చుచున్నది" అని ఉన్నది (చూ. చోన్). "అయనునన్ను నూకరమై యప్పుడ యెత్తుకొని రయంబునఁ జనుచోన్, కుక్షిచ్యుతుండై నుతుఁడా రాక్షసు భస్మంబు సేసి" (ఆది. I. 133), "ఈ బ్రాహ్మణునకు నేమి ప్రియంబు సేయ సమకూరునోయని చింతించుచున్నచో" (ఆది. VI, 240), "అయ్యమృతంబు దేవతలుపయోగించుచో" (ఆది. II, 18.) "ఎడ" ఎట్లు పూర్వులు వాడినారో చూడండి. "ఉతంకుండు మగిడి పోవు నెడ" (ఆది. I, 101) "గీర్వాణులుం బూర్వగీర్వాణ ప్రాతము నబ్ధిఁ ద్రచ్చు నెడ" (ఆది II, 12). ఉత్తరాంధ్రకవులు చేదర్థకముగా 'చో' వాడినారు. అట్టి వాడుకలో ప్రధానవాక్యమందు క్రియ భవిష్యత్కాలమం దుంటుంది. నన్నయాదుల వాడుకలో దానికి భిన్నము. దశకుమార చరిత్రలో కేతన—"పుత్రికి నేఁగునపుడు కరము సంప్రీతితో, ననుఁబవచ్చి నీకు ననుమతంబులైన పనులకే సహాయుండనయ్యెద, వలయుచోట నన్ను దలపవయ్య" (చూ IX, 36) అని 'చోటు' శబ్దమే ప్రయోగించినాడు. క్రింది పద్యములో (చూ. 38) "బెగ్గలించుచున్న చో", అని 'చోన్' 'వలయుచోటు'కు మారుగా 'వలయుచోన్' అని వాడినా భావము ఇంచుమించుగా ఒక్కటే అవుతుంది.

దీనిని విస్తరించి వ్రాయుటకు చోటు చాలదు. తెలుగులో "తే" ప్రత్యయమై ఉన్నది, చేస్తే అనే శబ్దమునకు చేదర్థమే కాక ఇంకా అనేకార్థములు కలిగినవి. అందుచేత అది చేదాద్యర్థకమనవచ్చును. దీనిని నిరాకరిస్తే, తెలుగువారు నోరు మూసుకొని కూర్చోవలెను. వాడుకలో లేని కృతక శబ్దములు, అర్థములు నేర్చుకొని వ్యవహరించలేరు. 'కింతు' మొ॥ అర్థములలో "అయితే" వాడుతున్నారు కారా పెద్దపండితులు? దానివంటివే 'అంటే' 'ఉంటే' మొదలయినవిన్నీ.

## అయితే, అంటే

అంగజాస్త్రవృత్తము ||

రంగుభమస్గల్ గ్రాలుమసజ్గల్
పొంగ్గైమన్యగముల్ రజర్గలో
పృంగా నార్థవగిరివళ్ళైతే
నంగజాస్త్రవృత్త మందగించున్ || అప్ప. IV, 209.

క|| అదుదునఁట లేకుంటే
యాడితినందువఁట యనక యుండిన మును చేఁ
జూడని పొదుదునఁట యీ
వేడబముల నాడనేర్చె వీఁడు తలంపన్ || ఉ. సై.

శా|| ఔనే యోసి దుర్మాత్మురాల నిన్ను నిల్లాలంచు నే నమ్మ్రియుం
టే నీవిట్లు దురాశఁ జెందఁదగునే నీ భోగముల్ సెల్లునే
కానిమ్మంచును రుక్మవంత యిదిగో కన్గొంటి దుశ్చేష్టితన్
దీనిం ద్రుంచుదు శస్త్రపాణినయి నా తృష్ణ్ణ మింకేటికిన్ ||
దశా. 195.

శా|| ఏనక్రూరుని వెంటవచ్చునపుడట్టే నన్ను వీక్షించి నేఁ
డైనన్ నిల్వుమటంచుఁ గన్నుగొనలం బ్రార్థించినం గూడదం
టై సెమ్మోములవంచి యున్నవరనుచున్ నేత్రాంబువర్షంబులన్
మాతం జేసిరి పైఁటలచ్చెలుల మానవన్ సేర్చునే యుద్ధవా || „ 309.

శా|| ఈబాలలైతే రామానుజుని యేది శాసనముచే తొండేఁగన్ గవన్ జూడుఁ||
„ 243.

శా|| దండాలం బెట్టిన మా సామికి నీవశాక వలపంటే వచ్చె నా బింకముల్ ||
„ 295.

శా|| దుర్యోధనుం డైతేనేమి పృథాతనూభవుఁ డైనా పాంచా. 43.

క॥ దళపతులనఁగా నందఱు
దళపతులా కారు పోటుదారియును బలా
బలములను వేళపాళలు
తెలియంగలవాఁడు దొాతికితే వాసియనన్ ॥ పార్వ. 26.

క॥ నీతోఁడఁ జర్చ సేయఁగఁ
బోతే నామనను కొకటి పాడమినఁ బొడమున్
నీతోఁడఁ బలుకరాదిఁక
వాతప్పగు మునుపె పడుచువాఁడను నేనున్ ॥ రాధా. 8.

ఉండురటే, దక్కడటంటె, పోవునటంటె, ఏలుమటంటె ,, II, 114.
అల్లితేనే, మీటితేనే, పాడితేనే, ఆడితేనే ” పుట 14.

శా॥ పాలుంబువ్వయుఁ బెట్టెదన్ గుడువరా పాపన్న రాయన్న వే
తేలెమ్మన్ననగంటి పండ్లుఁ గొని తేలేకున్న నే నొల్లనం
చ్రై లాలింపర తల్లిదండ్రు లపుడట్లె తెచ్చి వాత్సల్య ల
క్ష్మీలీలావచనంబులం గుడుపరా శ్రీ కాళహస్తీశ్వరా ॥
శ్రీ కాళ. శతక. 52.

శా॥ జ్ఞాతుల్ ద్రోహులు వాండ్రు సేయు కపటేర్ష్యాది క్రియాదోషముల్
మాతండ్రానన సహింపరాదు ప్రతికర్మం బించుకే చేయఁగా
బోతే దోషముగాన మాని యతినై పోఁగోరినన్ సర్వదా
జ్ఞాతిక్రోధము మాన దెట్లు నడతున్ శ్రీ కాళహస్తీశ్వరా ॥ ,, 69.

## ఆరగింపు

చేయడము వంటి శబ్దములు నిషేధించిన అధర్వణుడే ఆరగింపువంటి శబ్దములఁకూడా నిరాకరించినాడు; "క్వచిదింప్వంపతాం కేచిదూచిరే నహిమే రుచిః"(అజ. 98); "ఇట్టి శబ్దము నా కిష్టముకాదు" అని అన్నాడు. అతని యిష్టా నిష్టాలు చొప్పున అతడు వ్యవహరించవచ్చునుగాని, ఇతరులను నిర్బం

ధించడమునకు అతనికి అధికారము లేదు. వైయాకరణు లెవ్వరూ శబ్దములు ఇట్లు అనుశాసించలేదు. తెలుగు భాష అధర్వణుడు గుర్తించలేదు. శబ్దరత్నాకరమునందు ఆరగింపు, సాశగింపు, బెల్లింపు వంటి శబ్దములు కొన్ని ఉన్నవి. సాశగింపు అపూర్వమట. సీతారామాచార్యులు "ఇంప్వంతము ప్రాచీనకవి సమ్మతము కా"దనడమునకు కారణము ఈకారికే కాబోలు. ఆంధ్రభాషార్ణవములో అనేకముగా ఇంప్వంతము లున్నవి: సుగ్గడింపు (1. 130), తల్లడింపు (1. 133), ఆరగింపు (II, 260). పాండురంగ మహాత్మ్యమందు సాశగింపులు (III, 43), పరమ యోగివిలాసమందు ఆరగింపులు (III, 38, IV, 143) ప్రయుక్తమై ఉన్నవి. శ్రీనాథుడు కాశీఖండమందు వేధింపులు (చూ. IV, 18) అని ప్రయోగించినట్టు వ్రాతప్రతిలో ఉన్నది. 'ఇంపు' 'పంపు' అనే శబ్దములు 'ఇంచు' 'పంచు' ధాతువులనుండి పుట్టినవి కావా? అరవభాషలో ఇప్పు అనేది కృదంతప్రత్యయము: పడిప్పు, ఇరుప్పు. ఆ 'ఇప్పు' తెనుగులోను ఉన్నది: మెచ్చు, మెప్పు.

## ఆరగింపు

క॥ అనుదినము వేయుదిరుముడి
కిని మృష్టాన్నముల నారగింపు విడక యా
యన భుజియింపఁడు మున్నుగఁ
దన వనితయుఁ దాను నెట్టి తాత్పరంబో ॥ — పరమ. IV, 143.

గీ॥ వేదమార్గ రహస్యైక వేత్తలైన
భూనిలింపోత్తములు యజింపుదురు — వరాహ. X, 76.

సీ॥ అచట జాంబూనదం బనువైఁడిఁ జేసిన
తొడవులు ధరియింపుదురుదివిజులు — ,, X, 119.

## కళలపై నకారము

క॥ అనఘ యిదియేటి తపమే
మనుపమ దుఃఖితులమగుట యాధారము లే
కను సంతానోచ్ఛేదం
బున క్రేవేలెద మనమలోకముల తెగవు ననఁ॥ భారత. ఆది. II, 139.

అనే పద్యమందలి 'లేకను' గురించి గుప్తార్థ ప్రకాశికాకారులు బాల సంజ్ఞ. 13 వ సూత్రమునకు వ్యాఖ్య వ్రాస్తూ " 'లేకను' అను ప్రయోగము చూచి కొందఱు 'లేక' అను వ్యతిరేక క్త్వార్థకము ద్రుతాంతముగానుండవచ్చు ననియు, మఱికొందఱానువర్ణము 'లేకయుఁ' అనియు శబ్దపూర్వకంబుగా నుండవలసినను నట్లుచ్చరింపక పోవుట పాదపూరణార్థమనియు నుడువుదురు. కాని సముచ్చయార్థంబునఁ నవసరంబులేని యిట్టికళాశబ్దంబుల మీఁద నకారంబు కాన్పించిన చోట్లనెల్ల సముచ్చయ నకారంబని సవరించుట సులభంబు గావున నిట్టివి యాభాస సమాధానంబులని యెఱుంగునది. "లేకను" అను చోట 'లేమిని' అను పాఠమే కవికృతమై యుండును. 'ఆధారము లేదని, అనుపాఠము వ్రాఁతప్రతులయందుఁ జూచినట్లు కొందఱు నుడువుచున్నారు" అని వ్రాసినారు. ఈవిధముగానే పరిష్కర్తల గ్రంధములలోని పాఠములు తమ ఇష్టానిష్టములను అనుసరించి దిద్దివేసినారు.

ఇక్కడ 'దుఃఖితులమగుటను, ఆధారము లేకను అని సముచ్చయార్థకముగానే ప్రయుక్తము లయి ఉన్నవి. మేము కనబరచిన ప్రయోగాలలో చాలచోట్ల వ్యతిరేక క్త్వార్థకముల తర్వాత నకారము సముచ్చయార్థకము గానే ఉన్నది; చూడండి.

కళలపై నకారము కనబడరాదన్న పట్టుదలతో కొందరు హాస్యాస్పదమైన రూపములు వాడుతున్నారు. 'ఇదియే యా', 'ఇదేయా' అని

రామకృష్ణకవుఌన్ను, 'కనుకనే' అని ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (IV,5) లో కపిస్థలం కృష్ణమాచార్యులవారున్ను వ్రాసినారు!

వాడుక భాషలో 'ఇదేనా', 'కనుకనే' మొదలయిన ప్రయోగాలం ఆబాల గోపాలం అందరూ వాడుకుంటున్నారు. ఈ రూపాలలో కళలైయున్న నకారము అవధారణార్థకము. 'నీవేనా'; ఇది ఏవార్థకావధారణార్థకముల మీద ప్రశ్నార్థకము. ఈ రూపములు సంభాషణలో ఎట్లు అర్థ భేదములతో రసవంతముగా ఉంటవో చూడండి:—

"ఇది ఎవరు వ్రాసినారు?" 'నేను' 'నీవా'? "రాముడనుకున్నాను" "రాముడు కాదు; నేనే" "నీవే?" "నేనేను". "నీవేనా? ఎంతచక్కగా వ్రాసినావు!" సంతానములేకను పెంచుకొన్నారు. సంతానము లేక నే— లేక నేను—అనికూడా మరింత నిశ్చయముగాను దృఢముగాను చెప్పవలెనని ఈ రూపాలు వాడుతున్నారు.

అవధారణార్థకముగానే పింగళి సూరనగారు కళాపూర్ణోదయము (IV, 138) లో "ఇదిగోనయ్యా" అని ప్రయోగించినారు. ఈవిధము గానే సముచ్చయార్థమందో, అవధారణార్థమందో కళలపై నకారము లోక వ్యవహారమందున్ను కవిప్రయోగాలలోను కనబడుతున్నవి.

ఏవి కళలో ఏవి ద్రుతప్రకృతికములో సరిగా తెలుసుకోక కొందరు తాము సంప్రతించి అచ్చువేసిన గ్రంథాలలో కవికృతమైన పాఠములు తప్పుగా దిద్ది సవరిస్తున్నారు. హరివంశ ఉత్తరభాగం (V, 197)లో 'దీనికేల యింతటు' అని వ్రాతప్రతులలో కనబడుతూవుంటే 'దీనికేలనింతటు' అని దిద్ది అచ్చు వేయించినారు. ఏల ద్రుతప్రకృతికమనుకొని 'ఏలననఁగా' అని కొందరు వ్రాస్తున్నారు. వ్యాకరణయుక్తంగానే 'ఏలన' అని మరి కొందరు వ్రాస్తున్నారు.

క॥ అనఘ యిదియేటి తపమే మనుమలు దుష్కృతులమగుట నాధారము లే
కను సంతానచ్ఛేదంబున వ్రేలెద మధమలోకమున దెరువు సనక॥
భార. ఆదిప. II, 139.

క॥ కాఱడవిఁ బఱచు మృగముల నూఱడకందిగిచి డస్సియున్నతరి శ్రమం
బాఱఁగ నెడఁ బరితాపము దీఱఁగఁ బైవీచె నన్నదీపవనంబుల్॥ ,, IV, 18.

సీ॥ మురటి లేకనె వచ్చితిగదేమి కల్కాన్న
సరటి దచ్చెదనని జరిగె నొకతె॥ ఉ. హై. V, 28.

క॥ కాలుం కదలింప లేకన్ వాలెమునడుగున నొడలను వైచి మెతుకుపై
జోలి నొకింతయుఁ బెట్టక గాలికి నుసురులను నిలుపఁగాఁ జొచ్చెఁగడున్॥
కవిజన చ. చ.

క॥ తోఁచిన వగ రచియించెదఁ గోఁచనితోఁ జిలువగట్టు దొరతోడైనా
యాచకనె యానతియ్యఁగఁ దోఁచ దసాధ్యంబు కవనధోరణిపట్లన్॥
ప్రబం. 5.

క॥ పడమటి వాకిలి వారిని దడఁబడకం బోయి సావధానముగాఁగన్
మృడుఁడామణిమయ ధామము కడు కన్నులపండువుగను గనుమాలోనన్॥
శివ. 41.

క॥ మలయపవమాన బాలకుల్ మందులుగద
యమృతకరుఁడవు గద నీవు కమలవైరి
యకట యిటులయ్యుఁ బెంపు సేయంగఁ దగునె
యంగజవ్యాధులను మాన్పకం గరంబు॥ సా. II, 177.

క॥ విను మాట్లాడఁగఁ బెద్దలుననుఁగని పనిసేయుమనుచు నాటిన కోపం
బున సేవలాడ విడలేకను దేశభ్రమణవృత్తిఁ గైకొని మఱియున్॥
హంస. III, 147.

## చేసినాను

ఆంధ్ర ప్రసన్నరాఘవ విమర్శమందు క. ప్ర. వేదము వేంకటరాయ శాస్త్రిలవారు ఇట్టి శబ్దములు "ఆంధ్ర వ్యాకరణ మర్యాదను" అతిక్రమించినవని నిందించినారు. (చూ. విషయ సంగ్రహాదికము, అనుబంధము పు. 3). ఆంధ్ర ప్రసన్నరాఘవములో మ. మ. కొక్కొండ వేంకటరత్నము పంతుల వారు వాడిన 'పొందినావు' అనే శబ్దమునుగురించి, "ఈ రూపము లక్షణ కారులచే ననుగృహీతముగాదు. మహాత్రైన పొందినాఁడవు. ఇతరమైన పొందినదానవు అని రూపములు. బాలవ్యాకరణము, క్రియా. ౧౧-౨-వ సూత్రముం బరికింపుఁడు" అని దోషము నిరూపించినారు. (చూ. పు. 265). ఈ శాస్త్రిలవారే, ఆంధ్ర సాహిత్య పరిషదష్టమ వార్షికోత్సవ సభ నెల్లూరిలో జరిగినప్పుడు, తమ అధ్యక్షోపన్యాసములో పేరు చెప్పకుండా, రా. బ. కందుకూరి వీరేశలింగము పంతులుగారు దుష్టప్రబంధ నిర్మాతలని దూషించి, వారి గ్రంథములలోని తప్పులలో "కోలినావు, అడిగినాము, విన్నాను ఇత్యాది భూతార్థక నావు నాము నాన్వంతములు పెక్కులు" అని ఉదాహరించినారు (చూ. ఆ. సా. ప. పత్రిక VIII, i, పు. 89).

అయితే, ఈ రూపములు ఈ శాస్త్రిలవారే తాము రచించిన శిశు వ్యాకరణమందున్ను (చూ. పుట 4, 5, 17), కథాసరిత్సాగరమందున్ను (చూ. పుట 364), అముద్రితగ్రంథ చింతామణిలో ప్రకటించిన వ్యాసములందున్ను (చూ. VII, 5 పుట 57) ప్రయోగించినారు; అప్పటికి వారు బాలవ్యాకరణము చదువుకోలేదు గాబోలు. ఇతరుల గ్రంథములలో తప్పులుగా వీరెన్నిన శబ్దములు ఇంచుమించుగా అన్నీ వీరి గ్రంథములలో కనబడుతున్నప్పుడు, ఏమనుకోవలెనో నేను చెప్పనక్కరలేదు. ఆంధ్ర ప్రసన్న రాఘవములోని 'మోసపోతిని' అనే ప్రయోగమునుగురించి, తమ విమర్శములో శాస్త్రిలవారు చేసిన ఆక్షేపము చూడండి: "పోతిననుట యెట్లు

సాధువు? 'పోతివిగదవే తప్పాలా బొంకించిపోతివే తప్పాలా' అను కూచి పూడి భాగవతమే ప్రమాణమా?" అని పరిహాసము చేసినారే; తమ కథా సరిత్సాగరమందు 'పోతిని', 'పోతివి', 'పోతిమి' (చూ. మొదటికూర్పు పు. 15, 16, 20, 21, 24, 26) తరుచుగా వాడినారు; అవి యెట్లు సాధువు? వాటికి ప్రమాణము వారుదాహరించిన కూచిపూడి భాగవతమేనా? అని ఎవరైనా అడిగితే, ఏమందురో శాస్త్రిలవారు. 'పోవుదును, పోవను, పోవక, పోవక' మారి కొంతకాలమునకు 'పోదును, పోను, పోక, పోక' అయినట్లే, 'పోయితిని' మారి 'పోతిని' అయినది. ప్రాచీనులు తమ కాల మందు వాడుకలో ఉన్న 'పోవుదును', 'పోయితిని' మొదలయినవి కావ్య ములలో ప్రయోగించినట్లే, అర్వాచీనులు తమ కాలమందున్న 'పోదును', 'పోతిని' వాడినారు. శబ్దముల సాధుత్వమునకు ప్రమాణము శిష్టవ్యవ హారమే. వరాహ పురాణములో నంది మల్లన్న, ఘంట సింగయ్య 'అమ్ముడుపోతిమి' అని ప్రయోగించినారు (చూ. X, 37 మ.).

ఇట్లే 'నాను నావు వామ్వంతములు'న్ను శిష్టవ్యవహారమందున్నందున కవులు ప్రయోగించినారు. గంగనాధ రామాయణములో వితత విక్రమ సైన్యవిభుఁ జేసినావె......మునుపుగాఁగడి దుర్గముల నుంచినావె (అయో); అప్పుడు రఘురామఁ దర్కజుఁజూచి, యెప్పుడు సూచినా వీ భూములెల్ల (కిష్కి) అనిన్ని, పిడుపర్తి సోమన బసవపురాణములో 'జరిగినావు' (పుట 64); ధూర్జటి కాళహస్తి మహాత్మ్యములో 'ఒసరించినాను' (III, 218); కోట శివరామయ సానందోపాఖ్యానములో 'తలంచినాను' (పు. 37), వెళ్లి నాను (పు. 84); మొల్లరామాయణములో 'నేర్చినాను' (I, 12); తెనాలి రామయ్య ఘటికాచల మహాత్మ్యములో 'ఒవరించినాము' (II, 158); సవరం చిననారాయణ కువలయాశ్వ చరిత్రలో 'చదువుకొన్నాము' (II, 79); మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రలో 'చూపించినాను' (III, 127);

శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానములో 'మోచినావు' (II, 147); రుద్రకవి నిరంకుశోపాఖ్యానములో ఒక్క సీసపద్యములోనే 'పట్టినావు, కోరినావు, నడచినావు, పడినావు, కాచినావు' (III, 29); సందు ర్తి వెంకటాచలకవి మిత్రవిందా పరిణయములో 'చదివినావు, రచియించినావు, ఘటియించినావు చాటించినావు, అలరినావు' (చూ. కవుల చరిత్ర పు. 443); అప్పకవి దాఁచినావు (II, 30), ఇచ్చినావు (IV, 413, 414, 415); కూచిమంచి తిమ్మకవి రాజశేఖర విలాసములో చాలినావు (II, 7); కృష్ణయ ఇందుమతీ పరిణయములో నేర్చినావు (III, 4); పాపకవి చెన్నబసవపురాణములో తలఁచినావు (పు. 127); పుష్పగిరి తిమ్మన సమీర కుమారవిజయములో పలికినాను (III, 104), వ్రాల్చినావు (IV, 225); దిట్టకవి నారాయణ రంగరాయ చరిత్రములో, నడచినాము, పంచినావు (II, 171); కంకంటి పాపరాజు ఉత్తర రామాయణములో హసించినావు (పు. 82), వచ్చినావు (పు. 187), వచ్చినాను (120).

ఇట్లు 16, 17, 18-వ శతాబ్దములలో అనేక కవులు ప్రబంధము లలో ఈ రూపములు ప్రయోగించినారు. శతకములలో అపరిమితముగా ఇట్టి ప్రయోగములు కనబడుచున్నవి. అధునాతనులు స్వేచ్ఛగా ఇవి వాడు చున్నారు. ఇట్టి శబ్దములు నిషేధించిన శబ్దానుశాసనము చెల్లదు (చూ. పండితభిమక్కల భాషాభేదజము).

ఇప్పటివారు ప్రఖ్యాతిపొందినవారే తాము నిత్యము వాడుచూఉండే భూతార్థక రూపములు విడిచి, వాటికి మారుగా సుపరిచితములు కాని ప్రాచీనాంధ్ర శబ్దములు ప్రయోగించ నుద్దేశించి, భ్రమప్రమాదములకు లోనయి, వ్యుత్పన్నసంస్కార దోషములకు లక్ష్యములు అమర్చిపెట్టుచున్నారు. ఇట్టివి వందలకొలదిగా ఉన్నవి. సంస్కృతమున్ను, ప్రాచీనాంధ్రమున్ను లెస్సగా అభ్యసించినవారేకాని ఇతరులు 'గ్రాంథికాంధ్రమున', పద్య

ప్రబంధముగాని గద్యప్రబంధముగాని, రచించుటకు అధికార్లు కారని చాటి చెప్పిన శ్రీ తిరుపతి వెంకటేశ్వరులే ఈ భూతార్థక రూపములు ప్రయోగించడములో ప్రమత్తులయినారు. వారి గురువులు, కవిసార్వభౌములు 'మీరు చనుదెంచిరి', 'మీరు కనిరి', 'మీరు ఎంచిరి', 'మీరు అయిరి', 'మీరు తలపడిరి' అని శ్రీకృష్ణభారతములో ప్రయోగించినారు. రాజమహేంద్రవరమునందే బ్ర. శ్రీ. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారి అధ్యక్షతను కూడిన ఒక పండితసభలో, ఇట్టి అప్రప్రయోగముగల పద్యమొకటి నేను చదివినప్పుడు ఎవ్వరికీ తప్పు తట్టలేదు. ఆంధ్ర స్కాట్ అని పేరుపొందిన బ్ర. శ్రీ. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రచించిన సంగ్రహరామాయణములోని గ్రాంథికాంధ్రభాష ఒక పండితసభలో, మ.శ్రీ. న్యాపతి సుబ్బారావు పంతులుగారు అధ్యక్షులుగా ఉన్నప్పుడు, నేను విమర్శించవలసివచ్చినది. అప్పుడు కవిగారి యెదుటనే సుందరకాండములోని 43-వ పద్యము,

క॥ ఏ విధమున నీమైథిలి నావశమై యుండఁగలదొ నయభయములచే
నా విధమున మెలఁగుడియిటుఁ గావింపక దక్కిరేని ఖండింతు మిమున్॥

చదివి వినిపిస్తే, దానిలోని అప్రప్రయోగము ఎవ్వరూ కనుక్కోలేకపోయినారు; ఎంత చర్చించినా కవిగారికి దోషము కనబడలేదు; 'దక్కిరి' అనే క్రియ ప్రథమపురుషము, దాని కర్త 'మీరు' మధ్యమపురుషము అని దోషము నేను చూపించిన తర్వాతనయినా కవిగారికి మాత్రము దోషము బోధపడ్డదిగాని, ఇతరులకు తెలియలేదు; స్పష్టముగా చెప్పవలసివచ్చినది. సంగ్రహరామాయణము తిరిగీ అచ్చువేయించినప్పుడు ఈ పద్యము 4-వ పాదము 'గావింపక దక్కిన మిము ఖండింతుజాఁడీ' అని కవిగారు దిద్దినారు. అయితే ప్రాచీనాంధ్రములో భూతకాలమును తెలియజేసే రూపముల లక్షణము వారికి బోధపడినట్లు కనబడదు. మీరు 'దక్కిరి'వంటి అపప్రయోగములు ఆ కావ్యమందే ఇంకా మరికొన్ని ఉన్నవి; అవి వారు దిద్దలేదు. విజయ

నగరములో మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిలవారు అధ్య క్షులుగా కూడిన ఉపాధ్యాయపండిత సభలో, నేను దేశభాషనుగురించి ఉపన్యసించినపుడు, సంగ్రహరామాయణములోనిదే—

గీ॥ రాజపుంగవుల్ సంచితవ్రతులు నియతు
లమరతుల్యులు మీరలో యనఘులార!
నామధేయంబు లెవ్వి? యన్వయమ దేది
యేటి కరుదెంచి రీదేశ మెరుగఁ జెపుఁడ॥ అనే పద్యము చదివి, అప ప్రయోగములు చూపించినాను. ఇట్లే ఆంధ్ర కాళిదాసులు మొదలుగాగల వా రనేకులు తప్పులువ్రాస్తున్నారు. బాలకవులు వారిని అనుకరించకూడదు; వాడుకలోని శబ్దములు ప్రయోగిస్తే తప్పులు రమ్మన్నా రావు.

చిన్నయసూరి అనుశాసించిన 'ఉన్నాను, ఉన్నావు, ఉన్నాము' కూడా చేసినాను, చేసినావు, చేసినాము వంటివే. ప్రాచీనాంధ్రమందు ఇవీ లేవు, అవీ లేవు. నన్నయ, తిక్కన, నన్నెచోడుడు, ఎర్రన, జక్కన, మారన, శ్రీనాథుడు మొదలుగా పూర్వాంధ్రకవులు ఇవి ఏవీ వాడలేదు. ఆంధ్రశబ్ద చింతామణి, క్రియా. సూ. ౧౧ ప్రకారము ఈ రూపములు సాధ్యమయితే, ఆ లక్షణము ఉత్తరాంధ్రభాషకే పట్టుతుంది; అట్టిదే అప్ప కవి నిరూపించిన వర్తమాన క్రియాసంధి (V, 69).

నన్నయ గ్రంథములో చేసినవాఁడను, చేసినవారము, చేసినవాఁడవు, చేసినవారరు, చేసినవాఁడు, చేసినవారు; ఉన్నవాఁడను, ఉన్నవారము, ఉన్నవాఁడవు, ఉన్నవారరు, ఉన్నవాఁడు, ఉన్నవారు కనబడుతున్నవి. తిక్కన గ్రంథములో చేసినాఁడను, చేసినారము, చేసినాఁడవు, చేసినారరు, చేసినాఁడు, చేసినారు; ఉన్నాఁడను. ఉన్నారము, ఉన్నాఁడవు, ఉన్నా రరు, ఉన్నాఁడు, ఉన్నారు కూడా ప్రయుక్తమైనవి. మధ్యమపురుష బ. వచనమందు 'అరు' అక్కడక్కడ కనబడదు; రానురాను ఆ-'అరు' తరు

ముగా లోపించినది. చేసినవాఁడు, ఉన్నవాఁడు లోని 'అవ' 'ఆ'గా మారి నందున 'చేసినాఁడు', 'ఉన్నాఁడు' అనే రూపములు వాడుకలోకి వచ్చి నవి. ఈ రూపములన్నీ విశేషణములుగాని క్రియలుకావు. 'నేను బాలుఁడను' 'మేము బాలురము', 'నీవు బాలుఁడవు', 'మీరు బాలురరు', 'వాఁడు బాలుఁడు', 'వారు బాలురు' ఇవిన్నీ అట్టి విశేషణములే. స్త్రీవాచకముల విషయమయి, చేసినదానను, చేసినదానవు, చేసినది; ఉన్నదానను, ఉన్న దానవు, ఉన్నది అనే రూపములు వాడుకలో ఇప్పటివలెనే అప్పుడున్ను ఉండేవి. మేము ముగ్గురము, మీరు ముగ్గురు; మేము చుట్టాలము, మీరు చుట్టాలు; మేము పదిమందిమి, మీరు పదిమంది—ఇట్లు మధ్యమపురుష బ. వచనము, ప్రథమపురుష బ. వచనమువలె అయిపోయినది.

ఆ పని చేసినవాఁడ(ను) నేను; నేను ఆ పని చేసినవాఁడ(ను), నేను ఆ పని చేసినాఁడ(ను) అని విశేషరూపముండగా నేను ఆ పని చేసినాను అనే రూపము క్రియగా వాడుకలోనికి వచ్చినది; ఇన్నూరేండ్లయి నేఁడు చేశాను అని దాని స్థానమందే వాడుకలోనికి వచ్చిఉన్నది. పదాలలోను పాటలలోను శతకాలలోను కొందరు ఈ కొత్తరూపాలు వాడుతున్నారు కూడాను. ఈ క్రియారూపమునకు కర్తృ పురుషవాచకముగాని, స్త్రీవాచకముగాని ఉండవచ్చును. శిష్టులందరూ తింటూఉన్నది, ఆరోగ్యప్రద మైనది, సులభమైనది అభక్ష్యమని ఆచార్యులవారెవరైనా నిషేధిస్తే ఎవరూ విడిచిపెట్టరు.

## చేసినాను

క॥ బలులేమి చేత వేసరు
 చెలికిం జిపిటంబులీయఁ జేకొని కృపతో
 గలిమిచ్చినావు కేరుచు
 నెలమిం గృపనేఁగి తద్జ్ఞా హితవుగ విపులక॥ అప్ప. IV, 411.

చ॥ అనితరబాహులీలారుజ వనాంతరవాసము జెందినావు నీ
వెనసిన ప్రేమ నగ్గదిసె దప్పటి ప్రేమను గూఁతుయుందుదుం
దును నొక యాసఁ బట్టుకొని స్రుక్కక పెక్కుదినంబు లోర్చితిన్
నను దిగనాడి యిట్లు చనినన్ నిక నెట్లు భరింతుఁ బ్రాణముల్॥
ఉ. రా. పు. 317.

వ॥ సీతాత్యాగం బొనరించినానసుడు నత్కూరుం దుమాజానికిన్.

శా॥ అయ్యా! ఎక్కడనుండి యిక్కడికి లీలార్థంబు విచ్చేసినా
రియ్యజ్ఞానముమీఁద నింత దయ మీకెట్లయ్యె నేఁ డెద్దినేఁ
జెయ్యంగాఁగల యూడిగంబని ప్రశంసింపన్ ఫణిగ్రామణీ
శయ్యాస్వామిందు ప్రసన్నమూర్తియయి రాజన్యున్ విలోకింపుచున్॥
కాశీ. మ. III, 218.

తే॥ చంచలింపకిట్టు పాపసత్కృత్యంబు
చేసినావు నాన నోసిపోయి
భయదరూపమైన పాషాణమై యిట్టు
పల్లవుండు వసింపు పట్టణమున॥ నిరం. IV, 44.

తే॥ కోరి గోదావరీ మహాతీరమందుఁ
బాలఁకూతలఁగూడి క్రీడకుఁ బోయినావొ
నన్ను భ్రమయించ నెచటనున్నావొ సీత
రావె యని లేచి పిలుచుచు రాఘవుండు॥ పట్టాభిరా. I, 15.

పంచచా॥ నరాధినాథ నన్నుఁ బాసినావటంచు నెంచి యీ ,, V, 174.

గీ॥ తనకు వార లెక్కడి తల్లిదండ్రులనఘ
నీవ తల్లివి తండ్రివి నీవ గురువు
క్షితిపు యజ్ఞంబు వెలయంగఁజేసి నన్నుఁ
గావు ప్రాణదానంబిడి కరుణతోడ॥ భాస్కరరా. బాల. 629.

శా॥ ఏయేదేశములన్ వసించితిరి మీ రే గిరుల్ చూచినా
రేయే తీర్థములందుఁ గ్రుంకిడితి రేయే వ్రతముల్ పెట్టినా
రేయే పుణ్యవనాళిఁ ద్రిమ్మరితి రేయే తోయధుల్ దాటినా
రా యా చోటులఁగల్గు వింతలు మహాత్మా! నా కెఱింగింపవే॥

హంస. I, 68.

ఉ॥ తెల్లని తమ్మిరేకులకుఁ దియ్యపు నెచ్చెలులైన కన్నులా
జల్లని చూపుమాచి యిటు సంగతులై చనుదెంచినారు మీ
రెల్లను లోకముల్ శుభసమేతములే యనురాధముల్ ప్రవ
ర్తిల్లరుగా సమస్త జగతీపరిపీడయొనర్పఁ గ్రమ్మఱన్॥

హరివం. పూ. V, పు. 101.

గీ॥ అడవిలో గొల్లమందలయందుఁ బెరిగి
నారు లౌకికం బేమియు నేర రెఱుఁగఁ
గంప నరనాయకుఁడు కేడ్కఁ గట్టు చీర
లడుగునంతటివారె మీరకట యిట్లు॥ ,, IX, పు. 205.

## చేస్తిని, చేస్తాను, ఉంటాను, చదువుతాను

క. వస్తాఁడా హరి సొమ్ములు తెస్తాఁడా గొల్లఁడంట దిట్టకరయఁగా
జాస్తాఁడా కౌఁగిలి నేఁడిస్తాఁడా చెప్పుమన్ననివి గ్రామ్యోక్తుల్.

అని అప్పకవి ఈ శబ్దములను గ్రామ్యములని దూషించి ఉన్నందున గద్దలికావ్యాయము చెప్పిన పండితులు అందరూ వీటిని బహిష్కరించినారు. బదులలోని పసిపిల్లలు మొదలుగా సాక్షరులందరూ ఈ-స్తా-రూపములు, రాత్రింబగళ్లు నోటను పలుకుతూ ఉన్నా, ఉత్తరాలలో వ్రాస్తూనే ఉన్నా, "వ్యాసరచన" లో మాత్రము వాడరు. గ్రామ్య శబ్దమునకు ఉదాహరణముగా చదువుకొన్నవారు ఈ-స్తా-రూపమే చెప్పు

కారు. అందువల్ల, ఇట్టిరూపములుగల తిజన్త పదములు సాధువులే అని నమ్మకము పుట్టేటట్టు రుజువు చేయడము కష్టముగా ఉన్నది. గ్రామ్య మంటే గొల్లలు మొదలయిన పామర జనులు వాడే శబ్దము అనిన్ని అశ్లీల శబ్దమనిన్ని సంస్కృత పండితులు నిర్వచనము చెప్తూ ఉంటారు; వస్తాడు మొ॥ శబ్దములు శిష్టుల వ్యవహార మందున్నప్పుడు అవి గ్రామ్య శబ్దములంటే, శిష్టులను గొల్లలవంటి పామర జనులలో కలిపినట్టు కాదా? నన్నయాది పూర్వ కవులు ఇట్టి శబ్దములు వాడి యుండలేదు గనుక ఇవి గ్రామ్యములంటారు కొందరు. పూర్వకవులు వాడని శబ్దములు అనేకము ఉత్తరాంధ్రకవులు వాడినారు కారా? అవి గ్రామ్యములా? వైయాకరణులు గ్రామ్యములన్న శబ్దములు నన్నయాదుల గ్రంథములందే ఉన్నవే; వాటికి గ్రామ్యత్వము ఏలాగున వచ్చినది? వాటిలో వర్ణలోపమో వర్ణాగమమో దోష మున్నది, అంటే, లోపాగమ వర్ణవ్యత్యయములు నిరూపించడమే అనుశాసనము, 'సంస్కరణము' 'వ్యాకరణము' అని పతంజలి మహా. భాష్యలో చెప్పినాడే! గ్రామ్యత్వము వాటివల్లరాదు; వ్యాకరణము అంటే ఏమిటో తెలియని అవివేకులు కల్పించే విధి నిషేధములు విమర్శించ కుండా, ఒకరిని చూచి ఒకరు పాటించడమువల్ల దేశభాష కుంటువడ్డది.

భవిష్యదర్థమును తెలియజేసే రూపములు, అస్తిరనుబంధకః స్యాద్యత్ర లృడర్థోవివక్షితోధాతోః అని ఆంధ్రశబ్దచింతామణిలో చెప్పినట్లున్ను, కల బ్యనుబంధంబుల్పుట్టు పరంబగునపుడగు అని బాలవ్యాకరణమందున్నట్టున్ను, నన్నయ తిక్కనాది ప్రాచీనకవుల గ్రంథములలో కనబడవు; కేతన పెద్దన చెప్పినవే తరుచుగా ప్రయుక్తమయినవి. ఉత్తరాంధ్రములో 'వచ్చును' వంటి రూపములున్ను 'వస్తాడు' వంటి రూపములున్ను వాడుకయందున్నవి; వాటి అర్థములో కొంతభేదమున్నది గనుక అవి అపరిహార్యములయినవి.

వస్తాడు మొ॥ శబ్దములు నన్నయ కాలమందున్నట్టు నిదర్శనము లేకున్నా తిక్కన కాలమందున్నట్టు నాటి శిలాశాసనములలో కనబడుతున్నది; దేవాలయములలో, స్తంభములమీదను గోడల మీదను చెక్కిన శిలాశాసనములలో "చేస్తిమి" "ఇస్తిమి" మొ॥నవి తెలుగు దేశమందు అంతటా ఉన్నవి; బాలసరస్వతి, అప్పకవి మొ॥ వారు రచించిన తెనుగు వ్యాఖ్యానాలలోను, ముద్దరాజు రామన్న మొ॥ వారు తెలుగు ప్రబంధములకు రచించిన టీకలలోనూ, 'ఉంటారు' 'అంటారు' 'చేస్తున్న' 'చెప్పతున్నాము' 'రక్షిస్తున్నాడు' (రక్షింస్తున్నాడు అని కొన్నిటిలో) కనబడుతున్నవి; సామెతలలోను, కథలలోను, పాటలలోను, పదాలలోను, శతకాలలోను, ద్విపద కావ్యములలోను చాటు పద్యములలోను ఈ రూపములు తెలుగువారి కందరకును పరిచిత మయినవి. చిన్నయ సూరి నీతి చంద్రిక బడులలోకి రాక మునుపు పిల్లలు చదివే పుస్తకము లన్నిటిలోను ఈశబ్దములు ప్రచురముగా ఉండేవి. న్యాయస్థానములలోను కచేరీలలోను వార్తా పత్రికలలోను గవర్నమెంటువారి శాసనములలోను, శిష్టవ్యవహారమందున్న భాషే 1802 వ సం. మొదలు కొని నేటివరకున్నూ వాడుతున్నారు. సర్వశబ్దసంబోధిని, గురుబాలప్రబోధిని, అమరము, ఆంధ్రనామసంగ్రహము మొ॥ నిఘంటులలో అర్థాలు వాడుక మాటలతో పండితులు చెప్పినారు. వేదాంతము, వైద్యము, జ్యోతిషము మొ॥ శాస్త్రాలకు తేట తెలుగున వ్రాసిన వ్యాఖ్యానా లున్నవి; వాటిలో ఈశబ్దములు తరుచుగా కనబడుచున్నవి.

'చేసితిని' అనేశబ్దము 'చేస్తిని' కావడము విపరీతము కాదు. అరవములో ప్రాచీన గ్రంథము లందున్న శబ్దముల 'త్తు' వర్ణములు ప్రజల వాడుకలో 'చ్చు' అయినవి. సం. 'నిత్య' పారి 'నిచ్చ' అయినదికాదా? ఛు- వర్ణము గల రూపములకన్న తు- వర్ణము గల రూపములు ఎక్కువ కాల

మయి తెలిసికొని, ఎక్కువగా వాడుకలో ఉన్నవి. చు- వర్ణము గల రూపములు వ్యవహార భ్రష్టములయినవి. 'చదువుకున్తున్నారు' 'వండుకున్తాను' 'ఇషు', 'అషు', 'అష్టా' ఇష్టా మొ॥ బాల్యమందు వైదికుల ఇండ్లలో వినబడేవి; నేడు 'చదువు కుంటున్నారు,' 'వండు కుంటాను' 'ఇటు' 'అటు', 'అట్లా' 'ఇట్లా' మాత్రమే వాడుకలో ఉన్నవి. చేస్తిని, ఇస్తిని, వస్తిని మొ॥ శబ్దములు వాడుకలోనికి వచ్చిన పిమ్మట, చేస్తే (చేసి తేన్) చేస్తూ, చేస్తాను, చేస్తున్నారు మొ॥ వి పరిణమించినవి; అంతటా అల్లుకొన్నవి; పండితులు, పరిషత్తులు, విశ్వవిద్యాలయాలు, శాసనసభలు, పరిపాలకులు వాటిని పరిహరించుకోలేరు. వాటిని తొలగించడము కుత్తుక కోసుకోవడము వంటిది. వాటి పని చు- వర్ణములుగల శబ్దములు చేయలేవు. చూడండి:—'వచ్చును' అనే శబ్దము వాడుకలో ఉన్నది గాని లేనిది కాదు. 'నేను రావచ్చునా?' 'నీకు పాఠము వచ్చునా?' ఇట్లే 'వత్తును' మొ॥ రూపము లున్ను నేటి వాడుకలో ఉన్నవి: 'నన్ను పిలిచిఉంటే, నేనూ వత్తును'; 'అన్నయ్యను పిలిచి ఉంటే ఆయన కూడా వచ్చును'; అయితే, భవిష్యదర్థకము క్రియ వాడవలసివచ్చినప్పుడు, వాడు వచ్చును, వచ్చెడిని, వచ్చెడును రాఁగలఁడు అని, ఎక్కడా, ఎవ్వరూ, అప్పుడు అనరు; 'వస్తాడు' మాత్రమే ఆ అర్థమందు వాడుతున్నారు. 'మీరు స్వయం' వెళ్ళి పిలిస్తే వాడు తప్పకుండా వస్తాడు; 'మీరు పిలిస్తేనే వచ్చాను, పిలవకపోతే తగు మనుషులు వస్తారా?' వాడు వస్తే మీకు తెలియజేయమన్నారు; వాడు వస్తేనా? (ఒకటి)?' 'వస్తేరా'; 'సెలవివ్వండి; నేను (పోయి) వస్తాను'; 'తొందరపడకండి, నేను ఇంటికి తిరిగి వస్తానే మీవ్యవహారం పరిష్కరిస్తాను'; 'నీవు వస్తేనేకాని ఈ పని నెరవేరదు' ఇట్లుసందర్భానుసారముగా లోకములో వస్తాడు, ఇస్తాడు, ఉంటాడు, పోతాడు, మొదలయిన రూపములు అందరూ వాడుతున్నప్పుడు, ప్రాచీనాంధ్రములో వీటి అర్థము

తెలిఁగు చేయడము సుకరము కాదు. నన్నయ వాడిన 'ఇత్తే' 'పుత్తే', 'కొండే', తిక్కన వాడిన 'వినితి' 'అనితి' నేటికవులు వాడరు.

ఈ మార్పు బుద్ధిపూర్వకముగా ఎవరూ చేయలేదు. అది తెలుగు భాషా స్వభావమునకు విరుద్ధము కాదు. ఇంచు=ఇన్ త్ స్ ఉ; నకార తకార సకారములు దంత్యములు మొదటిది అను నాసికము, రెండోది స్పర్శము, మూడోది ఊష్మము: పరస్పర సంబంధము గలవి, అందు చేతనే 'పుస్తకము' 'పుత్తకమూ' అని 'వస్తాను' 'వత్తాను' అని పిల్లలు అంటున్నారు. 'పొత్తము' తద్భవము, గ్రాంథి కాంధ్రములో సాధువు. 'పొత్తగమ్' అరవములో సాధు శబ్దము: కొరకంచు = కొరకచ్చు, చేత్తాడు = చేంతాడు, తగిల్చి = తగిలించి, స్నానము = తానము = స్తానము, త్రెచ్చి=త్రెంచి, క్రంచర= క్రచ్చర, చణక= సెనగ, చంపక=సంపెగ కుర్సీ=కుర్చీ, ఉచిత=ఉస్తి (కాయలు)- ఇట్లురూపాంతరములు భాషలో ఏర్పడడము విపరీతము కాదు. చుకారాంత ధాతువులు అనేకము యుకారాంత ధాతువు లయినవి. వాటిలోని చ వర్ణము య వర్ణముగా మారలేదు. 'మోచి', 'మోచెన్' అనే ప్రాచీన శబ్దములు ఉత్తరాంధ్రములో 'మోసి' 'మోసెను' అని వాడుకలో మారినందున అవి యుకారాంత ధాతువుల నుండి పుట్టినవని వ్యాకరణాలలో పండితులు వ్రాస్తారు; 'త్ స్ ఇ' 'త్ స్ ఎ'_వీటిలోని తకారము పోయినది. 'చందనము పూచి (కొనెను)=చందనము పూసు (కొన్నాడు'); పూసు (హూసు) కన్నడములో సుకారాంత ధాతువు. ఇట్లే వైచి, వైచెను, తిగిచి, తిగిచెను, నేడు 'వేసి, వేసెను, తీసి, తీసెను,' అయినవి. తెలుగులోని 'పాలించు' కన్నడములో 'పాలిసు' తె, దుఃఖించు=క దుఃఖిసు, తె. పాలించుచును (పాలిస్తూ)=క పాలిసుత్తా, తె దుఃఖించుచును (దుఃఖిస్తూ) =క. దుఃఖిసుత్త, క. మాడిస్తరు=తె చేయించిరి, క. ప్రార్థిసుత్తేనె= ప్రార్థిస్తున్నాను.

ఇంగ్లీషు భాషలో ఇప్పుడు he writes, speaks, అని సకారాంతముగా ఉన్న క్రియారూపములు 200 సం|| క్రిందటి వరకూ writeth speaketh అని తకారాంతముగా ఉండేవి. అంతకు మునుపే లోకులు ఇవి సకారాంతముగా పలికేవారు; అడిసన్, స్టీల్ మొదలయిన పండితులు సకారాంతము ఇవి ఉచ్చరించడము మంచిది కాదని నిషేధించినా అవి నెల కొన్నవి; ఇప్పుడు పద్యకావ్యములలో 'అను ప్రాసము' కోసము తకారాంతరూపములు కొందరు ప్రయోగించినా, అవి వ్యవహార భ్రష్టమయినవి గనక ఇతర రచనలలో అవి ప్రయోగార్హ్వము కావు.

ఈ విషయము విస్తరించి వ్రాయుటకు ఇక్కడ మరి స్థలములేదు. నాలుగయిదు వందల సంవత్సరములయి 'ఇస్తాను', 'కొంటాను', చదువుతాను' మొదలయిన శబ్దములు తెలుగు దేశమందు అంతటా శిష్టవ్యవహారమందున్నట్టి శాసనములలోను, శతకములలోను, పాటలలోను, పండితులు వ్రాసిన వ్యాఖ్యానములలోను కనబడుతున్నవి. వీటిని విడిచిపెట్టితే వ్యవహారహాని కలుగుతుంది. భాషయొక్క ప్రథమ ప్రయోజనమే భగ్నమవుతుంది. గనుక ఇవి సాధువులుగా అంగీకరించక తప్పదు. నూరేండ్ల క్రిందట రావిపాటి గురుమూర్తిశాస్త్రి గారు రచించిన వ్యాకరణములోను మరికొందరు రచించిన వ్యాకరణములలోను ఈ శబ్దములకు అనుశాసనము ఉన్నది. త్రివిక్రమ వ్యాకరణమందు కూడా ఉన్నది, గాని అది అచ్చుపడలేదు-లుట్ త్రుచితాడ్ యర్ చాత్యావ్యాష్ తెస్తాడాగ తేస్తు వస్తాడు.

'చేస్తుంది'కి మారుగా 'చేస్తాది'; 'చేస్తది' అని పామరుల వాడుకలో ఉన్నవి. 'చేస్తవి'; చేస్తాయి', 'చేస్తయి' అనే రూపములు శిష్టవ్యవహారమందున్నవి. 'అవుతాది', 'అవుతది'; 'అవుద్ది' అని వడ్డర్లు మాత్రమే అంటారనిన్ని తక్కిన వారందరూ బ్రాహ్మల వలెనే 'అవుతుంది' అని వాడుతారనిన్ని నరసారావుపేటలో ఒక బండివాడు చెప్పినాడు. అతని సంభాషణవల్లనే అతని మాట రుజువయినది.

## చేస్తాను

క. వస్తాడు నీలభూపతి
తెస్తాఁడు ధనంబు నీకతి ప్రమదముగా
నిస్తాఁడు విరహావేదన
జస్తాఁడా నమ్ము మదిని సంశయమేలా॥ చం. వి. 73.

చ॥ తపములు నెన్ని చేసితినొ దానములెన్ని తలంచి యిస్తినో
జపముల నెన్ని సల్పితినొ సద్వ్రత యాగము లెన్ని చేస్తినో
సఫలముగా మదీయకుల జాతిపునైతి విలోకమందునా
తపములు పండెనమ్మ జగదంబవుకావె త్రిలోక సుందరీ॥ పట్టాభి. 41.

క. నీచిత్తము మాభాగ్యము
రోచన యుల్లమున నెటుల రోచించెదరో
తోచినది మనవి చేస్తిమి
చూచి కటాక్షింప వలయు సుందరమూర్తీ॥ ,, 75

ఉ॥ భావ మహానుభావ కడుభాగ్యము చేసితి విల్లువేళ్ళని
దేవగవశ్యవిద్యఘటియించితొ యేశకునాన వస్తివో
భూవలయంబు లోపలను బోడిమి చెందిన మోహనాంగి రో
లావలపించి మోహము చెలంగఁగ జేసితి చూచినంతటన్॥ పభు. పు. 14

క॥ తనువిస్తిని మనసిస్తిని
ధనమిస్తినటంచు నాడఁ దగునా నింకా
తను ధనము లేడగలిగెను
పనుపడ నీకిది యొభక్త పాటియెబసవా॥ పుట. 54

మ॥ అలయింతప్పుడె యిల్లుదూరి సతులన్ హాస్యంబుగా నవ్వివా
రల వెన్నన్ దిని జారచోరతతి ధూర్తస్వామివై నేఁడు నా
చెలులే పిల్వగ నెమ్మి రావలసివస్తే నేరికిన్ జాల్కనో
చలమేలయ్య మహాత్మ నీదుదయ కృష్ణా యాపదుద్ధారకా॥ రామస్త 20

శా॥ దస్త్రాలన్ మసిబుడ్లలుం గలములుం దార్కొన్న చింతంబళుల్
పుస్తెల్ గాగెడు దుస్తులుం జెమటకంపుం గొట్టు నీర్కావులన్
అస్తవ్యస్తపుఁ గన్నదంబును భయం బైతోఁచు గడ్డంబులన్
వస్త్రాచూస్త్రిమి గోస్త్రిమిన్ బలుకులన్ వ్యాపారులం గ్రూరులన్॥

శ్రీనాధుని చాటు

## చేనును

చేయు, తెలియు మొ॥ యుకారాంత క్రియలకు ఉత్తరాంధ్రములో ఇట్టి రూపములు ఏర్పడ్డవి; గాని ప్రాచీనాంధ్రమందు లేవు.

'తెలియు' అనే క్రియ 'ఎఱుఁగు' వలెనే ప్రాచీనాంధ్రమందు సకర్మకము. చూ. ఉద్యో. II. 152—(శాంతనవుఁడు సుయోధనునితో) క. సారథియు రథియునై యొక, తేరం గృష్ణు లతిఘోర తేజస్స్ఫారస్ఫారతఁ దోఁచిన నైనను ధీరత వాటించి చూచి తెలిసెదవు బళే.॥ కర్ణ II-214 (భీముఁడు శల్యునితో—) "ఇంత ప్రమాదంబు నీవు గలిమిం దెలిసితి మాతులా"॥ శల్య. 1-351 క. గంగాతనయుఁడు దెగినను, సంగరమున నుత్సహింపఁ జనునే తమకున్, వెంగలులని యప్పుడు దెలియంగా నెఱిఁగితి సుయోధనాదులఁ గృష్ణా॥ శల్య 1-352. ఉ. యా! వంతయు నాత్మలోనఁ దెలియందు సుయోధనుఁ డెంత మూర్ఖుఁడో II. స్త్రీ 1-149—(ధృతరాష్ట్రుఁడు కృష్ణునితో—) క. తెలిసితి నీ మాటలఁ బుత్రుల దెస నెవ్వగల నెల్ల దొరఁగి. అర. VII. 193. చ. ఇంతవట్టు నేఁ దెలియుదుఁ జెప్పెదన్॥

ఎఱుఁగు శబ్దమునకున్ను తెలియు శబ్దమునకున్ను అర్థములో కొంత భేదమున్నది. 'నే నెఱుఁగుదును, నేఁ దెలియుదును; నే నెఱుఁగను, నేఁ దెలియను' అని పూర్వుల వ్యవహారము; ఉత్తరాంధ్ర కవులు కొందరు తెలియు ధాతువు ఇట్లు వాడినా, ఉత్తరాంధ్రమందు 'నాకుఁ దెలియును' అనే ప్రయోగము ప్రచురమయినది. పూర్వులు 'ఎఱుంగికొని' అన్నట్లు నేటివారు 'తెలిసికొని' అనుబంధముతో వాడుతున్నారు. అది 'చదువుకొని' మొ॥ క్రియల సాదృశ్యబలముచేత 'తెలుసుకొని' అయినది. రాను రాను 'నాకు తెలుసును,' 'నాకు తెలియదు' అనే రూపములు ఏర్పడ్డవి. ప్రాచీనాంధ్రమందు చుకారాంతములుగా ఉండిన క్రియలు కొన్ని రాను రాను యుకారాంతము లయినవి. వైచు, తిగుచు, ప్రోచు పూచు, కాచు మొదలయినవాటి క్త్వార్థక రూపములున్ను భూతార్థక రూపములున్ను, చివర్ణము, చెవర్ణము కలవి, ఉత్తరాంధ్రములో సివర్ణము సెవర్ణము కలవి అవుటచేతను, అట్టి రూపములు యువర్ణాంత క్రియలను కలుగుటచేతను వైయాకరణులు యుకారాంతముల వర్గములో చేర్చినారు; కవులు యథేష్టముగా వైచి, వేసి, వైచెను, వేసెను, తిగిచి (తివిచి) తీసి, తిగిచెను (తివిచెను), తీసెను. ప్రయోగిస్తున్నారు. కవుల వ్రాతలలో కలగలపు భాష కనబడుతున్నా, లోకములో తెలుసును, తెలియదు, చేసును, చేయదు, కురుసును, కురియదు, కురవదు, కలుసును, కలియదు, (కలవదు), కలుసుకొను, పూసే కాసే చెట్టు, పూయదు, కాయదు (పూవదు కావదు అనే రూపములు నేడు వినబడవు)— ఇట్టివి ఏర్పడినవి. మోచుకొని, మోసుకొని వాడుకలో ఉన్నప్పుడు మోచును, మోసును కాదా? 'మోచి'

అనేది, మోపి అయినట్లే, 'మోచును' అనేది మోసును అయినది; తిగిచి, తీచి; అనేవి తిగిసి, తీసి అయినట్లే, తిగుచుకా, తీచుకా అనేవి తిగునుకా, తీనుకా, అయినవి.

ఇంతేకాక, యకారమునకున్ను సకారమునకున్ను ద్రావిడ భాషలలో సంబంధమున్నది. సం. ఆకాశము=అరవములో ఆగాయమకా. సం. కుశం=అర. కుయం; సం. మదన=కన్న. మయన; అర. ఉయిర్ = తె. ఉసురు; సం. రాజన్=రాయన. అగ. అరసన, అరయన; తె. పూయు (క్రియ)=కన్న. పూసు; తె. మెఱయు = కన్న. మెఱసు. కన్నడములో 'మూయు', 'మూసు' అని రెండు రూపములున్నవి. అట్లే, తెలుగు భాషా లక్షణము ఉత్తరాంధ్ర వ్యవహారానుసారము సవరించవలెను గాని తెలుసుకు మొ॥నవి అసాధువులని విడిచిపెట్టరాదు. ఇవి ఇంచుమించుగా 300 సంవత్సరములయి వాడుకలో నెలకొని ఉన్నవి.

గౌరన హరిశ్చంద్ర. II. 1901 లో తెల్సును ఉన్నది.

సకల కథాసార సంగ్రహమందు-మోసువానికి దెలుసు కావరి బయవు; మిత్రవిందాపరిణయములో తెలుసును (పు. 69).

అంగద నృసింహకవి రాజరాజాభిషేకమనే ఆయిదాశ్వాసముల ప్రబంధములో—'వ్రాసుటయుకా' అని సు-వర్ణము ప్రాసస్థానమందుంచి ఉత్పలమాల రచించినాడు. (చూ. కవుల చరిత్రము పు. 500).

ఈ సు-వర్ణ శబ్దములు నేడు మనము కల్పించినవి కావు. పదితరములయి కవులు వాడుతున్నవే.

## చేసును

క॥ ఆసమయంబునఁ గాంస్యము
గీసినగతి నతులవల్లకీతతు లాకసై
మ్రోసినగతి నెఱుఁగ దరన్
భూసతికడనుండియొక్క నుడివినఁబడియెన్॥ ఉ.రా. 321.

క॥ ఆ సమయంబున నొక్క వి
లాసిని యొక గిండిలోఁ గళముఁ దొట్టంగా
నాసవమును గడువడిగాఁ
బోసుకొని యచటికిఁ దాఁ బ్రముదమున వచ్చెన్॥

కవిజనచ. IV. 53.

ఉ॥ అందని మ్రానిపండుగదరా మదరాజమరాళయాన యీ
సుందరిఁ జెంద గల్గిననసూ ఘనసూర్జిత పూర్వసత్క్రియా
స్పంద ఫలంబులీల సగసన్ సరసత్వముమీఱఁ జేద నే
సుందరుఁ డింపుతోడఁ గలసుం బలసూదన భోగభాగ్యుఁడై. ద్రౌప.

ఉ॥ శ్రీసతి చన్నుఁగ్రేవలను జెక్కుల నొక్కటఁబత్రభంగముల్
వ్రాసుటకున్ విరించి నిటలంబుల నొక్కట భాగ్యవర్ణముల్
వ్రాసుటకున్ జతుర్భుజ విలాసము పూనినవేల్పు సత్కృపో
ల్లాస మెలర్పఁ బ్రోచు శుభలక్షణుఁ గొప్పులవల్ల భూవరున్.
రాజరా. పుట 500.

సీ. ఎన్ని జన్మములెత్తి యేమేమి పుణ్యముల్
జేసుటనో భవద్భాసురాంఘ్రి. వీరనారాయణ 17.

క. గోసంబున వీరిరువురు
భాసుర కమలాసనాఖ్యాస్త్రబాణంబులు తా
కేసుట కుపక్రమించ
వ్యాసమహామాని సింహుఁ డడ్డంబగుచున్॥ శశి. 81.

## చేసింది మొ॥

'చేసినది' (=చేసినయది) అనే శబ్దములో నకారముమీదనున్న అకారము లోపించినందున 'చేసింది' అయినది. ఇట్లే 'కొనుట,' 'కొంట' అయినది; 'కొంట' వంటి శబ్దములు నన్నయ గ్రంథమందు లేకున్నా, తిక్కనాదుల గ్రంథాలలో ఉన్నవి; కనక అథర్వణుడు 'పూర్వస్యనవికారో నోః' అని చేసిన అను శాసనము చెల్లదు. (చూ. మొదటి ప్రసంగము) 'కొనుడు' 'కొండు' అయినది; 'అనఁటి,' 'పనఁటి' కూడా, ఇట్టి లోపమువల్లనే, 'అంటి,' 'పంటి' అయినవి. ఇట్లే అనిన=అన్న, వినిన=విన్న, కొలంది = కొలఁది=కొలది=కొల్ది=కొద్ధి; వలవదు=వలాదు=వలదు=వల్దు=వద్దు; ఉంగరము=ఉంగ్రము మొ॥ వి. గౌరన కాలములో కవులు ఇట్టి శబ్దములు కావ్యాలలో వాడినారు. "కట్టిన దోకబట్ట కప్పిందితోలు (హరిశ్చ. II. 1413). పూర్వకాలపు శాసనములలో కనబడుతున్నది. (చూ. ఆ. సా. పరిషత్పత్రిక II. పు 223, సం 933. శ. వ. ౧౧౬౩. పెట్టింది) కొన్ని ప్రదేశములందు 'ఉండినది=ఉండింది', 'అనినది=అనింది' అనిన్ని మరికొన్ని ప్రదేశములందు 'ఉన్నది=ఉంది', 'అన్నది=అంది' అనిన్ని వాడుతున్నారు. సందర్భానుసారముగా, 'ఉన్నది ఉన్నట్లు చెప్పు,' 'విన్నది విన్నట్లు', 'అయినదానికీ కానిదానికీ=అయిందానికీ కాందానికీ,' 'ఎక్కడున్నది=ఎక్కడుంది; అది ఏమున్నది=ఏమంది' అని లోకులు వాడుతున్నారు.

## చేసింది

ఉ॥ ఆటలుసాడ నేఁటికిదొ యద్భుతమొప్పఁగఁ గానవంబులో
ఘోటక మొక్కటుంది పదికోటి వరాలును జేయునందు నం
చీటగు నా హయంబు గొనితెచ్చి తపోవనమందుఁ గట్టెదన్
మాటలు నేటికంచుఁ గృతమానిత గోపమహావనంబునన్॥

పట్టాభి. IV, పు. 111.

గీ॥ పోసిరా మొల్లవారి కాపోశనంబు
నారగింపుఁడు రెండు మీ కమృతమస్తు
ప్రొద్దుపోయిందినుండని బుజ్జగించి
మ్రొక్కె నంజలియొత్తి యమ్మొదుకపడఁతి॥ భీమఖండ.

క॥ కొలచింది రామచంద్రునిఁ
దలచింది పరస్వరూప ధ్యానము సేయన్
వలచింది ముక్తి లలనను
నిలిచింది పురాకృతంబు నిజమని తెలుపన్॥ రామ స్తం.

క॥ పలికింది వేదతుల్యము
చిలికింది కృపారసంబు శ్రితజనులందున్
గులికినవి యోగచర్యలు
నలికిన యది యా యవిద్య యహితులు బెదరన్॥ ,,

మ॥ కరి నేలింది హుళక్కి ద్రౌపదికిఁ గోకల్ మెచ్చియిచ్చింది ద
బ్బర కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టిందబద్ధం బహో
శరణన్నం బగవాని తమ్మునికి రాజ్యంబిచ్చుటల్ కల్ల యి
త్తెరి నన్నేలిన నిక్క మీ కథలు కృష్ణా దేవకీనందనా॥

దేవకీనం. శత. 100.

ఆ॥ పురుషుఁ డెన్నిగతులఁ బుట్టింది మొదలుగ                వేమనశత. I' 118.

శా॥ పోసించేటిది పోఁతలేటివి మనోపోగన్నుఁ డై దేహితాఁ
బూసించేటిది పూఁతలేటివి మదాపూతంబు లీ దేహముల్
మూసించేటిది మూఁతలేటివి సదా మూఢత్వమే కాని తాఁ
జేసించేటిది చేఁతలేటివి వృథా శ్రీ కాళహస్తీశ్వరా॥
శ్రీకాళ. శత. 71.

## ఓరాత్రి, మాబాగు

'ఒకరాత్రి'కి మారుగా 'ఓరాత్రి' అని శ్రీనాథుడు కాశీఖండమందు ప్రయోగించినాడు. ఇది వైపరీత్యముగా అనేక పండితులు భావించినారు. 'మహా' అనే శబ్దము 'మహా', 'మా' అని అరవములోనూ, కన్నడములోనూ కూడా ఉన్నది. 'ఒక'లోని కవర్గము, 'మహా'లోని హ వర్గము లోపించి నందున వాటికి పూర్వమందున్న అచ్చు దీర్ఘమయినది; నష్టం ఏమీ లేదు. ఇట్టి మార్పు సర్వభాషాసామాన్యమే. తెలుగులోనే—అయ్యెను=ఆయెను, తియ్యఁడు=తీయఁడు, ఒకర్తు=ఓర్తు, ఒకర్తి=ఓర్తి, ఒకర్తు=ఓర్తు; సగము=సాము, సగపాలు=సాబాలు, మొగము=మోము, మొగమోట=మోమోట, మొగసాల=మోసల, ఇగము=ఈము, తలగడ=తలాడ, పెందలకడ=పెందలాడ, మఱవకు=మటాకు, వలవదు=వలాదు, సహవాసము=సావాసము, సహాయము=సాయము, సహముజ=సాజము, ముహూర్తము=మూర్తము, వరహాలు=వరాలు, గ్రహము=గాము, గృహము=గీము, భాగహారము=భాగారము, భాగహారులు= బాగార్లు, పదహారు=పదాఱు, కాళహస్తి=కాళాస్తి. 'మాసెలజాణవు', 'మాబాగు' అని లోకమందు వాడుకఉన్నది; కవులు కూడా ప్రయోగించిఉన్నారు. మహదేవుడు, మహదేవి, మహాశయము,

మహారాజా అని కావ్యములందున్నవి. చేకొనఁడు=చేకోఁడు; చేకొనక= చేకోక; పట్టుకొను=పట్టుకో ము॥ ఇట్లే ఏర్పడ్డవి; ఇట్టివి అన్నీ సాధువులే.

## ఓరాత్రి, మాబాగు

శా॥ ఓరాత్రిం గను అప్పవేయక మహోద్యోగంబునన్ ధీరతా
ధౌరంధర్యము పూను మానవునకుం దాత్పర్యవృత్తిన్ సదా
చారం బెట్లొనరింపవచ్చుఁ గలశీసంజాత! కాశీశ్వరున్
గౌరీవల్లభు సంస్మరించి బ్రతుకంగా కాఁదప్రచ్యుతిన్॥

కాశీఖ. V, 139.

గీ॥ వీరమాహేశ్వరాచారపారగునకుఁ
దనకు శశిమౌళి యొసఁగిన కనకరథముఁ
గాముగమనంబు నైషధక్ష్మాధవునకు
మామయిచ్చెను మాయని మహిమతింప॥ నైష. VI, 95.

ఉ॥ ఓ పరమాత్ములార! కరుణోదధులార! నితాంతయోగ వి
ద్యాపరతంత్రులార! తెలియన్ వశమే భవదీయమైన యా
నైపుణి చాలుఁజాలుననిన్ నిజమూర్తులు దాల్చి తాపసుల్
శాపరమేశ్వరా! యనిన జంతువులన్నియుఁ బోయె మాయమై॥

వరా. I, 148.

చ॥ మనమున మెచ్చి నాయకుఁడమా నెఱజాణవు ప్రౌఢవే క్రియన్
గొని రతి నేలినాఁడవనుకూలము నాకిది నిచ్చనిచ్చలున్
ననవిలుకాని కేలికలన్ వెలయించుమటంచుఁ బల్కినన్
విని పరనుండు మంచిదని వేడుక నాతనిఁ బంపె నింటికిన్॥

హంస. IV, 104.

## చెల్లాచెదరు

ఇటువంటి శబ్దములు సంస్కరించడము దుష్కరము. సంస్కరించడ మనగా దిద్దడము కాదు; ప్రకృతి ప్రత్యయ విభాగము చేయడము; (లోపా గమ వర్ణవ్యత్యయ ప్రకృతిభావ లక్షణము నిరూపించడము) అన్ని భాషలలో ఇట్టి శబ్దముల సాధుత్వము శిష్టవ్యవహారము చొప్పున నిర్ణయిస్తారు. కవులు కావ్యములలో ఏరూపములు ప్రయోగించినారో తెలుసు కోవడము సుకరము కాదు. నేటి శిష్టవ్యవహారమునే కవు లనుసరిస్తారని ఊహించక తప్పదు. రూపాంతరము లెన్నిఉన్నవో అన్నీ గ్రామ్యములే- అడ్డదిడ్డము, అడ్డాదిడ్డి, అడ్డాదిడ్డాలు; ఎగాదిగా; చెట్టాపట్టాలు, నకావకలు, బటాబయలు, బటాకబయలు. మొ|| వి సాధువులే. సంస్కృత మందున్న నఖానిఖీ, ముష్టీ ముష్టి (తెలుగు. భాగ. ముష్టా ముష్టి) కర్ణా కర్ణి హస్తా హస్తి మొ|| విన్నీ, హిందీ మొ|| వాటిలోని సరాసరీ, ఎకాయకీ బరా బరీ, హోరా హోరీ మొ|| విన్నీ తెలుగులో చేరినవి; వాటిలో కొన్ని పెద్ద ప్రబంధాలలోని కెక్కినవి కావా? ఎందుకు సాధువులు కావు?

## ఎగాదిగ; చెల్లాచెదరు

చ|| కడకొను కక్షదీధితు లెగాదిఁగ గ్రొను ఆముక్త. (II 50)

క|| మల్లామడి యగు మదనుఁడు

మెల్లనఁ గూర్చుండెఁ దాల్మి వినుమినుకనఁగన్ శు. హరి. (V. 166)

చ|| కటకట! కాశికాపురి నొకానొక నిద్దురఁ గన్ను మోడ్చి

కాశీ. (III. 99)

శా|| గాలిం బోవక సన్న దుప్పటియు గొంకాగొంకముల్ దిట్టి

కాశీ. (III. 58)

చ॥ కనుఁగొని మానికాంతలు కకాపికలా మది నమ్మ చెల్లఁగా
యనుచు మిళద్భరీకృత భయంబు గళ త్కబరీచయంబున
త్యనుపదధానవావిల మృగాంగనమున్ మహోరుచ్చలద్గురు
స్తనమును గారయంబున యదాయదలై పలు తెంచి తెల్పినన్
కువలయా. (II. 31)

క॥ చెల్లాచెదరై యత్నులు
పెల్లగిలం బఱచి రద్రి బి ట్టులియంగన్॥ నిర్వ. (IV. 75)

క॥ వడ్డించు మనుచుఁ గుడుచుచు
నడ్డాదిడ్డాలు పలుకు నంతటిలోనన్॥ బసవ.

మ॥ ..................అఁ జెయ్యావై
ఖరినీ యిద్దఱు నుద్దులన్ భ్రమసి రాకాపోక గావించె॥
చంపూరా. (V. 39)

## కానీ...కానీ.

'కానీ' అనే శబ్దము, కాన్ (అగు ధాతు, తుమ్.) + ఈ (ఇచ్ఛా ధాతు. ప్రా. మ. పు; ఏ, వ.), వాడుకలో అవ్యయము, వికల్పార్థకము. దాని అంత మందున్న ఈకారము హ్రస్వమయినందున 'కాని' అనే రూపాంతరము ఏర్పడ్డది. 'అదిగాని ఇదిగాని' అని అవ్యవధానముగా వాక్యములు పలికి నప్పుడు ఒక భావమున్ను, అదిగానీ ఇదిగానీ' అని కొంచెము ఆగి పలికినప్పుడు మరియొక భావమున్ను వ్యక్తపడును గనుక సందర్భానుసారముగా లోకులు వాడుతారు. రెండు రూపములున్ను కావ్యములలో ప్రయుక్తమై ఉన్నవి. 'కానీ' అనే రూపము లక్షణ విరుద్ధమని కొందరు భ్రమ పడుతున్నారు; గాని కాదు. 'కింతు' అనే అర్థమందు 'కాని' శబ్దములోని ఇకారము హ్రస్వముగా ఉంటుంది—అట్టే 'శేపు చదువుదువు గాని ఇప్పుడు పడుకో' అన్నప్పుడున్ను, 'కానిపని' లోనిదిన్ని 'కాని' వ్యతి

శేకార్థకము. 'వాడు రానీ రాకపోనీ; నేను తప్పకుండా వస్తాను, నన్ను లోపలికి రానీ అకలితో నీయింటికి వచ్చిన వానికి అన్నము పెట్టవలెను; ఎవడటి కానీ' అనే వాక్యములలోని 'ఈ' శబ్దము వేరేవేరే భావము తెలియ జేస్తుంది.

కొందరు పండితులు "'కాని' యను హ్రస్వాంతము గ్రామ్యరూప మయ్యును భారత ప్రయోగా రూఢమై గ్రాహ్యమయినది" అన్నారు (చూ. శృంగార నైషధవ్యాఖ్య. VI, 23,) భారత ప్రయోగము గ్రామ్య మనడము 'ప్రయోగమూలం వ్యాకరణమ్' అనే సూత్రమునకు విరుద్ధము కాదా? వ్యాకరణమంటే ఏమిటో, గ్రామ్యమంటే ఏమిటో తెలియనివారి మాటే పాటింప నక్కరలేదు. కవుల ప్రయోగములు చూడండి.

## కానీ.

క|| నీతిందానఁ దలంచి చేయఁబని గానీ కాకపోనీ|| ఆముక్త. IV, 214.

మ|| అకటా ఏమని దూఱుదాన మిము నాథా వేగుజామయ్యెఁ బొం
దిక గాఁ బాదము లొత్త రమ్మనుటగా నీయింటి యేమోకధా
నిక టక్కోణికి వేగ దమ్మనుటగా నీకెంత నెయ్యంపుఁబూ
నికతోఁ గన్నులు విచ్చిచూచుటయుఁ గానీ లేద యొక్కింతయున్|| కళా,

ఉ|| కావున రూపయౌవనవికస్వరగర్వ భయంబు చేతఁ గా
నీ విభుఁడిచ్చుమన్ననల నెయ్యపుటాల నటించు నవ్విధం గా
నీ విన్నదియాదు లేమ్ములక నీ హృదయంబునఁ దదీయబంధుమి
త్రావళులన్ సపత్నినియు ధార్హ విధిన్ ముదమందఁ జేయుమీ||

,, VII, 94.

క|| నీ చెల్వంబిది నిక్కమట్లయినఁగానీ నాథ నీవంటి|| కాళ. మా. II,13.

మ|| నిరవద్యస్థిత భక్తితోడ ననుగానీ శంభుగానీరమే
శ్వరుగానీ గుతియించి యెవ్వరటయా సారస్తవంబుల్ జపింతురు||
కాశీఖం.

సీ|| ఓర్పుమైమునుప్పిండి యుపవాస ముండనీ
మగనాలి సరిపోల్పఁ దగదు విధవ
సద్భక్తి దేవతార్చనము సేయంగనీ
మగనాలి సరిపోల్పఁ దగదు విధవ
తిరిగి నానాపుణ్య తీర్థంబు లాడనీ
మగనాలిసరిపోల్పఁ దగదు విధవ|| ,,

క|| ఎంతబుధుఁడైనఁ గానీ
చింతామణి మంత్రరాజ సేవాపరు|| నైష. VI, 23.

మ|| నియతిన్ బాతికరొత్తు కాంచనముగానీ వెండి గానీ జగ
త్త్రియ పూజ్యంబగు పాండురంగవసతిన్|| పాండు. II, 87.

క|| నలినీపత్రము సలిలం
బులఁబొఁగయని రీతి నుత్తముఁడు సత్కర్మం
బులు గానీ దుష్కర్మం
బులు గానీ హరికి నిచ్చి పొఁగయుడు వానిన్|| వరహ. II, 13.

క|| తానెంత యొగని పడినం
గానీ దీని కుచములకుఁ గందుక మినయే|| రా. వి. III, 101.

## చేతావాతా

చేతన్ వాతన్=చేతావాతా. నకారము లోపించినందున పూర్వ మందున్న అచ్చుదీర్ఘమయినది. ఇట్లే 'రోళ్ళారోకళ్ళా' నోరారా (అరన్=అరా) మనసారా, కళ్ళారా, చేతులాలా, చెవులారా; కడతేరా,

కొసముట్టా, గోడదాకా, దగ్గరా, ఎడ తెగకుండా, నిండా, చాలా, మళ్ళా, బోరిగిలా, ఇట్లే అన్ననున్ అక్కనున్ = అన్ననూ, అక్కనూ; పిన్నిన్ కక్కిన్ = పిన్నినీ కక్కినీ; అన్నకున్ అక్కకున్ = అన్నకూ అక్కకూ; ఇంటన్ ఒంటన్ = = ఇంటా ఒంటా; నీ చేతన్ కాదు, నా చేతన్ కాదు = నీచేతా గాదు నాచేతా కాదు; క్రిందన్ మీదన్ = క్రిందా మీదా; ఇల్లిల్లూ తిరిగినాను, ఇంటింటా వెదకినాను, ఏటేటా ఈ ఉత్సవము చేస్తారు, పలికిరానూరాడు పైకిపోనూపోడు; తిట్టావద్దు కొట్టావద్దు; కప్పా విప్పా సమర్థుడు.

ధనము కూడఁబెట్టినాఁడు, ధనము కూడాపెట్టినాడు; వీధులన్నీ తిరిగి వచ్చినాడు, తిరిగీ వచ్చినాడు; 'నే నడగనిదీ ఎందు కిచ్చినావు?' 'నేనడగని దెందుకచ్చినావు?' - ఇట్లు దీర్ఘముంటే అర్థము మారుతుంది. శాసనముల పుస్తకము కృష్ణ - శ్రీకాకులము నెం. 974 రు శకవర్షములు ౧౦౫౮ నాటి శాసనమందు "ఎవ్వరూను" "ఏంటా పదేందుము" ఉన్నవి. నాటనుండినీ ఇట్టి దీర్ఘాంతములు తెలుగుదేశమందు వాడుకలో ఉన్నవి గదా; సాధువులు గావా?

క॥ చేతావాతా గొట్టె
ఘాతకుల వివేకులనుచు గని వారలతో
నీతిపరు లడ్డమాడరు
చాతుర్య ధురీణులన్న సంపఁగెమన్నా॥ సంపంగిశ.

క॥ ఏమనఁగలాఁతి వారమె
నీమన సెట్లట్లకాక నీరజవదనా
ఏమిటికిఁ దలకెఁ దల్లీ
తామరయును బోలియుండి తగవు విడుతురే? హరి. V, 200.

క॥ నందికన్నుల నక్రులం
చిందేతాపంబుమేనఁ జెందీ హృదయం
బందీ కుందీ రొందీ
యిందివరనయన వెదకి యిందన లేవా॥ పార్వ.

క॥ ముల్లోకంబుల జనములు
నోళ్ళన్ నోకండ్లబాడ నోయక మరియున్॥ వరహ. VII, 22.

క॥ ఏరీతింబెనఁగిన నె
వ్వారలుఁగరు నీదు గుట్టు వనితామణి! నో
ళ్ళారోఁ కండ్లంబాడిన
కూరుము లిపుడంత దాచు కొన్ననడఁగునే॥ ప్రభా. V, 25.

మ॥ ..................సంకల్పసిద్ధుల్ గొనం
బలుమేరున్ నిరసింపలేఁ చిగురు గొమ్మంజేవగాకుండునే॥
వసు. III, 201.

## తెలిసీతెలియని

తెలుగులో 'ఉన్' అనే సముచ్చయమునకు అనేకమయిన అర్థము లున్నవి. తెలుగువ్యాకరణమందు 'ఇదియున్' అనేది 'ఇది + యు + ను' అని విభజించి 'యు' 'ను' లు సముచ్చయములని అనుశాసనమున్నదిగాని; తప్పు. 'ఇది + ఉన్' ఇది + (యడాగమము) + ఉన్ = ఇదియున్. అరవమందున్ను కన్నడమందున్ను 'ఉమ్' సముచ్చయము. కన్నడములో 'అవరుమ్' 'ఇవరుమ్' అనేవి నేను 'అవరూ', 'ఇవరూ' అని ఉచ్చరిస్తారు; నన్నయాదులు వారున్ వీరున్ అనేవారు; మనము 'వారూ', 'వీరూ' అని కాని, 'వారున్నూ', 'వీరున్నూ' అనికాని అంటున్నాము.

'అంతయున్' అనేది 'అంతా(న్)', 'అంతాను' అనిన్ని, 'ఇదియున్' అనేది ఇది (న్) 'ఇదీ', 'ఇదిన్నీ' అనిన్ని, 'ఏదియున్' అనేది 'ఏమిన్' 'ఏమీ', 'ఏమిన్నీ' అనిన్నీ పలుకుతున్నాము.

ఇట్టివే తల్లీతండ్రీ (తల్లియున్), అన్నాతమ్ముడూ, కొడుకూ కూతురూ; పువ్వులూకాయలూ; పుట్టాచెట్టూ; తోటా దొడ్డీ మొ॥నవి. ఇట్లే విని యున్ = వినీ, (వినిన్నీ); తెలిసీతెలియని, వచ్చీరాని, నమ్మీనమ్మని, విడీ విడని, ఊరీఊరని, ఉన్నదితెలియదు లేనిదీతెలియదు అని లోకమందు ఏర్పడ్డవి.

ఇట్టి మార్పు ఇంచుమించుగా 700 సంవత్సరములయి తెలుగులో కలుగుతూఉన్నట్టు శాసనములలోనేకాక పాటలలోను, శతకాలలోను, ద్విపదలలోను, ప్రబంధాలలోకూడాను కనబడుతున్నవి. ఇది అనివార్యము. నన్నయ అరణ్య. III, 264 "క॥ తమమామకుఁ దద్వృత్తాంతమునంతయుఁ దెలియఁజెప్పి......" అని ప్రయోగించినాడు. 'అంతను' లోని నువర్ణము ద్వి. విభక్తి ప్రత్యయము కాదు; అంతను = అంతయును (= అంతాను) ఇట్లే, "సమస్త క్షత్రవంశకులెల్లను భక్తింబనిసేయుచుండఁగ" అని 'ఎల్లను' ప్రయోగించినాడు. ('ఎల్ల' ద్రు. ప్రకృతికము కాదు. 'ఎల్లయవి', 'ఎల్లయాత్మలు', 'ఎల్లయందు' అని ప్రయోగములున్నవి). 'ఎల్లను' కర్త గనుక నువర్ణము సముచ్చయార్థకము, ఎల్లను = ఎల్లయును (= ఎల్లాను). అరవమందు 'ఎల్లాం', కన్నడమందు 'ఎల్లా' అని దీర్ఘాంత మసాధువు కాదు; ఎల్లవర్, ఎల్లార్, ఎల్లారుం అనే శబ్దములున్నవి.

తిక్కన "ఇజ్జగంబులన్నిని నొకపెట్ట మ్రింగిరను" (ఉద్యో. II, 323) అనిన్ని, "ఇట్టిదిం గలదే" (ఉద్యో. III, 95) అనిన్ని, "అనుజులకు నడ్డపడియేమిని జేయఁగనీమి..." (ఉద్యో. II, 13) అనిన్ని, ధర్మసూతి ......వినఁడునుగానఁడున్ (ఉద్యో. II, 14) అనిన్ని, "సైన్యావలియైనఁ జెడ్పడక యాతలకెద్దుటలేదునేనియున్" (విరా. IV, 192) అనిన్ని వాడియున్నాడు. అన్నిని = అన్నియును = అన్నిన్ని, ఇట్టిదిన్ = ఇట్టిదియున్ = ఇట్టిదిన్ని. 'వాలింగిలినను' (నిర్వ. VII, 99) = వాలిన్ని గిలిన్ని. హరివంశమందు ఎఱ్ఱనాను, హరవిలాసమందు శ్రీనాథుడున్ను, ఉ. హరివంశమందు నాచన సోమనాథుడున్ను, భోజరాజీయమందు అనంతుడున్ను "ఏమి" (= ఏమియును) అని ప్రయోగించినారు. దశకుమారచరిత్రమందు కేతన తల్లిని దండ్రిని (VIII, 47); నాచన సోమనాథుడు "అల్లితామర" (V, 200) అని వాడినారు; 'తండ్రియున్' అనుటకు మారుగా 'తండ్రిని'

(= తండ్రివిన్ని) అన్నాడు కవి; 'అల్లియున్' అనుటకు మారుగా 'అల్లీ' అన్నాడు నాచనసోమనాథుడు. సాధువుకాదా? ఈలాటివే "వెన్నా మీగడా" 'ఊరూవాడా' మొదలయినవి.

'నమ్మీనమ్మని' అని శాంతిపర్వమందు తిక్కన వాడినట్టు వేమూరి వారి కూర్పు (సం|| 1901) లో కనబడుతున్నది. వ్రాతప్రతులలో ఉన్నది. సం|| 1909-వ కూర్పులో ఆ పాఠములేదు; తప్పనుకొని ఎవరో పరిష్కర్తలు దిద్దినారు. అహోబలుండు 'వచ్చీరాని కుచంబులు' ఇతిదీర్ఘప్రయోగస్తు నప్రామాణికః అని నిషేధించినాడు; 'తల్లిందండ్రియు'కూడా తప్పన్నాడు. అవివేకులు చేసిన అనుశాసనము చెల్లదు. అహోబలునికి అనుశాసనమంటే ఏమిటో తెలియదుగాబోలు. శృంగారనైషధములో శ్రీనాథుడు "వినీ విననిభంగి" అని ప్రయోగించినాడు. సీతారామాచార్యులవారు 'వినిన్ వినని' అనే పాఠము ఎత్తుకొని, ప్రౌ.వ్యా. 116లో అనుశాసించినారు. కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రిలవారు "ద్వ్యర్థకముపై నువర్ణము యువర్ణహీనముగా" నుండుట ప్రశస్తముకాదనిన్ని ఆచార్యులవారు అభారతప్రయోగము హరించినారనిన్ని ఆక్షేపించినారు. రాజమహేంద్రవరమునందు ఒక పండిత పరిషత్తులో ఇట్టి ప్రయోగములు నేనుదాహరించినప్పుడు, శ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిలవారున్ను మరికొందరున్ను "అవి దిద్దవలసినవే, దిద్దవచ్చును" అన్నారు. శబ్దరత్నాకరములోని "పొట్టుపీడె పీడని బియ్యము" (చూ. మెతికలు), "ప్రొద్దుగ్రుంకీగ్రుంకకమునుపు" 2చూ. మునిచీఁకటి) ప్రమాణముకాదన్నారు. కళాపూర్ణోదయము (VII, (19)లోని 'మానీమానని'కూడా వారు దిద్దడానికి సాహసించినప్పుడు, "ద్వ్యక్షరకందమండీ!" అని నేను చెప్పగానే, సిగ్గుపడి నోరు నొక్కుకొన్నారు. కీ|| శే|| పోలవరము జమీందారు కృష్ణారావుపంతులుగారు మార్కండేయపురాణము వ్రాతప్రతి శ్రీ వ్యాసమూర్తిశాస్త్రిలవారి చేతి

కిచ్చి పరిష్కరించవలసినదని కోరితే, చేయగూడదని మార్పులు చేసినారట. జమీందారుగారు ఒక లేఖలో ఆ విషయము వ్రాసి నాకు పంపినారు. పరిష్కర్తలు తొలగించగా మిగిలిన ప్రయోగములు కొన్ని దిగువను ఉదాహరిస్తున్నాను చూడండి: ఏ కాలమందు ఏ శబ్దములు శిష్టవ్యవహారమందు ఉండునో ఆ శబ్దములు లేఖలలో వ్రాయడము ఆచారముగా ఉన్నట్టు శాసనములలో కనబడుతున్నవి. వాటిలో తమకిష్టమైనవి కవులు ప్రయోగించడము సదాచారమయినట్టు కావ్యములలో కనబడుతున్నదిగదా. మన పూర్వులు ఆచరించినట్టే మనమున్ను ఆచరింతాము. తెలివితక్కువ తెలుగు పండితులు ఏమంటేనేమి? వారి మాట ప్రమాణము కాదు. ప్రాచీనులు వాడని శబ్దాలు వేనవేలు అర్వాచీనులు వాడినారే; ఏ లక్షణమును అనుసరించి వారు అవి ప్రయోగించినారు?

## తెలిసీ తెలియని

శా॥ నిన్నాడింపఁగ వచ్చిగోపతనయుల్ నెయ్యంబునన్ వేదిపై
నున్నారీకడ కొమ్ము జోగులుకరాళ్ళోన్మత్తు లేతెంచెదర్
వెన్నమీఁగడలున్ ఫలంబొసఁగెదన్ వేగంబరారమ్ము మా
యన్నా యంచును వెంట వెంట హరి యా యమ్మన్నగున్ ప్రౌఢికిన్॥
కవిచిం.

క॥ సన్నిధిఁ బన్నగహారుఁడు
పెన్నిధిఁగని పొంగుచున్న పేదల క్రియనా
యన్నాదమ్ములఁ గనిమీ
కెన్నఁగ నేవరములిచ్చుయిచ్చెదవానిన్ హరివ. ఉ. IV, 15.

చ॥ నియమిత దుందుభి ధ్వని వినీవినమిన్ బురిలోని సైనికుల్॥
జైమిని.

ఉ॥ దుర్భాషణముల్ వినీవినని భంగిన దట్టుడి॥ నైష. VI, 33.

క॥ నమ్మమి మృత్యువు పెద్దయు
నమ్ముట యపమృత్యువగుట నరపతినమ్మీ
నమ్మక॥ భార.శాంతి. II, 351. Edn. 1901

క॥ తెలిసినవానిఁ దెలిసీ
తెలియని నరుఁ దెల్ప బ్రహ్మదేవునివశమే॥ భర్తృ. ( నీతి )

శా॥ కూడీ కూడని చిన్ని కూఁకటులతో గోపార్భక శ్రేణితో॥
దేవకీ. శత. ( 4 )

క॥ అధరము కదలీ కదలక
మధురములగు భాషలుడిగి మానఁ బ్రభుఁడే॥ సుమ. శత. ( 5 )

శా॥ చల్లాయంబలి త్రావితిఁ రుచులదోసంబంచుఁ బోనాడితిఁ॥
శ్రీనా. వీధి.

## నవ్వేరు

కన్నడ వ్యాకరణములో అఖ్యాత (=క్రియా) ప్రకరణమందు 'భావి కాలము' అని 'భవిష్యత్ కాలము' అని భేదము ఏర్పడిఉన్నది. మొదటిది తెలుగువ్యాకరణములో చెప్పిన భవిష్యత్కాలమునకు సమానము; రెండోది యదృచ్ఛా-సంభావ్యతాద్యర్థములు తెలియజేస్తుంది. అవనుమాడియాను= వాడుచేసేను; అవరు మాడియారు=వారు చేసేరు. ఈ భావము తెలియ జేయడమునకు ప్రాచీనాంధ్రగ్రంథములందు ఏ రూపములు వాడేవాళ్లో నిశ్చ యముగా చెప్పలేను; గాని ఉత్తరాంధ్రగ్రంథములలో ప్రచురముగా నవ్వేరు వంటివే కనబడుతున్నవి. అయితే నవ్వేదనువంటి రూపములు 'చుమీ, చుఁడీ' చేర్చి ఈ భావము తెలియజేయుటకు కొందరు కవులు ప్రయోగించి నారు. కళాపూర్ణోదయములో, సుగాత్రి భర్త ప్రథమ సంగమవేళ భార్యను ముట్టుకోకుండడము చూచి బోంట్లు నవ్వుతూ ఆమె తల్లితో ఆ ముచ్చట్లు చెప్పినప్పుడు, "ఆయన వినఁబేలెదరునుఁడీ యిట్లు గయాళులార"

అని చీవాట్లుపెట్టినది తల్లి. ఇందు ప్రేలెదరు=ప్రేలేరు. ఇట్లే నారన విష్ణుపురాణమందు యముడు తన కింకరునితో—

ఉ॥ నీవు మహీతలంబునకు నేఁగి ముకుందునిమీఁది భక్తిచేఁ
జేవవహించియున్న గుణశీలురఁ దెచ్చెదుసుమ్మి వైష్ణవుల్॥ IV, 112.

అని బోధించినాడు. ఇక్కడ తెచ్చెదవు=తెచ్చేవు. ఇట్లే విజయవిలాస మందు సన్న్యాసి అర్జునుడని సుభద్రకు తెలిస్తే అతనికి ఆమె ఉపచారము చేయకపోతుందేమో అని కృష్ణుడు రుక్మిణితో—

క॥ తన మదిలో నితఁడర్జునుఁ
డని తెలిసి సుభద్ర సేవకరుగకయున్నన్
జని మీ రతనికి భోజన
మొనరింతురుగాని యూరకుండెదరు సుమీ॥ అని చెప్పినాడు. ఇట్టి

సందర్భమందు నవ్వేరువంటి రూపములు, సవరం చిననారాయణకవి అహల్యా సంక్రందనీయములోను, వెలిదండ్ల వెంకటపతి రాధామాధవ సంవాదము లోను, ధరణి దశావతార చరిత్రములోను, ఇంకా అనేకులు ప్రబంధాలలోను, శతకాలలోను, పాటలలోను మిక్కిలి మనోహరముగా ప్రయోగించినారు. నవ్వెదను లోని దకారమున్ను, నవ్వెదురులోని డకారమున్ను లోపించగా పూర్వాచ్చు దీర్ఘమయినదిగాబోలు.

ఈ రూపములే ప్రశ్నార్థకములుగాను, సందేహార్థకములుగాను, యథోచిత స్వరముతో ప్రయోగించి, కవులు అర్థవిశేషములు ఇంపుగా తెలియజేస్తారు. అపరిచితమయిన ప్రాచీనాంధ్రభాష అలాగున వాడడము దుష్కరము.

నేడు మన వ్యవహారమందుకూడా ఇట్టివి వాడుతున్నాము. "చెడవు కురా చెడేవు", "పులి వచ్చేను గిలివచ్చేను", "పడేవురా చెట్టెక్కు తున్నావు", "ఆవుదగ్గిరికి వెళ్ళకు; తన్నేను, పొడిచేను", "నీవు వెళ్ళి పిలి

చావు గనుక వాడు వచ్చాడు; లేకుంటే వచ్చేనా?", "నీవు పట్టుకోకపోతే వాడు పడిపొయ్యేదే" ఇట్టి శబ్దములు మానుకోవచ్చునా?

కవుల ప్రయోగములు కొన్ని ఉదాహరిస్తున్నాను; చూడండి:

శా|| ఔనౌనే వెలయాలనా యిటుల నీ వాడఁగ బల్కఁ జాలు పో
పో నవ్వే రెవరైన విన్న నిట నేర్పుల్ సొంపుగా వచ్చితో
నా నాథుండిది విన్న యంతఁ దనకున్ నాకున్ మహా హానిరా
దా నావంటి కులాంగనామణికి న్యాయంబౌనె యీ మార్గముల్||

దశా. 218.

మ|| మ।మ్మును గన్నమ్మ యిదేటిబుద్ధి పలదే క్రొవ్వెక్కెను నీ కాళ్ళకున్||

పార్వ. 67.

చ|| న।వ్వులఁ బచరించినట్లు చనువుల్ నెరపేవది మంచిమాటగా।దు

రంగరా. II, 169.

మ|| మమ్ముం జంపఁజూ।చిన చచ్చేమని పల్కినారు|| ,, II, 245.

ఉ|| భావఫలాభిలాషమున బాలుని కేమరు వుగ్గు బెట్టి పె
య్యావుల పాలతో జలకమార్చును దాఁదొడనుంచి యేమి చూ
చేవని నవ్వుచున్ బయటచే తడియొత్తి శిరామరత్నతో
లావుగఁ జుక్కబొట్టు నొసలన్ ఘటియించి కదించు నుయ్యెలన్||

రాధా. I, పు. 3.

ఉ|| అల్లదె దొండపండువలె నాయనివా తెఱలాననిచ్చు నీ
కొల్లవె పుట్ట చెండు లివిగోయని చన్గవఁబట్టనిచ్చు రా
గిల్ల మయూరపించ మడిగేవని పెన్నెరులంటనిచ్చుచో
కల్లవియంచుఁ గృష్ణుఁడు నగన్ నగి రాధ యదేమిరా యనున్||

,, I, పు. 5.

చ|| చెలికలనైన నన్ను మఱచేవు సుమీ యెవరేని చెప్పినన్|| ,, III, పు. 55.

క॥ శ్రీరామకృష్ణులకుఁ బని
ధారుణి సెవకైవఁ దమ్ముఁ దలంచినవారిన్
జేరదే దయచేతను
వారయ యిందొక కథగలదది వినుపింతున్॥ రామస్త. 18.

శా॥ స్త్రీకుంభిన్యధికారమిచ్చి కృశియించే వెంచ రాజత్వమే
నీకన్నన్ వినుమగ్రగణ్యుఁడను వెన్వెంటన్ బ్రవర్తింపఁగా
నాకుం దేజముడిందె నన్నె యుఁగవే నక్షత్రకుండన్ సదా
యేకంబీ మలినాంబరంబె గతి నీ కెట్లాడె నోరిట్లనన్॥

పట్చ. III, 140.

## చేసే, చేసేటి, చేసేది

ఈలాటి శబ్దాలు నన్నయాది పూర్వకవుల గ్రంథాలలో లేవు. వారి కాలమందు చేసెదున్, చేసెదువాఁడు, చేసెదునది మొ॥ ఉండేవి. చేసెడిన్, చేసెడివాఁడు మొ॥నవి ఉండేవని నిశ్చయముగా చెప్పలేము. రాను రాను ఇటువంటివిన్నీ, చేసిడి, చేసెటి, చేసేటి, చేసిటి, చేసేవాడు, చేసీవాడు, చేసేది, చేసీది మొ॥ రూపాలు వాడుకలో ఏర్పడ్డవి. ఇవి ఆయా కాలపు శాసనాలలో కనబడుతున్నవి. శక. 1022 సం. "నాలవుపాలు అవే (=అయే) నేల", శక. 1157 "కొలిచివారికి", శక. 1307 "తోంట చేసేపోలిరెడ్డి", శక. 1310 "పూసే పుష్పజాతులు", శక. 1345 "పరిపాలించిడివారికి", శక. 1366 "ఊలిగము సేసేరు", "సుఖాన అనుభవించీది", శక. 1431–35 "మాకు నాయంక్రమై చెల్లేటి గుత్త", "అంగరంగ వైభవాలు నడచేఅందుకు", "ఆక్షేత్రానకు జెల్లే చతుశ్శీమలో", "దేవునికి ఒక పళియం నడచే అట్టుగాను", "నయివేద్యం సాగేఅట్టుగాను", "ఆ పొలం మీరు వ్యవసాయపర్చుకొనేది" ఇటువంటివి అనేకము లున్నవి.

ఆయా కాలపు కవులు యథేష్టముగా ఇట్టి శబ్దాలు పద్యరచనలో కూడా ప్రయోగించినారు. లాక్షణికుడయిన ముద్దరాజు చినరామన కవి లోక సంజీవనిలో కృత్యాదినే.

శ్రీమించున్ దనుకాంతి వేఁడుటను లక్ష్మీ నామ సౌదామనీ
దామోపాయన మాచరించు భుజమధ్య ప్రాంగణం బాశ్రయిం
చే మేఘంబనఁగాఁ జెలంగు లలిత శ్రీవత్సమున్ దాల్చురా
ధా మోహాస్పద రూపధేయు ముఖశ్రీకారేయు సేవించెదన్॥ అని "ఆశ్రయించే" అనే రూపము ప్రయోగించినాడు. ఈ గ్రంథము ఇంకా అచ్చుపడలేదు.

శ్లోకకవి మల్లన రుక్మాంగద చరిత్రలో "మింగేవానికి" ( 27) అనిన్ని, తెనాలి రామలింగకవి పాండురంగ మహాత్మ్యమందు "నుయిదాఁటేవానికిం జింతయా కంతేనింగడ మేనియుంగడమగాదా" అనిన్ని, పుత్తేటి రామభద్రుని తాత, అయ్యలార్యుడు ఒంటిమిట్ట రఘువీరశతకములో "సంధుల్ గోసి వేసేతటిన్, పాపాలఁ బారంద్రోలేటి నృసింహా" అనిన్ని, మల్లయ ప్రబోధ చంద్రోదయములో 'మింగే' (II) అనిన్ని వాడినారు. వారికి పిమ్మట కవులు ఇంచుమించుగా అందరూ విరళముగానో ప్రచురముగానో ఈలాటివి వాడినట్టు కనబడుతున్నది. పరిష్కర్తలు మార్చివేయక విడిచినవే ఎత్తి కొందరి ప్రయోగములు ఉదాహరిస్తున్నాను.

చేసెడునప్పుడు, చేసెడియప్పుడు, చేసెటిఅప్పుడు, చేసేటప్పుడు, చేసేఅప్పుడు, చేసీఅప్పుడు-చేసెడునది, చేసెడిది, చేసేది, చేసేటిది, చేసీది- ఇట్టి మార్పులు తెలుగుభాషాస్వభావమునకు విరుద్ధము కావు.

ఉత్తరాంధ్రమందు ఈ శబ్దముల అర్థములో సూక్ష్మభేదములు ఏర్పడినవి: "వాడు మా యింటికి మునుపు రోజూవచ్చేవాడు; ఇప్పుడు నెలకు ఒకమారైనా రాడు"; "ఈ వుత్తరము మీ తండ్రిగారికి అందజేసేది";

"ఈ మందు తేనెతో గండుపుటలా పుచ్చుకునేది"; "నీవు వచ్చేవీ లేనిదీ తెలియజేయవలెను" మొ॥

## చేసే, చేసేటి

శా॥ శృంగారంబుగదోంచు దానిని రచించే మార్గమెల్లందగం ధను. 161

శా॥ శ్రీమత్పర్వతరాజకన్యను వరించేవేళ దన్మాత సా
మ్మే మైవన్ నిదుమన్న నెట్లనుచు మున్నే యోజనన్ జేసె నా
హేమాద్రిన్ మణులన్ జెలంగుటను జూపేచ్చన్ వలెన్ బట్టు తా
గిమెల్లన్ రజతంబు జేయ ననితగిరివుండు నన్ బ్రోవుతన్॥ పార్వ. I. 1

శా॥ అంతర్వాణి కుశేశయద్యుమణిఁ బద్మాత్మున్ మదిన్నిల్పి దు
ర్దాంతానంత భవాంధకూప తరణప్రౌఢిన్ ధృఢస్థేమఁ బా
టించుట్పెద్దలు తద్దనమ్మి నుయిదాటేవానికిన్ జీంత యా
కంతైనన్ గడమేనియుం గడమగాదాయంచు నూహించుచున్॥
పాండు. IV. 275

మ॥ పడతీ తల్లియుఁ దండ్రిఁ జంపుట తృణప్రాయంబు తోఁబుట్టులన్
మడియం జూచుట లెక్కగాదనిన జన్మజ్ఞాతకీటంబులన్
గెడపంబూనుట నాకు దొడ్డ గుడి మింగేవానికిన్ దల్పుల
ప్పడమూల్ గావన పిల్లపిల్లతరమున్ భక్షించు దాయాదులన్॥ ప్రబో. 67

చ॥ అటువలె దృశ్యవిస్మరణనందక శాస్త్రము నేటి నూతిలో వా. రా.

శా॥ కాలంబీగతి జేసెనా భృగునవంకా, గారణం బేమిఁకన్
జాలా నాయెడ సత్కృపన్ నిలుపుమో స్వామీ కడుం జాలునిం
దీలావణ్య విలాసినిన్ గరుణతో నింపొందఁగా ముందు న
న్నే లేరీతిగ నేలు నా మదికిదే యిష్టంబు ప్రాణేశ్వరా॥ వేం. శ్వ. 157

శా॥ నానాదాన వితానముల్ గొనఁ బరాన్నపుష్టుఁడై నిత్యక
ర్మానుష్ఠానముమాని రేబగళు లన్యాయార్జితద్రవ్య సం
తానుండై పరమార్థమైన సెలవింతా లేక పడ్డప్పు డీ
చ్చే నీచుండడిపోవదుఃఖపడ దానిట్లయ్యె వేయేటికిన్॥ సానం. 30

గీ॥ ఆతని వధూటి శుకఘోటి నలరుమేటి
యొడయఁడే లేటి సీమాటి యొఱపుగోటి
కొన నెగయమీటి యిది యేటి కులుకనేటి
పోటి కెదిరేటి శుభవాటి నీటుమెఱయ॥ హంస. II, 185

శా॥ కొండల్ వంటి కవీశ్వరుల్ శతకముల్ గూర్పంగఁ గోటాన కో
ట్లుండన్ నీవును జెప్పఁబూనితి వదేమో యంటివా వింటివా
వండే నేర్పుల పెక్కురీతుల రుచుల్ వర్తింపవే శాకముల్॥
దేవకీనం. శత. 10

## వచ్చేది

శా॥ ఈరీతిం గొనియాడు నారదునిఁ దా నీక్షించ సత్ప్రేమ నిం
కారావోయి వరంబు వేడుమను నా కాకుత్స్థుతో మానినిన్
జేరేదిమ్మనిఁ గోర నిచ్చె దయతో శ్రీరామచంద్రుం డయో
ధ్యారాజ్యంబున జానకీ సహితుఁడై ధర్మంబు పాలించుచున్॥ రామ స్త.12

క॥ దిటచెడక దిగులుగొని పట
పోట వోవక వెనుకముందు చూడక బొంకే
దెటులని చింతింపక యా
ఘటకుచ తడబడక యత్తఁ గన్గొని వలికెన్॥ హంస. V, 186

మ॥ కొలిచేదిన్ బగలేక నేనడిగితే కోపించుటే లేక నే॥ దేవకీనం. శతక.42

## ప్రథమ వ్యంజనలోపము

'పూని సెగసెంబొదివెంబొనగెంబొందె నటన్న పలుకులందు మొదలం గలుగునట్టి వ్యంజనంబు లడంగి వానిపై స్వరములు నిలుచు వలసినపుడు నీర జాక్ష,' అని అప్పకవి చేసిన అనుశాసనము ఆక్షేపించి, పూనుపాదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచారమూలకంబు" అని చిన్నయ సూరి దిద్దితే, సువ్యాఖ్యప్రకాశికాకారులు, చిన్నయసూరి మతము విమర్శించి, "ఇట్టు లసామాన్య కవి ప్రయోగంబు లుండగాఁ బరిశీలింపక కవిబ్రహ్మ వాక్యాన కెదురాడిన చిన్నయసూరి వచనంబు చిన్న యసూరి వచనంబుగాఁ జెల్లందగు"నని నిరాకరించినారు.

అప్పకవి చెప్పినవేకాక ఇంకా అనేక శబ్దములలో ప్రథమ వ్యంజ నము లోపిస్తుంది. పొచ్చెము=ఒచ్చెము; పసరు=అసరు, పెడఁబాయు=ఎడఁ బాయు; పవర్ణమేకాక ఇతరవర్ణములుకూడా కొన్ని అలాగునసే లోపిస్తవి. చిగురు=ఇగురు తెగులు=ఎగులు, నేను=ఏను, నీవు=ఈవు, నీరండ=ఈరెండ; నిట్టలము=ఇట్టలము, మీరు=ఈరు, మేము=ఏము మొ॥వి.

తెలుగు తామేలు=అరవము ఆమై; తె. తొండ=అ. ఒన్ని.

సంస్కృతమందు 'వీరిణమ్' అనే శబ్దమునకు రూపాంతరము ఈరిణమ్. లాస్ఫోటనీ=అస్ఫోటనీ. (ప్రాకృ). మొ॥వి. ఏకోనవింశతిః=ఏకోణీస్. (cf వింశతిః=వీస్.)

ఇట్లే అన్నిభాషలలోను, శబ్దములలో కలిగే మార్పులు చూపించి శబ్దానుశాసనము చేయడము పండితుల పని. లోపాగమవ్యత్యయాదులు సంస్కారాలు; వాటిని నిరూపించడమే సంస్కారము చేయడమంటారు వైయాకరణులు. దేవదత్తః అనే శబ్దములో ధాతుజమైన 'ద' వర్ణము లోపించి దేవత్తః అయినది. ఆ శబ్దము అనుశాసించినప్పుడు ద వర్ణలోపము సంస్కారమని చెప్పబడ్డది. సంస్కృతభాష పామర వ్యవహారములో మారి

ప్రాకృతమయినప్పుడు ప్రాకృతభాషకులక్షణము నిర్మించినవారు ఆ మార్పులే సంస్కారములుగా నిరూపించినారు. ఆర్యపుత్రశబ్దము అజ్జఉత్త అనిన్నీ దేవకుల అనేది దేవఉల అనిన్నీ ప్రాకృతములో మారినవి. పుత్ర-కుల శబ్దాలు సమాసమందు ద్వితీయ శబ్దములవుటచేత వాటి ప్రథమ వ్యంజనము లోపించినది; మొదటి శబ్దములయివుంటే అట్టిలోపము కలుగదు.

అట్లే తెలుగులో (చాపము)మోపుపెట్టి=మోపెట్టి (శ.ర.); బొబ్బ+పెట్టు=బొబ్బెట్టు (శ.ర.); నోప్పెట్టి, తలపెట్టి, ఒట్టెట్టు, మొరగెట్టు, చూపెట్టు, కప్పెట్టు, తుడుపెట్టి, దండమెట్టి, బొట్టెట్టి; త్రోపు+పడు=త్రోపడు; ప్రోపడు; ఊర్పు+పుచ్చు=ఊర్పుచ్చు; ఊర్పు+పోవు=ఊర్పోవు; ప్రొద్దు+పుచ్చు=ప్రొద్దుచ్చు. గంతులు+వేయు=గంతులేయు; ఉసురు+పోనుకొను=ఉసురోనుకొను పడవైచి=పడవేసి=పడేసి; కొట్టివైచి=కొట్టేసి.

వీటిలో, మోపెట్టి మొ॥వి భారతములోనే ఉన్నవి; తక్కినవి ఉత్తరాంధ్రకవులు వాడిఉన్నారు. గంతులేయు, అప్పక. iv 193. లంగరేసి-శ్రీకృష్ణ భారతము. ఆది. iv. 75. (లంగరువైచి=లంగరువేసి=లంగరేసి.) రాజప్రోలు=రాజవ్రోలు=రాజవోలు=రాజోలు; నిడుదప్రోలు=నిడుదోలు; మామిడివాడ=మామిడాడ; శబ్దములో ఇటువంటిమార్పులు భాషాస్వభావానుసారముగానే కలుగుతవి.

శిష్టవ్యవహారమందున్న శబ్దములన్నీ సాధువులే; ఔచిత్యమునట్టి కవులు వాడుతారు.

## ఆదివ్యంజనలోపము

సీ॥ కలువకొ్రివ్విరిదాలు బెళుకు బేడిసమీలు
మెఱుఁగొట్టి కనుదోయి మఱచెనొక్కొ॥ నిర్వ. వి. రా.

చ॥ కరలక క్రమ్మటింప నడుగెంటనె నిల్చినొకింత నూఁకినన్
శరనిధు వేదుదాఁటు మెయిచాచి చివుక్కున నుక్కుమీఱి సం
గరమున గాయమైన పతిఁగాచుఁ జలింపక తత్పురీహరుల్
హరిహయుమావుమునిక్కిగిన యంబుధిరేవున వచ్చెనో సుమీ॥
పాం. I, 114.

ద్వి॥ శ్రీరామరామ యీ చెడుబుద్ధి చెప్పి
యోరామ యెవరు నీ యుసుగోసుకొనిరో॥ మృత్యు. 23.

సీ॥ చంద్రవమా తేళ్లను మంద్రడగబ్బలు కొన్ని
గుట్టిన నెడనెడ గొట్టువారు
విలపించి పాదముల్ విదలించుకొనువారు
నిండ్లలోపల గంతులేయువారు॥ శశి. పు. 60.

క॥ మీకంటెను బంధువులిఁక
నాకెవ్వరులేరు వినుము నాకపకీర్తిన్
రాకుండఁ బెంల్లొచ్చిన
రాకొమరుల బ్రతుకు చూడు రాక్షసనాథా॥ శశి. పు.74.

## ఔపవిభక్తిక శబ్దములు

బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు తమ "ఆంధ్ర భాషానుశాసనము" లో వీటిని గురించి ఇప్పటికి తెలిసినంత మట్టుకు "రూపనిష్పత్తి" నిర్దేశించినారు; (చూ. ద్వి. భాగ. పు. 49-57.) ఇట్టి

శిష్టలక్షణముగల శబ్దములు తెలుగులోనే కాక అరవము కన్నడము మొదలయిన ఇతర ద్రావిడ భాషలలో కూడా ఉన్నవి గాని, తెలుగులో (విశేషముగా ప్రాచీనావస్థలో) ఎక్కువగా కనబడుతున్నవి. తెలుగు– ఏఱు, ఏటిన్, ఏటికి, ఏటిలో; అరవము- ఆఱు, ఆట్రై, ఆట్రుక్కు, ఆట్రిల్ ('ట్ఱ' అనేవర్ణములు పండితులు 'ట్ర' అనిన్ని సామాన్యులు 'ట్ట' అనిన్ని ఉచ్చరిస్తారు.) తెలుగులో 'నీరిలో' అని నన్నయ గ్రంథమందున్నది; ఉత్తరాంధ్ర మందు 'నీటిలో', 'నీటికి' అనివాడుక. 'నోరు' 'నోరి' అని తిక్కన కాలమందు వాడుక; 'గోరు,' 'గోరి' అని ఒక మండల మందున్న 'గోరు' 'గోటి' అని మరిఒక మండలమందున్న వాడేవారేమో. డుకారాంత శబ్దములలో కొన్ని ఇట్లే విశిష్టలక్షణము గలిగి ఉన్నవి. అరవము–వీడు, వీట్రై, వీట్టుక్కు, వీట్టిల్; తెలుగు–వీడు, వీటి (ఁ), వీటికి, వీటఁ (వీటిలో) cf అరవము 'అవై'=తెలుగు 'అవి'; అరవ 'అవట్రై'=తెలుగు (ప్రాచీనాంధ్రమందు వానిన్) వాటిన్, అవట్రుక్కు= (ప్రాచీనాంధ్ర మందు వానికి వాటికి), అవట్రిల్=వాటిలో. మరిఒక విశేషము చూడండి –అరవము, అవన్=తెలుగు 'వాండు,' వాఁడు. అరవ. అవనై=తెలు. వాని (న్), అరవ. అవనుక్కు=తెలు. వానికి. ప్రథమేతర విభక్తుల అరవములోను తెలుగులోను నవర్ణముతో ఉన్నవి. ప్రథమావిభక్తి అరవములో నవర్ణము కలిగి ఉండగా, తెలుగులో నవర్ణము డవర్ణముతో కలిసి ఉన్నది. అరవ. 'అవన్' తెలుగు. 'వాన్(డ్) ఉ.' (ఇంగ్లీషు Stand, Sound ఇట్టివే) ఔపవిభక్తికములకున్ను తక్కిన విభక్తులకున్ను ఉండే సంబంధము చూడండి. తెలుగు (ఇనుప) గుండు, గుంటి, గుంటన్; ఒక్కండు, ఒక్కంటి ఒక్కంటన్; మండు (క్రియ), మంట (కృదంత); తెలుగు కన్ను=అరవ కణ్ తెలుగు కను (క్రియ); నేను కంటిన్; (వాఁడు) కనెన్; అరవ. కాణ్ (కణ్)=కను, (నాన్) కండేన్, (అవన్) కండాన్ ( cf. O. E. fif, mod. E. five, fifth; సం. వాక్. వాచా. Lat. Vox. )

ద్రావిడ భాషా తత్త్వవేత్తలు ఈ విషయము విమర్శించడమునకు ఇట్టి శబ్దములు ఏ కాలమందు ఎట్టిరూపములు గలిగి యుండెనో తెలుసుకోవలెను. నేటి వ్యవహారములో నేడు శిష్టులు వాడే రూపములే సాధువులు. నేడు రచించే గ్రంథములలో నేటి వాడుకలోని శబ్దములే ప్రయోగిస్తే, ఈకాలము వారికి సుబోధముగా ఉండడమే కాక భాషాతత్త్వము నిరూపించే వారికి ఉపచరిస్తవి. తొల్లింటి ద్రావిడ భాషలోనే ఇట్టి విభక్తులుండేవా? ఉంటే అవి అరవము, కన్నడము మొ|| వాటిలో, తెలుగులో మునుపున్నట్టు లేవేమి? మధ్య కాలములో జారిపోయినవా? లేకుంటే తెలుగులో ఎప్పుడు పరిణమించినవి? ఇట్టి ప్రశ్నలున్నవి.

ప్రాచీన భాషలోని ఔపవిభక్తిక శబ్దములు వివిధముగా ఉన్నవని అనుశాసించేవారు. సావధానముగా ప్రయోగములు విచారించకపోతే, నింద పొందుతారు. తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమందు, 'ప్రోలు' శబ్దము అనౌపవిభక్తికముగా భారతములో నన్నయ ప్రయోగించినట్టు:—

క|| కనక మయమైన యీ ప్రోలున దమసుతులాహవంబులోనమరులచే
త నవధ్యులుగా మఱియు, వ్వనజజుచేఁ బడసి రసురవనితలు గరుణన్||

అనే పద్యము (అరణ్య IV, 80) వసుచరిత్ర పద్యముతో పాటు ఉదాహరించినారు. తిమ్మకవి అనుశాసనము ప్రమాణముగా నమ్మి, 'గుప్తార్థ ప్రకాశికాకారులు (సూ. బాల. వ్యా. అచ్చి. సూ. 29. వ్యాఖ్యా) "ఇట్లు ఔపవిభక్తిక శూన్యంబులగు ప్రయోగంబులు' గలవు కావునఁ బైవిధి కొన్నిమొదల నిత్యంబుగాదు" అని సిద్ధాంతము చేసినారు. ఉత్తరాంధ్ర కావ్యములలో, ఔపవిభక్తికములు తారుమారు కావడము వింత కాదు; ఆకావ్యములు పుట్టిన కాలములో నన్నయాదుల ప్రయోగములు మారి ఉండవచ్చును; లేక, ప్రాచీన ప్రయోగములు సుపరిచితములు కాక

కవులు భ్రమ ప్రమాదములకు లోనై ఉండవచ్చును. 'ప్రోలు' శబ్దము నన్నయ ఆదిపర్వములోకూడా "ఉ... వాని నెల్లఁగ్రక్కించెద నీమదాంధ్యముడిగించెద నిప్పుడ కాలుఁబ్రోలికేఁగించెద..." (చూ. VI, 294) అని ప్రయోగించినాడు. యుద్ధమల్లుని శాసనమందు "చేంబ్రోలనుండి" అనిన్ని, బెజవాడలోనిదే. శక. 1068 వ సం|| (సెం 749 రు) శాసనము మరిఒకదానిలో చేంబ్రోలన్ అనిన్ని, దాక్షారామములో, సెం 1114 రు శక 1085 సం|| శాసనములో "నిడుంబ్రోలి..." అనిన్ని ఉన్నందున, ప్రోలు శబ్దము నన్నయ కాలమందు ఔపవిభక్తికశబ్దమే అని అంగీకరించక తప్పదు; గనుక తిమ్మకవి ఉదాహరించిన పాఠము తప్పు, ఆనంద ముద్రణమందున్న వావిళ్ళవారి కూర్పులోనున్న "ప్రోలును" అని సముచ్చయముతో కలిసి ప్రథమావిభక్తి రూపము కనబడుతున్నది. ప్రకరణమును బట్టి చూస్తే, ఆరూపమే సాధువు. ఎదుటనున్న పురముచూచి మాతలిని ఇంద్రుడు అడిగినాడు— "ఇది ఎవ్వరి పురము?" అని. "పులోమయుఁ గాలకయునఁగా నిరువురు సురయువతులు గమలాసను నారాధించిరి; కనకమయమైన యీ ప్రోలును దమసుతులాహవంబులో నమరులచేత నవధ్యులుగాఁ గను నవ్వనజజుచేఁ బడసిరి సురవనితలు గరుణన్" అనిమాతలి చెప్పినాడు. సంస్కృత భాగతమందు "తపసోంతే తతస్తాభ్యాం స్వయంభూ గదద్వరమ్, అవధ్యతాంచరాజేంద్రసుర రాక్షస పన్నగైః, పురం సురమణీయంచఖరం సుమహా ప్రథం|| (అర. అధ్యా. 173, శ్లో. 8, 9). తిమ్మకవి పాఠములో "ప్రోలన" సప్తమీవిభక్త్యర్థక మని విమర్శించకుండా ప్రయోగములు ఎత్తుకొనేవారు భ్రమపడి 'ప్రోలు' అనౌపవిభక్తిక శబ్దమని లక్షణము నిరూపించినారు. 'ప్రోలును'= ప్రోలున్ను అని ఇక్కడ అర్థము.

యయాతి చరిత్ర, వసుచరిత్ర మొదలయిన ఉత్తరాంధ్రగ్రంథములలోని తెలుగు "కృత్రిమభాష"; వాటిలోని ప్రయోగములు అన్నీ ఆగ్రంథ

ములు రచించిన కవుల వ్యావహారిక భాషలో ఉన్నవని కాని, నన్నయాది ప్రాచీన కవుల గ్రంథములలో ఉన్నవని కాని చెప్పలేము. స్పెన్సర్ మహాకవి గ్రంథములలోని కృతకాంగ్లమువంటిదే ఆ కృతకాంధ్రము. నన్నయ మొదలుకొని తెలుగు కవులందరూ వాడిన భాష మారకుండా ఒక్కలాగుననే ఉన్నదని లాక్షణికులున్ను, పండితులున్ను, కవులున్ను భ్రమ పడుట చేత, అసత్య కల్పనలు, పరస్పరము విరుద్ధమైన అనుశాసనములు పెరిగినవి. ఆంధ్ర సాహిత్యపరిషత్తువారు తాము మోసపోయి గ్రాంథికాంధ్రభాష మారలేదని వాదించి లోకమును మోసపుచ్చినవా రయినారు.

నేడు శిష్టవ్యవహారమందు 'గుంటూరుకు' 'నెల్లూరుకు' 'రాజోలుకు' 'గుంతకల్లుకు,' 'వరంగల్లుకు' అని కొందరు అంటూ ఉన్నా, పామరులున్ను (కొందరు శిష్టులు కూడాను) పూర్వ వ్యవహారము చొప్పున 'గుంటూరికి', 'నెల్లూరికి' 'రాజోలికి', 'గుంతకంటికి', 'ఓరుగంటికి' అనే, నేడున్నూ అంటారు; 'నూజేటికి' అని ఒకరనగా నేను విన్నాను; 'నూజివీడుకు' అని చదువుకొన్నవారు కొందరంటున్నారని ఎరుగుదును. "కలుచంబర్రు శాసనము" అని అంటున్నాము. గాని 'కలుచంబర్తి' అనవలసినది. ఔపవిభక్తిక శబ్దములు ఈలాగున మారుతూ ఉన్నవి; గాని 'గుంటూరునకు', 'రాజోలునకు', 'గుంతకల్లునకు' అని లోకములో 'కు' వర్ణమునకు ముందు 'న' కారముంచి ఎవ్వరూ వాడరు పత్రికలలో మాత్రము ఈ కృతక రూపములు తరుచుగా కనబడుతున్నవి. 'నకా' సూత్రము పండితంమన్యులు ఇట్టి శబ్దములకు పట్టిస్తున్నారు.*

*శ్రీ కోమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు శివాజీమహారాజు నొక్క' (=రాజుయొక్క) అని చరిత్రలో ప్రయోగించినారు. ఆంధ్ర పత్రికలో ప్రకటితమైన లేఖలలో 'పబ్లిసిటీబ్యూరోనకు' 'బొంబాయినకు' 'శ్రీనివాస అయ్యంగారునకు' 'కృష్ణరాయలునకు' మొదలైన విపరీత ప్రయోగములు కనబడుతూ ఉంటవి. 'మిమ్ము' 'మిమ్ములను' 'మీకు' 'తమ్ము' తమకు అని అందరూ వాడుతూ ఉన్నందున అవి గ్రామ్యములనుకొని కాబోలు, కొందరు 'మీరలను', 'మీరలకు' 'తమరిని'; 'తమరునకు' అని ప్రయోగిస్తున్నారని విన్నాను.

'న' వర్ణము ప్రాచీనాంధ్రములో 'దేశమున వారు', 'దేశమున యందు', దేశమున నుండి, క్రతుశతంబు న కంటె, వర్గత్రయంబు న వలన (శాంతి) అని ప్రచురముగా శాసనములందున్ను గ్రంథములందున్ను, సంబంధార్థమును తెలియజేసే ఆగమముగా ప్రయుక్తమవుతూ ఉండినట్టు నిశ్చయించి చెప్పగలము; అయితే రానురాను ఆ 'న' కారము వ్యవహార భ్రష్టమయినది. ఇట్లే రామునిచేత, రామునితోడ, రామునికై, రాముని కొఱకు మొ॥ వాటిలోని 'ని' వర్ణముకూడా ఉత్తరాంధ్రములో జారిపోయినదని ప్రయోగములు చూపించి వైయాకరణులు అనుశాసించినారు. వ్యవహారము ఈ లాగున ఉండగా, 'నెల్లూరునకు' 'కూతురునకు' 'ముందునకు' 'క్రిందునకు' 'ఎందునకు' 'చోటునకు' మొదలైన కృతకరూపములు ప్రయోగించడము హాస్యాస్పదముగా ఉంటుందని నేను చెప్పనక్కరలేదు.

కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రులవారు కథాసరిత్సాగరమందు ఔపవిభక్తిక శబ్దములు ఏతీరున ప్రయోగించినారో చూడండి:— పేరు యొక్క (పు 46), ఈ పేరుతోనే (పు. 473), పేరును చూచి (54) —(నామధేయమని అర్థము), త్రాడుతో (122), త్రాడునుండి (210), చోటును (204), కొట్టునొద్ద (208), ఇల్లును (224), నేయితో (505); నడుమునకు (=మధ్యకు 425),—భారతాది ప్రాచీనాంధ్ర గ్రంథములు గాని, ఆంధ్రవ్యాకరణములుగాని చదివినవారెవరైనా ఈలాటి శబ్దములు వాడుదురా? 1901 సం॥ర లో ఈ గ్రంథము అచ్చుపడ్డది. అప్పటికి ఈ శాస్త్రులవారికి "గ్రాంథికాంధ్రము" తెలియదనడమునకు, అదే నిదర్శనము; లేఖ ప్రమాణము. బాలకవులు జాగరూకులై ఉండవలెను.

## లోప విభక్తికములు

మ|| ఘనతన్ జాలక జాలముల్ దళములున్ గన్పింపనష్టాద్రులన్
కృష్ణరా.విజ. I, 45.

చ|| అలమి త్రిలోకముల్ గెలుచు నత్తఱి తేరువహించుచుఁ దోడిచి
ల్కలు దగదొట్టి ముందఱికి లాగక యుండినఁ దాన తద్భరం
బెలమి వహింప మెచ్చి మరు డిచ్చుమణీమయ మాలికాత్రయున్
గళమునఁ దాల్చు చిత్రశుక నాథుఁడు రేఖలు పేఁగ నిచ్చలున్||
పాండు. IV, 224.

ఉత్సాహ|| వచ్చి వచ్చి కల్పకంబు వంటియొంటివానిఁగా
నచ్చవచ్చు గ్రచ్చకాయ లెంచియాడువాని మీ
విచ్చు పచ్చగంటివాని వింటివెన్నముచ్చు న
ప్పచ్చవిల్తుఁ గన్నతండ్రిఁ బాండురంగ విట్ఠలున్|| ,, V, 197.

గీ|| ఎగసి మిథిలానగరిఁ బాయనిగిడి గరుడి
చక్కనడ తెంచి జవమెక్క ఱిక్కత్రోవఁ
దనదుపైఁ జక్కఁ గరుడకేతనము గదలఁ
గదలిపైఁ బాలు కప్పలి కరణి నపుడు|| బహు. IV, 5.

గీ|| అధిక సౌహార్దసంపద నాసరోజ
గంధి నడిమికిఁ బేదఱికంబుమానెఁ
దలఁప నట్టిద యెట్టి వారలకు నైన
లేమి కాపుర ముండునే భూమిలోన|| వరా. III, 8.

క|| ఎక్కడఁబోయెద వింకం
జిక్కితి గాకనుచుఁ గృష్ణ సితర క్తత నుం
డొక్కఁ డెదిరి వాని వలన
నొక్కఁడు మహదాహ్వాయమున నుదయమునొందెన్ IX, 11.

## మాండలీయకములు

వ్యావహారిక భాష గ్రంథములలో వాడదగునది కాదనే వాదము సిద్ధాంతీకరించుటకు ఆభాషలో గొప్ప దోషమొకటి తరుచుగా చూపిస్తూ ఉంటారు మా ప్రతిపక్షులు. "ఆ భాష ఒక మండలములో ఒక విధముగాను మరి ఒక మండలములో మరి ఒక విధముగాను ఉంటుంది; అక్కడివారి మాటలు ఇక్కడివారికి, ఇక్కడివారి మాటలు అక్కడివారికి బోధపడవు. గ్రాంథిక భాష అటువంటిది కాదు; ఆంధ్రదేశమందు అన్ని మండలములవారికి అది సామాన్యభాష. అదే అందరికీ సుపరిచితమయినది, గనుక సుబోధము." ఈ విషయముగురించి ఒక సభలో మ॥ జయంతి రామయ్య పంతులుగారున్ను మరి ఒక సభలో మ॥ కోలాచలం శ్రీనివాసరావు పంతులుగారున్ను చెప్పినమాటలు నాకు జ్ఞప్తియందున్నవి.

"నేను దత్తమండలములకు వెళ్ళినప్పుడు ఒక నాడు బంట్రోతు చేతికి అయిదు రూపాయలు ఇచ్చి 'బేడలు' తెమ్మన్నాను; వాడు ఒక బస్తాలో కంది'పప్పు' తెచ్చాడు; చూచారా! వ్యవహారిక భాష యెలాగుంటుందో! అన్నారు రామయ్య పంతులుగారు" "మేము 'వక్కలు' అంటాము; మీరు 'చెక్కలు' అంటారు మీ మాట మాకు తెలియదు. మాట్లాడేటట్టు గ్రంథాలలో వ్రాస్తే అందరికీ సుబోధముకాదు" అన్నారు శ్రీనివాసరావుగారు. సభలోనివారంతా ఆమాటలు విని, మెచ్చుకొని కరతాళధ్వనులు చేస్తూ, పక పక నవ్వుతూ నావైపు చూచినారు. నేనూ నవ్వినాను వారి అవివేకము చూచి. "మీరన్నమాట నిజమే; అయితే, యేమంటారు? పప్పూ–బేడలూ, చెక్కలూ—వక్కలూ మాండలీయకములు గనుక దత్తమండలములవారు బేడలూ వక్కలూ అనిన్ని ఉత్తరసర్కారులలోనివారు పప్పూ—చెక్కలూ అనిన్ని గ్రంథాలలో వ్రాయకూడదని మీరు నిషేధిస్తే, వాటికి మారుగా గ్రంథాలలో ఏమాటలు ప్రయోగించవలెనో చెప్పండి" అని నేనన్నాను.

గ్రాంథిక భాషావాదులు ఒకరి మొగము ఒకరు చూచుకొన్నారు, ఏవో గుసగుసలాడినారు; గాని ఆ ప్రశ్నకు ప్రత్యుత్తరము రాలేదు.

'లౌకికభాషలన్నీ' మన తెలుగుభాషవంటివే, భాషలో కొన్ని శబ్దములు భిన్నముగా ఉంటవి; కొన్నిశబ్దములు సామాన్యమైనా, ఏదో కొంచెము వ్యత్యాసము వాటిలో ఉంటుంది. కొన్ని శబ్దముల అర్థం వేరు వేరుగా ఉంటుంది. ఇట్టి భేదమున్నా, ఒకరిభాష ఇంకొకరికి తెలియదన డము అసత్యవాదము. చాలాకాలముక్రిందటనే ఈ ఆక్షేపమునకు సమాధానము ఆముద్రితగ్రంథ చింతామణిలో సంపాదకులు ప్రకటించినారు.

ఒక మండలమువారికిన్ని ఇంకొకమండలమువారికిన్ని పరస్పర సంభాషణమునకు అవకాశములు తక్కువగా ఉన్నప్పుడు ఈ మాత్రము వైషమ్యము ఉండడము వింతగాదు. ఇంగ్లీషువారు అందరూ చదువునేర్చిన వారయినా ఇంగ్లాండులో, ఒక మండలమువారి భాషకున్ను ఇంకొక మండలమువారి భాషకున్ను కొంత వ్యత్యాసమున్నది గాని లేకపోలేదు. అమెరికావారి ఇంగ్లీషుకున్ను ఇంగ్లాండువారి ఇంగ్లీషుకున్ను వైషమ్యము ఏర్పడబట్టి, క్రీస్తుమత గ్రంథమయిన 'బైబిల్' అమెరికావారు తమ ఇంగ్లీషులోనికి తర్జుమా చేసుకొన్నారు; వారికి ఇంగ్లాండులోని ఇంగ్లీషు సుబోధము కాదట.

'వ్యావహారిక భాష' అంటే ఏమిటో, 'గ్రాంథికభాష' అంటే ఏమిటో తెలియనివారి వాదము ఈలాగుననే ఉంటుంది. 'మాండలీయకములం ఆనేవే అప్పకవి,

"క. కేశవయాంధ్రులు నానా, దేశంబులయందు నిలిచి తెనుఁగు లెత్త, ద్దేశోక్తులంటఁ బలికిన నాశబ్దము లన్యదేశజాంధ్రములయ్యెన్" అని నిరూపించినాడు. ఆ 'మాండలీయకములే' ఆంధ్రనామ సంగ్రహములోను, ఆంధ్రభాషార్ణవములోను, పర్యాయ పదాలుగా చేరినవి; అవి అన్నీ శబ్ద

రత్నాకరములోని కెక్కినవి. పప్పు జేసుకొనరూపంబు దనరారు (ఆ. భా. II, 348), పైకము దబ్బు దుడ్డు (II,307), చిల్లి గొళ్ళెము (II, 111, 51), బొంగరమనఁగను బొమ్మరమ్మనఁగను (II, 307). ఈలాటి మాండలీయకములు కవులు తమ గ్రంథాలలో వాడినారు: 'పప్పు', శ్రీనాథుని హరవి. II, 31, జేసలు. ఆము. II, 88. బొమ్మరము జైమి. శబ్దరత్నాకరములో చేరని 'మాండలీయకములు' పూర్వకావ్యములలో అనేకమున్నవి, ఇప్పటి కావ్యములలోనూ ఉన్నవి. ఇవి అన్నీ శ్రీ సూర్యారాయ బృహదాంధ్ర నిఘంటువులో నిఘంటునిర్మాతలు జయంతి రామయ్యపంతులుగారు చేర్చరుగాబోలు. వారికి మాండలీయకములు రుచించవే. 'మొసరు' బహు. V లో ఉన్నది; శ.ర.లో లేదు. అన్నట్టు మరచిపోయినాను! కవిసార్వభౌములు శ్రీకృష్ణభారతములో, గోదావరిమండలము వారు వాడుకొనే శబ్దాలు, పూర్వులు ప్రయోగించనవీ, శ.ర.లో లేనివీ చాలా చేర్చినారు. ఆది. X.232. చ.లో 'జివఁగొని' అని ప్రయోగించి, అది ఏ నిఘంటువులోనూ లేనందున, పుట అడుగున "జివ = దార్ఢ్యము. ఇట్లు గోదావరిమండలమున వాడుదురు; (వానికింకను జివచేరలేదు)" అని టీక వ్రాసినారు. ఇట్టి శబ్దములు నిఘంటువులో చేర్చకపోతే, శబ్దము దుష్టమవుతుందా? దీనికి ఏదో ప్రక్రియ వైయాకరణులు చేయకపోతే, వ్యాకరణము దుష్ట మవుతుందిగాని శబ్దము కాదు. వివేకులయినవారు శిష్టవ్యవహారమందున్న ఇట్టి శబ్దములు నిరాకరించరు. నిఘంటువులో ఉన్న తెలుగు మాటలలో ఇట్టి పర్యాయపదాలు ఇంచుమించుగా సగపాలు అనుకొంటాను.

క్త్వార్థకములు కొన్ని మండలములోని తెలుగువారు ప్రయోగించే విధము ఉత్తరాదివారికి వింతగా ఉంటుంది. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు కథాసరిత్సాగరమందు-చెప్పికాఁగానే (4) చెప్పుకొనియుఖునతర్వాత

(18); అనిన్ని మరిఒకరు "వానిని రాకజేసిరి (=రానుండా) అనిన్నీ వ్రాశారు. ఇటువంటి ప్రయోగములుకూడా మాండలీయకములే.

## రూపాంతరములు

మాండలీయకములను దూషించినట్టే, రూపాంతరములనుకూడా దూషిస్తారు; "ఒకరు 'కోరిక' అంటారు; ఒకరు 'కోరికె' అంటారు; ఒకరు 'గాడిదె' అంటారు; ఒకరు 'గాడిద' అంటారు" అని సభలలో, గ్రాంథికాంధ్రభాషాభిమానులు రూపాంతరములను గురించి హేళన చేస్తారు. అట్టి ఆక్షేపము యుక్తి యుక్తమయినదనిన్ని అఖండ్యమనిన్ని భావించి, సభలోనివారందరూ చప్పట్లు కొట్టుతారు; తమ వాదము సిద్ధాంత మయినట్లు సంతోషిస్తారు. 'గాడిదె' అని నీతిచంద్రికలో చిన్నయసూరిగారే వాడినారు. 'కోరిక' కోర్కె తప్పన్నవారు మ॥ వావిలికొలను సుబ్బారావుగారు (చూ. సులభవ్యాకరణము, 3 వ భాగ. పు. 73; మొదటి భాగ. పు. 59. మరి ఎవరో 'కోరిక' తప్పన్నారు. 'కోరికి' అనే రూపము భారతములో ఉన్నందున ఇకారాంతరూపమే సాధువని వారి నమ్మకము. అయితే, ఉత్తరాంధ్రభాషలో, ఈ రూపము మారినది:—మారన మార్కండేయ పురాణమందు "క...కార్యము।గానేరదు నీదు కోరికలు దప్పెం(జు సుమీ.' (చూ. V, 234) అనిన్ని, తిమ్మన పారిజాతాపహరణమందు క. ...గరుడోరగముఖుల కోరికను విఘ్నంబుల్ (V, 24) అనిన్ని అకారాంతముగా ఈ శబ్దము ప్రయోగించినారు. తపతీసంవరణోపాఖ్యానములో గంగాధరకవి "కేదారములందు గోరికెలు ఫలియింపన్ (1.7) అని ఎకారాంతముగా ప్రయోగించినాడు. యతిస్థానమందు 'కె' వర్ణముంటేనేకాని లాక్షణికులు ప్రమాణముగా అంగీకరించమంటారు గనుక అట్టిది ఒకటి ఉదాహరించినాను; గాని అనేక గ్రంథములలో 'కోరికె' అనే రూపము ప్రయుక్తమయి ఉన్నది.

చిన్నయసూరి బాలవ్యాకరణమందు 'కోరిక, కోరికి, పోలిక, పోలికి' అనుశాసించి, 'కోరికె, పోలికె' ఉపేక్షించినాడు. శబ్దరత్నాకరమందు 'కోరికె, పోలికె' లేవు. ఆంధ్రభాషార్ణవము, ఆంధ్రనామ సంగ్రహము మొదలయిన నిఘంటువులలో ఇట్టి రూపాంతరములుగల మాటలు కొన్ని మాత్రమే ఉన్నవి. బాలవ్యాకరణమందైనా అత్యల్పముగానే ఉన్నవి. (చూ. ప్రకీర్ణక.) మూడు వందల సంవత్సరాలయి ఆంధ్రశబ్దముల రూపములను గురించి లాక్షణికులు తగవులాడుతున్నారు. హల్లు, అచ్చు నిర్ణయించడమునకు అవి ప్రాసస్థానమందో యతిస్థానమందో ప్రయుక్తమయినవిగా ఉండవలెను. లేకుంటే, పరిష్కర్తలు తమ తమ మతానుసారము గ్రంథము 'దిద్ది' వేస్తారు.

తే॥ ధరణి నుయ్యేలపయ్యెద తాయెతులను, గల యకారంబులకు వక్రములు
    నిజంబు! ముద్దరాజు రామన వాని మాటిని బదమధ్యయాలని చెప్పె
నిమ్మాట మిథ్య." (11. 184) అని అప్పకవి ఆక్షేపించినాడు. కూచిమంచి తిమ్మకవి,

గీ॥ తాయెదయు నుయ్యెలయుఁ బయ్యెదయు ననంగ
    గలుగదత్వంబు మధ్యయుకారమునకు
    ననుచు మునుముద్దరాజు రామనవచించె
    గాని యత్వంబు కృతులందు గలదు శర్వ॥ (సర్వలక్ష. 69) అని

రామన్న లక్షణము దూషించి, ప్రయోగము లుదాహరించినాడు. చిన్నయసూరి, ఉయ్యెల పయ్యెద తాయెతులం ద్రిక్క నామంబులందు యాకుందాల వ్యవక్రయోగంబు లేదు (ప్రకీ. 3) అని బాలవ్యాకరణమం దనుశాసించినాడు. సుప్తార్థ ప్రకాశికాకారులు తమ భాష్యములో సూత్రకారుని మతము కొంతమట్టుకు నిరాకరించినాడు. ముద్దరాజు రామన గ్రంథములో 'తాయొర' అని వ్రాసినాడు; వ్రాతప్రతిలో నేను చూచినాను. అతడు

ఉదాహరించిన ప్రయోగము చంద్రభాను చరిత్రలోనిది; అచ్చులో సాహిత్య పరిషత్తువారు 'తారౌతులు' అని దిద్దినారు, గాని వారివద్దనున్న వ్రాతప్రతిలోను గవర్నమెంటువారి లైబ్రరీలోని ప్రతులలోను, ఆరూపము లేదు. దాని మాటకేమిగాని, 'భోరౌత' అనే శబ్దము హరిశ్చంద్ర నలోపాఖ్యానమందు 'రౌ'కారము యతిగా ప్రయుక్తమయి ఉన్నదే. అది సాధువు కాదా? (చూ. శ. ర.)

ఇట్లే, గీ. దక్కెనని కాని చెల్లదు దక్కెనను ప్ర
యోగమంచు వచించె నింపానరముద్ద
రాజు రామన్న యది యథార్థంబుగాదు
రెండుఁగల వెన్నఁగృతులఁ గారికశత్ర" అని పూర్వులు

చెప్పిన లక్షణము తప్పని ప్రయోగములు చూపించినాడు తిమ్మకవి. వ్యావహారిక భాషలో రూపాంతరములున్నప్పుడు కవులు తమ కిష్టమయినవి వాడుతారు; వారి వాడుకనుబట్టి లాక్షణికులు అనుశాసనము చేస్తారు. అంతేకాని, అనుశాసనమునుపట్టి కవుల ప్రయోగము తప్పనగూడదు. కవికి లోకము (అనగా శిష్టవ్యవహారము) ప్రమాణము. భారతములో 'కోరికి', 'పోలికి', పూనికి', 'మిక్కుటము', 'నాలుక', 'భోరన' అని గుర్తులు పెట్టిన వర్ణములు యతిస్థానమందుంచి, మహాకవులు ప్రాచీనులు వాడిఉంటే, ఉత్తరాంధ్ర కవులు, 'కోరిక' 'కోరికె'; 'పోలిక', 'పోలికె', 'పూనిక', 'పూనికె;' 'మిక్కుటము, 'నాలిక', 'భోరున' అనే రూపాంతరములు ఎందుకు ప్రయోగించినారు? శబ్దముల రూపములు మారినవి; తమ కాలమందు తాము వాడేవి గానీ, గ్రంథములలో పూర్వులు వాడినవిగానీ, ఏవి కావలస్తే అవి కవులు ప్రయోగించడము శిష్టసంప్రదాయము. ప్రయోగమునుపట్టి లక్షణము మారవలెను. ప్రయోగమూలమ్ వ్యాకరణమ్.

క|| పూవు పువు పువ్వు పూయన" అనిన్ని "క|| కేళాకూళియనంగా, కేళాకులి కేళకుళియుఁ గీర్తింపఁ గెళా, కూళియు ననఁదగు దీర్ఘిక" అనిన్ని నాలుగు రూపాంతరము లున్నప్పుడు నాలుగున్ను అనుశాసించినాడు తిమ్మకవి. ఏశబ్దమయినా లేదని చెప్పడము సాహసము. ఒక శబ్దము కవి ప్రయోగించినప్పుడు అది లోకములోనిదైనా అయిఉండవలెను, లేదా కవిప్రయుక్తమయినదయినా అయిఉండవలెను, ఆ ప్రయోగము చూపించవలసిన పూచీ కవిది; అది చూపించలేనప్పుడు కవి నిందపాలు కాకమానడు.

సీ. జాతివాగల వోష్ఠ్య శబ్దమొక్కటి దక్క సంస్కృతాంధ్రముల సముజ్జ్వలములందు, శబ్దంబు మొదల నిశ్చయముగాఁ గొమ్ములు నోష్ఠ్యంబులునుగల్గ వొకటికైన, వాకు శృంగముల కైవడి నోష్ఠ్యములభంగి శబ్దాదిగల యవి స్వరము లగును—అని అప్పకవి, తెలితక్కువచేత నియమము చేసినందున, పండితులు ప్రత్యాఖ్యానము చేసినారు. అప్పకవి లేవన్నవి చాలా ఉన్నవి (చూ. బాలవ్యా. గుప్తార్థ ప్రకాశిక పు. 11 ).

రూపాంతరములు గల తెలుగుశబ్దములు అనేకము గణపవరపు వెంకట కవి ద్విరూపకోశములో చేర్చినాడు; గాని ఆ గ్రంథము అచ్చుపడలేదు; దానిలో లేనివి వందలు వందలుగా నేను సంగ్రహించినాను; రూపాంతరములు వర్గీకరణము చేసి, భాషాశబ్దములు ఏలాగున మారినవో చూపించవచ్చును.

నాడుకలో ఉండే భాష లన్నిటిలోనూ రూపాంతరములుగల శబ్దములు అనేకముగా ఉంటవి; అనగా, ఒక్క శబ్దమునకు అనేక రూపములుంటవి. ఒక్క మనుష్యుడే ఒక శబ్దము ఒకప్పుడొకలాగునా, మరి ఒకొప్పుడు మరిఒకలాగునా ఉచ్చరిస్తాడు; ఒక్క కుటుంబములోనివారైనా ఒక్క శబ్దమే ఒకరు ఒకవిధముగాను మరిఒకరు మరిఒక విధముగాను పలుకుతారు. ఇట్లే వివిధజాతులవారిలోనూ వివిధ మండలములవారిలోనూ వ్యత్యా

షము కనబడుతుంది. ఇది భాషాస్వభావానుసారము జరుగుతుంది. ఒకటే భాషవాడే జనులలో పరస్పర సంబంధముంటే, అనగా నిరంతరమూ ఒకరితో ఒకరు సంభాషిస్తూ ఉంటే, సంభాషణలోని భాషకున్ను వ్రాతలలోని భాషకున్ను వ్యత్యాసము లేకుంటే, శబ్దముల రూపములలో వ్యత్యాసము అట్టే ఉండదు. ఇంగ్లండులో యంత్రములద్వారా నోటిమాటలు దేశమంతా వినబడేటట్టు మాట్లాడడమునకు ఏర్పాట్లు చేసినప్పుడు, ఎవరి ఉచ్చారణ అందరికీ సుబోధముగా ఉంటుంది ? అనే విషయము చర్చించినప్పుడు ఒక సభలో బర్నార్డ్ షాగారు, 'ఈదేశమందు 4 కోట్ల 80 లక్షల ఇంగ్లీషు భాషలున్నవి; ' అని అంటే, "ఎన్ని ఉంటేనేమి ? ఒకరి మాటలు ఒకరికి తెలుస్తూ ఉన్నవి" అని ఇంకొకరన్నారట. ఇంగ్లీషు నిఘంటువులలో శబ్దోచ్చారణ ఎన్ని విధములుగానుండునో తెలిసేటట్టు నిఘంటు నిర్మాతలు వ్రాసి ఉన్నారు. అమెరికావారి ఉచ్చారణలోగల వైషమ్యము అక్కడి పండితులు రచించిన నిఘంటువులలో కనబడుతున్నది.

వేనవేల సంవత్సరముల క్రిందట పంజాబులో వ్యావహారిక భాషలోని శబ్దములు, తిజంతములు, సుబంతములు, అవ్యయములు వివిధముగా ఉండేవని ఆ భాషలో రచించిన వేదములలో కనబడుతున్నది. అజాగత్, అజారస్, అజార్య, అజార=ముసలికాని; ఉర, ఉరల=పోవుట; పిశాచిః, పిశాచః; ప్రసహా, ప్రసాహా=బలము; అశుః, అశూ=వడిగల;క్రీడి, క్రీడుమ్=క్రీడ; యజస్; యజూస్; వపుస్, వపుష్=సొగసయిన; దేవా, దేవాసి=దేవతలు; చరామసి, చరామః=చరిస్తున్నాము; దేవేభిః, దేవైః=దేవతలచేత; గవాం, గోనాం=ఎడ్లయొక్క, ఇట్టివి వందలకొలదిగా ఉన్నవి; వైదిక భాషలో వైదిక ప్రక్రియలోని వ్యత్యయోబహులమ్ అనే సూత్రముక్రింద వ్రాసి ఉన్న విషయములు వైయాకరణులను అడిగితే వారు సవిస్తరముగా తెలియజేస్తారు. సంధ్యావందనములోని మంత్రాలలో ఉన్న వైదిక శబ్దాలు పరిశీలించవలెను.

వేదములలోని భాష రానురాను మారి, (కొంతమట్టుకు వ్యవహార భ్రష్టమై) లౌకిక భాషగా ఉన్నప్పుడు, పాణిన్యాదులు వైదిక శబ్దములకు వేరుగాను, వ్యావహారిక భాషకు వేరుగాను అనుశాసనము చేసినారు. శిష్ట వ్యవహారమందు శబ్దములు ఏరూపముతో ఉంటే ఆ రూపమే (ఎన్నిరూపాంతరములుంటే, అన్నిరూపాంతరములున్నూ) సాధువుగానే గ్రహించి, ప్రకృతి ప్రత్యయ విభాగము చేసి, లోపాగమ వర్ణవ్యత్యయాది సంస్కారములు నిరూపించి, భాషకు వ్యాకరణము రచించినారు; పిమ్మట ఆ భాషకు కోశములు పుట్టినవి. ఆ భాష పేరే సంస్కృతము. సంస్కృత శబ్దములలో అనేకమయినవాటికి రూపాంతరములున్నవి; అవి అపరిమితము. ధాతువులకే రూపాంతరము లున్నవి. సంధికార్యములు, సుబన్తములు; తిఙన్తములు, కృతంతములు, తద్ధితాంతములు, అవ్యయములు — అన్నిటిలోనూ వైవిధ్యమున్నది.

ధాతువులు—స్కంభ్, స్కుంభ్; జర్చ్, జర్ఛ్, జర్జ్, జర్ఝ్, జర్త్స్ = బెదిరించుట; మక్ల్, మంక్, మఖ్, మంఖ్, మంగ్, మంఘు, వక్క్, వఖ్, వంఖ్, వంక్, వంగ్ వీని లౌకికములో జనులే, వివిధముగా క్రియారూపములు ఉచ్చరించుటచేత, ఒక్క క్రియకే ఇన్ని రూపాంతరము లేర్పడినవి, అవి అన్నీ సాధువులుగా వైయాకరణులు అనుశాసించినారు చూచినారా. ధాతుపాఠములో పాఠభేదా లున్నవి. ఆ పాఠాంతరాలుకూడా సాధువులే; రుట్, లుట్; రుఠ్ం లుఠ్; రుడ్, లుడ్ రూపాంతరాలు. ఇకను ఒక జాతిపిట్ట పేరు తూర్పు దేశమువారు 'వర్తకో' అంటారనిన్ని ఉత్తర దేశమువారు, అదే 'వర్తికో' అంటారనిన్ని వివిధ మండలముల వాడుక సాధువుగా అంగీకరించి, రూపాంతరములుగా లాక్షణికులు వ్యాకరణములోను కోశములోను అనుశాసించినారు. పాణిని విడిచినవి కాత్యాయనుడు అనుశాసించినాడు; మిగిలిన

లోపములు పతంజలి సవరించినాడు. ఇట్లు ముగ్గురు ఆచార్యులు, తమ కాలమందు శిష్టులు వ్యవహరించే భాషఅంతా, సాధ్యమయినంతమట్టుకు పరిశీలించి, అనుశాసనము రచించినారు; ప్రకృతిప్రత్యయవిభాగము చేయ డమునకు వలనుపడనివి తప్పులనక, పృషోదరాది గణములోచేర్చి, పృషోదరాది త్వాత్ సాధుః అన్నారు. సామాన్యసూత్రమునకు లొంగని శబ్దాలు ఏలాగుననో సాధించినారుగాని అసాధువులని విడిచిపెట్టలేదు. సమ్‌విద్ ధాతువునుండి వచ్చిన సంవిదతే అనే క్రియారూపము లోకములో శిష్టులు లేఖము చేర్చివాడుతూ ఉండినందున సాధువన్నారు.

'కృ' అనే ధాతువు 'కర్', 'కార్', 'కురి' అని మారి కర్మ, కర్తా, కార్యమ్, చకర, చకురిః' అనే శబ్దములలో ఉంటే అట్టి శబ్దములు అట్లే అనుశాసించినారు. ఈ క్రింది శ్లోకములో ధూ—ధాతువు ఎన్ని విధాల వాడేవారో కవి చూపించినాఁడు. ధూనోతి చంపకవనాని ధునోత్యశోకం చూతం ధునాతి ధువతి స్ఫుటితాతిముక్తం వాయుర్ విధూనయతి చంపకపుష్ప రేణూన్ యత్కాననే ధవతి చందన మంజరీశ్చ"

లోకములోని వాడుకనుబట్టి అనేక వర్గములలో ఈ ఒక్క ధాతువు చేర్చినాడు అనుశాసనకర్త.

రాజసభా, ఇనసభమ్, స్త్రీసభమ్ బ్రాహ్మణసేనమ్ గోశాలమ్; పాత కాలమ్‌ఇట్లు శిష్టవ్యవహారమున్నందున, అదే సాధువుగా, అనుశాసన మేర్పడ్డది. సంస్కృత శబ్దములు (నామవాచకములు) వాడుకలో ఎన్ని రూపములు పొందినవో చూడండి—తిత్తిరిః (పక్షి), తిత్తిరః, తితిరిః, తిత్తిరికః, తిత్తిరీకః; జలకా (=జలగ), జలికా, జలుకా, జలూకా, జలోకా, జలా ఉకా, జలోకికా; భల్లః (=ఎలుగుగొడ్డు), భల్లకః, భల్లుకః, భల్లూకః భాల్లుకః, భాల్లూకః, భాలుకః, భాలూకః, భీలుకః, భీలూకః, భల్లుః భాల్లుః; భృకుటిః (=బొమముడి), భృకుటీ, భ్రూకుటిః, భ్రూకుటీ, భ్రుకుటీ,

భ్రూకుటిః, భ్రికుటి, బొ॥వి; చుచుకః (చనుమొన), చుచుకమ్, చూచుకమ్, చుచూకమ్, చూచూకమ్; ఏడుకః (గొఱ్ఱె), ఏడుకమ్, ఏడూకః, ఏడూకమ్, ఏడోకః, ఏడోకమ్; ధత్తూరః (ఉమ్మెత్త), ధత్తూరః, ధుస్తూరః, ధుస్తూరః; ధూస్తూరః; తింతిలీ (=చింత-చెట్టు), తింతిడీ, తింతిడః, తింతిలికా, తింతిడికా, తింతిలీకా, తింతిడీకః, నిఃశ్రయణీ (=నిచ్చెన), నిఃశ్రయిణీ, నిఃశ్రేణీ; పృథ్వీ, పృథివీ, పృథవీ.

ఈ సంస్కృత శబ్దములు ఆర్యావర్తములో ఉండే పామర జనుల నోట్లో అనేక మార్పులు పొంది ప్రాకృత శబ్దాల రూపాంతరములైనవి. తింతిడీ శబ్దము హిందీలో 'తింతిరీ' అయినది. ఓఢ్రములో తింతిడో, తింతిడికా, తింతిడీ, తింతిళీ, తింతిడీక, తింతుళి, తెంతుళి తెందుణీ (కడపటిదే తరుచుగా వాడుకలో ఉన్నవి) సవరలు 'తిత్తి' అంటారు; మరాఠీలో చించ; అదే తెలుగులో చింత అయినది. నిఃశ్రయిణి శబ్దముయొక్క రూపాంతరము 'నిఃశ్రేణీ' కాళిదాసు రఘువంశములో ప్రయోగించినాడు; అది మరాఠీలో నిశిణా, నిసణా; ఓఢ్రములోని శుణి; తెలుగులో నిచ్చెన, కన్నడములో నిచ్చెణికె, అరవములో ఏణి అయినది. తెలుగు మాట పుడమి, ప్రాకృతము ప్రథవీ శబ్దముయొక్క వికృతి; పుడమి అనేది పృథవీయొక్క వికృతి; అది పృథివియొక్క రూపాంతరము, అది పృథ్వియొక్క రూపాంతరము. (పృథు + ఈః)

ఇట్లే తెలుగులో ఉన్న అనేక శబ్దాలకు అనేక విధములయిన రూపాంతరములున్నవి:—(గండ) పెండియము, పెండెము, పెండెరము, పెండేరము, పెండరము—పెండారము; (కొబ్బరి) బొండము,— బొండాము, బొండలము, బొండ్లాము; ముంగమురము, ముంగమురాము, ముంగాముగము, ముంగామురుగు, ముంగమురారి, ముంగామురారి ముంగయిమురారి, ముంగైమురారి.

ఇట్టి రూపాంతరాలుగల మాటలు తెలుగు భాషలో వేలకొలదిగా ఉన్నవి. వైదిక భాషమారి లౌకికభాష సంస్కృతము ఏర్పడ్డది; రాను రాను అది మారి ప్రాకృతములు (మహారాష్ట్రీ, శౌరసేనీ, పాలీ మొ॥వి) వాడుకలోనికి వచ్చినవి; సంస్కృతము వ్యవహార భ్రష్టమయిన తర్వాత, పామరుల భాషలే శిష్టభాషలయినవి; వాటికి వ్యాకరణాలు కోశాలు పుట్టినవి; కొంతకాలానకు అవికూడా మారిపోయినవి; వాటి పిల్లలే నేడు హిందీ, బంగాళీ, గుజరాతీ, మరాఠీ, ఒరియా మొ॥నవి దేశ భాషలుగా ఒక్కొక్క మండలములో ఒక్కొక్కటి వాడుకలో ఉన్నవి. వాటిలో గొప్పగ్రంథాలు గొప్పకవులు రచించినవి ప్రసిద్ధి కెక్కినవి, తులసీదాసు రామాయణము వంటివి. ఆ భాషలుకూడా మారుతూ ఉన్నవి; తులసీదాసు ప్రయోగించిన శబ్దాలకు రూపాంతరములు పుట్టినవి; సుబంతాలు, తిఙంతాలు కొత్తవి హిందీలో నేడు కవులు వాడుతున్నారు.

వేదములలో పూర్వకాలపు ఋషుల భాష శిలాక్షరములవలెనే స్థిరమై ఉన్నది. ఆ ఋషులు పఠించినట్లే నేటి వైదికులు పఠించడము అభ్యసిస్తున్నారు, ఇష్టమయినవారు. అట్లే పాణిన్యాదులు అనుశాసించిన భాష వ్యాకరణములోను, పురాణాలలోను, కావ్యాలలోను స్థిరమయి ఉన్నది; అది కావలసినవారు వాటినిపట్టి నేర్చుకొంటారు. అలాగుననే పాలీ మొ॥విన్నీ. అయితే నేడు వ్యవహారమందున్న భాషలు అలాగున ప్రజలు అభ్యసించరు. పెద్దల సహవాసమువల్లనే వారు వ్యవహరించే భాష పిల్లలకు పట్టుపడుతుంది. అదే దేశభాష, అదే శిష్టజనుల మాతృభాష; 'ఉగ్గుపాలతో" ఒంటికి పట్టిఉన్నది; అపరిహార్యమైనది. దానిలో బాలకవులు ఏలాటి కావ్యము రచించినా, అందరికీ సుబోధముగాను, మనోహరముగాను ఉంటుంది. అదే దేశికవిత; జానుకవిత; మధురకవిత, తేటతెనుగు కవిత.

## సంధి

"పూర్వ పరస్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధియనం బడు" అని సంధికి నిర్వచనముగా చిన్నయసూరిగారు చెప్పిన వాక్యము తెలుగుభాషకు స్వరసంహిత విషయమై మాత్రమే సామాన్యముగా చెల్లు దగినదైనా యడాగమము, నుగాగమము, ముగాగమము, టుగాగమము, రుగాగమము, గసడదవాదేశము, సరళాదేశమూ మొదలైనవి సంధికార్యములకు సంబంధించిన విషయములే కనుక వీటిని గురించి చెప్పిన సూత్రములన్నీ సంధి పరిచ్ఛేదములోనే చేరి ఉన్నవి. వీటిని గురించి వ్యాకరణాలలో అనుశాసించిన దేమిటి? కవి ప్రయోగా లెట్లున్నవి? నేటివ్యవహార మెట్లున్నది? అనే విషయములు విమర్శించి చూస్తే ఒకదానికొకటి సరిపడదు. సంధికార్యము ఎక్కడ నిత్యము, ఎక్కడ బహుళము, ఎక్కడ వైకల్పికము, ఎక్కడ నిషిద్ధము అనే విషయములు వ్యాకరణముల వల్లగాని, ప్రయోగముల వల్లగాని స్పష్టపడకుండా ఉన్నవి. "అత్తునకు సంధి బహుళముగానగు" అనే సూత్రము క్రింద "బహుళగ్రహణముచేత స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధిలేదు" అని చిన్నయ సూరిగారు అనుశాసించి, "భవంతికేచిచ్ఛబ్దాస్తు సాంగత్యే నైవసాధవః । కుత్రచిత్సంస్కృతీయోపి ప్రాణోప్యత్రచ్యుతో భవేత్" అనిఅథర్వణాచార్యులు చెప్పిన శ్లోకము జ్ఞప్తియందుంచుకొని కాబోలు "సంస్కృతీయంబునకు సంధి యగునని యథర్వణాచార్యులు చెప్పిరి. గాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. అధునికకృతులందొకానొకచోట స్త్రీ వాచక తత్సమంబులకు సంధి గానంబడియెడు - గంగనుకాని - సెలఁతిచ్చెను" అని వ్రాసినాడు. అయితే, అధునిక కృతులందే కాక ప్రాచీన కృతులలోకూడా స్త్రీ వాచక తత్సమములందు అత్వసంధి కనబడుతున్నది. 'గంగనుకాని', - 'చేష్టుడిగె' 'భర్తంచు' అనే ప్రయోగములు గల ఆముక్తమాల్యదా 16వ శతాబ్దముదే

అయినా ఆధునిక కావ్యమే అంటే, అంతకు పూర్వము రచితమైన పద్మ పురాణములో 'ప్రేతయి' (ప్రేత+ఆయి) (IV, 80.) అనిన్ని, రంగనాథ రామాయణములో 'మాయను' (మాయ+అను) (V, 225) అనిన్ని ప్రయోగము లున్నవి.

పైనిసూచించిన సూత్రమునకు వ్యాఖ్యవ్రాస్తూ గుప్తార్థప్రకాశికా కారులు, "అకారంబునకు 'అకు, అంత, అయ్య, అమ్మ, అప్ప, అక్క, అన్న' మున్నగువాని యచ్చులు పరంబగు నపుడు సంధి నిత్యమని పెక్కు వ్యాకరణంబులు ఘోషించుచున్నవి. కాని 'అను' అను శబ్దము పరంబగు నపుడు సంధి లేమియు విరళంబుగా నున్నది" అనిన్ని 'పరిమాణార్థకమైన 'అంత' యను తెలుఁగు శబ్దంబు పరం బగునపుడు ప్రాయికంబుగా సంధి సర్వత్ర నిత్యంబు, ఉదా. కొండంత - గోడంత- " 'తన యంత' ఇత్యాదులయందు వైకల్పికంబును గానంబడుచున్నది" అనిన్ని చెప్పి ప్రయోగాలు కనబరచినారు.

" 'చింతయా'కని యొకఁడు పలికెఁగాని యదిమనోజ్ఞము కాదు" అని వావిలికొలను సుబ్బారావుగారు తమ సులభవ్యాకరణము (పు. ౭౮)లో తెనాలి రామలింగకవి ప్రయోగము నిరాకరించినారు. "ఇకారాంత స్థలము లలో నాకు శబ్దము పరంబగు నపుడు సంధి శ్రుతి కటువుగా నుండుటం జేసి 'ఉ. తా। టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినన్ఁ బాపమంచు" "క. మట్టాకునఁ బండెడు చొర । గుట్టానికి రెండు కాళ్లు కోడికి వలెనే" మొదలైన వానియందు "తాటియాకు, మట్టియాకు" అని ప్రయోగించుటయే రమణీయము" అని గుప్తార్థ ప్రకాశికా కారులు రుక్మాంగద చరిత్రలోని 'రావియాకు' అని ప్రయోగముదాహరించినారు. ఈ రుక్మాంగద చరిత్ర (II, 113.) లోనే 'రావాకు' అనే ప్రయోగముకూడా ఉన్నది. ఇదివారు చూచినట్టు కనబడదు. లోక వ్యవహారమును అనుసరించి కవి తనకేది

ఇష్టమయితే అది ప్రయోగిస్తాడు; రెండూ ఇష్టమైతే రెండూ ప్రయోగిస్తాడు గాని లాక్షణికుల ఇష్టానిష్టములతో అతనికి పనిలేదు. జైమినిభారతంలో 'మట్టాకు' అనే ప్రయోగం (VIII 140, 141, 147.) మూడు చోట్ల ఉన్నది. సుప్తార్థ ప్రకాశికా కారులకు శ్రుతి కటువుగా ఉన్నా పిల్లలమఱ్ఱి పినవీరభద్రునికి ఇంపుగానే ఉన్నది.

చిన్నయసూరి 'స్త్రీవాచక తత్సమ సంబోధనానంతంబులకు సంధి లేదు" అని మూడు స్థలములే పేర్కొని ఉండుటచేత, సుప్తార్థ ప్రకాశికా కారులు "ఏవార్థకంబైన (అవధారణార్థకంబైన) యకారంబునకుంగూడ నచ్చుపరంబగు నపుడు సంధిలేదని యెఱుంగునది. ఉదా. నీవ యనుంగుం జెలివి. ఇచ్చట సంధి కూడదు." అని చిన్నయసూరి చెప్పిన దానిలో గల లోపము పూర్తి చేసినారు. అవధారణార్థమందు ఆధునిక వ్యవహారములోగల 'నేనే, నీవే' అనే ఏకారాంత రూపములే కాని ప్రాచీన వ్యవహారములోగల 'నేన, నీవ' అనే అకారాంతరూపములు స్ఫురణయందు లేక పోవుటచేత కాబోలు చిన్నయసూరిగారు ఈ విషయము చెప్పమరచినారు. వాస్తవముగా సంబోధ నావధారణముల పట్ల అత్తునకే కాదు మరియే స్వరమునకైనా సరే అచ్చు పరమైనప్పుడు సంధిలేదని నిశ్చయముగా చెప్పవచ్చును. ఉచ్చారణలో సహజముగా ఈ స్థలములందు విరామ కార్యమవసరమైనది గనుక సంహిత సంభవించదు.

"తామరసనేత్రలిండ్ల బందాలుకారె" అనే (మను. II, 73.) చరణ మందలి 'నేత్రలిండ్ల' లోని సంధి సాధువుకాదని కొందరి అభిప్రాయము. గాని ఇట్టిప్రయోగాలు భారతములో ఉన్నవి. రాజులొద్ద (ఆది. VI, 11; 120; VIII, 66); తల్లి దండ్రులొద్ద (అర. II, 132); అనాథులట్ల (అర. III. 165) క్రియలందు (అర. III, 166) ఆకాలపు శాసనములలో కూడా ఇట్టి సంధిగల రూపాలు కనబడుతున్నవి.

"ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు" అని బాల వ్యాకరణములోని సూత్రము ఉన్నది. అయితే, ఈ ఇత్వ సంధి బహుళ మే కాని వైకల్పికము కాదు. ఇది, అది, నీవి, నావి మొదలయిన రెండక్షర ముల పదములలోతుదినున్న ఇకారమునకు ఏవార్థకమైన అకారము చేర్చి నపుడు ఇదియ, అదియ, నీవియ, నావియ మొదలయిన రూపములే నన్నయాది ప్రాచీన కవులు ప్రయోగించినట్లు కనబడుతున్నది. నీవ అంటే (నీవు + అ) నీవే అని అర్థము; గాని, నీవి + అ=నీవే అన్న అర్థము లేదు. ప్రాచీనభాష ననుకరించబోయి, నీవియ అనే అర్థమందు నీవ అని వడ్డాది సుబ్బరాయకవి గారు తమ సుమనోమనోజ్ఞము (1. పుట. 28) లో 'మాయెల్ల సంపదలు నీవ' అనే వాక్యమందు ప్రయోగించినారు; గాని, ఇది ప్రాచీన భాషా సం ప్రదాయ సమ్మతమైనట్లు కనబడదు. నేటి వ్యవహారమందు నీవు; నీవి అనే మాటలకు ఏవార్థక ప్రత్యయమైన 'ఏ' చేర్చి 'నీవే' అనే ఒక రూపమే రెండర్థములందున్ను వాడుతున్నారు. ప్రాచీన భాషలో ఇవి + అ=ఇవియ; వారివి + అ=వారివ; (మా. ఆది. III,155.) మొదటి దానిలో సంధి లేక పోవడమున్ను రెండవ దానిలో సంధి కలగడమున్ను కనబడుతున్నది. ఈ భేదము శ్రుతి రమణీయతను బట్టి ఏర్పడుతున్నది. సంస్కృతభాషలో సర్పి ష్కుండికా, పరమసర్పిః కుండికా అని సర్పిః అనేపదము విడిగా ఉన్నప్పుడు ఒకరీతిగాను, సమాసములో అంత మందున్నప్పుడు ఒకరీతిగాను సంధి కార్యము జరిగినట్లే 'ఇవియ, వారివ'లో సంధి భిన్నముగా జరిగినది.

నైషధము (III. 202) లో శ్రీనాథుడు 'దినంఘ్రులు' అని వ్రాస్తే 'వీని యంఘ్రులు' అని దిద్ది, ఇది నరస భూపాలీయములోని 'వానన్న' వంటి దుష్టసంధి అని వేదము వేంకట్రాయ శాస్త్రులవారు ఆక్షేపించినారు. వీరే తమ కథా సరిత్సాగరమందు 'వలిమలల్లుని' ప్రయోగించినారు. ఇది వారు దుష్టమని నిందించినసంధి వంటిదేకదా. "వలిమలయల్లు నాని తలవాడని పువ్వ

యి" యదియాది. VI. "అహోబలపతి 'మగనాలు' అనునది ఇకారనిత్యసంధికి నుదాహరణ మిచ్చెను. "సీ. ఓర్మి మైనుప్పిడి యుపవాసముండనీ మగనాలిసరిఁ బోల్పఁదగదు విధవ". కాశీ. 2. ఆ. అని చెప్పి అహోబలపతి మతమునకు విరుద్ధముగా "ఉ. ఆసమయంబు నన్మగనియాంధ్రుడు గన్యలు నాకసొచ్చి..." ఉత్తరరామాయణము, ఇచ్చట 'మగనియాలు' అనియుం గలదు' అని సుప్తార్థప్రకాశికా కారులు వ్రాసినారు. సంబంధషష్ఠీ రూపములందలి ఇత్వ సంధికి నన్నయాది ప్రాచీన కవి ప్రయోగములు సైతము కలవు- 'సయునునికి' (ఆది. VIII. 167); 'కృష్ణునల్లుఁడు' (ద్రోణ. II, 248, 337) జమునిల్లు (విరా. II. 204); 'చిలుతొండ సింటికేగ' (హరి. I. 15)

క్త్వార్థకమైన ఇత్తునకు సంధి లేదన్న మతము పండితులలో చాలా మందికి దృఢముగా ఉన్నది. అడిదము సూరకవి మాత్రము తన కవి సంశయవిచ్ఛేద మందలి ప్రథమ తరంగములో "ఇడగవచ్చును ల్యప్పుపై నిత్యసంధి మాత్రమొక్కొక్క చోటను మట్టుమీఱఁ । గొలతువఘుమదంపఁ గోరిందు శేఖరు । నన్నయట్లు కవిజనాను మతిని॥ అని లక్షణము చెప్పి భారతం - ఉద్యోగ పర్వము నుండి "అందిమ్ము", రాఘవ పాండవీయమునుండి "చూపినపలుఁడు", నైషధమునుండి "అనించుకించుక", ఆముక్తమాల్యద నుండి "చించిచ్చు", విజయ విలాసము నుండి "అడిగిచ్చు"; కవుల షష్ఠము నుండి "ఎక్కడనుండిట వచ్చినారు", శుద్ధాంధ్ర రామాయణమునుండి "నిగిడిరువైశ్యులగ" లక్ష్యములుగా చూపినారు. వీటిలో 'అందిమ్ము' ధాతు పల్లవ మనిన్ని, 'ఎతేఁగిపుడే' అనే పాఠమునకు 'ఎతేఁగించితగ' అనే పాఠాంతరమున్న దనిన్ని, భారతములో ఇట్టిసంధి లేదన్నట్లు సూచించి తక్కిన గ్రంథాలలోని ప్రయోగాలు "నిరాకరంబులు" అని సుప్తార్థ ప్రకాశికాకారులు వ్రాయుటకు సాహసించినారు. కవిత్రయమువారు

ఈ సంధి తరుచుగా చేయకపోయినా వారి తర్వాతి మహాకవుల ప్రయోగాలు వందల కొలదిగా ఉన్నవిగదా ఈ సంధికూడదని లాక్షణికులు ఎట్లు సాహసించి చెప్పగలరు? ఇకారమునకు ఇ ఈ ఎ ఏ లు పరమైనప్పుడు సంధి సహజముగాను శ్రుతి కింపుగాను ఉంటుంది.

సంధికార్యము అన్ని భాషలలోను ఒక టేతీరున ఉండదు. ఏఒక్క భాషలోనైనా ఎల్లకాలము ఒకటేతీరున వేదములో ఉన్నట్లు పాణిని సంస్కరించిన సంస్కృత భాషలో లేదు. దీర్ఘాచ్చు పైనున్న నకారము దానికి అచ్చు పరమైతే అనుస్వారముగా మారుతుంది. ఉ. మహాన్ + ఇంద్రః= మహాఀఇంద్రః; విద్వాన్ + అగ్నే =విద్వాఀఅగ్నే; నకారము ఈ, ఊ, ౠ, పైనున్న యెడల అనుస్వారముతో పాటు రేఫగాకూడా మారుతుంది. ఉ. అగ్నీన్ + అప్సు=అగ్నీఀరప్సు; పరిధీన్ + అతి = పరిధీఀరతి; అభీశూన్ + ఇవ= అభీశూఀరివ.

ఋగ్వేదంలో విసంధి కనబడుతున్నది. ఈదిగువను కనబరచిన చరణాలలో విసంధిగా ఒక్కొక్కచోట చదువుతేనే కాని అక్షరసంఖ్య సరిపడక ఛందోభంగము కలుగుతుంది.

మిత్రో దేవేషు ఆయుషు (III, 59)

సమిథో నావి అహితం (X, 135)

పనాయ్యామో భోఅస్మే సమిన్వతవ్ (I. 160)

సంస్కృత భాషలో సంధి కొన్నిచోట్ల వైకల్పికము, కొన్నిచోట్ల నిత్యము, నిత్యమైనచోట్లనైనా ఒక్కొక్కచోట సంధికార్యము రెండు మూడు విధములుగా ఉంటుంది. సంస్కర్తా (సమ్ + కర్తా) అనే శబ్దమునకు 107 రూపాంతరాలున్నవట!

ప్రాకృత వ్యాకరణాలలో సంధిసూత్రములు సరిగా చెప్పుటకు ఆధారముగా గణము లేర్పరుచుట కష్టమనిన్ని, ఒక విధమైన ప్రాకృతములో కనబడని సంధి మరియొక విధమైన ప్రాకృతములో కనబడుతున్నదనిన్ని, ఏ ప్రాకృతములోనైనా సంధి బహుళముగానే ఉంటుందనిన్ని చెప్పినారు.

అలాగుననే తెలుగు భాషలో కూడా నన్నయ కాలమునుండి నేటి వరకున్ను సంధికార్యము ఒక్కతీరుగానే ఉన్నదని చెప్పుటకు వల్లకాదు. లోకుల ఉచ్చారణ స్వభావమును బట్టి మారుతూ ఉంటుంది. అందుచేతనే నన్నయాది ప్రాచీనకవుల ప్రయోగములకు భిన్నముగా ఉత్తరాంధ్రకవుల ప్రయోగములు కనబడుతున్నవి. సమకాలికులయినా ఒక్కొక్క మండలము వారు ఒక్కొక్కవిధముగా పదాంత స్వరములు ఉచ్చరించుటచేత సంధి కార్యము కొద్దిగా భిన్నము కాక తప్పదు. ఒక్కమండలమువారయినా తమ అలవాటు ననుసరించి ఒకచోట సంధిచేసి మరిఒకచోట సంధిచేయక సంభాషిస్తారు.

కొన్నిచోట్ల సంధిచేయుటవల్ల ఒక అర్థమున్ను, సంధి చేయకపోవుట వల్ల మరియొక అర్థమున్ను స్ఫురించడముచేత సంధిసూత్రములు అర్థవిశేషములబట్టి చేయవలసి ఉన్నది.

కొత్తఊరు (ఊరు కొత్తది అని అర్థము) ఇదే గ్రామనామమై 'కొత్తూరు' అని ఉచ్చారణలో స్థిరమవుతుంది. అలాగుననే పెద్ద ఈతచెట్లు పెద్దీతచెట్లు; పెద్దఏరు వచ్చినది, పెద్దేరు దాటినాము; ప్రతిఉత్తరం, ప్రత్యుత్తరం; రెండు ఎడ్లబండ్లు, రెండెడ్ల బండ్లు; అక్కడ (ను) ఉండి పోవలెను, అక్కడనుండి పోవలెను.

యడాగమము నేటి వ్యవహారములో తారుమారుగా ఉన్నది. 'మా యమ్మ, మా యన్న, మా యత్త, మా యప్ప, మా యయ్య' అని

పామరులయిన తక్కువజాతివారి ఉచ్చారణలో వినబడుతున్నది గాని శిష్టజన వ్యవహారములో లేదు; 'అయా గ్రామములలో' అన్నప్పుడు మాత్రం శిష్టుల ఉచ్చారణలో కూడా వినబడు తున్నది. ఇక్కడ ఆకారము యశ్రుతి అంతమందుగల స్వరము. అందుచేతనే కొందరు అయ్యాయ్ ఆయాయ్ అని కూడా ఉచ్చరిస్తున్నారు. ఇ ఈ ఎ ఏ లు మొదటనున్న మాటలు కొన్ని యకారముతో కొందరుచ్చరిస్తున్నారు. ఆ యీతచెట్టు, నా యీడు, ఈ యేనుగు మొదలయిన మాటలలో యకారము వినబడుతున్నది. ఎవడైనా తన సంఘములో ఉన్న ఉచ్చారణను అనుసరించి ఉచ్చరిస్తాడు గాని అందుకు భిన్నముగా తానొక్కడు ఒక కొత్త ఉచ్చారణ కల్పించి చేయడు; గనుక కావ్య భాషమాత్రమే మనసులో పెట్టుకొని అదైనా తిన్నగా విమర్శించి చూడక సూత్రములు కల్పించిన లాక్షణికుల 'అనుశాసనం పాటించక లోక వ్యవహారమును అనుసరించి వ్రాయడమే ఉత్తమము.

మా ఊరు, ఒక ఉత్తరము, పిల్లి ఉన్నది మరి ఒక మొదలయినవి ప్రాచీనాంధ్రుల ఉచ్చారణలో మాయూరు, ఒక యుత్తరము, పిల్లియున్నది మరియొక అని ఉండినా నేటి ఉచ్చారణములో ఈ మాటలందు యశ్రుతి లేదు. ఉ ఊ ఒ ఓ లు మొదటి వర్ణములుగా ఉన్న మాటలు వకారముతో కలిపి ఉచ్చరిస్తున్నారు. అందు చేతనే ఒద్ద, ఒడ్డాది మొదలయిన మాటలు వద్ద, వడ్డాది అయి స్థిరపడినవి. గనుక మావూరు, ఒక వుత్తరము పిల్లి వున్నది, మరివక మొదలయిన వాటిలో వకారము ఆదేశముగా ఉంటుంది.

## విసంధి

విసంధి, మహావిసంధి, కుసంధి, దుస్సంధి—ఈనాలుగున్ను సంధి దోషము లన్నాడు అప్పకవి (చూ. V, 8). అందులో విసంధికి,

"తే॥ హరి మురలికిని అనుజాండు అర్జునునకుఁ
జెలి యనచు నిట్లుగుదునుపై శృంగమునయి
స్వరములకు సంధిగలుగ సాగనేని
దానిని విసంధి యండ్రు సత్కవులు కృష్ణ."

అని ఉదాహరణములు చూపించినాడు.

"వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గాదని యార్య్యులండ్రు. ౫౮.

"సత్యము సర్వశ్రేయము. అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థములు॥ ఇట్లు సంధి విరహంబు కావ్యంబులం బాదాంత మంద చూపట్టెడు॥" అని బాలవ్యాకరణములోని సూత్రమునకు వ్యాఖ్యాత్రాన్తూ కడపటి వాక్యమునకు గుప్తార్థ ప్రకాశికాకారులు "పద్యకావ్యములలోఁ బద్యములోని వాక్యాంతము లందు సంధియే యుండవలెను గాని పాదాంత మందుం బలె లేక పోఁగూడదు" అని అర్థము స్పష్టపరచినారు. అనగా వాక్యాంతమైనా చరణ మధ్యమందు సంధి తప్పకుండా ఉండవలెననిన్ని, వాక్యము అంతము కాకపోయినా చరణాంతమందు విసంధి కూడు ననిన్ని తేలినది. పాదాంత మందైనా విసంధి కూడదని కొందరు అంటున్నారు.

"పడగనున్న హనుమద్భయవిహ్వలుఁడు గాఁడు
అగదమునకు సూతుఁడచ్యుతుండు'.

అనే పద్యములో "విహ్వలుఁడు శబ్దంబు పూర్ణబిందు యుక్తముగా వచించి గణభంగంబు సవరించు కొనుచుఁ బద్యంబుల యందును సంధి నిత్యంబుగా రావలయునే కాని (భయవిహ్వలుండుగాఁ దరదమునకు) సంధి విరహంబు కూడ దని వక్కాణించెదరు. ఇట్టి చోట్లను యధేష్టసంధి నన్నయ భట్టార కాదుల మతమందు నిర్వివాదంబు గాన మతాంతరుల యభిప్రాయంబు ప్రమాదికంబని ద్వితీయోదాహరణంబుచే నైన నూహింపవలయును" అని గుప్తార్థ ప్రకాశికాకారులు వ్రాసినారు.

వీరు వ్రాసినట్లు చరణాంతమందు విసంధికి కవి ప్రయోగాలు అనేకముగా ఉన్నవి. "ఎప్పుడుగా" అని ద్రుతాంతముగా ఒకపాదము అంతమై "ఎలమి" అని దాని తర్వాతి చరణము ప్రారంభించినపుడు, 'ఎప్పుడున్నెలమి' అని ద్రుతమునకు ద్విత్వరూపమైన సంశ్లేష కలుగ వచ్చుననైనా ఒప్పుకోవలసి ఉంటుంది; లేదా, చరణాంతమందు విసంధి కావచ్చుననైనా ఒప్పుకోవలసి ఉంటుంది; రెండింటిలో ఏదీ ఒప్పుకోలేమంటే భారతము, భాగవతము, రామాయణము మొదలయిన ప్రమాణ గ్రంథములలోని ప్రయోగాలు అగ్రాహ్యములు కావలసి వస్తుంది. అందుచేత, కొందరు ఏదో ఒకటి ఒప్పుసంటున్నారు. "పాషండులు న్నెై" అని (భాగ. II, 198) చరణ మధ్యమందు కూడా ఇటువంటి రూపాలు కనబడుతూ ఉండడము చేతను, "భవునిహృల్లుండుగాఁడు । అరదమునకు" అని ఉకారాంతముగా చరణమంతమై తర్వాతి చరణము అచ్చుతో ఆరంభించిన పద్యాలు అనేకముగా కనబడుతూ ఉండడముచేతను ద్రుతమునకు ద్విత్వరూప సంశ్లేషమున్ను చరణాంతమున విసంధిన్ని ఒప్పుకోక తప్పినదికాదు.

చరణమధ్యమందు విసంధిగా ఉన్న ప్రయోగాలు తరుచుగా కనబడడములేదు గాని లేకపోలేదు.

విజయ విలాసం ( II. పు. 37) లో

"క॥ ఈకవ్వడి యతివేషము, చేకొని యున్నాఁడు; ఇదిగో..." అనిన్ని

పానందోపాఖ్యానము (పు. 43) లో "ఉ. నవ్వరు ఎవ్వరైన..." అనిన్ని ఉన్నవి.

శాసనాలలో కూడా చరణమధ్యమందు విసంధి కనబడుతున్నది:—

1. కరగిరివియదిందు గణనమైపరగఁ
గాళకునేండ్లు అక్షుత్పృతీయ్యయుమి
హిరవాసరమున...(Vol. IV. No. 731)

2. వరవీరచోడ వల్లభుండు అఖండవర్తి దీపంటు (VI, 731.)

3. భూనుతేంద్రులుం ఈ రీతి సంస్తుతింప (V, 1212)

## మహావిసంధి, దుస్సంధి

ఈ రెండున్ను విసంధి, కుసంధితో పాటు సంధిదోషములని అప్పకవి వ్రాసినాడు, (చూ. అప్ప. V, 8). మహావిసంధికి 'సురల్ యద్భుతంబు' అనే ఉదాహరణమున్ను, దుస్సంధికి 'అందున్నని' అనే ఉదాహరణమున్ను కనబరచినాడు. వీటిలో రెండవ దానిని గురించి 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము' పేరా 77-88 లలో ద్రుతమునకు అచ్చుతో సంశ్లేషము' అనే శీర్షిక క్రిందను వ్రాసినాము గనుక ఇక్కడ మరి ప్రత్యేకించి వ్రాయలేదు.

ద్రుతము లోపింపగా ద్రుతమునకు పూర్వమందున్ను, పరమందున్ను గల స్వరముల సంధి వల్ల ఏర్పడిన (చూచెన్ + అతఁడు) చూచతఁడు వంటి రూపములకు ప్రాచీనకవి ప్రయోగాలు కనబడలేదు. వేంకటనాథకవి రచించిన పంచతంత్రములో మాత్రము "ఘనతరఘూర్జరీ..." అనే పద్యములో "నగించటు గాక యుండినన్" అనే ప్రయోగమున్నది. ఇటువంటిదే బహులాశ్వచరిత్రము (పు. 76) లో "(నేను) ఇడెదన్న"

మహావిసంధి, దుస్సంధి

(ఇడెదన్ + అన్న) అనే ప్రయోగము కనబడినది.

ఈ "లుక్ సంశ్లేషానాచి" అనే ఆంధ్రశబ్ద చింతామణి సూత్రమునాధారముగా చేసుకొని (నేను) పిలిచితిన్ + అనఁగ=పిలిచితిననఁగ అని ఉండవలెను గాని 'పిలిచితనఁగ' అని ఉండరాదని కొందరు అంటున్నారు. ప్రాచీనాంధ్రములో ఇట్టిసంధి లేదనే నమ్మవచ్చును. భారతం కర్ణపర్వము (II, 329) లో ఉన్న 'ఉనిచితిపుడు', శాంతిపర్వము (I, 14) లో ఉన్న 'పల్కితిటు' సరియైన పాఠములుగా అంగీకరించలేము.

ప్రాచీనకవులు ఇట్టి సంధిచేయకపోయినా ఉత్తరాంధ్రకవులు కొందరు రచించిన గ్రంథాలలో దీనికి ప్రయోగాలు కనబడుతున్నవి. (చూ. పట్టిక.)

నేటివ్యవహారములో కొన్ని మండలములందు 'నేను చేసినాను, చేశాను' మొదలయిన రూపాలే కాని 'చేసితిని' మొదలయిన ఉత్తమపురుష క్రియారూపములు లేవు. ఉన్నచోటను 'చేసితినయ్యా, చేస్తినయ్యా' అని ద్రుతముంచి పలుకుతున్నారు. చేసితయ్యా; చేస్తయ్యా అనేవారు ఉంటే ఉండవచ్చును. '(నేను) చేసితయ్యా' వంటి సంధిచేసినవారు లోకవ్యవహారమును అనుసరించి చేసినారా? లేక గణము కుదరక ఛందస్సుకోసము చేసినారా? అని సంశయించ వలసి ఉన్నది.

'నిత్యమనుత్తమ పురుషక్రియాస్వితః' అనే ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రమునకు ఎవరికి తోచి నట్లువారు అర్థం చెప్పుతున్నారు. భూతార్థ క్రియా రూపముల తుదినున్న ఇత్వమునకు సంధి నిత్యముగా ఉండడము ఏపురుషములలోను అంటే ఉత్తమ పురుషము కాక తక్కిన ప్రథమ, మధ్యమ పురుషములందు అని కొందరంటున్నారు. అందులో అప్పకవి,

"వసుధనుత్తమ పురుషమైకవచనమున
దక్క భూతక్రియా పదాంతములఁగల్గు
నిత్తులకు మీఁద నచ్చులు హత్తునపుడు
నిత్యముగ సంధులు ఘటించు దైత్యదమన.

తే॥ పుడమి సూత్రోక్తముత్తమ పురుషమనుచుఁ
దత్పురుషమెల్లఁ గొనరాదు తద్బహూక్తి
మున్ను లిఙ్మధ్యములతోడ నెన్నుకతన
నిత్యముగఁ బ్రాణసంధి దానికి ఘటించు॥"

అని నిత్యవిధి ఉత్తమపురుష బహువచనము, ప్రథమ పురుష బహువచనము, మధ్యమ పురుష ఏకవచనము, బహువచనములకు చెప్పి 'వింటిమివార్త, మునీశ్వరులు దీవించిరట, నీవు నేలితివట, మీరు గట్టితిరట' అని

ఉదాహరణములు చూపించినాడు; అంతేకాక, 'కూర్చుండిరి యొండొరుం గదిసి' అని శ్రీనాథుని నైషధము (V, 66) లోని ప్రయోగము సాక్షేపించి నాడు. అయితే అడిదమునూరకవి ప్రథమ పురుషబహువచన క్రియారూప ములందు సంధినిత్యము కాదని లక్షణముచెప్పి (చూ. 14 లక్షణము) ఆదిపర్వము (VII, 132), ఉద్యోగపర్వము (III,36), నైషధము(V, 66 లోని పద్యాలు దాహరించినాడు. ఇందులో మొదటి పద్యము ఎత్తుగీతి రెండవ చరణములో "ఇచ్చిరి యందు కొందఱు" అని ఉంటే, భారతము అచ్చు ప్రతులలో "(సురవంశ్యులకు) నిచ్చి రందు కొందఱు" అని దిద్ది సవరించిన పాఠము కనబడుతున్నది.

## మువర్ణలోపము

"మధ్యమ పురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగు నపుడు లోపము విభాషనగు... చూడుము + నన్ను—చూడునన్ను, చూడుము నన్ను ... చూడుమనిరెు — వినుమనిరెు — ఇచ్చట, నచ్చు పరంబయినది కాఁబట్టి లోపములేదు" బాల. సంధి. ౪౬ "వ్యతిరేక మధ్యమ మువర్ణకం బున కెల్లయెడల లోపంబు విభాషనగు. నమ్మకుము + ఇట = నమ్మకిట, నమ్మకుమిట" బాల. సంధి. ౪౭.

ప్రాచీనాంధ్రములోని ప్రయోగాలు ఈ సూత్రములలో చెప్పినట్లే ఉన్నవి. గాని ఉత్తరాంధ్రగ్రంథములలో మువర్ణము లోపించి దానికి పూర్వమందున్ను పరమందున్నుగల అచ్చులకు సంధిచేసిన ప్రయోగాలు అనే కముగా కనబడుతున్నవి (చూ. పట్టిక).

యకారాంత క్రియల ప్రార్థనార్థక రూపాలు నేటివాడుకలో చెయ్యి, చెయ్యండి; పొయ్యి, పొయ్యండి; తియ్యి, తియ్యండి; అయినవి. వీటికి 'అని' చేర్చితే చెయ్యమని, చేయమని; చెయ్యండని, చేయండని, పొయ్యమని, పోయమని, పొయ్యండని, తియ్యమని, తీయమని, తియ్యం డని అవుతున్నవి. రఘునాథ మహీపాలుని పార్వతీపరిణయము (పు. 56)లో 'చేయుమని' అనే ప్రయోగము, 'య' కారము యతిస్థలమందు నిలిచియున్నది.

## అకారసంధి

### i తత్సమ శబ్దములందు

అము. గంగను (II, 9)
చేష్టుడిగా, భర్తంచు (VI,108)
కవిక. దూతని (II, 128)
చం.వి. మారయో (III,17)
రామా. మాయను
(మాయ + అను) (V, 225)
రామస్త. చరితా (64)
సుతా (314)
వార్తతనికి (419)
పద్మ. ప్రేతయి (IV,80)

ప్రబం. పరిథునవార్థి (ప్ర. 18)
ప్రబో. వల్లభనుచు (II, 19)
రామ. మిథ్యని (ప్ర. 8)
వరా. పరమాత్మందురు
వెం. చ. కరుణే (ప్ర. 195)
శశి. వేశటువంటిదా (ప్ర. 40)
మర్యాదగునే (28)
శుక. నిందవు (ప్ర. 55)
హంస. మహిమెట్టిదా
చండశర్మను

### ii. స్త్రీ వాచకములందు

శుచే. బేలుండు
పాంచా. దారయో
బోరయో

వసు. అమ్మని (VI,80)
స.కృ. ఎవ్వతో (ప్ర. 20)

### iii. షష్ఠీరూపములందు

ప్రభు. కన్నులాన
ప్రభో. తనందు (V, 42)
భాగ. ఆర్యులొద్ద (VII,)
భార. రాజులొద్ద (ఆది VI, 11
VI,120 VIII, 66)
తల్లిదండ్రులొద్ద (అర. II, 132)
అసాధులట్ల (అర. III, 165)
కిరియతందు (అర. III, 166)
కన్యలట్టి (అర. I,8)

మను. నోచినమ్మలు (III, 29)
నేత్రలింద్ల (II, 73)
ముల్ల. రా. మనందటి (యు. 8)
రామస్త. మామన్నకొడుకు (360)
రుక్మా. పద్మములొద్ద, ద్రుమములొద్ద
వై. వి. మనందు (III, 90)
సానం. మానవులాపద (19)
సారం. చందమామల్లుండు (ప్ర.5,55)
హంస. తనింట

## క్త్వార్థక 'ఇ' కారసంధి

అప్ప. గుత్తతేఁగిప్పంబుగ (IV,320)
ఆము. అందిచ్చు (II, 22;VI,85)
అందీఁగ (VI,25)
చించిచ్చు (VI,85)
ఒదిగుండు (IV,217)
ఇందు. ఏరొయెడవుండిటకు (II, 124)
ఉ. హై. (వ్రాత) కదిసినపుడు (19b)
పెనగాడి (8,a)
ఉ. రా. తేలాడు (1పు.10)
ఉ. హరి. అందిచ్చె (I,143)
కవిజనచ. మండాడు (III,86)
కవిరా. పొంచుండె (పు. 39)
కవిసం. (కవులప)-
ఎక్కుడ నుండిట (పు. 7)
కాశి. అందీక (V, పు. 122)
కాళ. ఈఁడీది
అందిచ్చు (III,105)
కుచే. పట్టీచ్చు (I,39)
కువ. అందిచ్చు (IV,81)
పట్టీచ్చు (I,39)
కృష్ణ. రంజిల్లదిగో (III,17)
అందిచ్చు* (III, 64)

కృష్ణ. వి. అందిచ్చి (II, 29)
గౌరీ. ఇమిడున్న (శృ. 29)
చను. చూచిడె (I,81)
గ్రుచ్చెత్తె (I,88)
చం. వి. చెప్పిదుము (పు. 21)
చిత్ర. భా. వీక్షించర్జునుండు (III,24)
చెన్నబ. కోరిటు (37)
ఉండిట (737,156)
రప్పించిటు (150)
చెన్నమ. అంటాడు (25)
జైమి. ఒనరించెదు రేగు
చూచనల
ఎదిరించాకర్ణ (V,180)
తొడిగెని
పెట్టిది (1,20)
ఎతేఁగిట్లు (VI1,56)
కోసిమ్మని (VII,215)
ప్రోయించరి (VII,162)
తొండ. పాటాడంగ (312)
నిలుచున్న (312)
పట్టీచ్చు (315)
ధను. ఉంచే (153)

| | | | |
|---|---|---|---|
| కొట్టేసి | (153) | ప్రభు. ఉలికలికి | (పు.12) |
| విరా. తొలంకాడి | (VII,132) | తగిలున్న | (పు.20) |
| వెలిబిట్లు | (V) | చూచెయుంగుదును | (పు.5) |
| నిర్వ. వి. రా. తేలాడి | (89) | | |
| ఏమనందు | (162) | పరి. ద్వి. నిలిచుండు | (6b) |
| ఎతీంగిటు | (164) | ఉలికుల్కి | (11) |
| పాలించాతని | (174) | కదలిపో యాతని | (14) |
| నీలా. పొంచుండి | (I,4[illegible]) | నమ్మంటి | (25) |
| పంచ. నగేడ్పించుక | | బస. నిలచాడెదు | (పు. 47) |
| కూడాది | (226) | ఎతిగుండరు | (పు.101) |
| పట్టా. వధించేని | (75) | అందిచ్చు | (పు.138) |
| పద్మ. అందిన్* | (II,19) | పిలికిచ్చి | (పు.231) |
| ఎక్కడినుండిటు | (II,192) | పొడిచెత్తి | (పు.275) |
| పాండు. కూడాడు | (II,95) | బహు. మట్లాడు | (పు.41) |
| ఉండుండి | (IV,300) | అందీడు | (పు.83) |
| ఉండే తెంచెఙ | (IV,252) | కదిసిట్లని | (III,645) |
| పారి. అందిచ్చు | (II,12) | తలంచిటు | (III,646) |
| పార్వ. త్రోసియ్యదే | (59) | భాగ. మట్లాడు | (III,72) |
| చిందితాపంబు | (80) | అందిచ్చు | (VII, VIII,46) |
| ప్రబో. అణగుండె | (I,4b) | కొనిచ్చెం | (ఉత్తర X,723) |
| సంతసిల్ల హంకారుడు | (II,13b) | ఎతింగెతింగి | (IX,515) |
| ఎదిరదిరి | (V,41) | ,, | X,11.930 |
| ఎటింగెటింగి | (IV,33b) | ఒదిగుండి | (X,II, 1237) |
| ప్రభా. చెప్పంపడే | (IV) | భార. ఎతింగించిపుడే | (ఉ.1,38) |

భార. అందిమ్మ (వి.IV,112)
భీమ. తేలాడు (III)
భోజ. అందిచ్చు (II,107)
చొచ్చుడవి(వ్రాతప్రతి VI,236)
మార్క. పట్టీడ్చు (357,358)
మొరా. అందీయ (యు. 36)
రాధా. పండుంటి (II, )
రాధి. పట్టీడ్వకు (పు.35.ప.114)
ఉడిగుంట
చేసలరు
చెప్పీడు
రాజశే. గ్రహించిపుడు (IV,129)
రామా. చేసిటు (II, 88)
ఉండిటు (VII,47)
రా. అందిచ్చు (యు. 2212)
రామరాజీ. దయమాలటు (209)
వచ్చుటు (333)
ఉండే (341,343)
రాఘ. చూపినకులుఁ
రుక్మా. గుడినుండే (పు.73)
చేసెంత (పు.11)
రుక్మి. పొంచుండి (1,43)
వరా. దాఁగుండు (122b)

చేరిచ్చులుకా (186b)
విక్ర. సేవించిలక (1,35)
పొలసాడు (1,95
విజ. అనవలసంటి (1,161)
అడిగిచ్చునో (1,59)
వి.పు. నుండేతెంచు (II, 323)
కొండత్రవ్వేలుక (VI,110)
వేం.చ. ఎర్గెత్తెంతో (పు.151)
చేసిటు (పు.181)
తెచ్చిత్తురే (పు.188)
వై. వి. పలుచెందతి (II,100)
ఉండిట (III,55)
శ. ఎటుబోమొటులానో (II, 108)
అందియ్యవే (IV,84)
శశి. పట్టీడ్చి (పు. 70)
ఎల్లుండమారికి (పు.52)
శు. చూచిరువార (పు.147)
శృం.శా. తోలాడు (23)
తూలాడు (25)
శకుం. కదిసెన్నదు (పు.54)
ఎతిఁగుండి (పు 54)
వెక్కివెక్కిడ్చిన (పు. 55)

| | | | |
|---|---|---|---|
| వీడుంగునా క్కేల | (పు.80) | దీవించతన | (I,48) |
| నడిచాడనేర్చి | (పు.89) | హంస. పదున్న | (II, 148) |
| శైవ. మరచుంటివి | (11b) | చూచిది | (III, 43) |
| సమీ. ఉండెటు | (I,156) | చూచదయత | (IV,30) |
| పండుండ | (II,141) | చూచదియును | (IV,30), |
| సానం. కాంచితనికి | (పు.30) | దాగుండు | (IV,59) |
| తెచ్చిచ్చి | (పు. 32) | అర్చిపతొమ్మ | (IV,86) |
| సారం. ఎటుబోరుటు | (పు.16) | వచ్చిట | (V, 171) |
| పూనిటు | (పు.30) | తలచట | (V,195) |
| పట్టిటు | (పు.40) | పట్టిచ్చు | (V,245) |
| వంచాడించక | (పు.57) | పట్టిమేడకు | (V,244) |
| అప్పలెత్తిటు | (II, 224) | | |

## ఇత్వసంధి

| | | | |
|---|---|---|---|
| అప్ప. ఆవడే | (IV,238) | కవిజ. వేలందని | (I,73) |
| వెనుకటట్టులు | (II, 302) | కవిమ. ఇట్టుందురు | (పు. 57) |
| ఆము. అతనింట | (I,83) | మట్టుందురు | (పు. 57) |
| పుట్టింట | (VI,71) | కాశీ. తిత్తొల్చి | (పు.171) |
| ఒంటొల్లె | (II,52), | కుచే. మాచేయాడుక | |
| వంటితివ | (V, 53) | | |
| ఆంధ్ర. పాలకదలల్లుండు | (దేవవర్గ7) | కువ. పెదవెత్త | |
| ఇందు. నామలీకలు | (II, 46) | కృష్ణ.వి. పొక్కిలందము | |
| ఉ. రా. చెక్కిలేమి | (పు.21) | కేయూ. బ్రాతే | (12-5) |
| ఎప్పటెలుంగు | (పు.313) | చం. వి. పనిండంది | |
| కవిక. కాకేమి | (I,8) | మనవాలకించి | |

జైమి. వానరదము (VII,19)
ఆహుంతనుచు (VIII,114)
తొండ. దంతో (305)
బంతో (305)
కొలికో (305),
వెండదండలంబు (306)
పదైదయి (313)
కటారేది (315)
బుద్ధోకింత (315)
నరస. వానన్న (IV,68)
నిర్వ.వి.రా. మంచిదటంచు (121)
నిరం. అందతేంద్లకు (II, 128)
నైష. దీనంగ్రముఖులు (III, 202)
పంచ. ఇటతాతని (I,449)
పట్టా. సమ్మతే (54)
గతేమి (54)
మేటగు (73)
భూమెల్ల (149)
లేనపవాదము (154)
పద్మ. ఎవ్వనింట (II, 94;II, 151)
పాండు. అనతిచ్చు (III,45)
కంచంత (III,81)
వత్తిడి (III,56)
పార్వ. తడార్చవే (31)
ప్రభు. పడతిటుచూడు (6)
సాకగు (11)
బస. (పా) కంచేదువాడల (95)
బస. (సిం) కా కరుపులు (139)

భాగ. ఈశ్వరైన X, ఉ. 1016.
భార. రాతికల్ల (ఆది.VI,160)
భీమ. ఏకాజ్ఞ (IV,83)
భోజ. చెఱోక (V,77)
మిత్ర. అరటాకు (25)
మొ. రా. పనర్యో నేని (అర.35)
య. అరటాకు (16)
వెలితేమియు (78)
రాధా. పనేమి, పదార్వేల, (III,50)
పరా (III, 14)
రామ.వి.కాళిం దైన (64)
సాటగు (196)
రామస్త. బూచని (25)
వా రాదుబిడ్డ (2)
తెలివంది (32)
తెలివెల్ల (39)
రుక్మాం. తొల్లిటట్ల (65)
లం. పెండ్లాండి (I,32)
వా.రా. వానిల్లు (428,54)
వి.పు. వెట్టాటలక (III,275),
కావలించి (VIII ,168)
ఎల్లుండి (VIII, 199)
వెలతైన (VIII,317)
వెం. చ. రీతెట్టుల (పు.61)
గొడ్డతేత్తి (105)
వడ్డియ్యా (147)
వైజ. బ్రహ్మచారిట్లు (IV,11)
శశి. ఎల్లుండి (పు. 52)

శుక. అనతిచ్చు (పు. 106) తల్లింటికి (55)
సానం. కొండబోడలు (158) హంస. అతనాలు
సారం. ఏటావల (పు. 28)

## మహావిసంధి, దుస్సంధి

ఉ. నై. పిలుచున్నిక (పు.25) యోజనము న్నరమేర (X,i,229)
ఉ. హ. సర్వాంగుని న్ననుభూతా (VI,326) విద్వాంసులు న్నెఱుంగలేరు (XI, )
ధారుణికి న్నేఁగి (XII)
కళా. బలెన్నరుశోభా (VII) భార. ఎన్నడున్నేని (ఆది. VII,141)
కుచే. అన్యులకున్నెయెడ (III, 85) ధైర్యవృత్తికిన్నరుఁడుగ (అర. 1,321)
నృసింహపు. ఎప్పుడున్నలమి (1,75) భీమ. ఎడమన్న గ్గాంగలక్ష్మి (V,130)
పట్టా. మునికిన్నభిషేకము (29) మను. పయోదకున్ననువైన (III,48)
ఊచున్నొక (43) రాజశే. ఈపురిన్నెచట (III, 109)
ఎప్పుడున్నిక (49) రామ. వి. సంహారులున్నైన
అగుచున్నాయాసము (55) రామస్త. నిరసించిన్నివి నీకు (20),
కోటలున్నచ్చటి (73) పరదేశిన్నేని (21) అనుచు
తల్లికిన్నధిక (182) న్నొందల (27)
పాంచా. తగన్నెగఁజిమ్మ (5) లం. వాచస్పతిన్నార్యునిఁ (1,12)
పారి. తానున్నొంచెంబు (చూ. రంగ వి. పు. రాట్ 11,436) మూడున్నర (III,172)
శుక. తినియెన్నిమాటు (పు.131)
భాగ. వెసన్నార్తును (II, ) ఎడన్నొకచో (పు. 156)
పావండులు న్నైన (II,ii,198) సానం. సదనంబునన్నవని (45)
సర్వమున్నతని (VII,) పొందితిన్నేమిగావలె (94)
కదియన్నోహో (X,ii, 1247) హరి. క్షోభమునొందన్నివిధమున
సంసర్గుఁ। ఆరాధిత (X,1,282) (VI,159)

## ఉత్తమపురుష క్రియాంతమందలి ఇత్వసంధి

| | | | |
|---|---|---|---|
| అప్ప. నేఁబిలిచితనఁగ | (V,135) | శుక. వచ్చితవనిసాధ | (పు.34) |
| ఉ.నై. పట్టువడితింక | (43b) | సమీ. వచ్చితసురేంద్ర | (1,158) |
| కుచే. పొందితనేక | (1,70) | సాన. చెరచితింతె | (పు.56) |
| జైమి. దక్కితని | (VIII, 131) | ఏనితంతె | (పు. 94) |
| భార. ఉనిచితిపుడు | (కర్ణ II, 329) | హంస. తెచ్చితింటికి | (V,191) |
| పల్కితిట | (శాంతి. 1,14) | హరి. నేను దొడరితిపుడు | (ఉ.VIII. పు. 211) |
| కేం. చ. ఇచ్చితిక | (పు.41) | | |

## మువర్ణలోపము

| | | | |
|---|---|---|---|
| పట్టా. తెల్పన్న | (పు. 51) | హంస. వాకిలిదీయని | (II, 55) |
| మార్క. చెప్పనినఁ | | రామ. ఇందయనుచు | (చూ. శ. ర. గెలుచు) |
| విజ. కూర్చుండని | (III,187) | | |

## 'పాతవడ్డ మాటలు'

పలుకుల పొందులేక రసభంగము సేయుచుఁ బ్రాతవడ్డ మా
టలఁ దమనేర్పు నూపి యొకటన్ హృదయం బలరింపలేక యే
పొలమునఁగాని యట్టిక్రమముం దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁ బొరయం జరించు కుకవుల్ ధర దుర్విటులట్లు చూడఁగన్.

అని తిక్కన వ్యవహార భ్రష్టమయిన శబ్దాలు కావ్యములలో వాడగూడదని నిషేధించినాడు. సరసకవులందరూ అలాగుననే అన్నారు! మల్లెమొగ్గలు వికసించగానే గుప్పున వాసనవేసినట్లు, పద్యము చదవగానే వినేవారు చట్టున భావము తెలుసుకొని సంతోషించేటట్లుగా కవిత రచించగలవాడే 'కవి' అనిపించుకొంటాడు.

"తేనెసోకనోరు తియ్యవయగు రీతిఁ
దోడనర్థమెల్ల దోపకున్న
గూఢశబ్ద వితతిఁ గొట్లాడు వనిథెల్ల
మూఁగ చెవిటివాని ముచ్చటరయ" అన్నారట మరి ఒకరు. వాడుకలో లేని పాతమాటలు అరిగిపోయిన నాణెములవంటివి; చెల్లవు.

'సంస్కృతము' లౌకిక భాషగా వ్యవహారమందుండినప్పుడు, వేదములలోని శబ్దములు కొన్ని పాతవడినవి. భాషాను శాసనము చేసిన పాణిన్యాదులు అట్టి వైదిక శబ్దములు విడదీసి వైదికీప్రక్రియగా అనుశాసించినారు; అవి లౌకిక శబ్దములవలె లౌకిక వ్యవహారమందు వాడగూడదని నిషేధించినారు.

అట్లే ఇంగ్లీషు భాషలో నేడు గ్రంథములు రచిస్తూ ఉన్నవారు నేడు లోకవ్యవహారమందు శిష్టులందరూ వాడుతూ ఉన్న శబ్దములే కాని, షేక్స్పియరు మొదలయిన పూర్వకవుల గ్రంథములలోవి, బైబిలులోనివి, పాతవడ్డ మాటలు వాడరు; వాడగూడదని నిషేధమున్నది. షేక్స్పియరు కాలమందు దగ్గర కవిఅయిన స్పెన్సరు పాతవడ్డ మాటలతో 'బడాయి' కవిత రచించినప్పుడు, బెన్ జాన్సన్ అనే కవి ఆక్షేపించినాడు; స్పెన్సరు భాష పూర్వపుదీ కాదు, నేటిదీ కాదు; అది ఏ భాషా కాదు' అని; అన్ని దేశముల లోనూ ఇదే కవుల సంప్రదాయము. ప్రజలు అందరూ పాతభాషలు నేర్చుకొన్నవారు కాకపోవుటచేత, అబాలగోపాలం అందరికీ సుబోధముగా ఉండేటట్లు భాషారచన ఉండడమే గొప్పగా ఎన్నిక పొందినది. డ్రైడన్, వర్డ్స్‌వర్త్ మొదలయిన ఇంగ్లీషు కవులు వాడుక మాటలతోనే మనోహరముగా కవిత కూర్పవచ్చునని చెప్పి, అలాగున చక్కని కావ్యాలు రచించి కవులకు మార్గదర్శులయినారు. అప్పటినుండి ఇంగ్లీషు కవిత విజృంభించినది. అనేక నాటకాలూ, కథలూ రచించి ప్రఖ్యాతి పొందిన మహాకవి గాల్స్‌వర్దీ అన్నాడు:—

To tell an interesting or amusing story through the medium of dialogues which appear to be natural conversation of human beings — That is literature. 'లోకములో మనుష్యులు మాట్లాడుకొంటూ ఉన్నట్టు తోచే సంభాషణలు కల్పించి వినేవారికి ఉల్లాసకరముగాను, మనోహరము గాను రచించిన కథ సారస్వతము, అని; "షేక్స్పియర్ రచించినట్టు రచించవలెనంటే, షేక్స్పియర్ నాటకాలలోని మాటలు మనము వాడడము అందుకు అనుకూలపడదు; షేక్స్పియర్ తన కాలములో అందరూ వాడుకొనే మాటలు ఏలాగున ప్రయోగించినాడో అలాగున మనకాలమందు వాడుకలో ఉన్న మాటలు ప్రయోగించవలెను" అని షెల్లీకవిత తన అభిప్రాయము చెప్పినాడు.

బంగాలీభాష 150 ఏండ్లక్రిందట కావ్యరచనకు ఉపయోగించలేదు; పండితులు సంస్కృతములోనే గ్రంథాలు రచించేవారు; కొంచెము మందికే సారస్వతమువల్ల మేలు కలిగేది. ఒకటి రెండు తరములలో బంగాలీభాష హిందూదేశములోని భాషలన్నిటిలోను గొప్పదయినది. శిష్టవ్యవహారమందున్న "చలిత్" భాషలోనే నానావిధమయిన గ్రంథములున్ను బంగాలీవారు రచిస్తున్నారు. మహాకవి అని పేరు పొందిన రవీంద్రనాథ ఠాకుర్ గారు రచించిన కావ్యములు ఇంగ్లీషు మొదలయిన యూరోపియన్ భాషలలోనికి 'తర్జుమా' అయినవి. 'పాతవడ్డ' మాటలు ఆయన వాడరట.

పాతవడ్డ మాటలు అపరిచితము లవుటచేత, ప్రజలు అట్టి కావ్యములు చదవరు; చదివేవారికైనా ఇంపుగా ఉండవు అట్టివి రచించడము వ్యర్థ ప్రయాసము. శబ్దముల రూపములే కాదు అర్థములుకూడా మారిపోతవి. అర్థము మారిపోయిన శబ్దాలు ప్రయోగించే కవులు భ్రమ ప్రమాదములకు లోనుగాక తప్పదు. ఈ నూరేండ్లయి తెలుగుదేశమందు పుట్టిన "గ్రాంథి

కాంధ్ర సారస్వతము”లో అపశబ్దములు మెండుగా ఉన్నవి. నూరుగురిలో ఎనమండుగురైనా ఓనమాలు నేర్చుకొన్నవారు తెనుగు దేశములో లేనప్పుడు, గ్రాంథికాంధ్రము తెలుసుకోగలవా రెందరుంటారు? అట్టి భాషలో రచించిన కావ్యాలలో తప్పొప్పులు కనుక్కోగలవారు అరుదు. అందువల్ల అపశబ్దాలు ప్రయోగించి ‘బడాయి’ కవిత రచించేవారికి తగినశాస్తి కావడములేదు. ఇంగ్లాండు మొదలయిన దేశములలో “బడాయి” బట్టబయలు అయినప్పటినుండిన్ని కవులు వివేకముతో మెలగుతున్నారు. ‘బడాయి’ తెలుగు కవిత ఏలాంటిదో చూపించవలెనంటే పెద్దగ్రంథము రచించవలెను. ఇప్పుడు ఇక్కడ ఆవిషయము విస్తరించి విశదపర్చడమునకు వల్లపడదు. మచ్చు చూపించుటకు, పెద్దపేరుగల ఒక కవి రచించిన పద్యములు రెండు మాత్ర ముదాహరిస్తాను. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు, “వాల్మీకి సంగ్రహ రామాయణ”మనే గ్రంథమందు అయోధ్యాకాండలో, దశరథుడు చనిపోయిననాడు అయోధ్యాపట్టణము ఎట్లుండెనో వర్ణించిన పట్టున, ఈ పద్యములున్నవి:—

గీ॥ పార్థివేశ్వరుఁ డటులందఁ బరమపదము
 భార్య లతనిచుట్టును జేరి ధైర్యమెడలి
 కరములను మోదుకొంచు వక్షస్థలములు
 దిగులుగొని విలపించిరి దిక్కుమాలి (154)

గీ॥ తలిరుఁబోండ్ల యాక్రందనధ్వనులతోడ
 బౌరజనులు విడుచు బాష్పములతోడ
 శోకదేవత వసియించు చోటువోలె
 నలరె నారేయి నా యయోధ్యాపురంబు (155)

రెండో పద్యములో నాలుగోచరణమందున్న మొదటి మాటకు ప్రాచీనాంధ్ర భాషలో ఏ అర్థమున్నదో తెలియక, అసంగతముగా అది

ప్రయోగించినందున రసభంగమైనది. ఆ మాటకు అర్థము తెలిసినవారు నోతపడి, ధూత్కారము చేయకమానరు. 'అలరు' అంటే, 'ప్రకాశించు', 'సంతోషించు', 'ఒప్పు' అని అర్థము.

పాతపడ్డ మాటలు వాడితే, ఈవిధముగా రసభంగము అవుతుందనే తిక్కన వాటిని విడిచిపెట్టవలసినదని ఉపదేశించినాడు.

## అన్యదేశ్యములు

ప్రపంచములో ఉన్న దేశములతో, ఇంచుమించుగా అన్నిటితోనూ, ఇంగ్లీషువారికి సంబంధమున్నందున ఆ దేశభాషలలోని శబ్దాలు కొన్ని ఇంగ్లీషు భాషలో చేరినవి. ఇంగ్లీషు నిఘంటువులోని కెక్కినవి; వ్రానే విషయమునుపట్టి అన్యదేశ్యములు గ్రంథరచనలో ఇంగ్లీషువారు వాడుతున్నారు; కవులుకూడా కావ్యములలో ప్రయోగిస్తున్నారు. తక్కిన దేశములలోకూడా ఇట్టి ఆచారమున్నది. మూడువేల సంవత్సరముల క్రిందట ద్రావిడ భాషలోని 'తోకై' (=నెమలిపిట్ట), కఱుప్పు, కాఱ్ పు (=దాల్చిని), అరిసి (బియ్యము) మొదలయినవి కొన్ని శబ్దములు ఆ పేరుగల వస్తువులలోకూడా యూదుల దేశమునందు సుపరిచితమైనవి గనుక హీబ్రూభాషలో చేరినవి; అరిసి శబ్దమే గ్రీకు భాషలో 'ఒరుజా' అయి ఇంగ్లీషులో చేరేసరికి 'రైస్'గా మారినది. 'ఆజానేయము,' 'కత్తులాని' మొ॥ శబ్దాలు అన్యదేశ్యములు; సంస్కృత భాషాపండితులు వాటికి సంస్కృతమే మూలముగా వ్యుత్పత్తి కల్పించినారు. ఈ విషయము సాకల్యముగా విమర్శించి కీ. శే. వేదం వెంకటాచలశాస్త్రిగారు కొన్ని వ్యాసములు రచించి భారతిలో ప్రకటించినారు. యవనుల జ్యోతిఃశాస్త్రము మన దేశమువారు నేర్చుకొన్నందున సంస్కృత గ్రంథములలో 'హోర', 'కేంద్ర' వంటి వేకాక, రాశిచక్రములోని మేషాది శబ్దములకు పర్యాయ పదాలుగా యవన శబ్ద

ఘుల్లుక్కూడా వాఙ్మయకల్లోకి వచ్చినవి. * యవనులు మహర్షులవలె పూజ్యులు అని వృద్ధగార్గుడు ప్రశంసించినాడు.

మన తెలుగుభాషలో అన్యదేశ్యములు అనేకమున్నవి; కవులుకూడా వాడుతున్నారు. అట్టి శబ్దములు ఏ యే భాషలనుండి ఎప్పు డెప్పుడు వచ్చి తెలుగులో చేరినవో, ఏలాగున మారినవో మన తెలుగు పండితులు విచారించలేదు; శ్రీ వావిలికొలను సుబ్బారావు పంతులుగారు, తమ సులభ వ్యాకరణములో, 'గోజు, ఖర్చు, జమ, జాబు' మొదలయిన తురక మాటలు, ప్రయోగార్హములు కావని నిషేధించినారుగాని, ఆయన రచించిన సుభద్రావిజయము (పు. 54) లో "కంతుతేజ్" అని ప్రయోగించినారు. 'తేజ్' అనే శబ్దము సంస్కృత శబ్దమే అనుకొన్నారో, ద్రావిడ శబ్దమే అనుకొన్నారో అచ్చ తెలుగే అనుకొన్నారో! శ్రీనాథుడు మొదలుగా గొప్ప కవులు అందరూ ఇట్టి అన్యదేశ్యములు యథేష్టముగా వాడుతూనే ఉన్నారు. మన దేశము ముసల్మాన్ ప్రభువులు చాలా కాలము పరిపాలించి యుండినందునను, ఆ మతమువారు, తురుష్కులు, పఠానులు, అరబ్బులు మొ॥వారు కోటానకోట్లుగా అన్ని మండలములలోను, స్థిరనివాసము ఏర్పరుచుకొని మనకు తోడి కాపులయి ఉన్నందునాను, వారి భాషలో చేరిన అరబ్బీ, పారసీ, తుర్కీ మాటలున్ను హిందీమాటలున్ను ఒక్క మన తెలుగులోనే కాదు, అన్ని భాషలలోనూ చేరినవి. ఈ "తురక మాటలు" అపరిహార్యములు; సరసకవితకు ఆలంబనములు. శ్రీనాథుడు అక్కడక్కడ ఒకొక్కమాట, "ఖునిమీదన్" (హర. పీఠి. 22) అని ప్రయోగించినాడు; గాని ఆంధ్రకవితా పితామహుడు ప్రచురముగా ఇట్టి శబ్దములు తెలుగులో పొదిగినాడు. (మా. మను. 11 8. 29.); ఆ పిమ్మట

---

* క్రియతాబురితుమ శరీరలేయపాథేయయాః కార్నాఖ్యాః
లైక్షిః అకోకరో హృద్రోగశ్చాంత్యర్థం చేత్తమ్" శబ్దకల్పద్రుమము

ఇట్టి రచన పరిపాటిగా కనబడుతున్నది. (చూ. అనిరుద్ధ. 18-19, హంస 350-356 శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు రచించిన ఉత్పలమాలలు.) నార్మను రాజులు ఇంగ్లండు జయించి పాలించిన కాలమందు నార్మన్ ఫ్రెంచి శబ్దములు ఇంగ్లీషులో కలిసినట్లే, మన తెలుగులో ఉర్దూ మాటలు చేరి, భాషాభివృద్ధికి కారణములయినవి. సాలాఖరువలెనే నెలాఖరు, మాసవారీ, బేమర్యాద, పెత్తనదారుడు, కలక్టరీ, నిజాయితీ, గుమస్తాగిరి, బంట్రోతుగిరి మొదలయిన శబ్దములు ఎంత పొందికగలిగియున్నవో చూడండి. హిందూస్తానీలో 'కుడౌల్' అంటారు. వేలకొలదిగా ఉన్నవి హిందూస్తానీమాటలు నిత్యవ్యవహారములో ఆంధ్రభారతిశరీరములోని అంగములయినవి; ఛేదిస్తే గాయములై పడకతప్పదు. ఆంధ్రనామ సంగ్రహము మొ|| నిఘంటువులలో ఉర్దూ మాటలు తెలుగులకు పర్యాయ పదాలుగా పూర్వులే చేర్చినారు; "ఎకిమీఁడు పాదుసా యేలిక మన్నీఁడు సాహేబు రాయఁడు ......" (సాంబ. మాన.) బ్రౌణ్యనిఘంటువులో ఇవి అనుబంధముగా ఉన్నవి. శబ్దరత్నాకరమందు 'హిం' అనే గుర్తు గలిగి కొన్ని, మరికొన్ని అన్యదేశ్యములయినా 'దేశ్యములు'గాను చాలాశబ్దము లున్నవి.

ఇన్నూరేండ్లయి ఇంగ్లీషువారితో మనకు సంబంధమేర్పడ్డది. నూరేండ్లయి వారి భాష తెలుగువారు నేర్చుకొంటున్నారు. వ్యవహారమందు అనేకమయిన ఇంగ్లీషు మాటలు పామరులుకూడా వాడుతున్నారు; వాటికి మారుగా తెలుగు మాటలు వాడితే సుబోధము కావు. పాశ్చాత్యుల జ్ఞానవిజ్ఞానములు ఇప్పుడు ఇంగ్లీషు భాషద్వారా మనవారు కొందరు సంపాదిస్తున్నారు. అవి దేశములో వ్యాపించేటట్టు చేయడమునకు దేశభాషలో ఇంగ్లీషు మాటలు చేర్చవలెను. ఇంగ్లీషు మాటలు, సంస్కృత శబ్దములు ఉర్దూపదములు, మన భాషలో కలిసిపోయినవన్నీ మన మాటలే; అవి విడిచితే వ్యవహారహాని. బడ్జెట్ వంటి విషయములు చ్చరించేటప్పుడు ఆంధ్ర

పత్రికా సంపాదకులు ఒక్క వ్యాసములో నూరు ఇంగ్లీషు మాటలు ప్రయోగిస్తారు. బాలకవులు కావ్యాలలో ఔచిత్యమునుబట్టి అవి ప్రయోగించవచ్చును. మతుకుమల్లి నృసింహ కవిగారు (1862 లో) రచించిన చెన్నపురీ విలాసమందు ఇంగ్లీషు మాటలు ఇంపుగా కూర్చినారు— "ముదమంద మదరాసు గార్నరుల్ చెలిమి వాటిల్లఁగానే సెలవుసేయ, బందరుపురములోపలఁ గలెక్టరు-జడ్జి కర్నలు మొదలుగాఁగలుగు దొరలు......"(పు. 3)

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు 'గ్రామోఫోను', 'మోటార్ కార్', 'ప్లీడర్లు' 'జప్తు బంట్రోతు' వర్ణించినప్పుడు వాడిన ఇంగ్లీషు మాటలు అందరికీ శ్రావ్యముగా ఉండలేదా? ఒప్పులకుప్ప అనదగిన ఖండకావ్యము, 'పండుగ కట్నము'లో బాలకవి శ్రీభోగరాజు నారాయణమూర్తి పంతులుగారు ప్రయోగించిన ఇంగ్లీషు మాటలు ఎంత అందముగా తెలుగుమాటలతో పొత్తుగూడి ఉన్నవో చూడండి.

"శా. పోస్టాఫీసున పోస్టుసేయుఁడొక జాబుః రేపు; నామాటలః
టెస్టుంజేయఁగవచ్చు; "స్టారిమిడియేట్లీ"యంచు వైరిచ్చుటే
బెస్టన్నింటను; వైరుచూచుకొనుచుః వేవేగ మేల్ ట్రైనుతో
నేస్టార్టౌనతఁ; డారణాలెకద మీకేమైన పేస్టైచరో."

ఎల్ యట్ అనే ఇంగ్లీషు కవి ఒక ఇంగ్లీషు కావ్యములో ఇటాలియన్ స్త్రీంచివాక్యములే కాక సంస్కృత శబ్దాలుకూడా ప్రయోగించినాడు, కడపటి పద్యములోని కడపటి పాదాలు "దత్తదయధ్వమ్ దమ్యత శాంతిః శాంతిః శాంతిః (త్రివేణి V, 2). 'లాలారూక్' 'లైట్ అఫ్ ఏష్యా' వంటి ఇంగ్లీషు కావ్యములలో హిందూదేశ భాషలలోని శబ్దములు ప్రయుక్తమైనవి.

అన్యదేశ్యములు మొట్టమొదట ప్రయోగించేవారు యథాశ్రుతముగానే ఉచ్చరిస్తారు; అలాగుననే వ్రాస్తారు. పామరులనోటను అవి మారిపోతవి. తెలుగులో అంతర్భూతములయిన ఇంగ్లీషు శబ్దముల రూపములున్ను అర్థములున్ను, ఇంగ్లీషు వ్యాకరణమునుపట్టీ, కోశమునుపట్టీ నిర్ణయించ కూడదు; అట్లే హిందూస్థానీ మాటలున్ను. ఇట్టివి అన్నీ తెలుగుభాషా స్వభావానుసారము తెలుగులో మారుతవి. రోడ్—రోడ్డు; వాఛ్ —వాచీ; ఏకర్—ఎకరము, ఎకరాలు; హాస్పటల్-ఆస్పత్రి, గజ్—గజము; గజాలు; చాబీ — తాళంచెవులు, తాళంచేతులు. తెలుగులో చేరిన సంస్కృత ప్రాకృత శబ్దముల సాధుత్వాసాధుత్వములు తెలుగుభాషా లక్షణమునుపట్టి నిర్ణయించవలెను. సంస్కృతము వ్యవహార భ్రష్టమయినది, (అనగా ఇప్పుడు అది లౌకిక భాషకాదు) గనుక, వైదిక శబ్దముల గురించి వైదిక ప్రక్రియనుబట్టిన్ని, వేదములలోని ప్రయోగమునుబట్టిన్ని, నిరుక్తము బట్టిన్ని రూపములున్ను, అర్థములున్ను నిరూపించినట్టే, సంస్కృతశబ్దములను గురించి పాణిన్యాదులు చెప్పిన లక్షణముబట్టిన్ని, కోశములనుబట్టిన్ని రూపములూ అర్థములూ తేర్చుకొంటారు. తెలుగు ఇప్పుడు వ్యవహారమందున్న "లౌకిక భాష" గనుక, తెలుగులో చేరిన సంస్కృత శబ్దాలకు తెలుగు మాటలతోపాటు "లౌకికత్వము" కలిగినది. వాటి అనుశాసనము తెలుగు దేశములోని శిష్టవ్యవహారమునుపట్టే చేయవలెను. "తెలుగు స్వతంత్రభాష" పూర్వము ఏజాతివారయి ఉండినా, ఏమతమువారయి ఉండినా, ఏభాష వాడేవారయి ఉండినా, నేడు తెలుగు మాతృభాషగా గలవారందరూ తెలుగు సంఘములోనివారేకదా; అట్లే తెలుగులో కలిసిపోయిన అనాంధ్ర శబ్దములన్నీ, పూర్వము ఏభాషలోనివైనా, ఇప్పుడు తెలుగులే; నేటి వ్యావహారికాంధ్రభాష అభినవాంధ్ర భారతియొక్క వాఙ్మయ శరీరము; భాషలో చేరిన అన్యదేశ్యాలతోపాటు సంస్కృతాలున్ను ప్రాకృతాలున్ను

ఆమె శరీరములో అంతర్భూతములే; కానివి అవసరమునుబట్టి వేసే వేషాలు, పెట్టుకొనే అలంకారాలు, పూసుకొనే మెరుగులు. నన్నయ పుట్టకమును పే చరిత్ర. 'దర్భలు, సంబోధన, సమర్పణ, స్ఫురణ, వధ, సఖుఁడు, తపశ్చ రణ, చతుశ్శాల, కమలనేత్రి, మనోవల్లభి, ధారుణి, పుడమి, ధర్మవు' మొద లయిన మాటలు తెలుగులో కలిసిపోయినవి. ఆయన ఇవి పుట్టించలేదు; పెద్దల సహవాసమువల్లనే పెద్దల తెలుగుభాష అయనకు అబ్బినది. గ్రంథ ములు చదివి ఆయన సంస్కృతము నేర్చుకొన్నాడు. ఆ భాషలో ఈశబ్ద ములు అపభ్రంశములు; సంస్కృతములో రచన చేసినప్పుడు ఇట్టివి ప్రయో గించలేదు. సంస్కృత భాషలో కావ్యము రచించేవారివలెనే, తెలుగు కావ్యములో, ఉత్కర్షకోసముగాని, ప్రౌఢికోసముగాని, ఆడంబరము కోసముగాని, ఔచిత్యమునుబట్టికాని, సంస్కృతసమాసములు, సంస్కృత శబ్దములు ప్రయోగించేవారుకూడా సిద్ధాంతకౌముదికి లోబడక తప్పదు. విమర్శకులు చ్యుతసంస్కార దోషములుంటే నిందించకమానరు. మమ్మ టుడు కావ్యప్రకాశము, సప్తమోల్లాసములో ఒక శ్లోక ముదాహరించి, 'దానిలో కవి ప్రయోగించిన "అనునాథతే" అనేక్రియ ఆత్మనే పదము; ఆ క్రియకు ఆశీస్సు అర్థమున్నప్పుడే అట్టి పదము విహితమయినది; ఈ శ్లోక మందు దానికి యాచన మర్థము; ఆ అర్థమున్నప్పుడు పరస్మైపదమే విహి తము; గనుక 'అనునాథతి' అని ప్రయోగించవలసి ఉండెను' అని, కవి యొక్క అజ్ఞానము ప్రకటించినాడు.

చిన్నయసూరి నీతిచంద్రికలో "యుధ్యన్ మేషమధ్యము" అని యుధ్ ధాతువు పరస్మైపదముగా ప్రయోగించినాడు; అది ఆత్మనే పదము; చిన్నయసూరికి సంస్కృతభాష బాగారాక ఈ తప్పు చేసినాడు. ఎనభై యేండ్లయి హైస్కూళ్లలోను కాలేజీలలోను తెలుగు పండితులు ఈ పుస్త కము విద్యార్థులచేత చదివిస్తూ ఉన్నారు కాని, గ్రంథములోని చ్యుత

సంస్కారదోషములు ఎవ్వరూ చూపించ లేదు; కవిసార్వభౌములు "విస్ఫురమాణాధరోష్ఠుడు" అని శ్రీకృష్ణభారతములో ప్రయోగించినాడు; వి-స్ఫుర్ ఆత్మనే పదము కాదు; పరస్మైపదము. ఇట్టి తప్పులు విమర్శకులు చూపించ లేదు. సంస్కృత భాష లెస్సగా అభ్యసించనివారు తెలుగులో కలియని సంస్కృత శబ్దములు ప్రయోగించేయెడల ఏమరి ఉండగూడదు. శ్రీతిరుపతి వేంకటేశ్వరులు అట్లే ఉపదేశించినారు.

క. కేవల సంస్కృతమర్యా, దావిదులును గేవలాంధ్రి తత్వరులును గా
కేవార లుభయ భాషాకోవిదు లవ్వారు దీని గురువులు జగతిన్.

'గ్రాంథికాంధ్రము' అనేది 'కల్పిత భాష' గాని దేశభాష కాదు; లోకవ్యవహారమందు లేని సంస్కృతము కొన్ని పాళ్ళు, వ్యవహారభ్రష్టమైన ప్రాచీనాంధ్రము కొన్ని పాళ్లు కలిపి పండితులు తమ పాండిత్యము ప్రకటించడముకోసము తయారు చేసుకొన్నది. దానిజోలికి సామాన్యులు పోగూడదు; పండితులు, వారిలో వారే, తగవులాడుకొంటూ, శతఘ్నులు పాశుపతములు ఒకరిమీద ఒకరు ప్రయోగిస్తున్నారు. మనము ఉగ్గుతోనూ పాలతోనూ అలవర్చుకొన్న మన మాతృభాష మన నాలుకమీద తాండవము చేస్తూ మన అధీనమందున్నది. దానిలో మన యిష్టమువచ్చినట్టూ కవితలు కూర్చవచ్చునే. తప్పులు రమ్మన్నా రావు. "ఉక్తి విశేషము కావ్యము; భాష ఏదైతేనేమి" అన్నాడు రాజశేఖరుడు.

## చిల్లర సంగతులు

[ఇంకా అనేక విషయములను గురించి ప్రసంగించ దలచినానుగాని, వల్లపడదు. వాటిలో కొన్ని మాత్రము టూకీగా సూచించి, గ్రంథము సమాప్తము కాకపోయినా చాలిస్తాను.]

అర్ధానుస్వారము, శకటరేఫము, రావడి, ఆదేశములు; ఆగమములు ఔపవిభక్తికములు మొదలయినవి గ్రాంథికాంధ్ర భాషయొక్క ముఖ్య లక్షణములుగా పండితుల వ్రాతలలో పైకి కనబడుతున్నవి. పరిశీలించి చూస్తే వీటి ప్రయోగములలో వ్యవస్థ కనబడదు. చిన్నయసూరి నీతిచంద్రిక, మొదటి రెండు కూర్పులలోనున్నట్టుగా, మళ్ళా అచ్చువేయించి దానికి నేను వ్రాసిన ప్రస్తావనలో ఈ భాషాలక్షణములు అస్తవ్యస్తముగా చిన్నయసూరి రచనలో ఉన్నవని రుజావు చేసినాను. శబ్దరత్నాకరములో నయినా వ్యవస్థ కనబడదు. లాక్షణికులు అనేకులు మున్నూరేండ్లయి వీటికి వ్యవస్థ యేర్పర్చుటకు ప్రయత్నము చేస్తున్నారుగాని ఆ ప్రయత్నము నేటికైనా సఫలము కాలేదు; పూర్వులు చేసిన వ్యవస్థలు పరస్పర విరుద్ధముగా ఉన్నవి. అందుకు కారణము ఆంధ్రభాష మొదటినుండి నేటివరకున్ను మారకుండా ఒక్క లాగుననే ఉన్నదని ఆంధ్ర పండితులు భ్రమ పడడము. ఆంధ్రభాష, తక్కిన భాషలవలె, మారుతూ ఉన్నది; ఒక్కొక్క యుగములో, ఒక్కొక్క అవస్థలో, ఈ భాషయొక్క లక్షణములు ఏ లాగున ఉన్నవో, నమ్మదగిన లేఖలు (ఆ యా యుగములలో వ్రాసినవి) దొరికితే నిరూపించ వచ్చును. పండితులు ఆ ప్రకారము విమర్శించలేదు. నన్నయ కాలమందున్న వ్యావహారికాంధ్రభాషలో మీద పేర్కొన్న లక్షణము లున్నట్లు ఆ కాలపు శాసనములలో కనబడుతున్నది. ఆయన రచించిన భారతమందున్న ప్రయోగములను బాగా పరిశీలించినట్టయితే, ఆకాలపు భాషావ్యవస్థ నిరూపించడము దుష్కరముకాదు. ఇట్లే ఒక్కొక్క యుగమందు భాషలో కనబడే మార్పులను బట్టి, లక్షణము కనుక్కోవచ్చును. ఈ విమర్శకు శాసనములు ఆధారము; అవి మొట్టమొదట చెక్కినట్టే నేటికిన్నీ ఉన్నవి; తాటాకుల మీద వ్రాసిన గ్రంథములు అట్టివికావు. క్రీ॥ శ॥ పదకొండవ శతాబ్దిలో నన్నయ రచించిన భారతము మూలగ్రంథము ఆయన చేతితో వ్రాసినది గాని,

వ్రాయించినదిగాని నేడు దొరకదుగదా; పోనీ, పుదహార్లో శతాబ్దిలో పెద్దన రచించిన మనుచరిత్ర మూల గ్రంథముగాని, 18-వ శతాబ్దిలో కూచిమంచి తిమ్మకవి రచించిన ప్రబంధములయినా గాని, వారు వ్రాసిన తాటాకుపుస్త కాలుగాని, దొరకవు. మూలగ్రంథముల చూచి లేఖలు తాటాకులమీద ప్రతి పుస్తకాలు వ్రాసికొంచడము, అవి చూచి మరికొందరు వ్రాయడము—ఈలాగున ఒక తరమువారు వ్రాసినవి చూచి మరియొక తరమువారు వ్రాసిన ప్రతిపుస్తక పరంపరలో, నశించగా మిగిలినవి, మనకు దక్కినవి. ఇవి మన తాతముత్తాతల కాలములో వ్రాసినవి. అంతకు పూర్వము వ్రాసినవి అరుదు. ఇట్టి వ్రాత ప్రతులలోని పాఠాలు అనేక విధాల మారిపోయినవి. లేఖకులలో, పండితం మన్యులు తమ అభిప్రాయాను సారముగా పాఠములు దిద్దినారు; అపండితులు గ్రంథస్థభాష బాగా తెలియక, అక్షరాలు సరిగా పోల్చలేక, పాఠాలు పాడుచేసినారు. అచ్చుయంత్రములు మన దేశమునకు వచ్చిన తర్వాత, ఆంధ్ర గ్రంథములు అచ్చు వేయించినవారు, "పండితుల" చేత ముందుగా అవి దిద్దించినారు. అప్పటి ఆంధ్రభాషా పాండిత్యము, ఆంధ్రభాషా లక్ష ణము వలెనే, నిరూపించ శక్యముకానిది. వారి గ్రంథ పరిష్కరణ పద్ధతి వర్ణించడమునకు ఇక్కడ వల్లపడదు. నా "వ్యాసావళి" లో 'రాజరాజు కాలమందున్న తెలుగు భాష' ను గురించి నేను వ్రాసినది చదివితే, కొంత మట్టుకు బోధపడవచ్చును. బసవ పురాణమునకు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిన పీఠికలోను "శివతత్త్వసారము"నకు కీ॥ శే॥ కొమ ర్రాజు లక్ష్మణరావుగారు వ్రాసిన ఉపోద్ఘాతములోను, వారు ప్రాచీన గ్రంథ పరిష్కరణము ఎంత దుష్కరమో తెలియజేసినారు. మీద నేను ఉదాహరించిన భాషాలక్షణములకు వ్యవస్థ ప్రభాకర శాస్త్రిగారి వంటి పండితులు నిరూపించలేకపోయినప్పుడు అపని సామాన్యులకు సాధ్యమా? నేనున్ను నా కొమారుడు చి॥ సీతాపతిన్ని చేసిన పరిశీలనము సంపూర్ణము కానందున ప్రకటించలేదు.

తాటాకు పుస్తకాలలోనే, యతిప్రాస స్థానములందు తప్ప, తక్కిన చోట్ల అరసున్నలు మొదలయినవి, చాలాకాలము క్రిందటనే పాటించడము మాని వేసినారు. లౌకిక భాషలో అర్ధానుస్వారాలు, శకటరేఫలు ఆదేశాలు వినబడనప్పుడు, అవి పాటించకుండా పద్యాలు చదివితే, వినే వారికి తప్పుగా తోచదు. అర్థము చెప్పేవారికి భ్రాంతి కలుగదు. ఈ కాలమందు కవులు పద్యాలు రచించి కాగితాల మీద వ్రాసినప్పుడు గాని, మరిఒకరి చేత వ్రాయించినప్పుడుగాని అరసున్నలు మొదలయిన వన్నెలు చిన్నెలు కనబడవు. ఇది అచ్చుపడేటప్పుడు, కొందరు "ప్రూఫు" లు దిద్దుతూ, అక్కడక్కడ, (ఒక్కొక్కడు అస్తవ్యస్తముగాను) పెడుతున్నారు; 'విధిలేక', విమర్శకులకు భయపడి కాబోలు. ఆంధ్రపత్రికా సంపాదకులు సంపాదకీయ వ్యాసములం గ్రాంథిక కాంధ్రమందే రచించినా నిరర్థకమయిన ఈ నియమాలు ఉపేక్షించినారు. 1863-వ సం॥ రాజమహేంద్రవరమునందు డి. మునసబుగా ఉండిన సామినేని ముద్దు కృష్ణమ్మనాయుడు గారు హితసూచని అనే గ్రంథము పీఠికలో ఈ నియమాలు అనర్థకములని విడిచి పెట్టినారు. రా. బ. కందుకూరు వీరేశలింగము పంతులుగారు, కవుల చరిత్ర, మొదటి కూర్పులో (చూ. పు. 141, 146) వీటివలన భాషకు కలిగిన చిక్కులు తొలగించవలసినదని ఉపదేశించినారు.

నా అభిప్రాయములు వేరే చెప్పనక్కరలేదు. నేటి శిష్ట వ్యవహారములో అర్ధానుస్వారము మొదలయిన వాటి ఉచ్చారణ వినబడదు. ప్రాచీనాంధ్రములో వినబడేది. ఆంధ్రభాషాచరిత్ర నిర్మించేవారు వాటిపుట్టుపూర్వోత్తరాలు విమర్శిస్తారు. ఆ బెడద వారుపడతారు. నేటి తేటతెలుగున కవిత కూర్చేవారు తమ నోటను భారతి పలికించినట్టే కాగితముమీద వ్రాయవలసినది. లేనిపోని బొట్లు చుక్కలూ పెట్టి కొత్తమాటలు పాతపరచ కూడదు.

గ స డ ద వా దేశమును గురించిన్ని రావడిని గురించిన్ని మాత్రము కొన్ని విషయములు తెలియజేస్తాను.

## గసడదవా దేశము

ఈ ఆ దేశము ప్రాచీన కావ్యము లందున్ను శాసనము లందున్ను వచ్చినచోట్ల నిత్యముగా రావలసినట్లును, రానిచోట్ల రానేకూడ దన్నట్లున్ను కనబడుతున్నది; ఎక్కడనూ వైకల్పిక మైనట్లు కనబడదు. ప్రథమ మీదను — ద్రుత ప్రకృతికములైన నేను, తానుమీద తప్ప— నన్నయాది ప్రాచీన కవుల కావ్యములలో ఈ ఆదేశము నిత్యముగా కనబడు తున్నది.

"నవికృతి శబ్దాత్ పరతః సాంస్కృతికానాం భవంతి గసడదవాః" అనే సూత్రమునకు ఆధారముగా నన్నయాది ప్రాచీన కవుల ప్రయోగమేదీ కనబడలేదు. అంతేకాదు ఈ సూత్రమునకు విరుద్ధముగా సర్వలక్షణ సార సంగ్రహము (పు. 53) లో తిమ్మకవి చూపించిన శ్రీనాథుని కాశీఖండము లోని "ఎవ్వండు వతించు", తిక్కన ఉత్తర రామాయణములోని "ఇట్లు దపంబు", వసుచరిత్రలోని "పెంపు వరీషింప" అనే ప్రయోగాలే కాక, యుద్ధమల్లుని శాసనమందు "ఇందు వశిత్యక్షమై" అనిన్ని నాచన సోముని ఉత్తర హరివంశమందు (IV, 53) "అశ్రిమంబుల్ గై వల్య... వీరల్ ఘోషించిన" అనిన్ని, ఉన్నది.

ఏవార్థకము, క్త్వార్థకము, ప్రశ్నార్థకము, సంబోధనము భీతశోక తెక్కడూరాహ్వాన సంశయార్థకములు అయిన శబ్దములమీద ఈ ఆదేశము రాదు. సీత చెప్పినమాట నా చెప్పినమాటవంటిది. ఇందులో 'సీత' ప్రథమా విభక్తిలో లేదు గనుక దానిపై ఈ ఆదేశమురాదు. బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులవారు తమ ఆంధ్రభాషాను శాసనములో ఈ విషయము గురించి వ్రాసిన దానికి అనేక కవి ప్రయోగాలు ఆధారముగా ఉన్నవి.

ఉత్తరాంధ్రకవులు ఈ ఆదేశము తిన్నగా పాటించలేదు. నేటి వ్యవహారములో 'వాడు నూకలేదు', 'అది నేరలేదు' ముల్లోక విభుడు వక్రి మొదలయినవి జయంతి రామయ పంతులుగారు అనినట్లు శ్రుతి కటువుగా కూడా ఉంటవి. గనుక, అర్ధానుస్వారము, శకటరేఫము వలెనే ఈ ఆదేశము కూడా విడిచి పెట్టుకోవడమే మంచిది.

## రేఫములు పోయిన మాటలు

క్రిక్కిర-కక్కిర, క్రాఁగు-కాఁగు, క్రుళ్ళు-కుళ్ళు, గ్రద్ద-గద్ద, త్రెడ్డు-తెడ్డు, క్రోఁతి-కోఁతి మొదలయిన ద్విరూపములు శబ్దరత్నాకరమందున్నవి. ఇటువంటి శబ్దములలో రేఫములు పోవడము ఉచ్చారణ సౌలభ్యం కోసము జరుగుతుంది. సంస్కృత భాషలోకూడా ప్రియాలః, పియాలః హ్రేషా హేషా వంటి ద్విరూపములున్నవి. నేటి వ్యవహారములో కొన్ని శబ్దాలకు రేఫములు లేని రూపములే వినబడుతున్నవి. రేఫముతో ఉన్నరూపాలు శ్రుతి కటువుగాను హాస్యాస్పదముగాను ఉంటవి: క్రోతి, త్రెడ్డు మొ॥

వసుచరిత్ర (I. ) లో "హారిశార్యండగు" అనే పద్యమందలి "ముసలి మానుల్" శ్లేషగలది. 'ముసల్మాన్' అనే అర్థమొకటి మ్రానుల్=మ్రాకుల్ అనే అర్థమొకటి ఉన్నవి. శృంగార శాకుంతలములో (పు. 60) 'వ్రేఁగు'కు రూపాంతరమైన 'వేఁగు' శబ్దము (వేప్రాస స్థానముందు) ప్రయుక్తమై ఉన్నది.

ఇటువంటి పూర్వ కవిప్రయోగాలున్ను, శాసనములలోని ప్రయోగాలున్ను చూచిన యెడల రేఫము పోయిన రూపాలు దేశములోచాలా కాలమైయున్నవనిన్ని సాధువులే అనిన్ని గ్రహించవలసి ఉంటుంది.

చిన్నయసూరి మొదలయిన దక్షిణాది తెలుగు పండితులు వ్రేల్చు (=హోమముచేయు), త్రోలు, తార్పు, వ్రేయు (=వైచు) అని లేని రేఫముచేర్చి ప్రయోగించినారు. నన్నయాది మహాకవులు 'వేల్చు' అనే శబ్దము 'వే' ప్రాసస్థానమందుంచి ప్రయోగించడము ఎరుగుదుము. అటిస్థల మందీ 'వ్రే' గల శబ్దము కనబడేనాకా 'వ్రేల్చు' సాధువని అంగీకరించ లేముగదా!

2) తెలుగులో ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, లేవని భ్రమపడి, అట్టివర్ణములుగల మాటలు వ్రాసినప్పుడు "ఒత్తులు" తొల గిస్తున్నారు పండితులు. అనుకరణములలో ఈ వర్ణములు ఉచ్చరించకపోతే అవి సార్థకములుకావే! 'ఖంగుమని', 'ఘుమఘుమ', 'ఛీఛీ', 'ఝూం కారము', 'ఠాఠుమని', 'ఢక్', 'థూ!' 'ఫట్' 'భగ్గున'—ఇట్టిమాటలు వాడుకలో లేవా? ఇవే కాక, 'ఖారం', 'ఘాటు', 'బచ్ఛా', 'ఝూరీ' ఠాణా, ఢంకా, 'ధగిడీ', 'ఫలసాయం' 'భడవా' మొదలయినవి కూడా అనేక మున్నవే. తాటాకు పుస్తకాలలోను, శాసనాలలోను 'భంగారము' 'భావులు' 'భండి', 'భండారి', 'భావ (గారు)', యాభై కనబడుతున్నవి. 'భమిడిపాడు' 'భమిడిపాటివారు' పైడి ఘంటంవారు, ఢిల్లీవారు వంటి శబ్దాలు మార్చశక్యముకాదు. తెలుగులో ఉండగా ఇవి లేవనడము అవి వేకము. శబ్దరత్నాకరములో 'ఠావు' అనే మాట 'గ్రామ్య' మని అను శాసనమున్నది. నన్నయ మొదలుగా మహాకవులందరూ ఈ శబ్దము ప్రయో గించినారు; 'గ్రామ్యములా' ఇట్టి తెలుగు మాటలు?

(3) 'అబ్జపత్రము—' మ. మ. కొక్కొండ వెంకట రత్నముపంతులు గారు తమ ఆంధ్రీకృత ప్రసన్న రాఘవములో ప్రయోగిస్తే, ఆ గ్రంథము విమర్శించిన క. ప్ర. వేదము వేంకటరాయశాస్త్రులవారు, "అబ్జపత్ర మనగా తామరరేకుగాని తామరాకు గాదు. అగుటకు అబ్జినీపత్ర మనవల-

యును. సంస్కృతము వీధులలో చెత్త తోట్లలో దొరకదు" అని ఆక్షేపించినారు. (చూ. పు. 113) 'పద్మపత్రము'—రా. బ. కందుకూరి వీరేశలింగము పంతులుగారు మాలవికాగ్నిమిత్రములో వాడిన ఈ శబ్దమును గురించి, ఆ శాస్త్రులవారే, అర్థజ్ఞానములేక శబ్దమును ప్రయోగించుట—పద్మపత్రములనఁగా తామరరేకులు, పద్మినీపత్రములనఁగా తామరాకులు' అని ఆంధ్రసాహిత్య పరిషదష్టమవార్షికోత్సవ సభలో చదివిన అధ్యక్షోపన్యాసములో వ్రాసినారు. (చూ. ఆ. సా. ప. పత్రిక. (VIII, 1. పు. 90).

సంస్కృత శబ్దాలు 'చెత్తతోట్లలో' దొరకవు అంటారు సంస్కృత పండితులు; గ్రాంథికాంధ్రశబ్దాలు పెంటకుప్పలలో దొరకవు అంటారు తెలుగు పండితులు. కళాప్రపూర్ణులు వాడిన 'తామ్రరాకు' శబ్దరత్నాకరములో లేదు. భారతాది గ్రంథములలో 'తామరపాకు' మాత్రమే దొరుకుతుంది. నేడు 'తామరాకులు' చెరువులలో పుట్టి మన యిళ్ళలోనూ ప్రవేశించి, చెత్తతోట్లలోకి పెంటకుప్పలమీదికి వెళ్లడము మాత్రమే కళాప్రపూర్ణులకు తెలిసిన విషయము; నలుగురితో పాటు వారున్ను ఎక్కడో సంపాదించినారు తెలుగు. దానికేమి? ఆ విషయము అట్లా ఉండనీయండి.

'పద్మపత్రము' అంటే తామరాకు అని అర్థము కాదా? శబ్దరత్నాకరము మొట్టమొదట చూడండి. "తామరపాకు", ద్వం. వి. (తామర + ఆకు) పద్మపత్రము." అని సీతారామాచార్యులవారి అనుశాసనము; పోనీండి; ఆయన సంస్కృతము ఏ చెత్త తోట్లలోనిదో! నన్నయ ఆదిపర్వములో, భీముడు అన్నదమ్ములకోసమున్ను తల్లికోసమున్ను 'కమలపత్రపుటికల నీళ్ళు ఇమ్ముగా సంగ్రహించి' నాడని వ్రాసినారు (చూ. VI, 179); 'కమలినీపత్రిపుటికలు' అనలేదు. 'కమలపత్ర పుటికలు' అంటే 'తామరాకు దొప్పలు' కావా? భోజన పాత్రలకు యోగ్యమయినవి, 'పలాశంపద్మపత్రంచ' అని పురోహితులు చెప్పుతారు.

4) 'అతివిస్తారము'—'అతివిస్తరము' : అనుటకు మారుగా 'అతివిస్తారము' అని వీరేశలింగము పంతులుగారు ప్రయోగించినారని కళాప్రపూర్ణులు నిందించినారు; గాని వారే వరలక్ష్మీ వ్రతకల్పమందు (చూ. పు. 42) "ఈ చరితమును సవిస్తారముగా నీకు జెప్పితిని" అనిన్ని, కథాసరిత్సాగరమందు 'విస్తారముగా' అనిన్ని వ్రాసినారు. తప్పులెన్నువారు తమ తప్పు లెఱుంగరు విశ్వ-". ఐతే ఈ శబ్దము మహాకవులు ప్రయోగించి ఉన్నారు: భారతమందు, 'అతివిస్తారము' (శల్య. 11,388), (భీష్మ. 1,73), (అశ్వ. 111, 206); 'విద్యావిస్తారము' (అశ్వ. 111, 13); భాగ. 'రచింపు దీని నతివిస్తారంబుగా (11, 212), మార్క. 'కథావిస్తారమై' (1, 14); పాల్కురికి సోమనాథుడు బసవ. 'ప్రస్తుతోక్తుల గద్యపద్య కావ్యముల విస్తారముగఁ జేసి వినుతించువారు; సంస్కృత భాగవతమందే, "వదదేవి సవిస్తారమ్ స్వస్యదుఃఖస్య కారణమ్' అని ఈ శబ్దము ప్రయుక్తమై ఉన్నది (1:43)

5) 'పద్మనేత్రి,' ఇట్టి శబ్దములు అసాధువులని చిన్నయ సూరిగారు బాలవ్యాకరణమందు (తత్స. సూ. 84) అనుశాసించి ఉన్నందున, తెలుగు సారస్వతమందు, నన్నయ మొదలుగా మహాకవులందరూ ప్రచురముగా ప్రయోగించిఉన్న ఇట్టి శబ్దములు కనబడకుండా, అచ్చుకూటములలో ఉండే పండిత పరిష్కర్తలు దిద్ది మార్చి చేసినారు. వ్రాతప్రతులలోను, మొట్టమొదట అచ్చుపడ్డ కూర్పులలోను 'పద్మనేత్రి', 'కమలనేత్రి', 'అంబుజనేత్రి' వంటివి కనబడుతున్నవి. నన్నయనాటి శాసనములలోకూడా ఉన్నవి (చూ. సోమలదేవి శాసనము.) ఈ శబ్దముయొక్క సాధుత్వాసాధుత్వమును గురించి పండితులు ఇదమిత్థమని నిర్ణయించలేదు. పాణిని వ్యాకరణ ప్రకారము అసాధువు లనవలసిన శబ్దాలు కొన్ని ఇతర వ్యాకరణముల ప్రకారము సాధువులుగా పండితులు అంగీకరించి ఉన్నారు. బొప్పదేవుని ముగ్ధబోధ వ్యాకరణమునకు శ్రీరామ తర్కవాగీశుడు రచించిన వ్యాఖ్యానమందు

ఇట్టి శబ్దములు సాధువు లనుటకు తగిన ప్రమాణమున్నది. ఈ సంగతి నా మిత్రులు బ్ర॥శ్రీ॥ వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు నాకు తెలియ జేసినారు. కూపస్థ మండూకములవంటి పండితులు మహాకవుల గ్రంథములు పరిష్కరించుటకు సాహసించి పాఠాలు పాడుచేసినారు.

6) 'కుసుమకోమలి' తప్పన్నారు కళాప్రపూర్ణులు: తప్పుకాదు; ఒప్పే. (చూ. నన్నె. కుమార. 581, VIII, 313; అనుశాస. 111, 125; హరి. ఉ. VII, 58). 'పువ్వుకోమలి,' అట్టిదే, సాధుశబ్దము (చూ. అర. V, 203, విరా. 1,154, కాశీ. VI, 234, భోజ. 111, 223); ప్రసవకోమలి అట్టిదే. నాయకి, బాలకి, లాసకి అని తెలుగులోనే కాదు; నవీనార్య భాషలలోనూ స్త్రీలింగ శబ్దాలు ఈకారాంతములుగా ఉన్నవి.

7) 'యవ్వనము' తెలుగులో సాధువు; ఇది 'జవ్వనము'నకు రూపాంతరము. 'జవ్వనము'నుండి 'జవ్వని' వచ్చినది. ప్రాసస్థానమందు 'వ్వ' ఉంచి, మడికి సింగన పద్మపురాణమందు యవ్వనము ప్రయోగించినాడు (చూ. 1, 91) క. అవ్వనములు దమమయమై, యవ్వనమున, ప్రొవ్వి...; అనంతుడు భోజరాజీయమందు (చూ. VII, 108) ఇట్లే ఈ శబ్దము వాడి నాడు. ఉ. నవ్వుచుఁ జెక్కుమీటి...యవ్వనలక్ష్మికిన్.... వాఁ, డువ్విళు లూరుచుఁ...శ్రీనాథుడు రచించిన గ్రంథము లన్నిటిలోనూ 'యవ్వన'ము ప్రయుక్తమై ఉన్నది. పండితం మన్యుల పరిష్కరణములో మారిపోయినది. సాహిత్య పరిషత్తువారు సంపాదించిన శివరాత్రి మహాత్మ్యము వ్రాతప్రతి ఇప్పటికి లోకములో కనబడుతున్నది ఒక్కటే ఉన్నది. దానినిపట్టివారు అచ్చువేయించిన కూర్పులో మూలమందు చాలాచోట్ల ఉన్న 'యవ్వనము' అచ్చులో 'యౌవనము'గా మారినది. ఇట్లే 'కమలనేత్రి', 'మంటపము', పట్టణము మొదలయినవిన్నీ మారురూపము పొందినవి. లోకములో శిష్ట వ్యవహారమందున్న శబ్దములు మహాకవులు వాడిఉంటే, అవి మార్చి దిద్దడము

నకు అధికార మెవరిచ్చినారో ఈ పండితం మన్యులకు? అడిగే దిక్కు లేదుగదా.

8) 'మండపము'నకు రూపాంతరముగా 'మంటపము' సంస్కృతమందే చేరినది, తటాకః, తడాకః, లటకః, లడకః మొ॥ అనేకమున్నవి.

9) 'పట్టణము', ప్రాకృతమంజరి (III,23) పత్తనం, పట్టనం. సరస్వతీ విలాసములో, పత్తనం పట్టంచైవ. సముద్రతీరమందు, నదీతీరమందుండే పురములకు పట్టణమనే పేరు-అని కౌటిల్యుని అర్థశాస్త్రమందున్నది. తెలుగు కవులు ప్రాసస్థానమందు 'ట్ట', 'ణ' ఉంచి పట్టణశబ్దము ప్రయోగించినారు. భాగ. X, 1, 164, 1150; ; నిర్వ. V, 79. క....పట్టణ ...హరి. ఉ. VIII, 84. పట్టణ....కళా. 1,22. శబ్దరత్నాకరమందు శబ్దమున్నది గాని ప్రయోగములు కనబరచలేదు.

10) సంస్కృతములో పుల్లింగములుగా ఉండే విమర్శ, శ్లేష, పాస మొదలయిన శబ్దములు తెలుగులో మువర్ణాంతములుగా ఉండవలెనని సామాన్య సూత్రమున్నా, దానికి విరుద్ధముగా శిష్టవ్యవహారమున్నందున అట్టి శబ్దములు సాధువులుగానే అంగీకరించవలెను. నన్నయ 'చరిత్ర' అని ప్రయోగించినందున, బాల. తత్స. 53 వ సూత్రములో బహుళము అని అనుశాసనము పుట్టినది. 'దర్భ' మొదలయినవాటిలో మువర్ణలోపము నిత్యము అని వ్యాఖ్యాతలు అనుశాసించినారు.

'భిక్షము', (సంస్కృమందు లేదు; 'భిక్షా' శబ్దము స్త్రీలింగము.) నన్నయ ఆది. VII, 209 లో, ప్రయోగించినాడు; శ్రీనాథాదులు వాడినారు; దీనిలోనుండే బిచ్చము వచ్చినది. స్వాములవారి భిక్షచేస్తాము. బీదవాళ్ళకు బిచ్చము పెడతాము.

ఊహః-పుల్లింగశబ్దము. తెలుగులో 'ఊహము' అనుటకు మారుగా 'ఊహ' అటారు. అట్లే తిక్కన శాంతి. III, 72 లో ప్రయోగించి

నాడు. శిష్టవ్యవహారములో ఉన్నదే నన్నయ తిక్కనాదులు వాడినారు. గాని వారు ఇట్టిశబ్దములు పుట్టించలేదు.

'విమర్శ' అని భోజ V, లోనున్న 'పంస్పర్శ'ని VI; 126 లో నున్న అనంతుడు వాడినాడు. భీమఖండములో ప్రశ్న (IV, 151), చిహ్న IV, 72) శ్రీనాథుడు వాడినాడు. (చిహ్నలోనుండే 'చిన్నె' వచ్చినది.)

11) సంస్కృతములో ల్యుట్ ప్రత్యయము (=అన) భావార్థమందు వస్తుంది. అది ఏలింగమందుండునో కోశమునుపట్టి తెలుసుకోవలెను. సమర్పణమ్ అని నపుంసకమే కాని సమర్పణ అని స్త్రీలింగముగా సంస్కృతమునందుండదు; అయినా నన్నయ ఆది. 11,40 లో సమర్పణ అని ప్రయోగించినాడు; అట్లే 'సంబోధనము' అని ముకారాంతముగా వాడవలసిన శబ్దము 'సంబోధన' అని ఆది 11, 200 లో నన్నయే వాడినాడు. నన్నయ సంస్కృతము రానివాడు కాడు; గనుక శిష్టవ్యవహారములో శబ్దాలెలాగున ఉన్నవో ఆలాగున ఆయన వాడినాడని అంగీకరించక తప్పదు. సంస్కృతములో 'సంభావనమ్,' 'సంభావనా' అని రెండు రూపాలున్నా మన వాడుకలో 'సంభావన' అని ఉన్నది గనుక అదే మన భాషలో సాధువు. ప్రతిశబ్దమూ నిఘంటువు చూచుకొని ఎవరు వాడగలరు. 'సంతర్పణ', 'తర్పణము', 'మర్దన', 'పోషణ' 'లాలన' 'దేవతార్చన', 'భజన' మొ॥వి అనేకము వాడుకలో ఉన్నవి; సాధువులే.

12) బ్రాహ్మడు (బ్రాహ్మలు), ప్రధాని, యజమాని-లోకములో ఉన్నవి. మొదటి రెండున్ను శాసనములందున్నవి. ప్రధాని గ్రంథములందుకూడా ఉన్నది. 'యజమాని' నేటివ్యవహారమందున్నది గనుక శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు కావ్యములో ప్రయోగించినారు; పత్రికలలో ప్రచురణముగా వాడుతున్నారు. 'పరశురాముడు దొడ్డి బ్రాహ్మలకర్థి' మద్యమం "బ్రాహ్మడైన విష్ణుభక్తుండు గాడేని" అని పాల్కురికి సోమ

నాథుడు బసవపురాణములో వ్రాసినాడని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు నాతో చెప్పినారు. చాటువులలోను, శతకాలలోనుకూడా ఈ శబ్దము లున్నవి. దొరగారి 'యాజమాన్యము' యజ్ ధాతువుతో పొందదు.

'గుణి' 'గర్వి', 'మంత్రి' మొ. ఇకారాంత శబ్దములు బహువచమందున 'గుణులు', 'గర్వులు', 'మంత్రులు'గా ఉంటవి గనుక, 'ప్రధానులు', 'యజమానులు', 'వైదికులు', 'నియోగులు' మొ. శబ్దములనుండి, 'ప్రధాని', 'యజమాని', 'వైదికి', 'నియోగి' మొ. ఏకవచన రూపములు పుట్టినవి గాబోలు. కనిస్టేబుల్ (Constable)అనేది ఇంగ్లీషులో ఏకవచనమైనా, తెలుగువారు అది 'ఉకారాంత'ముగా ఉన్నందున బహువచనమని భ్రమపడి, ఏకవచనముగా 'కనిస్టేబు' అని వాడుతున్నారు. పత్రికలలో ప్రతిదినము కనబడుతున్నది.

'వైదికి' అనే రూపము సాధువా? అసాధువా? అంటే, శిష్టవ్యవహార మందున్నదా? లేదా అని అడుగుతాను; ఉంటే సాధువే. అలిక—అలీక శబ్దాలు, ఋషిక—ఋషీక శబ్దాలు, కులిర—కులీర శబ్దాలు వల్మిక—వల్మీక శబ్దాలు సంస్కృతములో సాధుత్వము పొందినట్లే తెలుగులో ఇవి సాధువులయినవి. యాత్రికులు, ప్రయాణీకులు, కుటింబీకుడు: ఇవి మనము కల్పించలేదు; వాటి అర్థము తెలియజేసే మాటలు తెలుగులో చట్టన దొరకనప్పుడు లోకములోని శిష్టులకు కొందరికి ఇట్టిమాటలు స్ఫురించియుండును; అవి అంత కంతకు వ్యాపించినవి. ఉచితమనితోస్తే కవులు కావ్యాలలో ప్రయోగిస్తారు; నిర్బంధము లేదు.

వృద్ధు, గృహస్థు, దుష్టు, శిష్టు, మూర్ఖు, నీచు, యోధు, భట్టు మొదలయినవి గొప్పకవులు ప్రయోగించినారు. వృద్ధు, (అర. III, లో), మూర్ఖు (పభా. లో) నన్నయ, నీచు (విరా. లో) తిక్కన, శిష్టు (భోజ. IV లో) అనంతుడు వాడినారు. గృహస్థు విష్ణు V లో ఉన్నది. దీనిలో మంచె గేస్తు

వచ్చినది. 'మూర్ఖు' నుండి మొరకు. వాడుకలో భారతరోధు అంటున్నారు. 'రోధు' నుండే 'జోదు'. సం. దూతః తెలుగులో దూత అయినది కాదా! 'దూతుఁడు' అని కవులు వాడినా, లోకములో వ్యాపించలేదు. శిష్ట లోకమే దేశభాషపై అధికారము చలాయిస్తుంది. 'మీటింగు'లు, 'తీర్మా నాలు' అక్కరలేదు. లోకములో చెల్లుబడిని పట్టి శబ్దము ప్రయుక్తమో అప్రయుక్తమో చెప్పవలెను.

13) కమండలము. సం. కమండలుః— తెలుగులో కమండలువు- అని ఉండవలెనుగాని కమండలము అని శిష్టులంటున్నారు. భాగ. VIII, 515 లో (వెనుకటి కూర్పులో) ను ఉత్త. హరి. IV, 79 లోను ప్రయుక్త మయిఉన్నది. కన్నడములో కూడా 'కమండల' ఉన్నది. సం. గుగ్గులుః= గుగ్గులః అని ఉన్నందున తెలుగువారి వాడుకలో 'గుగ్గిలము', అయినది.

14) ఉత్తరః_నుండి ఉత్తరము, ఉత్తరువు (అర్థములో భేద మేర్పడి నది) అట్లే చిత్రః- చిత్రము, చిత్తరువు; భరః- భరము, బరువు; భారః- భారము, బారువు. ధర్మః- ధర్మము, ధర్మువు, శ. ర. లో. నన్నయ ప్రయోగ ముదాహరించలేదు.

15) గురు:- గురుఁడు (గ్రహము), గురువు.

16) వ్రయము:— 'వ్యయము' యొక్క వికృతి. ప్రాకృతములో వ్యాడి-వ్రాడి అవుతుంది; అట్లే ఇది అయినది. తిక్కనాదికవులు ప్రయోగించి నారు. రుగ్మత-రుగ్ణత యొక్క వికృతి.

17) స్మశానము. సం. శ్మశానము తెలుగువారు స్మశానము అని పలు కుతున్నారు. పెద్దలు కొందరు గ్రంథాలలో అలాగుననే ఆశబ్దము వాడు తున్నారు. సంస్కృతములోనే శవర్ణమునకు మారుగా సవర్ణముగల రూపాంతరములు అనేక శబ్దములకున్నవే!- శాతవాహన=సాత-, శారిక=

సారికా, శస్యం=సస్యం, శాయకః=సాయకః. శూకరః=సూకరః; కిశలయః=కిసలయః, వశిష్ఠః=వసిష్ఠః, మశీ=మసీ మొ|| వి. వందలకొలదిగా ఉన్నవి; ఎవరికి ఏదిష్టమయితే అది వాడవచ్చునని గదా. అలాగుననే తెలుగులో అంగీకరించరాదా?

18) రణము. సం. వ్రణము తెలుగులో 'రణము' అయినది. మొదటి వర్ణము, వ్ పోయినది. సం. 'హ్రేషా' లోని హకారముపోయి 'రేషా' అయినది కాదా. ఇంగ్లీషులోని వ్రైట్ (Write), వ్రాంగ్ (Wrong) శబ్దములలోని మొదటి వర్ణము లోపించగా 'రైట్' రాంగ్' అయినవి గదా. write, right శబ్దములు నోటను ఒక్కలాగుననే ఉచ్చరించినా, సందర్భమును బట్టి శబ్దబోధ కలుగుతుంది గనక వ్యవహారహాని లేదు.

18) 'వెధవ' శబ్దము 'విధవ' యొక్క వికృతి కాదు; వైధవేయ శబ్దము నుండి వచ్చినది. సం. ఐ కారము ప్రాకృ-లో ఏకారమవుతుంది. ఇది తిట్టుమాట వెధవా=వెదవ ముండకొడుకా. కొందరు 'వెధవాయా' అంటారు లోకములో. దైవమ్=దెబ్బం-దెయ్యం- (దయ్యం).

19) అయిస్వర్యం అయిస్వరియం. సం. ఐశ్వర్యమ్. సం ఐ=ప్రాకృ లో అయి-(ఏదైతః.) పవురుషం, సం. పౌరుషమ్. సం. ఔ=ప్రాకృ-లో అవు. (ఓదౌతః) గౌరవ=గోరవ, గఉరవ (శౌరసేనీ); గారవ (మహారాష్ట్రీ)) తెలుగులో ఔను=అవును; తౌడు=తవుడు; ఐ=అయి; రైక=రయిక.

20) సౌజ్ఞ(సౌంజ్ఞ, సౌగ్య)-సం. సంజ్ఞా-మడికిసింగన జ్ఞాన. కా.లో క. విజ్ఞానమునులు చెప్పిన, సౌజ్ఞాఖ్యాన.........అని ప్రయోగించినాడు. శాసనములలోను, వ్రాత పుస్తకములలోను తెలుగువారి ఉచ్చారణ విశదపడుతున్నది. పూర్వము సంజ్ఞ=సఞ్ఞ=సన్న; అజ్ఞ= అఞ్ఞ=అన. మరిఒకరీతిని, సైంగ వచ్చినది; నేడు సౌగ్య. సౌగ్గి అవుతున్నది.

దంష్ట్రి శబ్దము శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారు దౌంష్ట్రి అని వ్రాసినారు.

21) పుత్రశబ్దములో రెండు తకారములక్కరలేదు; నిఘంటువులో ఒక్క తకారమే ఉన్నది. 'పుత్రపౌత్రాదిని', 'పుత్రపౌత్రి'

22) దుఃఖము=పాలీ, ప్రాకృ. దుక్ఖం, తెలుగులో 'దుక్ఖం' అనే శిష్టులు పలుకుతున్నారు. ప్రాకృతభవము.

23) దర్శనము=దరిసెనము (చూ. శ. ర. కవులు వాడి ఉన్నారు)

వర్ష=వరుష-శాసనములలో 'శకవరుషంబులు'

వర్షం (=వాన) -'వరషం' అని ఉచ్చారణ వినబడుతున్నది.

హర్ష-హరుష-హర్షించు- (శ. ర. హరుషించు)-'హరిషించు' కూడ వినబడుతున్నది. త్రివిక్రమ వ్యాకరణమందు. అర్హ=అరహ, అరిహ, అరుహ.

సంస్కృతమందే, సర్షపః= (రూపాంతరం) సరిషపః; సూత్న=సూతన.

శారఙ్గపాణిః = (తెలుగు) సారంగపాణి-భాగ. X. ప. 329. చ...కచా, కరపణముల్.

పండితులు అసాధువులనుకొనే తెలుగు శబ్దాలు అనేకము ప్రాకృతభవములుగా కనబడుతున్నవి. ప్రాకృతభాషలు అభ్యసించిన వారు వాటికి ప్రక్రియలు కల్పించగలరు. తెలుగులో చేరిన ప్రాకృతాలు రాను రాను మారుతూ వున్నవి.

24) సం. ముష్టీముష్టి-తెలుగులో 'ముష్టాముష్టి' భాషాస్వభావానుసారముగా వచ్చినది. (చెకాచెక్కీ, ఎగాదిగ పం||). శ. ర. లో లేదు. అర, III 395 లో 'ష్టా' యతిస్థానమందున్నది. కాశీ V, 150 లో శ్రీనాథుడు ప్రయోగించినట్టు తాటాకుల పుస్తకములో ఉన్నది, అచ్చువేసిన వారు "దిద్ది"నారు. భాగ. X. ప. 66 లో పూర్వ ముద్రణమందున్నది.

కొత్త కూర్పులో పండిత పరిష్కర్తలు మార్చి వేసినారు. సం. బాహు శబ్దమునకు 'బాహా' అని రూపాంతరమున్నది; బాహా శబ్దమును పట్టి బాహాబాహవి అని ఏర్పడ్డది. తెలుగులో 'బాహాబాహి' అంటారు. ఎందుకు అసాధువు అంటారో తెలియదు.

25) మిశ్రసమాసములు— ఆంధ్ర శబ్దములతో కలిపి సమాసముగా ప్రయోగించడము దోషమని, 'మడి' కట్టుకొన్న 'చాదస్తపు' పండితులు కాని స్త్రీ, చెల్లదు. ఒకరిని ఒకరు ముట్టకుండా రేల్ బండిలో కూర్చొని ప్రయాణం చేయడము అసాధ్యము కాదా? అట్లే వివిధ భాషలు మాట్లాడే వారితో సహవాసము చేసినప్పుడు భాషా సాంకర్యము కాక తప్పదు. సంస్కృతములోనే చేరినవి అనేక శబ్దాలు అన్యభాషలలోనివి. (చూ. అన్యదేశ్యాలు) మేషాది రాసుల పేళ్ళు హోర, ద్రేక్కాణ, కేంద్ర, అనఫా మొ, పారిభాషిక పదాలు గ్రీకుభాషలోనివి; వాటితో సంస్కృతశబ్దాలు చేర్చి సమాసము కల్పించినారు కారా జ్యోతిశ్శాస్త్ర నిర్మాతలు?

అట్లే 'తురకలు' రాజ్యము చేసినప్పుడు 'తురకమాటల'తో తెనుగు మాటలు, సంస్కృతశబ్దాలు కలిసి సమాసాలు ఏర్పడి లౌకిక భాషలో నెలకొని ఉన్నవి; ఎవరు తొలగించగలరు? 'గ్రామనాయకుడు' వంటిదే 'గ్రామమునసబు' వందలు, వేలు ఇట్టివి ఉన్నప్పుడు ప్రయోగములు ఉదాహరించడము ఎందుకు?

అన్ని భాషలలోనూ ఇట్టి సాంకర్యమున్నది. కన్నడములో 'వైరిసమాసము' అనిన్ని ఇంగ్లీషులో హైబ్రిడ్ (Hybrids) అనిన్ని ఇట్టివాటికి 'పేరు'. పారిభాషిక పదముగా భాషానుశాసనము చేసినవారు పెట్టినారు. సమాసముల వ్యుత్పత్తి తెలియజేస్తుంది ఆ పేరు. అంతేకాని, అట్టి సమాసములు అసాధువులని సూచనఅయినా దానిలో లేదు. అచ్చర 'వైకృత శబ్ద'మంటే, అది అసాధువని అర్థమా?

బసవపురాణ పీఠికలో బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సవిస్తరముగా ఈ విషయము చర్చించి ఉన్నారు. (చూ. పుటలు 97–99) వారుదాహరించిన మిశ్రసమాసాలు పాల్కురికి సోమనాథుడు ప్రయోగించినవి. ఇతరులు ప్రయోగించనవికూడా అనేక మున్నవి; శాసనములలో కొన్ని కనబడుతున్నవి.

'కృష్ణరాయభారము' అనే సమాసముయొక్క సాధుత్వము శంకించేవారికి ఆంధ్రసారస్వతముతో పరిచయము లేదు గాబోలు. లోకములో ఎంత మట్టుకు ఇట్టి శబ్దములు వ్యాపించినవో నేటి వ్రాతలలో కనబడుతున్నవి. కొన్ని ఉదాహరిస్తున్నాను. వీటిలో కొన్ని కవులు ప్రయోగించినవే.

| | | |
|---|---|---|
| అపదూటు | దివవెచ్చము | కాశీకావిడి |
| అపవాడి | మహారాణి | కాశీగాజులు |
| అపసెపము | మధురపేణీలు | కాశీమజిలీలు |
| అపనమ్మిక | అల్పాహారవిందు | గ్రామనాయడు |
| అపనమ్మకము | వామనకేళి | గ్రామమునసబు |
| దుర్నడత | మందారపువ్వు | కంతుతేజీ |
| దుస్సలహా | కమలాపండు | పురుషకళేబరము |
| దురలవాటు | ద్రాక్షసారాయి | అంగదరాయబారము |
| నిర్మొగమాటము | గజనిమ్మపండు | శ్రీకృష్ణరాయబారము |
| అంతరతామర | గజదొంగ | వినాయకచవితి |
| అంతరపల్లటీలు | గతనెల | గంధాక్షింతలు |
| అర్ధరూపాయి | గతసాలు | స్వంతసాగు |

అర్ధణా
అర్ధాకలి
ఉత్తర జందెములు
ఉత్తరార్కాడు
శుద్ధపాడ్యమి
శుద్ధతదియ
శుద్ధచవితి
శుక్లపాడ్యమి
బహుళపాడ్యమి
మధ్యరకము
ఉత్తమతరగతి
పంచవన్నె
పంచవట్టె
పంచరంగీ
అనేకమంది
ప్రతివాడు
ప్రతిరోజు
కపిలకన్నులు
కపిలజడలు
శివగట్టు
ప్రాణగొడ్డము
నిత్యపడి

చంద్రవంక
లింగకాయ
కులపెద్ద
పాదకట్నము
వ్యాసపీట
రామచిలక
రామమాడ
దర్భముడి
బ్రహ్మముడి
శివకోవిల
గర్భగుడి
బ్రాహ్మణకోడూరు
సీతాశోకచిలుక
శ్రీరంగపట్టణము
విశాఖపట్టణము
మధురవాడ
విజయవాడ
నాగపూడి
దేశపాండ్య
రాజనగరు
రాజప్రోలు
రాజశివి

దానపట్టా
క్రయచీటీ
భూఖామందు
భోగబండా
సరస్వతీమహాల్
ప్రయాణసరంజామా
వర్తకసరకులు
నాటకసామానులు
దీర్ఘవాయిదారుణములు
ఉభయపార్టీలు
సహకారబ్యాంకులు
తుంగభద్రాప్రాజెక్టు
కలకంఠుఁడు
ముల్లోకములు
ఇరుఘంట లిఖితము
నాచనసోమయాజి
హిందూరాజ్యరమ
దసరానవరాత్రులు
సుబ్బారాయషష్ఠి
జైనస్త్రీ
నేరారోపణము

ఇట్టి సమాసముల సాధుత్వాసాధుత్వములు చర్చించేవారు జ్ఞప్తియందుంచుకోవలసిన విషయ మొకటి తెలియజేస్తాను. శిష్టానాముక్తౌ సూత్రాణామభావే అనుశాసనకారిణ ఏవదండనీయాః అనే వచనము అథర్వణునికిన్ని అహోబలునికిన్ని వర్తిస్తుంది. తిక్కన భారతములోను ఇతర మహాకవుల ప్రబంధములలోను ప్రచురముగా ఉన్న, 'కొంట', 'వింట', 'అంట' అనే ప్రయోగములు అసాధువు లన్నారు. ఈ విషయము వెనుకను చర్చించి ఉన్నాను (చూ. పు.48-61). ఇక్కడ మరిఒక్క విషయము అట్టిదే తెలియజేస్తాను. "ద్వితీయాచార్యు'డయిన అథర్వణుడు రచించిన కారికావళిలో, అర్యాంబాదికి శబ్దాస్సుః స్త్రీవాచకాయతః, తత స్తదంతశబ్దేభ్యో నైవ శ్రేష్ఠగోచరాః" అని అనుశాసించినాడు (అజ. 111). తృతీయాచార్యుడైన అహోబలుడు ఈ అనుశాసనము అంగీకరించినాడు. ఈ అనుశాసనము నన్నయాది మహాకవుల ప్రయోగములకు విరుద్ధము గనుక చెల్లదు. "నన్నపార్యుం జూచి" అని నన్నయ ఆదిపర్వములో, తిక్కన, "అన్నమాంబాపతి" అని విరాటపర్వములో, ఎఱ్ఱాప్రగడ, 'ప్రోలమాంబ', 'పేకమాంబా మనఃప్రియుండు', 'పోతమాంబ' అని, మడికిసింగన, "మల్లమాంబ', 'గౌరమాంబ', 'కాచమాంబిక', 'సింగమాంబ' అని పద్మపురాణమందు, శ్రీనాథుడు, "నన్నిపాచార్యవర్య', 'అన్నమాంబ' 'వేంగమాంబ', 'వేమమాంబానుపుత్రా, రామమాంబారమణీమణి' అని, మారన, 'మల్లమాంబిక' అని, బమ్మెరపోతరాజు 'గౌరమాంబ, లక్కమాంబ', అని, అల్లసాని పెద్దన 'లక్కమాంబ', 'నాగమాంబిక', చొక్కనామాత్యపుత్ర పెద్దనార్యప్రణీతంబు" అని ఇట్లు కవులందరూ అంబా—ఆర్యశబ్దములు ప్రయోగించి ఉండగా, ఇట్టి ప్రయోగములు అసాధువులన్నాడే! అతని అనుశాసనముతప్పవుతుంది గాని కవుల ప్రయోగాలు తప్పుకావు. గనుక బాలకవులు లాక్షణికుల మాట వేదవాక్యమని విశ్వసించకూడదు. వర్తమాన వ్యావహారిక భాషాశబ్ద

ములకు అనుశాసనము చేసేవారు శిష్టుల వాడుకను అనుసరించవలెను. వ్యవహారభ్రష్టమైన భాషలోని శబ్దములకు అనుశాసనము చేసేవారు గ్రంథములలోని ప్రయోగములను అనుసరించవలెను.

26) కరణము, జంగము—ఇవి శ. ర. లో ఉన్నవి. లోకములో వాటికి ఉన్న అర్థమే అందున్ను ఉన్నది; అయితే ప్రయోగములు లేనందున పండితులు ఆ శబ్దము లసాధువులని భ్రమపడి కరణికుఁడు, జంగముఁడు అని గ్రాంథిక భాషలో వాడుతున్నారు. అవి లౌకిక భాషలో చేరలేదు గనుక కృతక శబ్దములు. మడికిసింగన "సకల నీతిసమ్మతము"లో—'మంత్రణము సేయఁగరణము, మంత్రియనంబరగునతఁడు మనుజేశునకున్'అనిన్ని, 'కరణంబు కొడుకు ముందఱ, కరణికధర్మంబునందు గడుఁగుశలుండై' అనిన్ని (చూ. 292. 301) ప్రయోగించినాడు. జంగం రామలింగం, వీరేశలింగం, రాజలింగం, వెంకటరంగం, నరసింహం, వెంకటచలం, వెంకటరత్నం, లక్ష్మీకాంతం మొ॥ పేళ్లు తెలుగుదేశములో ప్రఖ్యాతమయినవి; కడపటి రెండున్ను స్త్రీలకు కూడా ఉన్నవి. సంబోధించినప్పుడు, 'మ్' దీర్ఘమవుతుంది. గ్రాంథికాంధ్రములో 'వెంకటరత్నము',-'రత్నంబు', 'ఓ వెంకటరత్నమా, వెంకటరత్నమా, వెంకటరత్నంబా' అని వ్రాయమంటారు పండితులు. లోకములో అట్టివి ఎక్కడా వినబడవు. 'లింగడు', 'రంగడు' లోకమందున్నవి; వాటికి బహువచనము వాడుకలో లేదు.

27) అనేక శబ్దములనుగురించి తగవులాట "ఇది ఉకారమధ్యమా అకారమధ్యమా?" అని. మధ్యాక్షరము యతిస్థానమందుంటే, దానినిబట్టి సాధుత్వాసాధుత్వములు నిర్ణయిస్తారు పండితులు. అయితే యిట్టి 'పరీక్ష' వల్ల సత్యము తెలియదు; యతిస్థానమందు శబ్దముయొక్క మధ్యవర్ణము పడడము దైవాయత్తము. మరి యే భాషలోనూ శబ్దాల సాధుత్వము ఈలాగున నిర్ణయించరు.

తెలుగు భాషాస్వభావానుసారము, 'అరుదు', 'అరిది' అని అనాది వర్ణముల అచ్చులకు సానురూప్యముంటుంది. అరవములో 'అరిదు' అంటారు. తెలుగువారు ఆలాగున ఉచ్చరించరు. చదువు (ము), చదువుకున్నాడు, చదువుతాడు; చదవడు, చదవక, చదవండీ, చదవలేదు, చదివి, చదివిన, చదివితిని—ఈలాగున 'చదువు' ధాతువులోని అనాదివర్ణముల అచ్చులు తెలుగువారి నోటను మారకమానవు; ఆ మార్పు తెలుగువారి చెవులకు ఇంపుగానే ఉంటుంది. తొమ్మిదులు అని ఒక ఆంధ్రభాషాచరిత్ర నిర్మించేవారు ప్రాచీనావస్థలో శబ్దముల రూపములు ఏలాగున ఉండెనో నిర్ణయించి చెప్పడము సుకరముకాదు. కడవ, పడమట, పసి, బేల, గొడుగు, కొమ్మ, బురద, రాయిడి, పొలంతి, మెలంత వంటి శబ్దాలు ప్రాచీనాంధ్రములో కడువ, పడుమట, పసు, బేలు, గొడగు, కొమ్ము, బురుద, రాయడి, పొలింతి, మెలంత అనే రూపములలో ఉండేవని నమ్మటకు తగిన ప్రమాణమున్నది. "నేడు వాడుకలో ఉన్న శబ్దాలు విడిచి ఈ పాతమాటలు వాడితే పుణ్యము కలుగుతుంది; కొత్తమాటలు అసాధువులు; అవి వాడితే పాపము సంభవించక మానదు" అని ఎవరైనా ఆంధ్రభాషానుశాసనము చేస్తే చెల్లుతుందా? 'ఎగుచు,' 'ఎగచు' అనే రెండురూపములున్న సాధువులనుటకు ప్రమాణముగా ఒక్కపద్యమే (నిర్వ. III, 33) 'ఎగుచు' కింద 'ఎగువన్' అనే పాఠముతోను, 'ఎగచు' కింద 'ఎగవన్' అనే పాఠముతోను ఉదాహరించి, శబ్దరత్నాకరము నిర్మించిన ఆంధ్రభాషానుశాసనకారుల వివేకము ఏమి చెప్పను? ఈ ఒక్కవిషయమునుబట్టి ఈలాగున ఆక్షేపించలేదు; వేలకొలదిగా ఉన్నవి శ. ర. లోని తప్పులు. ఏ దేశమువారైనా నిఘంటువునుబట్టి దేశభాష వాడరు. శ. ర. లో 'నడుచు', 'పొడుచు' (=ఉదయించు) ఉకారమధ్యముగా ఉన్నా, భాషాచరిత్ర తెలిసినవారు ఇవి అకారమధ్యముగానే ప్రాచీనాంధ్రమందు ఉండేవని రుజువుచేయగలరు: తెంచు అనుబంధమున్నా

ఉన్నప్పుడు చుకారాంత క్రియల చువర్ణము లోపిస్తుంది: మొలచు + ఎంచు = మొలలెంచు; నడచు + ఎంచు = నడలెంచు; పొడచు + ఎంచు = పొడలెంచు.

28) వెదకు, వెతకు; పిదుకు, పితుకు; బ్రదుకు, బ్రతుకు—ఇట్టివాటిలో 'ద'వర్ణముగలవి ప్రాచీనాంధ్రములోవి; తవర్ణముగలవి ఉత్తరాంధ్రములోవి; అవీ ఇవీకూడా సాధువులే; ఎవరికేవి యిష్టమైతే అవి వాడవచ్చును.

అట్లే నమ్మిగ, నమ్మిక-నేడు నమ్మకము వాడుకలో ఉన్నది; ప్రాచీనాంధ్రములో కనబడలేదు. అమ్మి-అమ్మకము మొ॥ కొత్త తెలుగు "కృదంతములు".

29) మావి, మావిడి ప్రాచీనాంధ్రములోనివి-మామిడి అర్వాచీన భాషలో, వకారము మకారమైనది. ప్రాచీ. తవ్విందలు, తవిదలు. అర్వా. తమిదలు; ఇట్లే చెవుడు, చెముడు; నవలు, నములు; నివురు, నిమురు; సెవరు, సెమరు; తడవు (తడువు), తడుము; కన్నడములో నడువు, తావరె, నవిలు తెనుగులో నడుము, తామర, నమిలి-ఇది భాషాస్వభావము గనుకనే కొందరు 'దేవుడు' శబ్దము 'దేముడు' అని పలుకుతారు.

30) ప్రాచీన-ఇంబు=అర్వాచీ ఇమ్ము. ఇట్లే కంబి=కమ్మి; వేంబు=వేము; దంబిడి=దమ్మిడి; దంబు (దంపనాగలి)=దమ్ము; కొంబు=కొమ్ము; తాంబేలు=తామేలు; పెనుంబట్టు=పెనుమర్రు (పెనుమర్తివారు); చిలుకుం బట్టు=చిలుకమర్రు (చిలకమర్తివారు); కారంబూండి=కారుమూడి; నోంబు=నోము; కుంబరి=కుమ్మరి; పొగరుంబోతు=పొగరుమోతు; గొడ్డుంబోతు=గొడ్డుమోతు (తత్సమచంద్రిక పు. 49); నాకుంబలె=నాకుమలె; విఱుగం బొడుచు=విరుగమొడుచు. ఇట్టి మార్పులు తెలుగు భాషాస్వభావానుసారముగా అవుతవి. శిష్టవ్యవహారమందుంటే సాధువులు; లేకుంటే అసాధువులు.

31) దొరకు=లభించు; ప్రే. దొరకించు అని శ. ర. ఇది ఉత్తరాంధ్రములో ఏర్పడిన క్రియ. నన్నయాది ప్రాచీనుల గ్రంథములలో లేదు. వారి

కాలమందు ‘కొను’ అనుబంధముతో ‘దొరకును’ అను అర్థముండుండేది. దాని కృత్. దొరకోలు, ప్రే. దొరకొల్పు; వ్యతి. దొరకొనమి. వీటి ప్రయోగములు చాలా ఉన్నవి. రానురాను ఉత్తరాంధ్రమందు, ఈ శబ్దము మారినది. ‘దొరకొను శుభముల్’ అనే వాక్యములోని ప్రయోగమువంటి శబ్దములుగల పద్యములలో ‘దొరకును శుభముల్’ అని లేఖకులు వ్రాయడము కనబడు చున్నందున ఆ ఉచ్చారణ లోకవ్యవహారమందు ఆనాడు ఉండేదని ఊహించవలెను. ఇట్లు ‘దొరకు’ స్వతంత్రక్రియగా ఏర్పడ్డది. ఇది ఉకారమధ్యమో అకారమధ్యమో, రేఫము లఘువో గురువో తెలియక పెద్దపేరుగల పండిత కవులు దొరుకదు, దొఱకును, దొఱకి మొ॥ శబ్దములు కల్పిస్తున్నారు.

32) అగుపడు: నూరేండ్లయి ఈ శబ్దము ‘కనపడు’ అనే అర్థమందు పండితులు వాడుతున్నారు. దీని వ్యుత్పత్తి శ. ర. లోని అగపడు (అగ్గము + పడు)=కనఁబడు, గోచరమగు, అగపాటు=అగపడుట; అగ్గము= అధీనము, కనఁబడినది; అగ్గపడు=అగపడు; అగ్గపాటు=అగ్గపడుట అనే శబ్దములను పట్టి పండితులయినా తెలుసుకోలేదు.

ప్రాచీనాంధ్రమందు అగపడు, అగ్గమగు మొ॥వి ఉన్నవిగాని ‘అగుపడు’ లేదు. “చిక్కువడియెఁ దొరకెఁ జేపడెఁ నగపడెఁ దవిలెఁ బట్టువడియెఁ దగులువడియె నబ్బెనగృహీతమయె ననందగు” అని ఆంధ్రభాషార్ణవములో చెప్పిన అర్థములు ఈ శబ్దమునకు గలవు, గాని నేటి తెలుగువారి వాడుకలో ఒక్క “కనబడు” మాత్రమే ఉన్నది. “యక్షునిచే నగపడ్డ” (విరా. I, 183); ‘వీడగ్గమై దొరకోలు’ (ద్రోణ. III, 185); ‘రాజ్యాయుత ప్రాజ్యవిభూతి కగపడని జనుల్’ (శాంతి. 91); వానిచే నగపడియె నుమ్మనగ ఖండపెంగిన్’ (దశ. X, 56)—ఇట్టి ప్రయోగములలో పూర్వులు ‘అగపడు’ వాడినట్లు ఉత్తరాంధ్రులు వాడలేదు. కథాసరిత్సాగరమందు (ప్రా. పు. 633) వేదం వెంకటరాయశాస్త్రిగారు “ఒక పురుషు డగుపడి వచ్చె యువ

లోకమునకుఁ గొనిపోయెను" అని అగుపడు ప్రయోగించినారు. ఇట్టి వాడుక ప్రాచీనాంధ్రమందు హాస్యాస్పదముగా ఉంటుంది.

కొందరు తమ గ్రంథములందు అనేక వాక్యములలో 'అగుపడు', 'అవుపడు', 'ఔపించు', 'అగుపర్చు' మొ॥ శబ్దములు తరచుగా వాడిఉన్నారు. వేదం వేంకటరాయశాస్త్రిలుగారు అలంకార సంగ్రహమందు ఇరవైసార్లు ఈ శబ్దము 'గు'వర్ణసహితముగానే ప్రయోగించినారు. రూపకలక్షణము—

క॥ రూపకము రక్తిక్తైత
ద్రూపతఁదదభేదతఁ బరరూపమును సమా
రోపింప విషయమునదది
యాపడు విషయోనతోరు తాను భయోక్తిఁ॥

అముద్రితగ్రంథచింతామణిలో వారు ప్రకటించిన వ్యాసములలో అట్లే ఆ శబ్దము ముద్రితమైనది. బ్ర. శ్రీ. వడ్డాది సుబ్బారావు పంతులుగారు మొదలయినవారున్ను అలాగుననే వ్రాసేవారు. బ్ర. శ్రీ. వావిలాల వెంకట శివావధానులుగారు అదే సాధురూపమనుకొన్నామని నాతో చెప్పినారు. నేను ప్రాచీనాంధ్రభాషాస్వరూపమును గురించి ఉపన్యసించినప్పుడు చాలా పట్టణములలో ఈ శబ్దముయొక్క వ్యుత్పత్తి విశదపర్చినాను. ఈ కాలమందు 'కనబడు' అనే అర్థమందు 'అగుపడు' అనే శబ్దము గువర్ణముతో శిష్టజనులు ఉచ్చరిస్తున్నారు గనుకను దానికి రూపాంతరములుగా 'అవుపడు', 'ఔపడు' ఏర్పడిఉన్నవి గనుకను వాటినుండి పుట్టిన 'అవుపించు', 'ఔపించు' అనే కొత్తక్రియలు వాడుకలోకి వచ్చిఉన్నవి గనుకను అట్లే వ్రాయవలెనని నా అభిప్రాయము.

## ఏనుగ, పీనుగ, ఇంగువ మొ.

42) కొన్ని శబ్దాలను గురించి, అకారాంతమా, ఉకారాంతమా అని తగవులాడుతారు పండితులు. ఏలాగున తగవు తీర్చడము? 'సముద్రము' అని

వాడుకలో ఉన్నందున నన్నయ వాడినాడు. అది సంస్కృత శబ్దము గనుక శత్రువు అనవలసి ఉండెను. అయినా, నన్నయ ప్రయోగించినందున సాధువే అంటారుగదా, ఎవరిచ్చినారు నన్నయకు అలాగున ఆశబ్దము వాడదమునకు అధికారము? శిష్టసంఘము. శిష్టసంఘమే అట్టి అధికారము బాలకవులకు ఈ కాలమందు ఇస్తుంది.

హింగుశబ్దము ఉకారాంతము—ఇంగువు అని తెలుగులో అనవలెను; గాని 'ఇంగువ' అంటారు. శ. ర. లో నున్నది. ఆయువ, వస్తువ, మేరువ, బారువ మొ|| లోకములో వినబడుతున్నవి.

దండః—దండము, దండువు, దండుగు; అయితే లోకములో దండుగ, దండగ అనికూడా అంటారు. అట్లే, పండుగు, పండుగ, పండగ; గానుగు, గానుగ; జీలుగు, జీలుగ; ఏనుగు, ఏనుగ, (ఏనిక); పీనుగు, పీనుగ మొ. వి.

వలువ, వల్వ, వలువము, వల్వము, వలువు శబ్దములు శ. ర. లో ఉన్నవి. అట్లే కైదువు, కైదువ. ఏకవికి ఏశబ్దము కావలెనో అది ఆ కవి వాడినాడు. కవులు ప్రయోగించిన మాటలన్నీ శ. ర. లో చేరలేదు.

'చవితి' అనవలెనా? లేక 'చవుతి' అనవలెనా? అని సందేహము పుట్టితే, ఎవరు తీర్చగలరు? శ. ర. లో ఆ శబ్దము లేదు. సం. చతుర్థి= ప్రాకృ. చఉత్థి; గనుక 'చవుతి' సాధువు అని ఎవరైనా అంటే; తెలుగులో, అచ్చులకు సానురూప్యము, భాషాస్వభావానుసారముగా ఏర్పడుతుంది, కాబట్టి 'చవితి' అనే రూపము వాడుకలో ఏర్పడ్డది అని సమాధానము చెప్పగలము.

ఏనుగ, పీనుగ మొ. మాటలవ్యుత్పత్తినిబట్టి, గవర్ణము పదాంతమందు ఏకవచనములో ఉండకూడదు. అరవ. అనై, ఏ. వ. అనై-గళ్. బ. వ. ఇట్లే ఎలి-కలు; ఈ-ంగలు.

సంస్కృతములో వ్యుత్పత్తినిబట్టి శబ్దముల రూపములు సాధించలేక, పృషోదరాది గణములో అలాటివి చేర్చవలసివచ్చినది.

34) అరవములో - పడు-పట్టాన్, ఇడు - ఇట్టాన్, విడు-విట్టాన్ అని నేటికిన్నీ డుకారాంత క్రియలకు డువర్ణము 'ట్టు', 'ట్ట' గా క్రియారూపములలో ఉన్నది. తెలుగులో కనుపడు, కనుపట్టి చేయఁబడు, చేయఁబడ్డ—(అరవ. సేయప్పడు, సేయపట్ట). ప్రాచీనాంధ్రమందు 'చూడఁబట్టదే?' అనే ప్రయోగమున్నది. నన్నయకాలమందే 'విట్టు' 'విడు' అయి పోయినది. నేటి తెలుగులో కొట్టు—కొడతాను; తిట్టు — తిడతాడు; పెట్టి - పెడతావా? అని వాడుతున్నారు. అనేకులు నవలలోను కథలలోను, పాటలలోను పదాలలోను 'పెడతాను' వంటి రూపాలు వ్రాస్తున్నారు. అరవైయేండ్లక్రిందట విజయనగరము దర్బారు కవులలో ప్రసిద్ధులు మండ కామశాస్త్రిగారు మార్కండేయ పురాణమందు 'పెడుదురు' అని పద్యములో ప్రయోగించడము నే నెరుగుదును (చూ. పు. 312) శ్రీ తిరుపతి వెంకటేశ్వరులుకూడా సుకన్యలో 'మొఱ వెడుదురు,' అని వాడినారు (చూ. పు. 2) ఇట్టివి అభినవాంధ్రశబ్దములు; కేవలము లౌకికములు.

35) మగఁడు-మొగుడు. ప్రాచీనాంధ్రమందు' మగణ్డు,'' మగండు'; గవర్ణము గురువుగా ఉండేదిగనుక దానిమీది అకారము మారలేదు. ఉత్తరాంధ్రమందు బిందువు పలకదు; గనుక ఇట్టి శబ్దములలోని అచ్చులకు సానురూప్యము కలుగుతుంది; అంతేకాక మకారము ఓష్ఠ్యమవుటచేత 'మొ' అయినది. (చూ. చంపూరామా. III,71 మొగతా (మొ యతిస్థలమందు) "మొగతాతళ్కువఁటిక మిటారి కపురంపుంబలుక్కు, గారాకుఁదీవగమిక..." శతకాలలోను పాటలు పదాలు మొ. వాటిలో తరచుగా 'మొగుడు', 'మొగవాడు' అని వాడుతున్నారు. లోకములో మగడు, మగవాడు అనే రూపములు వినపడవు. 'పగడాలు' 'పొగడాలు'గా

మారినది. 'మఖ్మల్' అనేమాట 'ముఖమల్' అని కవులు వ్రాసినారు. 'బ్రహ్మదేవుడు='బొమ్మదేవర'.

## తాటాకు, నవ్వాను

తాటాకు, మఱ్ఱాకు (చూ. ఇత్వసంధి) శబ్దములలో మధ్యవర్ణముపై నున్న అచ్చు కేవలము అకారము కాదు. అ ఏ లకు మధ్యస్థమైన స్వరము. తాలవ్యము. ఇంగ్లీషుభాషలో (man) మాన్ అనే పదములోని అచ్చు వంటిది. ఇది తాలవ్యస్వరము గనుక, తాలవ్యవర్ణములయిన చ, శ, య లకు అత్వము చేర్చినయెడల ఆస్వరము సరిగా ఉచ్చరించుటకు వీలుగా ఉండును. గాని తక్కిన వర్ణములకు అత్వము చేర్చినయెడల ఆస్వరము రాదు.

ఉ. చారు, చాప, చామంతి, చాత, చేశాను, శావ, శాలూలు, శావ శాయవలెను, నల్లశానపురాయి; పంచలు, శనగలు, ఆయతే మొదలగునవి.

చేక, మేక, మేడ మొ. శబ్దములలో ద్వితీయవర్ణము అకారాంతము గనుక ప్రథమ వర్ణమందున్న ఏకారము పైని చెప్పిన స్వరమువలెనే వినబడుతుంది. అది మేకు, చేకి, మేడి మొ. శబ్దములలో వినబడదు; కేవలము ఏకారముగానే ఉంటుంది.

నేటి బంగాలీ భాషలో ఈ స్వరముగల ఏక్ (=ఏక) ఏక్తార్ (=ఏకతార), తాగ్ (=త్యాగ) మొ॥ శబ్దములు కొందలకొలదిగా ఉన్నవని సునీతి కుమారఛట్టర్జీగారు Bengali self-taught అనే గ్రంథములో వ్రాసినారు.

తెలుగువారందరూ తరుచుగా ఉచ్చరిస్తూ ఉన్న ఈ స్వరము, దీనికి సరియైన అక్షరము లేదని, విడిచిపెట్టుకోవడము వివేకము కాదు. కొందరు "వ్యాసరుకాడు" అని వ్రాస్తున్నారు. చూ. తిరుపతి వేంకటేశ్వరకవుల లక్ష్మీపరిణయము (I, 62). అయితే వారి ఉద్దేశము ఛందములో కుదరదే

వర్ణము యకార సహితముగా ఉచ్చరింపవలెనని కాదు. అది పైని చెప్పిన స్వరము ఉచ్చరించుటకు చిహ్నముగా పెట్టినది. ఆ సంకేతము స్థిరపడలేదు. తప్పుగా చదువుటకు అవకాశమిచ్చును గనుక కొత్త చిహ్నము ఒకటి కావలెను. పైని సూచించినట్లు తాటాకు అని టాపైని ఒక చుక్క పెడితే చాలును. "గిన్నెబ్రహ్మకపాలము" కాళహస్తి. శత. ఈ చుక్క లేకపోతే కవి ఉద్దేశించినట్లు గిన్నెలోని స్వరము సరిగా ఉచ్చరించలేరు. కావ కాయవలెను శాసనములలో తరుచుగా కనబడుతున్నవి (IV,2805, 1478 హంపి) 'ఆయకే' (=ఆయెకె) అని ఆముక్తమాల్యద (V,133) లో యకారము పాదాదిని నిల్పిన ప్రయోగమున్నది. (చూ. శ. ర.) కొత్తగా అచ్చుపడ్డ ప్రతిలో ఈ రూపము దిద్ది సవరించినారు. వెనుకటి కూర్పులలో ఆయకే శబ్దమే ఉన్నది. అనియను (=అనియెను) అనే ప్రయోగము పంచతంత్రమున కలదు. ఇవి పైనిచెప్పిన తాలవ్యోచ్చారణను తెలియజేస్తున్నవి.

37) కన్నడ. 'కూతుకొళ్ళు'='కూర్చుండు'; తెలుగువారిలో పామరులు 'కూకో' అంటారు. కొన్ని మండలములలో నిల్చుకో = 'నిల్చుండు' అంటారు. నేటివాడుకలో, ఊరుకో=ఊరకుండు, (ఊరుకొని, ఊరుకుని), నిల్చో (నిల్చుని, నిల్చొని), కూర్చో (కూర్చొని, కూర్చుని), కూచో (కూచొని, కూచుని); దా(ం)గో [దా(ం)గొని, దా(ం)గుని], పడుకో (పడుకొని, పడుకుని), పామరుల భాషలో, తొంగో (తొంగొని, తొంగుని) వినబడుతున్నవి. కూర్చొను, కూర్చును మొ. వి. కొత్త ధాతువులు ఏర్పడ్డవి. కవులు స్వేచ్ఛగా పద్యాలలో ఈ కొత్త శబ్దాలు ప్రయోగిస్తున్నారు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు, వీరూ వారూ అని పేర్కొన నక్కరలేదు; ఇవి కావ్యభాషకు ఉచితమై నెలకొన్నవి. నన్నయ మొదలుగా నూరేండ్ల క్రిందటివరకూ కవులెవ్వరూ ఇవి వాడిఉండలేదు. గ్రాంథికాంధ్రము మారలేదట !!

38) కదలు ధాతువు ప్రేరణార్థకమందు కదలుపు=కదల్పు అవుతుంది; అట్లే మెదలు, మెదల్పు; కుదులు, కుదుల్పు; విదులు, విదుల్పు- ఇవి నేటి వాడుకలో 'కదుపు', 'మెదపు', 'కుదుపు', 'విదుపు' అయినవి; వాటిలోని లకారము పోయినది; పోయినా అవి సాధువులని కవిసార్వభౌములు శ్రీకృష్ణభారతములోను, కళాప్రపూర్ణులు కథాసరిత్సాగరములోను, ఆంధ్ర కాళిదాసులు తమ నాటకములలోను ఆంధ్రస్కాట్లు తమ నవలలలోను, పత్రికా సంపాదకులు సంపాదకీయ వ్యాసములలోను, కాలేజిలలో గ్రాంథికాంధ్ర భాషాపాండిత్యము విద్యార్థులు అభ్యసించడమునకు "ఆదర్శము"గా పండితులు రచించే ఉద్గ్రంథములలోను నిరభ్యంతరముగా ప్రయోగిస్తున్నారు. నన్నయ కాలము మొదలుగా ఈ నాటివరకూ కవులు ఎవ్వరూ ఇవి వాడలేదు. ఇవి వాడే కవులకు 'శబ్దసిద్ధి' ఏలోకము వలన తెలిసినది? ఆలోకమువలననే బాలకవులకుకూడా శబ్దసిద్ధి తెలుస్తుంది.

39) తెగఁగొట్టు-తెగ+కొట్టు = తెగ్గొట్టు, తెక్కొట్టు; దిగఁగొట్టు, దిగ+కొట్టు=దిగ్గొట్టు, దిక్కొట్టు; విఱుగఁగొట్టు = విరక్కొట్టు; ఎక్కొట్టు; లాగికొన్నాడు, లాగుకొన్నాడు=లాక్కొన్నాడు. రామా. VIII, 80;అదుక్కొను హంస. III,142 మొ. వి. వాడుకలో ఉన్నవి. కొన్ని కవులు వాడినారు, నెలకొను=నెక్కొను అని తిక్కన కాలమందున్నది. పెద్దతనము=పెత్తనము; అంతదనుక, అంతఁదాక=అందాక; వంగకాయ = వంకాయ, వెలంగకాయ=వెలంకాయ, ఎన్నినాళ్ళు=ఎన్నాళ్లు మొ. వి గ్రంథాలలో ఉన్నవి.

40) బడిపిల్లల పుస్తకములు రచించిన పండితులు 'పిచిక' గ్రామ్యమనుకొని, 'పిచుక' అని వ్రాస్తున్నారు. తిక్కన 'పిచ్చిక' అని భారతములో వాడినాడు; దీని రూపాంతరమే 'పిచిక' సాధువు కాదేమి? (వెలిమిడి) కచ్చిక, కచిక అని రెండు రూపములున్న వాడుకలో ఉన్నవి. శ.ర. లో 'కచ్చిక' మాత్రమే ఉన్నది.

41) 'నేనేమి సేయుదానను', 'ఏమి సేయువాఁడను', 'ఏమి సేయుదును' 'ఏమి సేతును', 'ఏమి సేయ (ఁగలదు)', ఏమి సేయ (వచ్చు) 'ఏమి సేయను' కడపటి వాక్యములోని 'చేయన్' తుమర్థకము. ఇది ఉత్తమ పురుషైకవచన రూపమని భ్రమపడి కొందరు, దానికి బ. వచనముగా ఏమి చేయము? అని వాడుతున్నారు. నేనేమి చేయను? చావనా? మేమేమి చేయము? చావమా? ఈలాగున నేటిభాషలో ఈ క్రియారూపములు ఏర్పడ్డవి. కొందరు గ్రంథాలలో వాడుతున్నారు. శ్రీసూర్యరాయ బృహదాంధ్ర నిఘంటు నిర్మాతలు మ. జయంతి రామయ్య పంతులుగారు ఆనిఘంటువులో ఈశబ్దములు అనుశాసించినట్లు ప్రకటించిన మచ్చుపదములలో కనబడుతున్నది.

42) అదుగో, ఇదుగో, అరుగో, ఇరుగో—ఇట్టి మాటలు గ్రామ్యాలని వేదం వేంకటరాయ శాస్త్రిలుగారు నిషేధించినారు గాని నేటి కవులందరూ వాడుతున్నారు. తిక్కన 'వాఁడె' (=అదుగో) వీఁడె=(ఇదుగో) మాత్రమే ప్రయోగించినాడు ఉత్తరాంధ్రకవులు 'వాఁడుగో', 'వీఁడుగో' అని వాడినారు 'ఇదిగో,' 'ఇవిగో', అనేవి కూడా ఇప్పుడు లోకములో ఉన్నవి. ఇవి ఇంచుమించుగా నూరేండ్లయి భాషలో ఏర్పడ్డ కొత్తమాటలే; కొత్తవి అయితే నేమి? సాధువులే తిరుపతి వెంకటేశ్వర కవులు మొదలయినవారు అనేకులు ఆ మాటలు వాడుతున్నారు. వాడనివారు అరుదు. చూ. అరుగో (సుకన్య. పు 24. దంభవా. 1. 4) ఇరుగో (దంభవా. IV, 19); అదుగో (సుకన్య VI, పు. 26).

43) 'ఇల్లిదిగో'—అల్లదిగో అన్నట్టే ఇల్లిదిగో వాడుకలోనికి వచ్చినది. నన్నయ కాలమందు, 'అల్ల', 'ఉల్ల' వాడుకలో ఉండేవి, గాని 'ఇల్ల' ఉన్నట్టు కనబడలేదు; మన కాలమందు శిష్టవ్యవహారములో ఉన్నది గనుక నే కళా ప్రపూర్ణులు 'ఉమ' లో "ఇల్లిదిగో గొల్లవటు నిప్పుడే వధింతున్" అని ప్రయోగించినారు (చూ. 72). వారిశిష్టమయినది వారు వాడినారు;

అక్కడ ఎవరి కిష్టమయినది వారు వాడుతారు. అడ్డడానికి ఎవరికి అధికార మున్నది?

44) 'తోడివాడు' అనే మాటకు మారుగా నేడు 'తోటివాఁడు' అని లోకములో అంటున్నారు. శ్రీ కృష్ణ జన్మఖండములో శ్రీ గోపీనాథ కవిగారు అది ప్రయోగించినారు. శ్రీపాద వెంకటాచలకవిగారు కౌసల్యా పరిణయమనే ప్రబంధములో, (చూ. ఆ. III, పు. 38.)

సీ. గీ. మాటిమాటికి నటుగులతోటి మాటి;

వాటిలఁగ వాడు మాటల తేటతోడ......

అని ఎంత చక్కగా ప్రయోగించినారో చూడండి. అసాధువా అది? గ్రామ్యమా?

45) 'నాతోపాటు' — అని పూర్వులు వాడలేదు; ఆధునికులు కొందరు స్వేచ్ఛగా కావ్యాలలో ప్రయోగిస్తున్నారు. శ. ర. లో 'తోపాటు' ఉన్నది. అయినా కొందరు అది తప్పని నిర్భమపడి 'నాతోఁ బాటు' అని సవరిస్తున్నారు. అలాగున చేయడము అవివేక విలసితము భారతము 'తోడి పాటిగా' అని ఉన్నది; దాని నుండి రాను రాను ఉత్త రాంధ్రములో ఈ రూప మేర్పడ్డది.

46) పనిమంతురాలు — 'బుద్ధి మంతురాలు' అనే శబ్దమును అనుసరించి ఏర్పడ్డది; ఇట్టివి కొందరు గ్రంథాలలో వాడుతున్నారు.

47) చేతకాని తనము; పనివాని తనము, సాధువులు. తనవారితనము కాశీ. VI, 60.

48) 'దాన్ని'— శ్రీ వావిలకొలను సుబ్బారావుగారు వాడినారు.

49) వాణ్ణి — రామస్తవ రాజములో మల్లనకవి— గతిలేకుండిన వాడనేని రొమవనింగైకొని వాణ్ణేని... (చూ. I, 8) అని ప్రయోగించి

కాదు. శతకాలు పాటలు మొ॥ వాటిలో తరుచుగా ఉన్నది. శాసనము లలో కూడా కనబడు తున్నది.

50) వాడి— అప్పారాయడి (చంద్రశే.); దేవుడి గుడి; రంగడి; లింగడి; అవి పాటలలో ప్రచురముగా కనబడును.

51) సాలలోకి,—కవిజ. IV, 172; వచన కావ్యములలో తరుచుగా కనబడుతున్నది.

52) కురిపించు, ప్రాచీనాంధ్రమందు 'కురియు' సకర్మకము; దేవతలు పుష్పవర్షంబు గురిసిరి. కురియించు ప్రే. మూడు నాలుగు తరములై కురిపించు వాడుక లోకి వచ్చినది. చిన్నయ సూరి 1847-వ సం॥ పరిష్కరించిన ఆది పర్వము కూర్పులో నన్నయ భాషలోనే 'కురిపించు' కనబర్చినాడు. అప్పటికి ప్రాచీన భాషాలక్షణము ఆయనకు లెస్సగా తెలిసి ఉండదు. అయన అచ్చు వేయించిన ఆది పర్వమునిండా తప్పులున్నవి. ఇప్పుడు కవులు అనేకులు యథేష్టముగా గ్రంథాలలో వాడుతున్నారు. మాటకు, తిరుపతి వేంకటేశ్వరకవులు 'కురిపించె' అని దేవీ భాగవతములో ప్రయోగించినారు. (చూ. IV, 100, V, 302).

53) మీదు మిక్కిలి, మీది మిక్కిలి— రెండున్ను సాధువులే.

54) అటు, ఇటు—ప్రాచీనాంధ్రమందు అట, ఇట, ఎట, కలవు ఎటుబోయెదు? "అటమీఁది వృత్తాంతంబు", 'అట యిట దిరుగుచు' 'అట మున్న', 'అటపిఱుందన'—ఈ విధముగా అట మొ॥ వి. ప్రయోగించేవారు. అధునాతనులు 'అటుమీద' 'అటుపైని' 'అటునిటు తిరుగుచు' అని వాడు తున్నారు. ఇట్టి కొత్తతెలుగు మాటలు నూటికి తొంభైతొమ్మిది పాళ్లు కలిపి ఒకపాలు పాతమాటలతో (గ్రాంథికాంధ్ర) భాషా రచన చేసేవారు కొత్తతెలుగు గ్రామ్యమని అట్టహాసాలు చేయడము ఎంత హాస్యాస్పద ముగా ఉంటుందో నేను చెప్పనక్కరలేదు.

55) 'చేయరా' 'చూడరా' మొ|| తప్పంటారు. 'చేయవే' చూడవే' సాధువులైతే అవెందుకు కావు?

అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా,

భిక్షాదానము సేయరా సుకవిరాడ్ బృందారక శ్రేణికిఁ"

అని శ్రీనాథుడే "చేయరా" అని ప్రయోగించినాడు. అతడే 'విచ్చేయ వమ్మా', 'పయనంబు గావమ్మ' 'రావమ్మ' లేవమ్మ' నడవ వమ్మ' అని భీమ ఖండములో వ్రాసినాడు (చూ. IV, 175) (లెగుచు) లేచు దాతువు గనుక లేవవమ్మ' అనవలెనే; లోకములో లే, లెండి, లేవయ్యా, లేవమ్మా, లేరా, అని వాడుతున్నారు. గనుక (నన్నయ తిక్కనాదులు అవి వాడినారా లేదా అని విచారించకుండా) స్వతంత్రించి ప్రయోగించినాడు. "లెగు(ము)" అని పరమ యోగి విలాసమందున్నది. (చూ. III, 70) ఆ ప్రయోగము మాండలీయకము; ఉత్తర సర్కారులలో పామర జనుల వాడుకలో ఉన్నది. గాని శిష్టజన వ్యవహారమందు లేదు; గనుక "గ్రామ్య"మవుతుంది. ఒక మండలములో గ్రామ్యమయిన శబ్దము మరి ఒక మండలములో శిష్టము. తిక్కన వాడినవైనా, 'కూడు' 'కుడుచు' 'బోనాలు' మొ|| నేటివాడుకలో మా మండలమందు 'గ్రామ్యములు', 'పొట్టకూడు' 'పాలుకుడుచు' 'మనుగుడుపులు' మాత్రము అగ్రామ్యములు. "బోనేయు" పూర్వకావ్యములలో ఉన్నా అది గ్రామ్యము గనుక మేము వాడము; 'వేంచేయు' వంటిదే 'భోంచేయు' వాడుతున్నాము; అదేమాకు సాధువు.

56) అక్షింతలు' 'అక్షతలు' శబ్దమునుండి పుట్టినదైనా, దాని రూపమూ, అర్థమూ తెలుగులో మారినవి. ఇది శరలోఉన్నది. "వై. గ్రా." అని 'రిమార్కు'కూడా ఉన్నది. 'విజయంచేయు', 'అవధారు' మొ||వి అనేకముగా "గ్రామ్యాలు" శ.ర.లో ఉన్నవి. 'గ్రామ్యము' అనేది పారిభాషిక పదము. వ్యుత్పత్తి నిరూపిస్తుందిగాని, ప్రయోగము తప్పనిసూచించదు. 'అక్షిం

తలు;' ప్రౌఢకవి మల్లన వాడినాడు (చూ. రుక్మా. IV, 89). ఈశబ్దమునకు 'అక్షతలు' అనే అర్థముకాక, బ్రాహ్మలు మొ. వారు మొగముమీద పెట్టుకొనే బొట్టు, స్త్రీల ఆభరణ విశేషము అనే అర్థములుకూడా ఉన్నవి; 'అక్షతలు' శబ్దానికి ఈ అర్థాలు పట్టవు.

57) 'ఏమిటి'-ఏమి ప్ర.విభ, ఏమిటికై మొ. వాటిలో 'టి' ఆగమము, షొ పవిభ. 'ఏమిటిది,' 'ఏమిటిమాట' అని ప్రాచీనులవాడుక. అర్వాచీనులు ఏఁటిది, ఏఁటిమాట అని వాడినారు, నేడు పామరులు 'ఏటి' అని ప్ర.విభ.గా వాడుతున్నారు; అది శిష్టులు గ్రామ్యముగా ఎంచి, వాడరు; 'ఏమిటి' అని ప్ర. విభ. గామాత్రము 'అదేమిటి?' 'ఇదేమిటి?' అని వాడుతున్నారు. ఇది 'ఒకండు' నుండి ఏర్పడిన 'ఒకటి' వంటిది. నేటికవులున్నూ అట్లేవాడుతున్నారు. మాటకు, శ్రీతిరుపతి వేంకటేశ్వరులు, అనర్ఘరాఘవములో "అబద్ధమున కర్థమేమిటి?" అని 'ఏమిటి' ప్ర. విభక్తిగానే నలుగురితోపాటు వాడినారు (చూ. పు. 2).

58) సంఖ్యార్థకములు.—(ఈగ్రంథమందే 150 వ పుటలో ఇరువై, ఆఱువై, శబ్దములు సాధువులని రుజావుచేసినాము.) నన్నయాదుల గ్రంథములలో ఇవి ఏరూపములు కలిగి ఉండేవో ఆరూపములే ఆకాలపు శాసనములలో కనబడుతున్నవి; 'ఎనిమిది,' 'ఎనమండ్రు,' 'ఎనుబది,' ఎనుబండ్రు.' నేడు మేము 'ఎనమండుగురు' 'ఎనిమిదిమంది,' ఎనభై, ఎనభైమంది' అని వాడుతున్నాము. గ్రాంథికాంధ్రమున వ్రాసేవారు, 'ఎనమండ్రుగురు' (చూ. బ్రహ్మాండ III i 537) తొమ్మండ్రుగురు (చూ. బ్రహ్మాండ. III, 460) అని బ్ర. శ్రీ జనమంచి శేషాద్రి శర్మగారివంటివారు, వాడుతున్నారు. మరికొందరు ఎనమండుగురు, తొమ్మండుగురు, పండ్రెండుగురు అని మావలెనే వ్రాస్తున్నారు. కొందరు ఎందునూపొందని కూటశబ్దాలు సృష్టిస్తున్నారు. గ్రాంథికాంధ్రము కాగారానివారు, లౌకికశబ్దాలు గ్రామ్యములని విడిచి

లేనిపోని అపశబ్దములు వాడితే కసుక్కునేవారు లేరుగదా. బ్రహ్మాండ పురాణమందు "క. సుమనోభద్రదము పద్మము, మలము పర్వతవతంసః" అని ప్రయోగించిన కవిగారి భాషాసౌష్ఠవమేమనను?

59) ప్రతివాఁడు.— ఇది సరి క్రొత్తతెలుగు. ఈఅర్థము తెలియ జేయడమునకు నన్నయాదులు 'ఎల్లవాఁడు,' 'ఎల్లవారు,' 'ఎల్లరు' అని వాడేవారు. 'ప్రతిదినము'నకు మారుగా 'ఎల్లనాఁడు' అనేవారు. కళా ప్రపూర్ణులు అలంకార సంగ్రహమందు "ప్రతిది" అని ప్రయోగించినారు. శ్రీతిరుపతి వేంకటేశ్వరులు "ప్రతివాఁడు' అని వాడినారు. (చూ. గుంటూరు సీమ పు 25)

60) సామెతలు—లోకోక్తులు—ఇవి లోకములో నలుగురూ వాడేవి. మార్చగూడదు; వేదవాక్యాలవంటివి. కొన్ని ప్రాచీనాంధ్రములో పూర్వ కాలమందే పుట్టినవి; తాఁబట్టినకుందేటికి మూడేకాళ్ళు, అనే సామెతలో ఉన్న 'కుందేలు' శబ్దమువాడుకలో లేకపోయినా, మార్చరు; శ్రీతిరుపతి వేంకటేశ్వరులు ఏలాగున సామెతలు వాడినారో:— "తాతా! పెండ్లాడు తావా? అంటే మనకిచ్చేవా రెవరన్నట్లు" (సుకన్య 1.7); "అఱువదియేండ్లు వచ్చి చదువుకొనక మన్ను కొట్టుకుంటానా" (అనర్ఘనార. పు. 30). ఇట్లే నాటకములలోను, నవలలలోను ఉత్తమ పాత్రలకు నేడు శిష్ట వ్యవ హారమందున్న భాష, తక్కినపాత్రలకు యథోచితమైన భాష ప్రయోగిస్తే ఆబాలగోపాలం అందరికీ సుబోధంగాను, మనోహరంగాను ఉంటుంది. అట్టి నాటకాలు, నవలలు రచించిన కవులు కృతకృత్యులవుతారు.

## గ్రామ్యభాష—శిష్టభాష

సవరలు, కోయలు మొదలయిన మోటుజనుల సంఘములలో అందరూ ఒక్కవిధమయిన భాషే మాట్లాడుతారు; శిష్టభాష అనీ గ్రామ్యభాష అనీ తారతమ్యము ఉండదు. నాగరికులతో సంబంధముగలవారు కొందరు నాగ

శిష్టుల మాటలు కొన్ని తమ భాషలో కలపి వాడుకొంటారు. వాటి ఉచ్చారణ సరిగా ఉండకపోయినా, అందరూ వాటిని మెచ్చుకొంటారు. గాని నాగరికులు వాటిని "అపభ్రంశ" మంటారు. వర్ణవ్యవస్థ యేర్పడ్డ సంఘములలో భాషావ్యవస్థకూడా ఏర్పడుతుంది. మాట్లాడేవారి ప్రతిష్ఠ, గౌరవము, కులీనత్వము మొదలయినవాటినిబట్టి వారి భాష "శిష్టభాష" అని మెప్పుపొందుతుంది; అట్టివారితో సహవాసముచేత, యితరజాతులవారికి కూడా శిష్టభాష అలవడుతుంది. క్రమక్రమముగా ఈ 'శిష్టభాష' సంఘములో వ్యాపిస్తుంది. "దేశభాష" అనేది ఈలాగుననే ఏర్పడుతుంది.

వ్యవహారభ్రష్టమయి, నాగరికులు పూర్వము రచించిన గ్రంథములలో మాత్రము నిల్చిఉన్న భాష, ఆ గ్రంథములు చదివేవారికే తెలుస్తుంది గాని ఇతరులకు తెలియదు. 'గ్రామ్యభాష', అది మాట్లాడే జాతివారికేకాని ఇతరులకు బాగా తెలియదు. 'శిష్టభాష' ఒక్కటే సంఘములోనివారికి, మొత్తముమీద అందరికీ తెలిసేభాష; గనుకనే దానికి 'దేశభాష' అనే పేరు కలిగినది. అది అచ్చుకొట్టినట్టు దేశమందంతటా ఒక్కలాగున ఉండదు. వ్యవహారమందుండే భాషలన్నిటి 'స్వభావము' ఇట్టిదే. మన తెలుగువారి దేశభాష ఒకొక్క జాతిలో, ఒకొక్క మండలములో, ఒకొక్క విశేషము కలిగిఉన్నా, మొత్తముమీద అందరికీ సామాన్యమని అంగీకరించకతప్పదు. ఏ ప్రదేశమందున్నవారు ఆ ప్రదేశమందున్న శిష్టభాషలో గ్రంథములు రచిస్తే అక్కడివారికేకాక తక్కిన ప్రదేశములందున్నవారికికూడా మొత్తముమీద సుబోధముగానే ఉంటవి. కవుల సంప్రదాయము అన్ని దేశములలోనూ ఇదే.

శిష్టజనులు వాడే భాష 'గ్రామ్యము' అని నిందించడము అవివేకము. 'గ్రామ్యమ్' అనేది సంస్కృతభాషలోని శబ్దము; ఆ భాష అనుశాసించిన పాణిన్యాదులుగానీ, కావ్యలక్షణము రచించిన పండితులుకానీ శిష్టభాష

'గ్రామ్య'మని చెప్పలేదు. ఆంధ్రశబ్ద చింతామణి, అప్పకవీయము, బాల వ్యాకరణము మొదలయిన లక్షణగ్రంథములు రచించినవారు 'లక్షణవిరుద్ధమయిన భాష గ్రామ్యము' అన్నారు, గాని ఆ మాట తప్పు. గ్రామ్యమనగా పామరజన వ్యవహారమనిన్ని, పామరులనగా ఆభీరులు (మేకలు కాచే గొల్లజాతివాళ్ళు) మొదలయినవారనిన్ని లాక్షణికులు నిర్వచించినారు. లక్షణవిరుద్ధమయిన భాష "చ్యుతసంస్కారము" అని 'దోషము'గా పేర్కొన్నారు. ఇంగ్లండులో నేడు శిష్టవ్యవహారమందున్న ఇంగ్లీషుభాషే దేశభాష; శిష్టులు కానివారి భాష Vulgar అని, Slang అని, Cockney అని, Cant అని, Patois అని, Brogue అని, అంటారు; శిష్టులు అట్టి భాష నోటను ఉచ్చరించనే ఉచ్చరించరు; శిష్టుల సంభాషణలో అట్టి మాటలు వినబడవు. Rail అనే మాట 'రైల్' అని గ్రామ్యజనులు పలుకుతారు; దది 'cockney', vulgar ఉచ్చారణ అంటారు. Funk వంటి మాటలు Slang అంటారు; ఇట్టి మాటలు శిష్టుల వాడుకలో చేరితే మరి నింద్యములు కావు. శబ్దముల శిష్టత్వము అవి వాడేవారి శిష్టత్వమువల్ల కలుగుతుంది, గాని వాటికి స్వభావసిద్ధమయినది కాదు. 'కూకో', కూర్చో, 'కూచో', 'కూకొని', 'కూర్చొని', 'కూర్చుని', 'కూచుని'—వీటిలో 'కూకో', 'కూకొని' గ్రామ్యజనులున్ను తక్కినవి శిష్టజనులున్ను వాడుతున్నారు; ప్రాచీనాంధ్రకావ్యములందు ఇవి కనబడవు; కొత్త తెలుగు మాటలు. నేటి కవులు యథేష్టముగా ఈ "శిష్టభాషితములు" ప్రౌఢరచనలో ప్రయోగిస్తున్నారు. 'కూకో' 'కూసని' 'తొంగో', 'తొంగుని' గ్రామ్యములు గనుక శిష్టులు సంభాషణలోనయినా వాడరు. జాతీయత తెలియచేయడమునకు పాత్రోచితముగా నాటకాలలోనూ, నవలలోనూ, కథలలోనూ కొందరు ఇట్టి శబ్దములు ప్రయోగిస్తున్నారు. ఇట్టి వ్యవస్థ అన్ని దేశములలోను ఉన్నది.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో గ్రామ్యలక్షణము

క॥ కసడములు గోరడములు
గాసరబీసరములైన కట్టిఁడి పలుకుల్
భాసిల్లు గ్రామ్యములు గా
వాసోక్తులఁ దెగడుచోట నవియున్ వలయున్॥ అని నిరూపించినాడు.

క॥ జగతిఁ గల చెల్లుబళ్ళై
నగినగి భాషించునట్టి నానుడి పలుకుల్
తగ దన రహిఁ జెడుఁ బుధ్యుల
సొగ సుడుగం బిసిగి కంపుకూచినభంగిన్॥

క॥ పల్లవనారీమ్లేచ్ఛా ద్యుల్లాస
మనోజ్ఞ బంధుగోక్తులు చవియై
చెల్లును గ్రామ్యములైనను
వాల్లీసక ముఖ్య నాటకాదిక ఫణితిన్॥

అని ఒకరన్నమాట శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రుదాహరించినారు.

సంస్కృతభాషారచనలో అపభ్రంశ భాష చేర్చరాదని లాక్షణికులు నిషేధించినారు; గాని అపభ్రంశ-భాషలలో గ్రంథాలు రచించగూడదని చెప్పలేదు. బృహత్కథ, సప్తశతి, సేతుబంధము, కర్పూరమంజరి మొదలయిన గద్యకావ్యములూ పద్యకావ్యములూ నాటకములూ గొప్పకవులు ప్రాకృతభాషలలో రచించినారు కారా? నికృష్టమైన పైశాచీ భాషలో రచించిన కావ్యములు (ఎంకిపాటలవంటివి) నయితము సహృదయులు మెచ్చు కొన్నారే! కేవలమూ గ్రామ్యభాషలో కవిత కూర్చడము నిర్దోషమయి ఉండగా, మనశిష్ట వ్యవహారమందున్న తెలుగు కావ్యరచనకు యోగ్యము కాదనడమూ, అది గ్రామ్యమని నిందించడమూ అవివేక విలసితము కాదా?

“ఇంగ్లీషు భాష సంభాషణలో ఒక విధముగాను, గ్రంథాలలో మరి ఒకవిధముగాను ఉండదా ? అట్టి భేదము తెలుగులోకూడా ఉంటే వద్దా?” అని కొందరు అడుగుతారు. అటువంటి భేదము అన్ని భాషల లోను ఉన్నది. Saintsbury అనే ఇంగ్లీషు పండితుడు ఈ విషయమయి అన్నమాటలు ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరముగా చెప్పుతున్నాను. “will not అని అనవలసినప్పుడు wo'nt అని వాడకూడదు; నిజమే, కాని wo'nt అని అనవలసినప్పుడు will not అని వాడడము అపహాస్యముగా ఉంటుంది. ఏసందర్భములో ఏది వాడవలెనో శిష్టుల వాడుకనుపట్టి తెలుసుకోవలెను” ఇష్టగోష్ఠిలో library, veterinary, deputy అనే మాటలు ‘లైబ్రి’, ‘వెట్రిన్రి’, ‘డెప్టి’ అనిన్ని సభలో ‘లైబ్రరి,’ ‘వెటరినరి’, ‘డిప్యూటి’ అనిన్ని శిష్టులు ఉచ్చరిస్తారు. సంభాషణలోని శైలి( Colloquial Style) కిన్ని గ్రంథములలోని శైలికిన్ని కొంచెము భేదమున్నా అది అంద రికీ తెలిసిన వ్యవస్థను అనుసరించి ఉంటుంది. ఇంగ్లండులో 200 సంవత్సర ములయి వ్యావహారిక భాషలో గ్రంథరచన అందరూ అభ్యసిస్తూ ఉన్నందున శిష్టుల వాడుకనుబట్టి కొన్ని వ్యవస్థలు ఏర్పడి ఉన్నవి. అవి Current English Dictionary, King's English, Modern English usage అనే లక్షణ గ్రంథములందు Fowler పండితుడు తెలియజేసినాడు. అట్టి గ్రంథములు మరికొందరుకూడా రచించినారు. అయితే లాక్షణికులు వ్యవస్థ ఏర్పర్చే అధికారము గలవారు కారు; శిష్ట వ్యవహారమందు ఏర్పడిన వ్యవస్థనుబట్టి అనుశాసనము చేస్తారు; అవి “శాసన ములు” కావు. వారి అనుశాసనము అన్ని విషయములలోను అందరూ అనుసరించరు; ‘అయుక్తము కాదు’, ‘ఇది సాధారణ మాట్లాడుక’ అనే తీర్పులు ఇంగ్లీషువారిలోను, ఫ్రెంచివారిలోను ఉన్నారు. తెలుగువాడుకను గురించి వ్యవస్థలు నిరూపించి లక్షణము రచించే కాలము ఇంకా రాలేదు. ఇక్కడన చెప్పినట్టు పాతమాటలువిడిచిపెట్టి ఔచితినిబట్టి దేశభాషా శబ్దములు ప్రయో

గించి, గద్యకావ్యములూ పద్యకావ్యములూ రచించడము కవులు కొంత కాలము అభ్యసిస్తేనేకాని వ్యవస్థలు ఏర్పడవు. ముందుగా వ్యవస్థలు ఏర్పచ్చుకొని మాతృభాషలో కవితలు ఏదేశములోనూ ఎవరూ కూర్చలేదు. భాషావ్యవస్థలు భాషలోనే ఉన్నవి; మనము వాటిని కనుక్కోవలెను.

బంగాళీ బాలకవులు తమ "చలిత్ భాష"(అనగా వర్తమాన వ్యావహారిక భాష)లోనే నానావిధ గ్రంథములూ రచిస్తున్నారు. సరికొత్తమాటలే కాని "పాతపడ్డ మాటలు వాడము" అని దీక్షపట్టినారట There is a strong body of writers who advocate the supersession of the old literary language by this living and vigorous form of spoken Bengali అని కలకత్తా విశ్వవిద్యాలయములోని పండితుడు డాక్టర్ సునీతికుమార చటర్జిగారు A Brief sketch of Bengali Phonetics అనే గ్రంథములో వ్రాసినారు. తెలుగు బాలకవులుకూడా బంగాళీవారివలె మాతృభాషాభిమానము కలవారై చక్కని కవితలు కూర్చగలిగితే ఆబాలగోపాలమయిన అభినవాంధ్ర సారస్వతము ఉదయిస్తుంది. దానివల్లవారికీ, వారి భాషకూ, వారి సంఘమునకూ లోకములో గౌరవ ప్రతిపత్తులు కలుగుతవి. సంఘముయొక్క భాగ్యము కవిబ్రహ్మల చేతిలో ఉన్నది.

